# ఆంధ్రదీపిక

[ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రీ - యూనివర్సిటీ పరీక్ష
తెలుగు పాఠ్యగ్రంథ వివరణము]



వివరణ కర్తలు :

పద్య భాగము

శ్రీ ఐ. వి. కుటుంబరాయశర్మ, ఎం. ఏ., బి. ఎడ్.
ఆంధ్రోపన్యాసకులు - నిజాం కాలేజి, హైదరాబాదు.

గద్య భాగము

విద్వాన్ శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ, ఎం. ఏ.,
ఆంధ్రోపన్యాసకులు - ఆర్ట్సు అండ్ సైన్సు కాలేజి, సికింద్రాబాదు.



సోల్ ఏజంట్లు :

శ్రీనివాస బుక్ డిపో
5054 - మార్కెటు వీధి, సికింద్రాబాదు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ధర్మజు రాజసూయము.

## స భా ప ర్వ ము.

(నన్నయ భట్టారక ప్రణీతము)

### 1. సంస్కృత మహాభారతము :—

సంస్కృత భాషయందు మహాభారతమును వేదవ్యాస మునీంద్రుఁడు రచించెను. సర్వవేదముల సారమును, సమస్త ధర్మముల తత్త్వమును దీనియందు ప్రతిపాదింపఁబడినవి. అందుచే దీనికి పంచమ వేదమనియు, సర్వ ధర్మ సముచ్చయ మనియు, ఇతిహాస రత్నమనియు, ప్రసిద్ధి. భారతీయ తత్త్వశాస్త్రమునకు శిరోభూషణమగు భగవద్గీత యీ గ్రంథములోనిదే.

వ్యాసమహర్షి తాను చెప్పిన వేదసార ప్రతిపాదకమగు మహాభారతమును వైశంపాయనుఁడను తన శిష్యున కుపదేశించెను. ఆ వైశంపాయనుఁడు వ్యాసుని అనుజ్ఞచేత ఆ సంస్కృత భారతమును (అభిమన్యుని మనుమఁడగు) జనమేజయ మహీవల్లభునకు వివరించినాఁడు. పిదప దానినే సూతుఁడు శౌనకాది మహర్షుల కుపదేశించెను. ఈ విధముగ మూఁడు ఆరంభములు కలిగి 'త్రయి' యను పేరను, భరతవంశరాజుల చరిత్రమగుటచే 'భారత'మను పేరను, వేదముల సారమగుటచే 'పంచమ వేదమ'ను పేరను, భ్రాజితమూర్తియై పరగిన సంస్కృత మహాభారతము లోకవ్యాప్తి గడించు కొన్నది.

### 2. ఆంధ్ర మహాభారతము : కవిత్రయము :—

సంస్కృత మహాభారతమును గద్య పద్యాత్మకమగు చంపూకావ్యముగా ఆంధ్రీకరించిన మహాకవులు ముువ్వురు. వీరికి 'కవిత్రయము' అని కీర్తి గలదు. ఇందు మొదటివాఁడు నన్నయ భట్టారకుఁడు. రెండవ యాతఁడు తిక్కనసోమయాజి. మూఁడవ కవి శంభుదాసుఁడును, ప్రబంధ పరమేశ్వరుఁడును, అని బిరుదులు వహించిన ఎఱ్ఱాప్రగడ.

ఆంధ్ర మహాభారతము పదునెనిమిది పర్వముల మహాగ్రంథము. ఇందు ఆది, సభా, పర్వములును, అరణ్యపర్వములో నాల్గవ యాశ్వాసమునందలి శరత్కాల

వర్ణనములోఁ గొంతవఱకును, పదునొకండవ శతాబ్దిలో, నన్నపార్యుఁడు ఆంధ్రీకరించెను. పిమ్మట పదుమూఁడవ శతాబ్దిలో తిక్కన సోమయాజి నాల్గవ పర్వమగు విరాటపర్వము నుండి ఆరంభించి, స్వర్గారోహణ పర్వము వఱకును గ్రంథము తుదముట్ట పదునైదు పర్వములు విరచించెను. పిదప పదునాల్గవ శతాబ్దిలోనుండిన ఎఱ్ఱనార్యుఁ డారణ్య పర్వమునందు నన్నయ విడిచిన భాగమును పూరించినాఁడు దీనితో ఆంధ్ర మహాభారత గ్రంథము పూర్తియైనది.

3. **నన్నపార్యుఁడు :—**

ప్రస్తుతము పాఠ్యభాగమైన 'ధర్మజు రాజసూయము'ను రచించినది నన్నయ భట్టారకుఁడు. ఇతడు క్రీ. శ. 1022 నుండి 1063 వఱకు రాజమహేంద్రపరము రాజధానిగా వేఁగిదేశమును పరిపాలించిన చాళుక్య చక్రవర్తియగు రాజరాజ నరేంద్రుని ఆస్థానమందున్నట్లు చరిత్ర వలన విశదమగుచున్నది. నన్నయ ముద్గల గోత్రుఁడు; ఆపస్తంభ సూత్రుఁడు; వేదాధ్యయన నిరతుఁడు; అవిరళ జప హోమ తత్పరుఁడు; బ్రహ్మాండాది నానాపురాణ విజ్ఞాన ఖని; లోకజ్ఞుఁడు; ఉభయ భాషా కావ్య రచనాభి శోభితుఁడు; సత్ప్రతిభాభియోగ్యుఁడు; నిత్య సత్యవచనుఁడు; మత్యమరాధిపాచార్యుఁడు; సుజనుఁడు.

తన కులబ్రాహ్మణుఁడై, అనురక్తుఁడై, పండితాగ్రసరుఁడై, అలరారుచున్న యీ నన్నయ భట్టారకుని రాజరాజనరేంద్రుఁడు సంస్కృత మహాభారతాంధ్రీకరణమునకు ప్రోత్సహించినాఁడు. తన ప్రభువగు రాజరాజు కోరికపై నన్నపార్యుఁడు భారతమును తెనిగింప పూనుకొనెను. ఈ మహారంభము నందీయనకు కుడి భుజమువోలె తోడైన వాఁడీయనకు సహపాఠియు, ఇష్టుఁడును, సంస్కృతాంధ్ర కర్ణాట ప్రాకృతాది వాఙ్మయ ధురంధరుఁఘను నగు నారాయణభట్ట మహాపండితుఁడు.

మహాభారతము వంటి ఉద్గ్రంథమును ఆంధ్రీకరించుటకు నన్నయ సర్వ విధములను యోగ్యుఁడు. ప్రజలలో విజ్ఞానవ్యాప్తికి హేతువగునట్టి యీ సత్కార్యమునకు ఆ కవితల్లజుఁడు నడుము బిగించి కృతకృత్యుఁడయ్యెను. ఈతనికి పూర్వము ప్రాచీన మహాకావ్య మేదియు తెనుగున గానరాకున్నది. కావుననే నన్నయ 'ఆదికవి' యని ప్రసిద్ధిపొందెను. 'ఆంధ్ర శబ్ద చింతామణి' అను వ్యాకరణ గ్రంథమునుకూడ నన్నపార్యుఁడే రచించెనని పలువురు పండితప్రకాండుల సిద్ధాంతము. ఆ వ్యాకరణ కర్తృత్వము వలననే యీయనకు 'వాగనుశాసనుఁడ'ని బిరుదు లభించిన దనియు కొందఱు వాదము. మొత్తముమీఁద సంస్కృతాంధ్రముల యందు రెంటను నన్నపార్యుఁడు అసమాన పాండిత్యముతో గ్రంథరచనము కావింప గల్గిన మేటి కవి యగుటచే పై బిరుదములు సార్థకములై యున్నవి.

## పూర్వ కథా పరిచయము

పితృలోకమునందున్న పాండు మహీపతిం జూచి యాతని ప్రేరణచేతనే నారద మహర్షి ఒకనాఁడు ధర్మజునికడ కరుదెంచును. పితృ పితామహులకు హితముచేయు నిమిత్తము రాజసూయ మహాధ్వరమును నిర్వర్తింపుమని పాండురాజు కోరినట్లు నారద మునీంద్రుఁడు ధర్మజునకు తెలుపును. అటు పితృగణహితము సమకూడినను, రాజసూయ క్రతువు వలన నిటు ప్రజా సంహారణమగునని ధర్మజుఁడు డోలాయమాన మానసుఁడగుచు కృష్ణుని నిమిత్తము వార్త పంపును. పిదప కృష్ణుఁ డింద్రప్రస్థ పురమునకు వచ్చును. ధర్మజుఁడు కమలాక్షునకు తన యభిప్రాయమును వెల్లడించును. శత్రు భయంకరులైన సోదరు లుండుటచే ధర్మజుఁడే రాజసూయ మహాధ్వరము సేయ నర్హుఁడని వాసుదేవుఁడు పల్కుచు పరశురామునిచే క్షాత్రియంతయు నపగత క్షత్త్రింబైనను ఐల వంశము, ఇక్ష్వాకు వంశము, యయాతి భోజ వంశముల వలన మఱల పెరిగిన రాజవంశముల నెల్ల జయించినట్టి జరాసంధుని భుజ వీర్య సంపదనుగూర్చి చెప్పును. అట్లుచెప్పి జరాసంధుఁడెంత బలియుఁడైనను, అవివేకి గావున నవివేకుల లక్ష్మి నిలువదు గావున భీమసేనార్జునుల సాహాయ్యముతో ముందు తాను జరాసంధుని వధింతుననియు, పిమ్మట ధర్మజుఁ డశ్వమేధమును చేయ వచ్చుననియు శ్రీకృష్ణుఁడు పలుకును. ధర్మరాజు వల్లె యనును. శ్రీకృష్ణుఁడు భీమార్జునులతో గూడి ఎట్టకేలకు జరాసంధునిపై దండెత్తును. భీముఁడు మల్ల యుద్ధమున జరాసంధుని సంహరించును. పిమ్మట అర్జునుఁడు ఉత్తర దిగ్విజయమును, భీమ సహదేవ నకులులు క్రమముగా పూర్వ, దక్షిణ, పశ్చిమ, దిక్కుల విజయంబులును చేయుదురు. అంతట రాజసూయము సేయుమని శ్రీకృష్ణాదులగు ఆప్తులు ధర్మజుని ప్రోత్సహింతురు. అవ్విధి బంధు వర్గముచే ననుమతుండై ధర్మరాజు రాజసూయము సేయ నారంభించును. ఆ మఖమునకు సంతసిల్లిన దేవతలును, విప్రులును, సమస్త రాజలోకమును ధర్మజుని సంస్తుతింతురు. యజ్ఞము ముగిసిన పిమ్మట సభలో కృష్ణున కగ్రపూజ సేయు సందర్భముతో ప్రకృత కథ ప్రారంభించుచున్నది.

## ప్రస్తుత కథా సంగ్రహము

భీష్ముఁడు రాజసూయమును జూచి యానందము చెంది, ధర్మజునితో నిట్లు పలికెను. "ధర్మజా! యజ్ఞమునందు పూజార్హు లాఱుగురు కలరు. వీరిలో గుణాధికుని గమనించి భక్తితో నాతని పూజింపుము."

అంతట ధర్మజుఁడట్టివానిని తన కెఱిగింపుమని భీష్ముని ప్రార్థించెను. కృష్ణుఁడే యగ్రపూజ కర్హుఁడని భీష్ముఁడు వివరింపఁగా, ధర్మజుఁడు వాసుదేవున కర్ఘ్యమిచ్చును. దానిని జూచి సహింపక శిశుపాలుఁడు అవహేళనపరుఁడై

కృష్ణు నాక్షేపించుచు ధర్మజునితో పల్కెను. "దాశార్హుఁడు పూజార్హుఁడు కాఁడ నియు, వృద్ధుఁడగు భీష్ముని బుద్ధి సంచలించి, యట్లు బోధించిన దానిని నమ్మి అనర్హుఁడైన వాని నర్హుఁడనుకొని అచ్యుతు నర్చితు చేయుట పాడిగాద"ని శిశు పాలుఁడు వాదించెను. అదియుగాక పూజనీయులగువారి లక్షణములు కృష్ణుని యందు లేవనెను. భీష్ముని మాటవిని ధర్మజుఁడు పాడిదప్ప తన్ను పూజించినను, లజ్జా విరహితుఁడై గోవిందుఁడా పూజను గైకొనుట పేడివాఁడు పెండ్లి యాడుట వలె నున్నదనెను.

ఇట్లుపల్కి యెల్లర నెగ్గులాడుచు చైద్యుఁడు (శిశుపాలుఁడు) అల్కతో సభవీడి పుత్త్రిబల సమేతుఁడై వెడలిపోయెను. అప్పుడు శిశుపాలుని వెంటఁబోయి ధర్మనందనుఁడు ప్రియవచనములతో నాతని ననునయించు చుండగా, భీష్ముఁడు శిశుపాలు నుద్దేశించి, శ్రీకృష్ణుని మహత్త్వమును, శక్తిసామర్థ్యములను తెలిపి, పెద్దలు శ్రీకృష్ణు నెఱింగినట్లు "ఓ శిశుపాలుఁడా !, నీ వెఱుఁగవు" అని మంద లింపఁజూచును.

ఇంతలో తా మెఱఁగి యెఱఁగి కృష్ణున కర్ఘ్య మిచ్చితి మనియు, నందులకు కాదన్నవారి నడినెత్తిపై తన్నెదననియు సహదేవుఁడు చరణమెత్తగా, సభ్యులెల్లరు భయపడి ఊరకుండిరి. సహదేవునిపై దేవతలు పుష్పవృష్టి కురిపించిరి. కలహ ప్రియుఁడు నారదుఁడు వేడుకతో నాట్యము చేసెను.

అంతట శిశుపాలుఁడు సేనను కూర్చుకొని పాండవులపై యుద్ధమునకు సన్నద్ధుఁడు కాఁగా, సకల క్షత్త్రియ క్షోభము కలిగెను. దీనికి ధర్మజుఁడు భీతిలి, క్షత్త్రియులను శాంతింప చేయుమని భీష్ముని వేఁడికొనెను. కృష్ణునిచేఁ గాపాడ బడు యజ్ఞమునకు భంగము రాజాలదని ధర్మజుని భీష్ముఁ డూరడించును.

కృష్ణుని పరమేశ్వరునిగా కొనియాడుట సామమున తమ్ము అవమానించు టయే యని పల్కుచు చైద్యుఁడు భీష్ముని, ధర్మజుని, దూలనాడి, శ్రీకృష్ణుని యద్భుత కార్యములకు దుర్వ్యాఖ్యచేసి, ఆతఁ డర్ఘ్యయోగ్యుఁడు కాఁడని పిడి వాదముచేయును. మఱియు, "నీవు అధర్మ మార్గావలంబివై యుండియు నిత రులకు మాత్రము ధర్మము నేర్పఁ బూనుచున్నావు" అని భీష్ముని నిందించి, శ్రీకృష్ణుఁడు జరాసంధుని నధర్మముగ వధించెనని, ఆక్షేపించెను. దీనికి భీముఁడు కోపించి వానిం దునుమాడఁబోవ భీష్ముఁడాతనిని వారించి శిశుపాలుని పూర్వ జన్మ వృత్తాంతము చెప్పి, యాతఁడు కృష్ణుని చేతనేగాని యొరులచేత నిహతుఁడు కాఁడని తెలుపును. ఈ రీతిగ పల్కుచున్న భీష్మ భీముల నతిక్రమించి శిశుపాలుఁడు తన్ను సంగ్రామమున నెదురుమని జనార్దనున కభిముఖుండై దూలనాడును.

ఇదివిన్న కృష్ణుఁడు పుట్టిన దాదిగా శిశుపాలుఁ డొనర్చిన మహాపాపములను పేర్కొని, తన్ను తమయత్త సాత్వతి ప్రార్థించుటవలనఁ దానాతని యపరాధ శతంబుల సహించితినని సభ్యులకు తెలియజేయును.

దీనికి కోపించిన శిశుపాలుఁడు తిరిగి కృష్ణుని నిందించుచు తొలుతఁ దనకిత్తునన్న రుక్మిణిని కృష్ణుఁ డపహరించుటను పేర్కొని యతి పరుష వచనుఁడగును.

అదివిని సహింపక జనార్దనుఁడు రాజచక్రమెల్ల భయమంద, తన చక్రాయుధముచే శిశుపాలుని శిరమును ఖండించును. ఈ రీతిగ త్రెళ్లిన శిశుపాలుని పృథుదేహమునుండి యొకానొక తేజము వెల్వడి యాకసమంతయు వెలుగునట్లుగా ప్రయాణించి వచ్చి శ్రీకృష్ణుని దేహములోఁ బ్రవేశించెను. ఇందులకు రాజలోకమంతయు విస్మయమొందినది.

మేఘములు లేకయే పిడుగులతోడి వాన కురిసెను. శిశుపాలుని మరణమునకు సముద్రములతో కూడిన భూమి దద్దిర తిరిగెను. జయజయ నినాదములతో శ్రీకృష్ణుని నుతించు ప్రజల మహాధ్వని భూమ్యాకాశముల నడుమ మార్మ్రోగెను.

వ్యాఖ్యానము :

పద్యము 1. : శ్రీ = లక్ష్మీదేవి యనెడి, రమణీ = స్త్రీకి, ప్రియ = ఇష్టుఁడైనవాఁడా!, ధర్మ = వేదధర్మమునందు, విశారద = నేర్పరియైనవాఁడా!, వీర = వీర రసముయొక్క, అవతార = మూర్తీభావమైనవాఁడా!, సౌజన్య = మంచితనమనెడి, గుణ = గుణమునకు, ఆధార = నిలయమైనవాఁడా!, భువన + ఏక = లోకములకెల్ల నొకడవేయగు, సుందర = అందమైనవాఁడా!, వీరశ్రీ = శౌర్య సంపదచే, రమ్య = మనోహరమైనవాఁడా!, బుధ = పండితులయొక్క, వివేక = జ్ఞానమునకు (శరీరము - ఆత్మ యనెడి విభేదము నెఱుఁగుటకు), నిధానా = నెలవైనవాఁడా! (ఓ! రాజరాజ నరేంద్ర! పిమ్మటికథ వినుము, అనుట).

తాత్పర్యము : రాజరాజు పృథ్వీభర్త. అందుచే పై విశేషణములన్నియు నాతనిని సంబోధించు చున్నవి.

వ్యాకరణ విశేషము : భువన + ఏక = భువనైక, [ (వృద్ధిసంధి ) అ + ఏ = ఐ.] బుధ + వివేకము = బుధులు యొక్క వివేకము. షష్ఠీ తత్పురుషము. బుధ వివేక + నిధానా = పండితుల వివేకమునకు నెలవైనవాఁడా! షష్ఠీ తత్పురుష సమాసము.

నర్మోక్తులందు కృష్ణుని కర్ష్ణుం బిచ్చుట :—

**ఛందస్సు** — ఇది కందపద్యము. దీనిలో పూర్వార్థమనియు, ఉత్తరార్థమనియు రెండు భాగంబు లుండును. ఒక్కొక్క భాగమునను ఎనిమిదేసి గణము లుండును. ఈ గణములు భ, జ, స, నల, గగ అనువానిలో వేనితోనైన పర్పున వచ్చును. ఆఱవ గణము జగణముగా గాని, నలగాగాని యుండవలెను. బేసిగణముగా జగణమును గూర్పరాదు. ప్రతిభాగము గుర్వక్షరముతో ముగియవలెను. మొదటి భాగములోని ఎనిమిది గణములలోను మొదటి మూడు గణములతో మొదటి పాదమును, తక్కిన అయిదు గణములతో రెండవపాదమును, అట్లే ద్వితీయ భాగమునందలి గణములతో మూడవ నాల్గవ పాదములను కూర్చి యీ కందపద్యమును నాల్గు పాదములలో వ్రాయుదురు. దీనికి ప్రాసనియమము గలదు. రెండవపాదము యొక్కయు, నాల్గవపాదము యొక్కయు నాల్గవ గణము యొక్క మొదటి యక్షరముతో యతి చెల్లవలెను.

కందపద్యము జాతులలోనిది.

భ భ భ
శ్రీరమ । ణీప్రియ । ధర్మవి ।

భ గగ జ గగ స
శారద । వీరా । వతార । సౌజ । న్యగుణా — ఇందు ఆఱవగణము జగణమై యున్నది. జగణము బేసిస్థానములోలేదు. శా కు సౌ అను వర్ణము నాల్గవ గణము యొక్క మొదటి యక్షరము యతిచెల్లినది. ఇట్లే తక్కిన పద్యభాగమున లక్షణ సమన్వయము చేసికోవలెను. ఇందు రేఫ ప్రాసముగలదు. రెండవ నాల్గవ పాదముల తుదిని గుర్వక్షరముగలదు.

2. వ: అక్కథకుండు = కథలుచెప్పు ఆ ముని (ఉగ్రశ్రవసుఁడు)

వ్యా: ఆ + కథకుఁడు = అక్కథకుఁడు. ఆ, ఈ, ఏ లను త్రికమందురు. ఈ త్రికము మీఁది రేఫోష్మేతర హల్లునకు ద్విత్వమును దాని పూర్వస్వరమునకు హ్రస్వమును కలిగినవి. అనఁగా 'క' రేఫముగాని, ఊష్మముగాని కానట్టి హల్లు. ఇది 'ఆ' కంటె పరమైనది. అప్పుడు 'క' కు ద్విత్వమును, 'ఆ' కు హ్రస్వమును వచ్చి, 'అక్కథకుఁడు' అగును. త్రికము మీఁద వచ్చిన సంధిగాన దీనిని త్రికసంధి అందురు.

శౌనకాది = శౌనకుఁడు మొదలుగాఁగల, మహామునులకున్ = మునీశ్వరులకు,

వ్యా : శౌనక + ఆది = శౌనకాది, సవర్ణ దీర్ఘసంధి.

పైని గీటించిన 'క' (క్ + అ) యందు అత్త్వమున్నది. దానికంటె 'ఆ' (రెండవ పదములోని తొలియక్షరము) పరమైనది. ఇచట పూర్వమునందున్న అచ్చును పరమగుచున్న అచ్చును సవర్ణములు. అందుచే(అ + ఆ = ఆ)'ఆ'కారము ఏకాదేశము. ఇది సంస్కృత సంధి.

మహత్ + ముని = మహాముని; వ్యా : మహచ్ఛబ్దమునకు సమానాధికరణ మున ఆకారమంతాదేశము. మునులకున్ + చెప్పె = మునులకుం జెప్పె:- ద్రుత ముకంటె పరుషము పరమగుచున్నది. కావున ఆ పరుషము సరళమై 'జె'(ప్పె) అగును. అట్లు 'మునులకున్ + జెప్పె, కాఁగా, 'జె' ఆదేశ సరళమగుటచే దానికి ముందున్న ద్రుతము (న్)నకు బిందువు (నిండుసున్న) వచ్చుచు, 'మునులకుం జెప్పె' యైనది. ఇది ద్రుతప్రకృతిక సంధి.

పురాణగాధ :

ఈ రాజసూయ కథ చెప్పిన మహర్షి రోమహర్షణుని కుమారుఁడైన ఉగ్రశ్రవసుఁడు. నైమిశారణ్యమున శౌనకముని లోకశ్రేయమునకై పండ్రెండేండ్లు సత్ర యాగము చేసెను. ఆ సందర్భమున వచ్చిన మునీశ్వరులు తన్నేదైన హృద్యమైన కథ చెప్పుమని ప్రార్థింప నా ఉగ్రశ్రవసుఁడు వారికి భారతకథ వినిపించెను.

రాజసూయ + మహత్ + ఉత్సవంబు = రాజసూయమను పేరుగల ఉత్సవము. కర్మధారయ సమాసము.

రాజసూయమనెడి పేరును ముందు పదముగా గల్గిన సమాసమిది. 'రామ ప్రభువు' వంటిది.

మహత్ + ఉత్సవంబు = మహోత్సవంబు. ఉత్సవంబు + ఒప్పు = ఉత్సవంబు నొప్పు, ఉత్సవము యొక్క అందము, అని దీని కర్థము. అందుచే నిది షష్ఠీ తత్పురుష సమాసము.

ఉత్సవంబు అను పదములోని తుది ఉత్వమునకు 'ఒప్పు' అను పదములోని మొదటి అచ్చు పరము కాఁగా నుగాగమము. కావున, ఉత్సవంబు + న్ + ఒప్పు = ఉత్సవంబునొప్పు అను రూపము. షష్ఠీతత్పురుష సమాసములయందు ఉత్వము కంటె పరమైన అచ్చునకు నుగాగమము కల్గును.

ధర్మనిత్యత = ధర్మము యొక్క నిత్యత (షష్ఠీ తత్పురుష సమాసము). = ఎడతెగక ధర్మమును సలుపు గుణము; స్తుతియించి = పొగడి, నారదుండు + ఆ + సదంబునన్ = ఆ సభలో.

సదంబు, సదమ్ము, సదము, సదస్సు, సదసు అనునవి సభకు పర్యాయ పదములు; రూపాంతరములు.

సకల + రాజ + సమూహంబును = రాజులెల్లరి సముదాయము వైపును (చూచి); రాజ + లోకములో = రాజుల సమూహములో, మనుష్య + సామాన్యుండయి + ఉన్న = సాధారణ మానవులందఱివలె నున్నట్టి, జగత్ + మాన్యున్ = జగన్మాన్యున్ (అనునాసిక సంధి) = లోకముచే పూజింపఁబడు; జనార్దనున్ + చూచి (ద్రుతకార్యము) కృష్ణునివైపు చూచి; తొల్లి = పూర్వము, బ్రహ్మ + ఆది + సుర + గణ + ప్రార్థితుండయి = బ్రహ్మ మొదలగు దేవతల సమూహముచే ప్రార్థింపఁబడినవాఁడై;

బ్రహ్మ + ఆది = బ్రహ్మాది – సవర్ణములైన అ + ఆ లకుసంధి. అట్లే ప్ర + అర్థితుఁడు = ప్రార్థితుఁడు (సవర్ణ దీర్ఘసంధి.) కోరఁబడినవాఁడై. అఖిల + మహీ + భార + అవతరణ + అర్థంబు = సమస్తమైన భూమియొక్క బరువును దింపు నిమిత్తమై (అనఁగా పాపులను జంపి వారి వలని బరువు భూమికి తొలగించుటకు), నారాయణుండు = శ్రీమహావిష్ణువు; [వ్యు. నారములు = జలములు - అయనము = నివాసము; అనఁగా జలములు నివాసముగా గలవాఁడు. [బహువ్రీహి] లేదా, నార = జ్ఞానమునకు, అయనము = నివాసము. [షష్ఠీ తత్పురుషము].

యదువంశంబున = యాదవుల కులమునందు, [యదువు అనువాఁడు మూల పురుషుఁడుగా గలది], ఉదయించుటయు = పుట్టుటయు, అయ్యయి = ఆ ఆ

ఆ + అయి = అయ్యయి. సూ. ఆకారంబునకు, ఆమ్రేడితంబునకు, తదర్థకంబునకు, అయి, ఆయి అను శబ్దములు విభాషనగు; ఆ, ఆ, ఆ, అయి, ఆయయి. త్రికసంధిచేత 'అయ్యయి'.

క్షత్త్రియకులంబుల = రాజవంశములలో (వ్యు.) క్షతాత్ + త్రాయతే క్షత్త్రియః = గాయమునుండి కాపాడువాఁడుగాన క్షత్త్రియుఁడు: సుర + దైత్య + దానవ + యక్ష + రాక్షస + గంధర్వ + ఆదులు = సురలు, దైత్యులు, దానవులు, యక్షులు, రాక్షసులు, గంధర్వులు మున్నగువారియొక్క, అంశ + అవతారంబులున్ = అంశలతో పుట్టుకలును (అనగా నానా రాజులు వేర్వేఱు అంశలతో పుట్టి

యుండుటయును,),తలంచికొని = భావించి,భవిష్యత్ + భారత + రణంబునకు = మున్ముందు రానున్న మహాభారత యుద్ధమునకు, సం + హృష్ట + హృదయుం డయి + ఉండునంత = సంతసించు మనస్సు గలవాఁడై యుండఁగా [రానున్న దానిని తెలిసికొనుటచే శ్రీకృష్ణుని దైవత్వమిందు సూచింపఁబడెను.]

ప. 3: శాంతనవుఁడు = శంతనుని కుమారుఁడును, ప్ర + శాంతుఁడు = శమ దమాది గుణములచే మిక్కిలి శాంతినొందిన యింద్రియ వ్యాపారము గల వాఁడును, అగు, భీష్ముండు = కౌరవులలో పెద్దయగు భీష్ముఁడు, తత్ + క్రతువు = (ధర్మజునిచే చేయఁబడిన) ఆ యజ్ఞమును, చూచి = పరికించి, సం + తుష్టుండై = మిక్కిలి సంతోషించిన వాఁడై, ధృతిమంతునకు(ఁ) = ధైర్యము లేక. సంతోషము గల వా(నికి)డును, అతి + అంత + ధర్మమతికి(న్) = మిక్కిలి ధర్మబుద్ధి గలవా(నికి)డును నగు, అంతక + తనూజునకు(ఁ) = యముని కుమారుఁడును నగు ధర్మరాజు(తో)నకు,ఇట్లనియెన్ = ఈ క్రిందిరీతిగ చెప్పినాఁడు.

తాత్ప: శాంత స్వభావుఁడైన భీష్ముఁడు రాజసూయమునకు సంతోషించి, మనోనిగ్రహముగల ధర్మరాజుతో నీరీతిగాఁ బల్కెను.

అతి + అంతము = అత్యంతము (యణాదేశసంధి.) ఇది సంస్కృత పదము లకు కల్గు సంధి. 'అతి' అను మొదటి పదములోని తుది 'ఇ' కారము కంటె రెండవ పదములోని తొలి అచ్చు పరమగుటచే ఇకారమునకు 'య' కారము ఆదేశముగా వచ్చును. కావున సంస్కృతమున ఇ,ఉ,ఋ,ఌ అనువానికి అచ్చుపరమగు నెడల వరుసగా య,వ,ర,ల అనునవి యాదేశములగును.దీనికే యణాదేశ సంధియని పేరు.

పురాణగాథ :—

ధర్మజుఁడు యమధర్మరాజు(అంశము) వరముచే కుంతీసతికి పెద్దకొడుకుగా పుట్టెనని పురాణ ప్రసిద్ధి.

భీష్ముఁడు :-

తండ్రియగు శంతనుని సౌఖ్యము కొఱకై తాను వివాహమాడనని భయం కరమైన ప్రతిన పూనుటచే శాంతనవునకు భీష్ముఁడని బిరుద నామము కల్గినది.

ఛందస్సు :— చూడు 1వ పద్యవ్యాఖ్య.

ప. 4: కౌరవ + అన్వయ + వర్ధనా ! = కౌరవ వంశమును పెంపొం దించు ధర్మరాజా!, స్నాతకుండును = బ్రహ్మచర్యము ముగియఁగా,సంతానార్థియై వివాహమాడుటకు గాను ధనము గోరువాఁడు. (స్నాతకులు తొమ్మండుగురు-

(1) సంతానార్థియై పెండ్లి చేసుకొనఁదలఁచి దాని కొఱకై ధనము కోరువాఁడు (2) తనకున్న ద్రవ్యమంతయు యజ్ఞమునందు బ్రాహ్మణుల కొసఁగి, దరిద్రుఁడం ధనము కోరువాఁడు, (3) యజ్ఞార్థమయి ధనము నపేక్షించువాఁడు (4) గుః దక్షిణార్థమయి ధనము కోరువాఁడు (5),(6) తలిదండ్రుల సంరక్షణార్థమ ధనము నపేక్షించువాఁడు (7) బాటసారి, (8) రోగి (9) వేద పఠనార్థము వలయ సౌకర్యము నభిలషించు వాఁడు.) ఋత్విజుండును = (యజ్ఞకర్త చేత దక్షిణ పుచ్చు కొని) యజ్ఞము చేయించు బ్రాహ్మణుఁడు; [వీరు నలుగురు. వీరిలో ఒక్కొక్కనికి ముగ్గురు చొప్పున మొత్తము పండ్రెండుగురు సహాయ ఋత్విజులు.] సద్గురు డును = ఉత్తముఁడైన గురువును, ఇష్టుఁడుఁ = ప్రీతిపాత్రుఁడును, భూతల + ఈశుఁడు = భూతలేశుఁడు (గుణసంధి) రాజును, సంయుజుండును = సద్గుః యుక్తుఁడును, పూజనీయులు = పూజకు అర్హులు, వీరిలోఁ = ఈ పైఁ జెప్పి వారిలో, ప్రీతిఁ = ప్రేముడివలనను,సత్ + గుణంబులన్ = సద్గుణంబులన్ = మం లక్షణముల వలనను, ఎవ్వఁడు + పెద్ద = ఎవరు గొప్పవారో,అట్టి మహాత్ముఁ = అః మహనీయుని, విఖ్యాతుఁ = కీర్తిమంతుని,ఒక్కనిన్ = ఒకానొకరుని,పూజితున్ + చేయుము = పూజింపుము.

తాత్ప : స్నాతకుఁడు మొదలగు ఆఱుగురు పూజకుఁ దగినవారు. ఓ ధర్మ రాజా ! వీరిలో మంచి గుణఖ్యాతులచే గొప్పవాఁడగు వాని నొక్కరుని పూజి పుము.

**ఛందస్సు :-** ఒక్కొక్క పాదమునందు, ర,స,జ,జ,భ,ర, గణములున్న మత్తకోకిలము. 11వ అక్షరము యతిస్థానము. ప్రతిపాదము మొదటి గురువున రెండు లఘువులుగా మార్చినచో 'తరలము' అను వృత్త పాదముగా మారున

ఛందస్సునకే వృత్తము ముఖ్యము.

4 వ (ఛం)

ఇది మత్తకోకిలయను వృత్తము. దీనికి ప్రతిపాదమునందును ర,స,జ,జ,భ,ర అను గణంబులుండును. పదునొకండవ యక్షరము యతి. ప్రాసనియమము గలదు దీనిలో పదునెనిమిది యక్షరములుండును.

స్నాతకుం । డును ఋ । త్విజుండు । ను సద్గు । రుండును । నిష్టుఁడున్.
ర స జ జ భ ర

స్నా......కు పదునొకండవ యక్షరము స యతి చెల్లినది. ఇందు న కారము ప్రాస నిర్వహింపఁబడినది. అన్ని పాదములందు నిట్లే లక్షణము సమన్వయించ కోవలెను.

ప. 5 : అట్టివాఁడు = పూజ కర్హుమైనట్టివాఁడు.

ప. 6 : రోదసీ + కుహరంబున్ = భూమ్యాకాశముల మధ్య భాగము యొక్క గుహను (షష్ఠీతత్పురుష సమాసము), అర్కుండు = సూర్యుఁడు, రుచిర + అంశు + తతిన్ + చేసి = మనోజ్ఞమగు తనకిరణములయొక్క సముదాయముచేత, వెలిగించునట్టులు = ప్రకాశింపఁజేయురీతిగాను;

శీత + అంశుఁడు = (సవర్ణ దీర్ఘ సంధి) చల్లని కిరణములు గల చంద్రుఁడు, అమృత + సందోహ + నిష్యంద + చంద్రికన్ + చేసి = అమృతము మొత్తమును వెదజల్లు వెన్నెల (తనకు) గల్గుటచేత, ఆనందించునట్లు = (లోకమును) సంతోషపెట్టు రీతిగాను ; [ఆనందింపఁ జేయునట్లు అని స్వార్థమున ప్రేరణార్థము చెప్పుకొనవలెను. నన్నయ కాలమున నిట్టి ప్రయోగము లనేకములు.]

సకల జనులకున్ = ప్రజలెల్లరకు, తనది + ఐన = తనదైన = తనయొక్క, సత్ + అమల = సదమల (జశ్త్వ సంధి) శుభ్రమైన, ద్యుతిన్ + చేసి = ద్యుతిఁజేసి = కాంతిచేత, తనరంగన్ = ఒప్పునట్లుగా, తేజంబున్ = ప్రకాశమును, తనుపున్ = సంతుష్టుని, తాన = తనంతట తానే, చేయుచున్ + ఉన్న = కల్గించుచున్నట్టి వాఁడును, సత్ = సజ్జనులకు, సేవ్యుండు = పూజింపఁ దగిన వాఁడును, పుండరీక + అక్షుండు = తెల్లఁదామరల వంటి కన్నులు గలవాఁడును, న + ఆది (అనాది) + నిధనుఁడు = మొదలుగాని, తుదిగాని లేనివాఁడును, (అనగా ఆద్యంత రహితుఁడు), అప్ + జ = అబ్జ + నాభుఁడు = తామరపూవు బొడ్డునందుఁ గలవాఁడును, అగు, కృష్ణుఁడు = శ్రీకృష్ణుఁడు, ఉండన్ = ఉండగా, ఇందున్ = ఈ సభలో, అర్ఘ్యంబునకున్ = పూజావిధికి (పూజకుఁదగిన నీరు మొదలైన దానికి), ఒరులు = ఇతరులు, అర్హులు = తగినవారు, కలరె = ఉన్నారా ?, యజ్ఞపురుషున్ = విష్ణు రూపుఁడును, అఖిల + లోక + పూజ్యున్ = ప్రజలెల్లరకును పూజింపఁదగినవాఁడును, అగు, అచ్యుతున్ = శ్రీకృష్ణుని, పూజింపుము = అర్ఘ్యమిచ్చి ఆరాధింపుము. అధిప = ఓ ధర్మజా !, యజ్ఞ + ఫలము = యాగముయొక్క ప్రయోజనము, అదియ = అదియే, చూ వె = (చూవే) చూడవె, చూడవే అను వానియొక్క లుప్త శేష రూపము; నిశ్చయమును తెలుపును.

తాత్ప : భూమ్యాకాశముల మధ్యభాగమును, తన కాంతిచే ప్రకాశింపఁ జేయు సూర్యుని వలెను, తన వెన్నెలచే సంతోషపఱచు చంద్రుని వలెను, జనులెల్లరను తన తేజముచే తృప్తులనుగాఁజేయు శ్రీకృష్ణుఁడుండగా అతనిని మించిన

యర్ఘ్యాలు కలరా ? అతనికి అర్ఘ్యమిచ్చి పూజింపుము. ఓ ధర్మజా ! అదియే యజ్ఞముయొక్క ప్రయోజనము.

వ్యా. వి : రుచిర + అంశు = రుచిరాంశు; శీత + అంశు = శీతాంశు; పుండరీక + అక్షుండు = పుండరీకాక్షుండు. ఇచట 'అ' కంటె 'అ' పరమైనది. (అ + అ). ఆ రెండు అచ్చులును సవర్ణములు, కాగా 'ఆ' ఆదేశము. కావున, నివి సవర్ణ దీర్ఘసంధులకు ఉదాహరణములు.

తాను + అ = తాన; అది + అ = అదియ. ఇచట తానే, అదియే అను నిశ్చయమును తెలుపు అ అను అవ్యయము వాడఁబడినది. నేఁటి వారు ఇట్టియెడ ఏ అను అవ్యయమునే వాడుచున్నారు. వాఁడు + ఏ = వాఁడే వచ్చెను మొదలైనవి.

తనరంగన్ + తేజంబు = తనరంగఁ దేజంబు; తేజంబున్ + తనుపున్ = తేజంబుఁదనుపు, తనుపున్ + తాన = తనువుఁదాన. ఇవి మూఁడును ద్రుతకార్యములు.

తతిన్ + చేసి :–'కొన్ని యెడలన్ చేత విభక్త్యర్థక వర్ణకంబులకును, వలన వర్ణకంబులకును తఱచుగ 'చేసి' అనుప్రయుక్తంబగు.'

సమాసములు :—

రుచిర + అంశు + తతి = రుచిరాంశు తతి-షష్ఠీ తత్పురుషము. రుచిరాంశువు = కర్మధారయ సమాసము.

(1) శీతాంశుఁడు = చల్లని కిరణములు కలవాఁడు. (2) పుండరీకాక్షుఁడు = తెల్లఁ దామరలవంటి కన్నులు గలవాఁడు (3) అనాదినిధనుఁడు = ఆదియు అంతమును లేనివాఁడు. (4) అబ్జనాభుఁడు = తామరపూవు బొడ్డునఁగలవాఁడు— ఈ నాల్గును బహువ్రీహి సమాసములు. అన్యపద ప్రాధాన్యము గలవి.

సకల జనులు = కర్మధారయ సమాసము.

సత్ + సేవ్యుండు = తృతీయ తత్పురుష సమాసము; అఖిల లోకములు = కర్మధారయ సమాసము; అఖిలలోక పూజ్యుఁడు = తృతీయ తత్పురుష సమాసము; యజ్ఞ ఫలము = షష్ఠీ తత్పురుష సమాసము

వ్యుత్పత్తి :—

అచ్యుతుఁడు :—చ్యుతిలేనివాఁడు (చ్యుతి = చ్యుతము) సంసార బంధములలోనికి దిగజాఱనివాఁడు.

విశేషములు :

యజ్ఞము = క్రతువు. [పంచ మహాయజ్ఞములు, బ్రహ్మ యజ్ఞాది] (1) బ్రహ్మ యజ్ఞము (2) దేవ యజ్ఞము (3) పితృయజ్ఞము, (4) భూత యజ్ఞము (5) మనుష్య యజ్ఞము అని యవి యైదు. అర్ఘ్యము = పూజకుఁ దగినది. అష్టార్ఘ్యములు = (1) పెరుగు, (2) తేనె, (3) నెయ్యి, (4) అక్షతలు, (5) గఱిక, (6) నువ్వులు, (7) దర్భ, (8) పుష్పము అని ఎనిమిది. [ఉదకము, పాలు, కుశాగ్రములు, పెరుగు, నేయి, అక్షతలు, యవలు, తెల్లావలు-అని కొందఱు].

అలంకారములు :

అరుఁడు వెలిగించి నట్టులు, ఆనందించి నట్టులు, మున్నగు తావులయందు ఉపమాలంకారములు.

6 ప. ఛందస్సు : ఇది సీసపద్యము. ప్రతిపాదమునను ఇంద్రగణములు ఆఱును, సూర్యగణములు రెండును వరుసగా నుండవలెను. మొదటిగణము యొక్క మొదటి యక్షరమునకును, తృతీయ గణము మొదటి యక్షరమునకును, అట్లే పంచమ గణాద్యక్షరమునకును, సప్తమ గణాద్యక్షరమునకును. యతి చెల్ల వలెను. ఇట్టివి నాలుగు పాదములు కూర్చి పిమ్మట తేఁటగీతినిగాని ఆట వెలఁదినిగాని చేర్చవలెను. ఇందు యతికిబదులు ప్రాసను వాడినను వాడవచ్చును.

ఇంద్రగణములు :—UIU రగణము, IIIU నగణము, UUI తగణము, IIUI నలము. UII భగణము, IIII నలము.

సూర్యగణములు :— III నగణము, UI గలము.

తేఁటగీతి :—ప్రతిపాదమునను వరుసగా ఒక సూర్య గణము రెండింద్ర గణములు పిమ్మట తిరిగి రెండు సూర్యగణములు నుండును. మూఁడవ గణము మొదటి యక్షరము యతి. దీనిలో ప్రాసయతిని వాడవచ్చును. ప్రాసనియమము లేదు.

ఆటవెలఁది :—మొదటి పాదమున వరుసగా మూఁడు సూర్యగణములును పిమ్మట రెండింద్ర గణములు నుండును. రెండవ పాదమున వరుసగా అయిదు సూర్యగణములుండును. మొదటి పాదమువలెనే మూఁడవ పాదము, రెండవ పాదము వలెనే నాల్గవ పాదము నుండును. ప్రతిపాదమునను మూఁడవ గణము యొక్క మొదటి యక్షరము యతిస్థానము. ఇందు ప్రాసయతి వాడవచ్చును. ప్రాసనియమము లేదు.

రోదసీ । కుహరంబు । రుచిరాంశు ।తతిఁజేసి । యర్కుండు । వెలిగించు । నట్టు।లమృత
ర సల సల సల శ సల గల న

వీనిలో మొదటి యాఱుగణములును ఇంద్రగణములు తక్కిన రెండును సూర్యగణములు. మొదటి గణము తొలి యక్షరమైన రో అనుదానికి మూడవ గణము మొదటి యక్షరము రు అనునది యతి చెల్లినది. అట్లే అయిదవ గణము మొదటి యక్షరము అ (య)కు ఏడవ గణము మొదటి యక్షరము అ (నట్టు) యతి చెల్లినది. నాలుగు పాదముల చివర ఇట ఆటవెలఁది చేర్పఁబడినది.

వ. 7 : భీష్మ + వచనంబునన్ = భీష్ముని ఆనతిని బట్టి ; సహదేవ + ఉపనీతంబైన = సహదేవునిచేత దగ్గరకు తేఁబడిన; అర్హణీయుండైన = పూజింపఁదగినవాఁడగు; శాస్త్ర + దృష్ట + విధానంబునన్ = శాస్త్రమునందు చూడఁబడిన రీతిని; ఉపాలంభన + పరుండై = నిందించుట యందాసక్తి కలవాఁడై; అధః + అక్షజున్ = జితేంద్రియములకుఁ బ్రత్యక్షమగు వానిని (విష్ణుని)

సమాసములు :-

సహదేవ + ఉపనీతంబు = సహదేవునిచేత దగ్గఱకు తేఁబడిన—తృతీయ తత్పురుష సమాసము; శాస్త్ర + ఉపదిష్టము = సప్తమీ తత్పురుష సమాసము; శాస్త్ర + ఉపదిష్ట + విధానము = కర్మధారయ సమాసము; ఉపాలంభన + పరుండయి = బహువ్రీహి సమాసము.

-: శిశుపాలుండు ధర్మజు నాక్షేపించుట :-

ప. 8 : ధరిత్రీనాథా = ధర్మరాజా!, అవనీ + నాథులు = భూపాలకులైన రాజులు, అనేకులు + ఉండగ = (ఉత్త్వసంధి) పెక్కురుండఁగా, విశిష్ట + ఆరాధ్యులు = మిక్కిలి సదాచార సంపన్నులగుట వలన సేవింపఁదగిన వారును, ఆర్యుల్ = పెద్దలును, పూజ్యుల్ = పూజింపఁదగిన వారునునైన, మహీ + దివిజుల్ = భూలోకమునందు దేవతలగు బ్రాహ్మణులు, పల్వురు + ఉండఁగన్ = (ఉత్త్వసంధి) పెక్కుమంది యుండఁగా, గాంగేయు = భీష్ముని, దుర్ + వ్యవసాయంబునన్ = చెడ్డదగు నిర్ణయముచే, కష్టచరితున్ = పాపపు నడవడిగల వాఁడును, వార్ష్ణేయున్ = వృష్ణివంశమునఁ బుట్టిన వాఁడును నగు, కృష్ణున్ = కృష్ణుని, పూజించి = అర్ఘ్యముచే సేవించి, ఇందఱకు = ఈ సభలో నెల్లరకు, నీ + అవివేకంబు = నీ తెలివి తక్కువఁ దనమును, ఎఱిఁగించితి = బైట పెట్టు

కొంటివి. దాశార్హుండు = యాదవుఁడు, పూజ + అర్హుండే ? = ఎక్కడైనను పూజకుఁ దగినవాఁడా ? (కాఁడనుట)

తాత్ప : ఓ ధర్మజా ! ఈ సభలో పెక్కుమంది రాజులును, పల్వురు బ్రాహ్మణోత్తములు నున్నారు. ఐనను వీరిని కాదని భీష్ముని కుట్రలోఁబడి దుష్ట ప్రవర్తనఁగల యాదవుఁడైన యొక కృష్ణుని పూజించితివి. నీ వివేక మెంతటిదో నల్వురకు తెలిసినది. యాదవులు పూజకు తగుదురా ? తగరని భావము.

వ్యా. వి:— విశిష్ట + ఆరాధ్యుల్ = విశిష్టారాధ్యుల్, పూజా + అర్హుఁడే = పూజార్హుఁడే. ఇవి సవర్ణ దీర్ఘ సంధులు.

ఎఱిఁగించితివి + ఇంచ అకు = ఎఱిగించితిప్రి అన్నదానికి కర్త 'నీవు.' కాన నిది మధ్యమపురుష క్రియ.'—మధ్యమ పురుషక్రియ (లిట్టు)ల తుది వకారమునకు లోపము విభాషనగు—'అందుచే 'ఎఱిఁగించితి' అగును. దానికంటె 'ఇందఅకు' అని పరమైనది. అనఁగా ఎఱిఁగించితి + ఇందఅకు.—'మధ్యమ పురుష క్రియల యందిత్తునకు సంధి యగును—'(బాల. సంధి—సూ. 7.). కాఁగా పూర్వ పర స్వరంబులకు పరస్వరంబేకాదేశమై 'ఎఱిఁగించితిందఅకు' అని యేర్పడినది.

వ్యు :- దాశార్హుండు :- దశార్హుని సంతతిలోని వాఁడు. యాదవులు దాశార్హులు. గాంగేయుఁడు:- గంగాదేవి పుత్త్రుండు (భీష్ముఁడు). గాంగేయుఁడు, వార్ష్ణేయుఁడు, దాశార్హుఁడు, ఇవి అపత్యార్థక తద్ధితములు.

సమాసములు :—

మహీ + దివిజుల్ = భూలోకమునందు దేవతలు (సప్తమీ తత్పురుష సమాసము); దుర్ + వ్యవసాయంబు = చెడ్డదగు నిర్ణయము (కర్మధారయ సమాసము); కష్టచరితుఁడు = పాపపు నడవడిగలవాఁడు, (బహువ్రీహి); న + వివేకము = అవివేకము (నఞ్ తత్పురుష సమాసము); పూజా + అర్హుఁడు = పూజించుటకుఁ దగినవాఁడు (చతుర్థీ తత్పురుష సమాసము).

గమనిక :—

"దాశార్హుండు పూజార్హుఁడే" సందర్భ సమన్వయమునకు ముఖ్యము.

శీలము :— పెద్దల నధిక్షేపించుట శిశుపాలుని స్వభావమని యీ పద్యము పట్టి యిచ్చుచున్నది.

8 ప. ఛందస్సు : మత్తేభము. దీనికి ఒక్కొక్క పాదములోను వరుసగా స, భ, ర, న, మ, య, అను గణములును పైన ఒక లఘువు, ఒక గురువు ఉం

డును. ఇట్లు నాలుగు పాదములుండును. పాదమందలి పదునాల్గవ యక్షరము యతి. ప్రాసనియమముకలదు. దీనిలో మొత్తము ఇరువది యక్షరములుండును.

అవనీ। నాథు ల। నేకులుం। డగ వి। శిష్టారా। ధ్యు లార్యుల్। మహీ
స భ ర న మ య లగ

మొదటిగణము మొదటి యక్షరమైన అ అనుదానికి పదునాల్గవ యక్షరమైన ష్టా (శిష్ట+ఆరాధ్యుల్) అనుచో సంధివశమున దీర్ఘమైయున్న ఆ కారముతో యతి చెల్లినది. వకారప్రాస నాల్గుపాదములలోను గలదు. ఇట్లే పాదములన్నింట నెఱుంగునది.

ప. 9. కడుకొని = ఎంతగాఁ బ్రయత్నించియు, ధర్మతత్త్వము = ధర్మము యొక్క స్వరూపము, ఎఱుఁగంగన్ = తెలిసికొనుటకు, అశక్యము = సాధ్యము కాదు. విచార + విదూరుఁడు = వివేకములేని భీష్ముఁడు, ధర్మ బాహ్యున్ = ధర్మమునుండి దూరమున నున్న, నిన్ = నిన్ను; ఒడఁబడన్ = ఒప్పుకొనునట్లు, ఇష్టుఁడు + ఐ = ఆప్తునివలె, కఱపి = బోధించి, ఉత్తములు = శ్రేష్ఠులగువారు, ఉండగన్ = ఉన్నను, వాసుదేవుఁడు + అన్ = కృష్ణుఁడనెడి, జడునకున్ = మూఢునకు, పూజ + ఇమ్ము + అని = అర్ఘ్యమిమ్మని, ఎంతయున్ = మిక్కిలి, వెడఁగు తనంబునన్ = వెఱ్ఱితనముచే, పనిచెన్ = ప్రోత్సహించెను. వృద్ధుల బుద్ధులు = పెద్దల మనస్సులు, సం + చలింపవే = (ఇట్టి దుష్కార్యమువలన)కలఁత నొందకుండునా ? [లేదా ముదుసలివారికి మతి చెడిపోవునుగదా !; కావున భీష్మునకు వెఱ్ఱి పట్టినది; అనియుఁ జెప్పనొప్పును.]

తాత్ప : ధర్మసూక్ష్మము గమనించుట చాల కష్టము. అవివేకియైన భీష్ముఁడు, ధర్మదూరుఁడవగు నీకు, దుర్బోధలుచేసి, లోబఱచుకొని, యీ సభలో నున్న ఉత్తములను ద్రోసిరాజని మూఢుఁడగు కృష్ణునకు పూజ చేయించినాఁడు. (ముసలితనముచే భీష్మునకు మతి చెడినది.) ఇట్టి యకార్యములవలన జ్ఞానవయో వృద్ధుల మనస్సులు కలుషితము [లు కావా?] లైనవి.

సమాసములు :—

ధర్మతత్త్వము = షష్ఠీతత్పురుష సమాసము; అశక్యము = నఞ్ తత్పురుష సమాసము; ధర్మ బాహ్యుఁడు = పంచమీ తత్పురుషము.

వ్యా. వి : వెడఁగు + తనము = 'వెడఁగు' ఉదంతస్త్రీసమము. దానికి 'తనము' పరమగుచున్నది. అందుచే 'ను' = గాగమము. (బాల–సంధి–సూ 35). పిదప ద్రుతకార్యము. (బాల-సంధి-17 సూ); అన్(+జడునకు) = అను = పదాంతంబులయి, అసంయుక్తంబులయిన. ను-లు-రు-ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు.

అలంకారములు :

వృద్ధుల బుద్ధులు సంచలింపవే ! = అర్థాంతర న్యాసము. ఇట సామాన్యముచే విశేషము సమర్థింపఁబడినది.

గమనిక :—

అర్థాంతర న్యాసాలంకారముగల పై వాక్యము సందర్భ సమన్వయమునకు ముఖ్యము.

ఛందస్సు : 9. ప. ఇది చంపకమాలా వృత్తము. దీనికొక్కొక్క పాదములోను క్రమముగా న, జ, భ, జ, జ, జ, ర అను గణములుండును. పదునొకండవ యక్షరము యతి. నాలుగుపాదములు నిట్లే యుండును. ప్రాసనియమము గలదు.

కడుకొ । నిధర్మ । తత్త్వమె । ఱుఁగంగ । నశక్య । ము ధర్మ । బాహ్యునిన్
న జ భ జ జ జ ర

మొదటి గణము తొలియక్షరమైన క అనుదానికి పదునొకండవ యక్షరమైన గ్గం అనుదానితో యతి సరిఁబడినది. నాల్గుపాదములలోను రెండవయక్షరము డకారము ప్రాసకూర్పఁబడినది. పాదములన్నింట గణములు యతి యిట్లే గుర్తించునది.

10. ప. ఇతనికిన్ = ఈ కృష్ణునకు, కూర్తురు + పనికిన్ = (మీరు) ప్రీతిని ప్రకటించుచో, ధనము = ద్రవ్యమును, ఇత్తురు = ఇచ్చెదరుగాక!, అభి + ఇష్టములు = అభీష్టములు = మిక్కిలి ప్రియములైన, కార్యముల్ = పనులు, మతిన్ = ప్రియ బుద్ధితో, ఒనరింతురు = చేయుదురుగాక!, ఇష్టుఁడు + అని = ప్రీతిపాత్రుఁడు అని తలఁచిన, మంతురు = పోషింతురుగాక, కాక = అంతియకాని, మహాత్ + ఆత్ములు = మహానుభావులు, ఐన = అగు, భూ + పతులయున్ = రాజులయొక్కయును, విప్ర ముఖ్యుల = బ్రాహ్మణ శ్రేష్ఠులయొక్క, సభన్ = సభలో, విధి = శాస్త్రములయందు, దృష్ట = చూడబడు, విశిష్ట = ఉత్తమమైన, పూజన = పూజయను, ఆయత = గొప్ప, విధికిన్ = కార్యమునకు; ఈతఁడు = ఈ కృష్ణుఁడు, అర్హుఁడు = తగినవాఁడు, అని = అని నిశ్చయించి, అచ్యుతున్ = కృష్ణుని, అర్చితున్ = పూజింపఁబడిన వానినిగా, చేయన్ = చేయుట, పాడియే = న్యాయమా?

తాత్ప : ఈ కృష్ణునిపైఁ బ్రీతికలదేని ధనమిందు; ఇష్టకార్యము లొనర్పుఁడు; పోషింపుఁడు; ఇంతియేగాని, మహానుభావులగు రాజులును, బ్రాహ్మణోత్తములును గల యీ సభలో నతనికి శాస్త్రసమ్మతమగు నగ్రపూజ యొనర్చుట మాత్రము న్యాయముకాదు.

వ్యా. వి :— కూర్చు + దురు = కూర్తురు; ఇచ్చు + దురు = ఇత్తురు; ఒనరించు + దురు = ఒనరింతురు;మంచు(న్చు) + దురు = మంతురు; '-చు' వర్ణంబుతోడి ద్విగ్ధ కారంబు 'త' కారంబగు.—'

మన్చు + చు = '—చు వర్ణకంబు పరంబగునపుడు అన్వాదులకు ఉత్వలోపం బేని, ను స్థానమున బిందువేని విభాషనగు—' మన్ + చు = (మన్చు) 'మంచు' రూపము సిద్ధించినది. భూపతుల + యొక్క-యు = భూపతులయు = యొక్కకు లోపము.

సమాసము :—

మహత్ + ఆత్ములు = మహాత్ములు = బహుువ్రీహి.

గమనిక :—

విధి దృష్ట అనుట సాధువు. విధి ధృష్ట అనుట అచ్చుపొరపాటు. "అచ్యుతు నర్చితుఁజేయఁ జాడియే"—ఇది సందర్భసమన్వయమునకు ముఖ్యము.

ఇందు మొదటి యక్షరమును వెనుకపదముతో గల్పి యన్వయించి (అన్నాఁడని యు), నిశ్చయార్థముచెప్పి, 'చ్యుతు నర్చితుఁజేయఁ జాడియే!' యని పఠించుట చమత్కారమని కొందఱ సూచన.

ఛందస్సు : చూ 9వ పద్యము.

11 ప: వసుమతి + ఈశ = ఓ ధర్మజా!, వసుదేవుఁడు + ఉండగన్ = వసుదేవుఁడు సభలో నుండఁగా, ఈతనిన్ = ఈ కృష్ణుని, వృద్ధు + అని = పెద్దవాఁడని, ఎఱిఁగి = తెలిసి (హేళన), పూజించితి + ఏ = సన్మానించితివా?

ధర్మ + యుక్తి = ధర్మశాస్త్రము యొక్క సంబంధముచేత, ద్వైపాయనుండు + ఉండన్ = వ్యాసుఁడుండఁగా, ఋత్విజుండు + అని = యాగము చేయించుట మున్నగు ధర్మము తెలిసినవాఁడీ కృష్ణుఁడని, విచారించి = దూరమాలోచించి, (అవహేళన), పూజించితి + ఏ = అర్ఘ్యమిచ్చితివా?, కృత + మతుల్ = [కృతధి, కృతబుద్ధి = శిక్షితమైన బుద్ధి] తెలివిగల, ద్రోణుండున్ + కృపుఁడున్ + ఉండన్ = ద్రోణుఁడును, కృపుఁడును నుండఁగా, ఆచార్యుఁడు + అని = అంత సద్గురుఁడని, వినయమునన్ = అడఁకువతో, పూజించితే = పూజలిచ్చితివా?, భూ + నాథుఁడు + అనియెదు = పోనీ, క్షత్రియుఁడనెడి, బుద్ధిన్ = ఆలోచనతో, పూజించితే = ఆరాధించితి వందుమా,అవని + మీఁదన్ = భూమిపై,యాదవుల్ = యదువంశమువారు, రాజులు + ఏ = క్షత్రియులా ?

పూజనీయులు + ఐన = గౌరవింపఁదగిన, పురుషులలోపల = పురుషులందు, కృష్ణుఁడు + ఎవ్వఁడు + అయ్యో = కృష్ణుఁ డేయర్హతకుఁ జెందిన వాఁడయ్యెను ?, పూజ్యులయిన వారిన్ = పూజకు అర్హులను, పూజింపన్ + ఒల్లక = పూజింప నంగీకరింపక, భీష్ము + పలుకున్ + చేసి = భీష్ముని మాట(ను బట్టి)నమ్మి, బేలవు + ఐతి = మూఢుఁడవైతివి.

తాత్ప : వృద్ధుఁడగు వసుదేవుఁడునుఁ, ధర్మవేదియు ఋత్విజుఁడును నగు వ్యాసుఁడును, ఆచార్యోత్తములగు కృపద్రోణులును, గల యీ సభలో కృష్ణుని వృద్ధుఁడని గాని, ఋత్విజుఁడనిగాని,గురువనిగాని, పూజింపరాదు గదా! యాదవులు క్షత్త్రియులే గారు. కావున క్షత్త్రియుఁడని పూజించుట ముందే తగదు. ఇట్టి పరిస్థితిలో భీష్ముని మాటలు నమ్మి. పూజింపఁదగిన వారినిఁ బూజింపక, పూజార్హుఁడు గాని కృష్ణునిఁ బూజించి నీ మూర్ఖతను బ్రకటించు కొంటివి.

వ్యా. వి :–(1)వృద్ధుఁడు = 'వృద్ధాదుల డుజ్ఞునకు లోపంబును విభాషనగు-' వృద్ధు + అని = వృద్ధని–అగును.

(2) పూజించితివి + ఏ = పూజించితివ్ + ఇ + ఏ = లిడ్లాట్టుల [భూత వర్తమాన కాలములను బోధించు మధ్యమ పురుషక్రియల] 'వ' కారమునకు లోపంబు విభాషనగు. (బాల. క్రియా. 24) 'వ' కారమనగా పొల్లు 'వ'కారము. ('వ' కారవ్యంజనము = వ్), మాత్రమే లోపించుననని గ్రహింపవలెను. అందుచే నిచట లిట్ అనఁగా భూతకాలార్థమున 'వ' లోపించి, పూజించితి + ఇ = పూజించితి + ఏ = పూజించితే అన్న రూపము సిద్ధించినది.

(3) ఒల్లక :– '—వ్యతిరేకంబున 'వలచు' నకు 'ఒల్ల' విభాషనగు–', ఒల్ల + క = ఒల్లక.

(4) బేలవు :- '—ప్రథమాంతరంబులగు యుష్మదస్మద్విశేషణంబులకు, ఏకత్వంబున వు, ను, లును, బహుత్వంబున రు, ము, లును అంతాగమంబులు ప్రాయికంబుగ నగు—' బేలు + వు = బేలువు. ఈ యాగమములు పరంబగు నపుడు ఉత్వంబునకు అత్వంబగు = బేలవు.

(5) ఐతి :- ఐతివి = ఇది భూతకాలిక మధ్యమపురుష క్రియ. పైని 1వ సూత్రమున చెప్పినట్లు ఐతి + వ్ + ఇ అను వాటిలో 'వ్' లోపింపగా. ఐతి + ఇ = అపవాదిస్వరసంధిచే 'ఐతి' అని అగును.

సమాసములు :—

ధర్మయుక్తి, భూనాథుఁడు—షష్ఠీ తత్పురుషములు; కృతమతుల్ = బహువ్రీహి.

వ్యు :— ద్వైపాయనుఁడు :— ద్వీపము జన్మస్థలముగాఁ గలవాఁడు, వ్యాసుఁడు.

శీలము :— శిశుపాలుని ఉపాలంభన గుణమీ పద్యమువలన విదితము.

ఛందస్సు : చూ 6వ పద్య వ్యాఖ్య.

ప. 12 :— ధర్మనందనా = ధర్మరాజా !, ఈ యుధిష్ఠిరుఁడు = ఈ ధర్మరాజు, పురుష + విశేష + విత్తముఁడు = ఇతర పురుషుల కంటె విలక్షణతనే ధవముగాఁ గలవాఁడు, ఉత్తముఁడు = శ్రేష్ఠుఁడు; రాజులలోనన్ = క్షత్త్రియుల యందు, పూజ్యుఁడు = గౌరవింపఁదగినవాఁడు, అని = ఇట్లు, నీ + గుణ + ఆళి = నీయొక్క గుణగణమును, మనంబులోనన్ = మనస్సులో, ప్రకటించి = నమ్ముకొని, [నీ + గుణ + ఆళి = నీయొక్క గుణముల వరుస (కర్త్రి), ప్రకటింపన్ = స్పష్టపఱుపఁగా, మనమ్మునన్ = మనస్సులో, నమ్మి = విశ్వసించి] ధారుణీ + ఈశ్వరులు = రాజులు, భవత్ + మఖంబునకున్ = నీ(వుచేయు) యొక్క యజ్ఞమునకు, వచ్చినన్ = రాఁగా, ఇందఱకున్ = ఈ సభలోని వారందఱికిని, ఈ + విధంబునన్ = ఈ రీతిగా ,పరఁగన్ = బాగుగా, అవజ్ఞ = అవమానము, చేయుట + ఇది = చేయుటయను నీపని, పాడియె = న్యాయమా ?, ధర్మువె = ధర్మమా?

తా॥ ధర్మరాజా! నీగుణముల నెఱిఁగి నీవు అసాధారణ పురుషుఁడవనియు, శ్రేష్ఠుఁడవనియు, క్షత్త్రియులలో గౌరవార్హుఁడవనియుఁ దలఁచి నీవు చేయు యాగమునకు వచ్చిన రాజులందఱ నిట్లవమానించుట తగదు. ధర్మము గాదు.

వ్యా. వి: ఇవ్విధంబు '-త్రికము మీఁది అసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు.' ఈ + విధంబు = ఈ + వ్విధంబు. ద్విరుక్తంబగు హల్లు (వ్వి) పరంబగునపుఁడు అచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు. కాఁగా.

ఇ + వ్విధంబు = ఇవ్విధంబు. త్రికసంధి.

చేయుటిది:— చేయుట + ఇది = 'అత్తునకు సంధి బహుళంబుగా నగు.' (బాల: సంధి - 4 సూ) = చేయుట యిది, చేయుటిది అను రెండు రూపములును ఏర్పడును.

సమాసములు:-

పురుష విశేష విత్తముఁడు = బహువ్రీహి; గుణాళి, ధారుణీశ్వరులు, భవన్ముఖము, ఈ మూడును షష్ఠీ తత్పురుషములు.

ఛందస్సు :- చూడు తొమ్మిదవ పద్యము.

13. ప. నీవు + ఎఱుఁగక + ఇచ్చినన్ = నీవు తెలియక యిచ్చినను, ఇది = ఈ అగ్రపూజ, నా విషయమె = తనకుఁ దగునా? అని, మనంబునన్ = మనస్సులో, వగవక = ఆలోచింపకయే, గోవిందుఁడు = కృష్ణుఁడు, లజ్జా + విరహితుఁడు + అయి = సిగ్గుమాలినవాఁడై, అర్ఘ్యము = పూజను, కొనియెన్ = స్వీకరించెను; కొనుట = ఇట్లు పూజను స్వీకరించుట, తనకు = ఈ కృష్ణునకు, ఉచితంబే = తగునా?

తాత్ప : ధర్మజా ! నీవెఱుఁగకయే కృష్ణునకుఁ బూజచేయఁ బూనితివను కొనుము. ఇతఁడు తానిందుల కర్హుఁడను గానని యాలోచింపకయే సిగ్గుమాలి దానిని గ్రహించుట తగునా ?

వ్యా. వి :- కొనుట + ఉచితంబె = కొనుటుచితంబె '–అత్తునకు సంధి బహుళముగా నగు–'

సమాసములు :-

నా విషయమె = షష్ఠీ తత్పురుషము. లజ్జా విరహితుఁడు = తృతీయా తత్పురుషము.

గమనిక :-

"తనకుఁ గొనుటుచితంబే!" సందర్భ సమన్వయమునకు ముఖ్యము.

ఛందస్సు–చూడు 1వ పద్యము.

ప. 14 : ఇలన్ = భూమిలో, కృష్ణున్ = ఈ కృష్ణుని, పూజించుట = సమ్మానించుట, చనన్ = తగునని, పేడికిన్ = నపుంసకునకు, దార + క్రియయును = వివాహమును; చెవిటికిన్ = చెవిటి వానికి, మధుర + గీతియును = ఇంపైన గానమును; చీకునకున్ = గ్రుడ్డివానికి, అతి + అనుపమ + సురూప + దర్శనమును = మిక్కిలి సాటిలేని మఱచి యందమును జూపుటను; చేయుటన్ = ఒనర్చుటతో, పోలున్ = సమమగును.

తాత్ప :—నపుంసకునకు వివాహము చేసినట్లును, చెవిటివానికి శ్రావ్యమైన గానమును వినిపించి నట్లును, గ్రుడ్డివానికి మంచి రూపమును జూపించి నట్లును, కృష్ణుని బూజించుట వ్యర్థము.

వ్యా. వి :- చనఁ బేడికి; చేయుటఁ బోలు, కృష్ణుఁ బూజించుట— ద్రుత కార్యములు.

సమాసములు :-

దారక్రియ = షష్ఠీ తత్పురుషము; మధురగీతి = కర్మధారయము.

ఛందస్సు—చూ 1వ పద్యవ్యాఖ్య.

ప. 15 : ధీయుత = బుద్ధిమంతుఁడా!. (ఎత్తిపొడుపు మాట) ఈ + అవనీ + ఈశ్వర + ప్రవరులు = ఈ రాజశ్రేష్ఠులు, ఇందఱు = ఇంతమందియును, నిన్ను + నగంగన్ = నిన్న పహసింపఁగా: ధర్మరాజు + అను = ధర్మరాజ నెడి, విశేష + సమాఖ్య = ఎవ్వరికిని లేని పేరు, నిరర్థకంబుగాన్ = అర్థము లేనిది యగునట్లును, ఇట్లు + అ + కాన్ = ఈ రీతిగా, చేయుదె = చేయుదువా?, అంచున్ = అని పలుకుచు, ధర్మజ + నదీసుత + కృష్ణులన్ = ధర్మరాజును, భీష్ముని, గృష్ణుని ముఫ్వురను, ఎగ్గులు + ఆడుచున్ = దూషించుచు, చైద్యుఁడు = శిశుపాలుఁడు, అల్కతోన్ = కోపముతో, స + పుత్త్రి + బలుండయి = కుమారులతో, సైన్యముతో గూడినవాఁడై, సదంబున్ = సభను, వెల్వడి = విడిచి, పోయెన్ = వెడలి పోయి నాఁడు.

తాత్ప : "బుద్ధిశాలినని గర్వించుచున్న ధర్మజా! రాజులందఱును నవ్వఁగా ధర్మరాజనుపేరు నిరర్థకంబుకాఁగా నిటుల పూజింపఁదగని కృష్ణుని బూజించితివేమి?" యని ధర్మరాజును, భీష్ముని, గృష్ణుని దూషించుచు శిశుపాలుఁడు కుపితుఁడై, తన కుమారులతోడను, సైన్యముతోడను సభనుండి లేచిపోయెను.

వ్యా. వి:- (1) చేయుదె = చేయుదువు + ఎ = '-లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు-' చేయుదు + ఎ. ఒక్కొకచోన్ తద్ధర్మక్రియ, ఆర్యాద్యర్థక పరకంబయి, వ్యతిరేక వ్యంజక ప్రశ్నార్థకంబగు = చేయుదె?

(2) అంచు = అను + చు = ' చు వర్ణకంబు పరంబగునపుఁడు, అన్వాదులకు ఉత్వలోపంబేని, ను స్థానంబున బిందువేని విభాషనగు-'

(3) అల్క = అలుక:- '-ఆచ్ఛికంబులన్ పద మధ్యంబుల న, ల, డ, ర, ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగనగు-'

సమాసములు.-

(1) ధీయుత = తృతీయా తత్పురుషము; (2) అవనీశ్వర ప్రవరులు = షష్ఠీ తత్పురుషము; (3) విశేష సమాఖ్య = కర్మధారయము; (4) నిరర్థకంబు = బహువ్రీహి; (5) ధర్మజ నదీసుత కృష్ణులు = బహుపద ద్వంద్వము; (6) సపుత్త్రి బలుండు; = బహువ్రీహి సమాసము.

15. ప. ఛందస్సు: ఇది ఉత్పలమాల. దీనికి ప్రతిపాదము నందును వరుసగా భ, ర, న, భ, భ, ర యను గణములును పైన ఒక లఘువు-ఒక గురువు-నాలుగు పాదములు నిట్లేయుండును. ప్రతిపాదమునను పదియవ యక్షరము యతి చెల్లును. ప్రాసనియమము గలదు.

ఈ యవ । నీశ్వర । ప్రవరు । లిందఱు । నిన్ను న । గంగ ని । ట్లుగా
భ ర న భ భ ర లగ

మొదటి గణము మొదటియక్షరమందు ఈ అనునది, దానికి పదియవ యక్షరమైన అం అను దానితో యతి సరిపడినది. నాల్గుపాదములయందును యకారము ప్రాసమై వెలసినది. అన్ని పాదములయందును గణవిభాగము యతి ఇట్లే తెలియునది.

వ. 16: పిఱుందన = వెంటనే; ప్రియవచనంబులన్ = మంచిమాటలతో; అనునయించుచున్ = శాంతింపఁజేయుచు.

సమాసము :—

ప్రియ వచనంబులు = కర్మధారయము.

ప. 17 : భూరి + గుణ + ఉన్నతులు = గొప్పగుణములచేత నుత్తములు, అనన్ + తగు + వారికిన్ = అనుటకుఁదగినట్టియు, ధీరులకున్ = గాంభీర్యము గల్గినట్టియు, ధరణి + వల్లభులకు = రాజులకు, వాక్ + పారుష్యము = మాటల కఱకుఁదనము, చనునె = తగునా?, అది = ఆ పరుసుఁదనము, విషముకంటెన్ = విషముకన్నను, దహనముకంటెన్ = అగ్నికన్నను, మహత్ + దారుణము = మిక్కిలి క్రూరము.

తాత్ప : ఉత్తమ గుణములును, గాంభీర్యమును గల రాజులు పరుష వచనములు పల్కుట తగదు. ఆ పలుకు పరుసుఁదనము విషముకంటెను, నిప్పు కంటెను గూడ క్రూరమైనది. [కావున నాశనము చేయును].

వ్యా. వి :- (1) గుణోన్నతులు = గుణ + ఉన్నతులు = [అ + ఉ = ఓ] = గుణసంధి.

(2) చన్నె = చనును + ఎ = '— ప్రశ్నార్థకమైన 'ఎ' కారము పర మగునపుడు అను, కొను, చను మొదలైన ధాతువుల యందలి 'ఉ' కారము వైకల్పికముగా లోపించును–' అందుచే చన్ + ఎ = చన్నె అను రూప మేర్పడు చున్నది.

సమాసములు :—

మహాధారుణము, భూరిగుణము = కర్మధారయములు; భూరిగుణోన్న తులు = తృతీయ తత్పురుషము; ధరణి వల్లభులు = ష. త., వాక్పారుష్యము = స. త;

గమనిక :—

"మహోదారుణ మది విషము కంటె దహనము కంటెన్".

సందర్భ సమన్వయమునకు ముఖ్యము.

ఛందస్సు : చూ. 1వ పద్యము.

ప. 18 : ఆదిజుఁడు + ఐన = తొలుతఁబుట్టిన, బ్రహ్మ + ఉదయంబునకున్ = బ్రహ్మదేవుని పుట్టుకకు, (కూడ), ఆస్పదము + ఐనవాఁడు = కారణమైనవాఁడు; వేద + ఆది + సమస్త + వాక్ + మయములందున్ = వేదములు మొదలైన సకల సారస్వతమునందును (గూడ) ప్ర + శంసితుఁడు + ఐనవాఁడు = బాగుగ పొగడ్త నొందినవాఁడు; లోక + ఆది = లోకములకు మూలమైనవాఁడు; త్రి + లోక + పూజ్యుఁడు = ముల్లోకములచేఁ బూజింపఁదగినవాఁడు; అని = అనుచు; ఆత్మన్ = తన మనస్సులో, ఎఱింగి = తెలిసికొని, పితామహుండు = మా తాతయగు భీష్ముఁడు, దామ + ఉదరున్ = శ్రీకృష్ణుని, పూజ్యుఁడు + అని = పూజింపఁదగిన వాఁడని, చెప్పెన్ = (మఱియు) చెప్పెను. ఇది = ఇట్లు అతఁడు చెప్పుటయు నేను చేయుటయును, యుక్తము + అ + కాక = తగినదేగాని, ఏమి + దోసమే ? = ఏమితప్పు ?

తాత్ప : శ్రీకృష్ణుఁడు సృష్టిలో తొలుత జన్మించిన బ్రహ్మదేవునకును జన కుఁడనియు, వేదాది సకల గ్రంథముల యందును బ్రతిపాదింపఁబడిన వాఁడనియు, లోకములకెల్ల మూలమనియును, కావుననే ముల్లోకములకును బూజింపఁదగిన వాఁడని యెఱింగిన వాఁడగుటచేత మాతాత యతనిని బూజింపఁ బ్రోత్సహించి న్నాఁడు. ఇది యొప్పేగాని, యేమాత్రమును దప్పుగాదు.

వ్యా. వి :— (1) వేదాది, లోకాది = సవర్ణ దీర్ఘసంధులు. (2) యుక్తమ = అవధారణా (నిశ్చయా) ర్థమునందు 'అ' కారంబగు. యుక్తమే అని యర్థము. (3) దామ + ఉదరుఁడు = (అ + ఉ = ఓ) గుణసంధి.

సమాసములు :—

(1) బ్రహ్మయుదయము = ష. త. (2) వేదాది + సమస్త వాఙ్మయములు = వేదాది = బహుబ్రీహి; వేదాది...వాఙ్మయములు = కర్మధా; (3) లోకాది = ష.త. (4) త్రిలోక పూజ్యుఁడు = తృ.త. (5) దామోదరుఁడు = బహుబ్రీహి.

విశేషార్థము :— శ్రీకృష్ణుని దేవత్వమిందు నిరూపితము.

గమనిక :—

"యుక్తము కాకిది యేమి దోసమే"—సందర్భసమన్వయమునకుముఖ్యము.

ఛందస్సు—ఉత్పలమాల. చూ. 15 వ పద్య వ్యాఖ్య.

19. ప. శిశుపాల = ఓ శిశుపాలుఁడా !, పరమ + అర్థ + ప్రతిభన్ = సత్య బుద్ధితో, తమస్ + హరున్ = తమోహరున్ = అజ్ఞానమును శాసించు వాఁడగు, అచ్యుతున్ = శ్రీకృష్ణుని, భీష్ముఁడు = పుణ్య చరిత్రుఁడగు భీష్ముఁడు, ఎఱిఁగినట్లు = తెలిసికొన్న రీతిగా, ఎఱుఁగఁగన్ = తెలిసికొనుటకు, నీకున్ + అరిది = నీవంటి వానికి అసాధ్యము. ఎందున్ = ఎచ్చటనేని, పెద్దల + చరితంబు = మహనీయుల నడత, ఎఱిఁగి = తెలిసికొని, పలుకన్ = చెప్పుటకు, అల్పులకు = తక్కువవారికి, శక్యమే = సాధ్యమా ?

తాత్ప : శిశుపాలా ! భీష్ముఁడు సత్యబుద్ధితో నజ్ఞాన నివారకుఁడగు శ్రీకృష్ణుని తత్త్వమును గమనించినట్లు నీవు గమనింపఁజాలవు. మహాత్ముల చరితముల యందలి రహస్యములను దెలిసికొనుటయు నెదుటి వారికిఁ జెప్పుటయు నందఱకును సాధ్యము కాదు.

వ్యా. వి :— తమస్ + హరుఁడు = తమోహరుఁడు = స్వాదిసంధి—ఇది సంస్కృత సంధి.

సమాసములు :-

(1) పరమార్థ ప్రతిభ = కర్మధారయము. (2) తమోహరుఁడు = ష. త.

గమనిక :-

"పెద్దల చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్"—సందర్భ సమన్వయమునకు ముఖ్యము.

ఛందస్సు—కందము. చూ 1వ పద్య వ్యాఖ్య.

20 ప. నీకంటెన్ = నీ కన్నను, వృద్ధతములు + ఐన = జ్ఞానము చేతను వయస్సు చేతను మిక్కిలి పెద్దలగు, నర + ఈశ్వరులు = రాజులు, గురుఁడు + అని = సద్గురు వనియు, సమస్త + లోక + ఉత్తరుఁడు + అని = సకల లోకముల యందును నుత్తముఁడనియు, అచ్యుతు = శ్రీకృష్ణు (ని యొక్క) నకుఁజేసిన, అర్చనన్ = పూజను, ఎడన్ = హృదయములో, కరము = అధికముగ, అభినందింపన్ = మెచ్చుకొనఁగా, నీకున్ = నీవు, కాదు + అనన్ + తగునే = కాదనుట న్యాయమా ?

తాత్ప : నీకంటె నెంతో పెద్దలగువారు సయితము శ్రీకృష్ణుఁడు సద్గురువనియు, సకల లోకముల యందును శ్రేష్ఠుఁడనియు, నతనికిఁ జేసిన యగ్రపూజ యుచిత మనియు మెచ్చుకొనుచుండఁగా నీవు నొప్పుకొందువేమి ?

వ్యా. వి :— (1) లోకోత్తరుఁడు = (లోక + ఉత్తరుఁడు) (2) నరేశ్వరులు(నర + ఈశ్వరులు) గుణసంధులు; (3) అచ్యుతు నర్చన = (అచ్యుతు + న్ + అర్చన) '— షష్ఠీ తత్పురుష సమాసము నందుత్తున కచ్చు పరంబగునపుఁడు 'ను' గాగమంబగు —' (బాల-సంధి-34 సూ).

సమాసములు :-

(1) నరేశ్వరులు = ష. త; (2) సమస్త లోకము = కర్మధారయము. (3) సమస్త లోకోత్తరుఁడు = స. త.

ఛందస్సు :- కందము. చూ 1వ పద్యము.

వ. 21. పట్టు వఱచుచు + ఉన్న = ఒప్పించుచున్నట్టి.

ప: 22 : భూ + పాలక = ధర్మరాజా !, పాలిత + దుర్ + నయుండు = పోషింపఁ బడిన చెడు నడవడిఁగల, శిశుపాలుఁడు = ఈ శిశుపాలుఁడు, బాలుఁడు = కుఱ్ఱవాఁడు (తెలివిలేని వాఁడు); వీనిన్ = ఇట్టి వీనిని, నీకున్ + పట్టువఱుపన్ + ఏల = నీవు ఒప్పించుటెందులకు?-మఱి = ఇంక, రాగ + కోప + భూరిత + మనస్కున్ = రాగద్వేషములచే నాక్రమింపఁబడిన మనస్సు గల్గినట్టియు, అల్ప = కొద్దిపాటియైన, రాజ్య = రాజ్యమందలి, లక్ష్మీ = సంపదయనెడి, లలనా = కాంత చేతనే, అంధ + బుద్ధికిన్ = మూఢమైన మతిగల్గినట్టియు, అనిమిత్త = నిష్కారణముగ, మహత్ = మహాత్ములను, పరివాద = దూషించు, శీలికిన్ = స్వభావము గల్గినట్టియు. వీనికిన్ = ఈ శిశుపాలునకు, ధర్మువు = ధర్మము, ఎఱుంగన్ + పోలునె = తెలిసికొనుటకు శక్యమగునా ?

తాత్ప :- ధర్మజా ! ఈ శిశుపాలుఁడు దుర్మార్గుఁడు, నజ్ఞానియుఁ గావున నీత్రనికి వచ్చఁజెప్పఁ బ్రయత్నింపకుము. ఇతని మనస్సు రాగద్వేషములచేఁ జెడినది. బుద్ధి, రాజ్య గర్వముచేఁ బాడైనది; నిష్కారణముగాఁ బెద్దలను నిందించుటయే యీతనికిఁ బరిపాటియైనది. కావున నీతఁడు ధర్మము నెఱుఁగలేఁడు.

వ్యా. వి:- (1) ధర్మువు=(ధర్మము)='అర్థాదుల కడయచ్చున కుత్వంబును, మీఁద 'వు' వర్ణకంబును వైకల్పికంబుగా నగు-'(2) మహత్ పరివాదము='మహత్' శబ్దము కర్మధారయమున ఆకారము వచ్చి 'మహా'గా మారును. ఇచ్చట నిది తత్పురుషమున ప్రయోగింపఁబడుటచే నా మార్పు రాలేదు.

విశేషము :

అవినీతికి ఆధీనమైనది శిశుపాలుని శీలమని విశదమగుచున్నది.

గమనిక :—

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

ఛందస్సు:- ఉత్పలమాల. చూ 15వ పద్యము.

వ. 23. వారించి=ఆపి.

ప. 24. మూర్ఖుఁడు+వు=మూర్ఖువు=మూఢుఁడవగు, శిశుపాల=ఓ శిశుపాలుడా!, నీవు+అవినయ+బుద్ధివి+ఐ=చెడునుద్దేశ్యము గలవాఁడవై, హరికిన్=శ్రీకృష్ణునకు, అర్ఘ్యము=అగ్రపూజ, అయోగ్యము+అ=తగనే తగదు, అంటి=అంటివి, ఇంకన్=ఇందుచే, పలుకన్+వలసెన్=సమాధానము చెప్పవలసి వచ్చినది. సభలోనన్+ఉన్న=ఈ సభయందున్న, ఈ+అవనిపులు+ఎల్లన్=రాజులందఱును, అతని=ఆ కృష్ణునియొక్క, దయన్=కృపచేత, పరిముక్తులు=వదలిపెట్టఁబడినవారును, వానిచేత=ఆ కృష్ణునిచేత, ఆహవ+జితులున్=యుద్ధమునందు జయింపఁబడిన వారును, తదీయ+శరణ+అర్థులు=ఆ కృష్ణుని శరణుఁ జొచ్చినవారును, కాక=తప్ప, ఒరులు+అయ్యా=ఇతరులా?, చెప్పుము+అ=(నీవే) చెప్పుము.

తాత్ప॥ అజ్ఞానివగు శిశుపాలా! దుర్బుద్ధిచే శ్రీకృష్ణున కర్ఘ్యమీయ రాదంటివి. నా ప్రశ్నకు సమాధానము చెప్పుము. ఈ సభలోని రాజులందఱును, ఆ కృష్ణునిచేఁ ద్రయ్యఁదల్లఁచి విడువఁబడినవారో లేక యతనిచే నోడింపఁబడినవారో, కాక యతని శరణుఁజొచ్చినవారో యగుదురుగదా!

వ్యా. వి :(1) మూర్ఖవు=(మూర్ఖుఁడు) '-వృద్ధాదుల డుజ్జునకు లోపంబు విభాషనగు-' కాఁగా మూర్ఖు అయినది. ఇది యిచట యుష్మద్విశేషణము. అందుచే 'వు' అంతాగనుము. కావున మూర్ఖువు. పిదప ఉత్వమున కత్వమువచ్చి మూర్ఖవు అయ్యెను. (2) అంటి=అంటివి '—లిడ్లాట్టుల 'వ' కారమునకు లోపంబు విభాషనగు-'

సమాసములు :—

(1) అవినయ బుద్ధి=బహువ్రీహి; (2) న+యోగ్యము=అయోగ్యము=న. త. (3) ఆహవజితులు=స. త; (4) అవనిపుఁడు=ష. త.

విశేషము :— శ్రీకృష్ణుని దయాశౌర్యము లిందుగ్గడింపఁబడినవి.

గమనిక :—

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

ఛందస్సు :- చంపకమాల. చూ. 9 ప. వ్యా.

ప. 25. ఉత్తమ+జ్ఞాన+వృద్ధునాన్=శ్రేష్ఠమైన తత్త్వబోధముచే పెద్దతనము గలవాఁడయి, ఉండెన్+ఏని=ఉండినచో, బాలుఁడు+అయ్యును=పసివాఁడైనను, బ్రాహ్మణుండు=విప్రుఁడు, పూజ్యుఁడు=పూజింపఁదగినవాఁడు; అమిత=మిక్కిలి, వి+క్రమ=గొప్ప పరాక్రమము యొక్క, సమృద్ధిన్=సంపత్తిచేత, ఉర్వి+పతులన్=రాజులలో, అధికుఁడు+ఐ+ఉండెన్+ఏని=గొప్పవాఁడై యుండినచో, క్షత్త్రియుఁడు=రాజు, పూజ్యుఁడు=మన్నింపఁదగినవాఁడు;

తాత్ప : బ్రాహ్మణుఁడు బాలుఁడైనను జ్ఞానాధికుఁడైనయెడలఁ బూజింపదగ్గువాఁడు. రాజధిక పరాక్రమవంతుఁడైనయెడలఁ బూజనీయుఁడగును.

వ్యు : క్షత్త్రియుఁడు :- క్షతము (గాయము) నుండి రక్షించువాఁడు.

సమాసములు :—

(1) అమిత విక్రమము=కర్మధా. (2) అమిత విక్రమ సమృద్ధి=ష. త. (3) ఉర్వీపతులలో=ష. త.

ఛందస్సు: తేఁటగీతి. చూ. 6వపద్యము. తేఁటగీతి లక్షణము, ఆట వెలఁది లక్షణము లటనున్నవి.

26. ప : ఈ రెండు కారణములన్ = పైఁజెప్పిన రెండు హేతువుల చేతను, మురి + అరి + అ = శ్రీకృష్ణుఁడే, అర్ఘ్యమునకున్ = అగ్రపూజకు, అర్హుఁడు = యోగ్యుఁడు; జగత్ + ఆధారుఁడు = లోకములకు మూలమైన యా కృష్ణుఁడు, మాకుఁ + అ + కాదు = మాకు మాత్రమే కాక, విష్టప + త్రయ + ఆవాసుల కుఁ = ముల్లోకముల యందుండు వారికిని, సదా + ఆరాధ్యుఁడు = నిత్యము పూజింపఁదగిన వాఁడు.

తాత్ప : జ్ఞాన వృద్ధత్వమును పరాక్రమ వృద్ధత్వమునను, రెండు కారణముల వలనను శ్రీకృష్ణుఁడే పూజనీయుఁడు. లోకాధారుఁడైన యతఁడు మాకేకాక లోకత్రయమునకును బూజనీయుఁడు.

వ్యా. వి :–(1) మురారి (2) సదా + ఆరాధ్యుఁడు-సవర్ణ దీర్ఘ సంధులు, (3) మాకు + అ = మాకు–అవధారణార్థమున 'అ' కారము–మాకే.

సమాసములు :-

(1) మురారాతి, జగదాధారుఁడు, విష్టపత్రయము = ష. త. లు (2) విష్టప త్రయ వాసులు = స. త.

ఛందస్సు :- కందము. చూ. 1వ పద్య వ్యాఖ్య.

27 ప. వృద్ధులు = వయసుచేత నధికులగువారు; ఒకలక్ష + ఉన్నను = లక్ష సంఖ్యగల వారుండినను, వారిఁ = ఆ వయోవృద్ధులను, పూజింపంగాన్ = పూజిం చుటకు, ఎవ్వరికిన్ = ఎట్టివారికైనను, బుద్ధియె = మనసు కల్గునా?, ఈ + ధరణీ + ఈశులలో = ఇచ్చటి రాజులయందు, గుణవృద్ధు + అని = గుణములచే నధికుఁడని తలచి, త్రి + విక్రమున్ = శ్రీకృష్ణుని, భక్తిన్ = భక్తితో, పూజించితిమి = గౌర వించితిమి.

తాత్ప : కేవలము వయసు మీఱిన వారెందఱున్నను వారినిఁ బూజించుట కెవ్వరు నంగీకరింపరు. ఈ రాజు లందఱికంటెను శ్రీకృష్ణుఁడు గుణములచే నధికుఁడు. కాఁబట్టియే యతని భక్తితోఁ బూజించితిమి.

వ్యా. వి. :- (1) ఇద్ధరణి = త్రి. సం. (2) ఇద్ధరణీశులు = స. దీ. సం.

సమాసము :—

గుణవృద్ధుఁడు = తృ. త.

వ్యు:- త్రి + విక్రముఁడు = [క్రమమనఁగా పాదవిన్యాసము = కాలి యడుగు. కాన, ]మూఁడు కాలియడుగులు గలవాఁడు = విష్ణురూపుఁడగు కృష్ణుఁడు.

పురాణగాథ :-

శ్రీ మహావిష్ణువు వామనావతారమున బలిని మూఁడడుగుల మేర యాచించి, యాతనిఁ బాతాళమున కణఁగఁద్రొక్కుట యిందలి యైతిహ్యము.

ఛందస్సు: కందము. చూ. 1 ప. వ్యా.

28. ప. ఒరులు = శ్రీకృష్ణునికంటె నితరులగు, భూజనులు = మనుజులు, పూజితులు + అ = పూజింపఁ బడినవారు మాత్రమే, తృప్తులు = తనివి పొందిన వారుగ, అగుదురు = అయ్యెదరు, అచ్యుతుండు + అ = శ్రీకృష్ణుఁడే, పూజితుఁడు + అగుడున్ = పూజింపఁబడినచో, పుణ్య + సమృద్ధిన్ = పుణ్యము యొక్క అతిశయము చేతను, తేజమునన్ = మహత్త్వముచేతను, జగత్ + త్రితయము = ముల్లోకములును, పూజితము + అయి = పూజింపఁబడినవై, తృప్తిన్ + పొందును = సంతుష్టిఁదాల్చును.

తాత్ప : కృష్ణునకుఁదప్ప ఇతరులెవ్వరికిఁ బూజ యొనర్చినను, బూజింపఁ బడినవారు మాత్రమే తనివిఁ జెందుదురు. శ్రీకృష్ణునిఁబూజించినటెనచోఁ బుణ్యాతిశయము గలుగును గాన, ముల్లోకములును దృప్తిపడును. అందుచే శ్రీకృష్ణుని పూజ యత్యుత్తమమైనది. శ్రీకృష్ణుఁడు పరమాత్మయే గావున ఆతఁడు తృప్తిపడిన తత్స్వరూపమైన జగత్తంతయుఁ దృప్తినొందునని భావము.

వ్యా. వి:- అగు + డున్ = (కాఁగా) 'డున్'—ఈ ప్రత్యయము అనంతర్యార్థకము.

సమాసములు :-

(1) పుణ్యసమృద్ధి, (2) జగత్త్రితయము = ష. త.

విశేషము :- ఇతరుల నెవ్వరినేని సభలో సమ్మానించినయెడల, కేవల మా పూజింపఁబడినవారే సంతృప్తులగుదురు. కాని, యచ్యుతుఁడైన శ్రీకృష్ణునిఁ బూజించిన యెడలనో, త్రిలోకములును బూజింపఁబడినట్టులై, యా పుణ్యాధిక్యమువలన తనివినొందును.

శ్రీకృష్ణు నారాధించి నందులకీ పద్యమున, భీష్ముఁడు తన్ను సమర్థించుకొనుచు, నవనవోన్మేషబుద్ధితో నుపపత్తిఁ జూపుచున్నాఁడు. ఈ యుపపత్తికి సంస్కృత మూలమున నాధారము గానము. ఇది భీష్ముని ప్రతిభాశాలిత్వమును

ప్రకటించుచున్నది. అనఁగా నిది నన్నపార్యుని సోపజ్ఞమైన సమర్థనము., ఆమూలకము.

గమనిక :—

మీ పాఠ్యగ్రంథమున నీ పద్యము రెండవపాదము మొదటిలో 'భూజను' లని యుండఁదగును. అట్లే యీ పాదమున 'అచ్యుతుండ' అని నిశ్చయార్థ ముండుటయు లెస్స.

ఛందస్సు :- కందము. చూ. 1 ప. వ్యా.

29. ప : బుద్ధియున్ = బుద్ధీంద్రియమును, మనమును = మనస్సును, పురుషుండు = జీవుండును, అవ్యక్తము = తెలియఁబడనిది, ప్రకృతియున్ = మూలప్రకృతియును [ సాంఖ్యమునుబట్టి సర్వహేతుకమగుచున్నట్టియు, సృష్టికిఁబూర్వము నందుఁగల యట్టియుఁ బ్రకృతి ] అంబరంబున్ = ఆకసమును, ధరణియున్ = భూమియును, తరణియున్ = సూర్యుఁడును, దహనుండున్ = అగ్నియును, చంద్రుండున్ — గాడ్పున్ = వాయువును, దిక్కులును = దిశలును, కాలములును = సమయములును, తాన + అ + ఐ = తానేయై, జంగమస్థావరాత్మకమైన = చరస్థిర రూపమగు, సకలభూత ప్రపంచంబున్ + ఎల్లన్ = ప్రాణిసంఘము నంతయు, తన దివ్యశక్తిమైన్ = తన యద్భుత ప్రభావముచేత, సర్వాత్మున్ = సర్వ స్వరూపుఁడైనట్టియు, సర్వభూత + ఈశ్వరున్ = సకల ప్రాణుల కధిపతియైనట్టియు, సర్వ వంద్యున్ = అందఱకును నమస్కరింపఁ దగినట్టి (శ్రీకృష్ణుని), అధిక యోగనిష్ఠిత + ఆత్మకులు + అగు = మహాయోగమునందు మనస్సు నిల్పినట్టి వారైన, మహాయోగివరులు = మహా యోగీశ్వరులు, తత్త్వయుక్తిన్ + చేసి = యథార్థజ్ఞానముచేత, ఎఱింగినట్లు = తెలిసికొనిన విధముగ, నీకున్ + ఎఱుంగంగన్ + పోలునే = నీవంటివానికిఁ దెలిసికొన సాధ్యమగునా ?, అనుచున్, భీష్ముఁడు, అన్న = పల్కిన, అవసరమునన్ = సమయములో (తరువాతి పద్యముతో నన్వయము).

తాత్ప : జీవుఁడును, ప్రకృతియు, బుద్ధియు, మనస్సును, భూమ్యాకాశములును, సూర్య చంద్రాగ్నులును, వాయువును, దిక్కులును, కాలమును, తానయై స్థావర జంగమాత్మకమగు ప్రపంచమును తన ప్రభావముచే ధరించి, సర్వాత్ముఁడును, సర్వేశ్వరుఁడును, సర్వ వంద్యుఁడును నగు శ్రీకృష్ణుని తత్త్వమును యోగీశ్వరులు మాత్రమే తెలిసికొనఁగలరు. కాని, నీకేమి యెఱుక ? అని భీష్ముఁడనుచుండగా,

(1) శక్తి + మై (తోడ) = క్తిమై = '—శజడ పదంబుమీఁది తోడకు, మెయి, మై, లు వికల్పముగా నగు-' శక్తి జడపదము. దానిమీఁద తోడ - అను

టకు 'మై' అనవచ్చును. కాని, 'వారిమై, వీరిమై'- అనరాదు. (2) యుక్తిన్ + చేసి = 'కొన్నియెడలన్ చేత విభక్త్యర్థక వర్ణకంబులకును, వలన వర్ణకంబునకును తఱచుగ 'చేసి' అను ప్రయుక్తంబగు-'

సమాసములు :—

(1) అవ్యక్తము = (న. త.), (2) సర్వభూతములు = (కర్మ), (3) సర్వభూతేశ్వరుఁ = (ష. త.), (4) మహాయోగి = (కర్మ) (5) మహాయోగివరులు = స. త.

ఛందస్సు : సీసపద్యము. చూ. 6 ప. వ్యా.

ప. 30 : ఎడపక = వదలక, అర్ఘ్యము = అగ్రపూజ, అచ్యుతునకున్ = శ్రీకృష్ణునకు, ఇచ్చితిమి = ఇవ్వవలెననియే యిచ్చితిమి. ఇచ్చినన్ = ఒసఁగఁగా, దీనికిన్ = ఇట్లొసఁగుటకు, ఇందు = (వీనియందు) శ్రీకృష్ణుని విషయమున, ఒడంబడము + అని = ఒప్పుకొన మనుచు, దుర్ + జనత్వమునన్ = చెడు స్వభావము చేత, పలికెడు = మారుమాట్లాడెడు, వీరుల = శూరులయొక్క, మస్తకంబు పైన్ = నడినెత్తిని, ఇడియెదను = పెట్టెదను, అంచున్ = అని పలుకు, సహదేవుఁడు = ధర్మజుని చివరి తమ్ముఁడు, తాన్ = తాను, సభన్ = సభయందు, చరణము = కాలు, ఎత్తెన్ = ఎత్తెను, అట్టిచో = ఆ సమయములో, సభాసదుల్ = సభలోనివారు, తద్దయున్ = మిక్కిలి, భీత చిత్తులు + ఐ = భయపడిన మనస్సు గలవారై, ఉడిగి = ప్రయత్నములు మాని, పలుకక + ఉండిరి = మారుపలుకక యుండిరి. (మౌనముఁదాల్చిరి).

తాత్ప: "మేము (బుద్ధిపూర్వకముగనే) పట్టుదలతో శ్రీకృష్ణున కగ్రపూజ యొనర్చితిమి. ఇది తమకు సమ్మతము గాదని యే వీరులందురో, అనుఁడు. వారి నడితలపై నేనీ కాలుమోపెద" ననుచు, సహదేవుఁడు తన కాలిని పైకెత్తెను. ఆ సమయమున సభలోనివారందఱును మిక్కిలి భయపడి, యేమియు ననక మౌనమువహించి యుండిరి.

వ్యా.వి :-(1)ఏము = మేము = '-నీ,మీ,నే,మే హల్లులకు లోపంబు విభాషనగు-' (2) ఇడు + ఇయ్ + ఎను = ఇడియెను (భూత)- ఇడు + ఇయ్ + ఎదను = ఇడియెదను (భవిష్య) = '-గురు విహితంబులయి, యయాంతంబులయిన యేకస్వర ద్విస్వరంబుల యించు గ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు-'(బాల.వ్యా. క్రి. 50 సూ.)

సమాసము :-

భీతచిత్తులు = బహువ్రీహి.

పాఠాంతరము :- 'దీనికే మొడంబడమని'

**అలంకారము :**

"ఇచ్చితి మిచ్చిన"-అని విడిచిన పదమునే తిరిగి గ్రహించుటచే యిందలి యలంకారము ముక్తపదగ్రస్తము.

**అలంకారౌచిత్యము :-**

కోపాగ్రహమునఁ బలుకు సహదేవుని పలుకులలో ముక్తపదగ్రస్తము కుదురు కొనుట స్వాభావికముగ నున్నది.

**శీలము :-**

శ్రీకృష్ణున కర్ఘ్యమిచ్చుట కంగీకరింపమని దౌర్జన్యమునఁ బలుకువారి నెత్తిపైననే సహదేవుఁడు కాలిడెద ననుచున్నాఁడు.అజ్ఞానముచే నంగీకరింపని వారికి శ్రీకృష్ణుని మహనీయతను భీష్మధర్మజాదులు బోధింపనే బోధించిరి. తెలిసినవారు ముందే యూరకొనిరి. ఇఁక తెలిసియు తెలియనివారు మూర్ఖులు. వారిదే దుర్జనత్వము. శిశుపాలాదు లా కోవలోనివారు. అట్టి దుర్జనుల నవమానింతు ననుట సహదేవుని శీలమునకు రంజకమే! భంజకము కాదు. ఇందులకు దేవతలును మెచ్చి పూలవాన కురిపించిరి. సహదేవుఁడు పాండవులైదుగురిలోను యువక రక్తము గలవాఁడు. నిండు సభలో సభాగౌరవమునకు భిన్నముగా పెద్దప్రొద్దు మితిమీరిన దౌర్జన్యము చూపువారియెడ హానము ప్రదర్శించు నేర్పు సహదేవున కుండక పోవుటయే సహజము. పాత్రౌచిత్య నెఱిగిన నన్నయ యీ దుడుకుతనము నాతని పరముగనే ప్రకటీకరించుట మఱియు యుచితజ్ఞత. మహాత్ములను నిందించు వారే కాదు— ఆ నిందను వినువారుకూడ పాపమును పంచుకొందురను కుమార సంభవము లోని కాళిదాసోక్తియు నిట ననుసంధింపఁదగినది.

**గమనిక :-**

ప్రతిపదార్థమున కీ పద్యము ముఖ్యము.

ఛందస్సు—చంపకమాల. చూ. 8వ పద్య వ్యాఖ్య. /

31. ప : చెలువుగన్ = అందముగ, సహదేవు + పయిన్ = సహదేవునిమీఁద, పుష్ప + వృష్టి = పూలవాన, కురిసెన్ = వర్షించెను.దివంబునన్ = ఆకాశమునందు, వెలయన్ + కఁ = ఒప్పు, సాధు + వాదములు = మేలుమేలను మాటలు, వించెన్ = వినఁబడినవి. సభాసదులు + ఎల్లన్ = సభ్యులందఱు, విస్మయ + ఆకు

లిత + మనస్కులు + ఐరి = వింతచేత కలఁతపెట్టఁబడిన మనస్సు గలవారుగనైరి. కలహ బంధుఁడు = (జగడము ప్రియముగా గల) నారదుఁడు, వేడుకన్ = సంతసముచే, తన + కుంచెయున్ = కుచ్చిళ్లుగల తన యుత్తరీయమును, కృష్ణమృగ + అజినంబునున్ = జింక చర్మమును, పలు + మఱున్ = చాలసారులు, వీఁచుచున్ = విసరుచు, ఆడెన్ = చిందులు ద్రొక్కెను.

తాత్ప : ఆ యవసరమున సహదేవునిపైఁ బుష్ప వర్షము గురిసినది. ఆకాశమున మేల్మేలను మాటలు వినఁబడినవి. సభ్యులెల్లరు నాశ్చర్య పడిరి. కలహ భోజనుఁడగు నారదుఁడు తన యుత్తరీయమును, కృష్ణాజినమును విదలించుచు సంతోషమున నాట్యము చేసెను.

వ్యా. వి:–విస్మయాకులిత మనస్కులు, కృష్ణ మృగాజినము (స. దీ. సంధులు)

సమాసములు:-

(1) పుష్ప వృష్టి, కృష్ణ మృగాజినము (ష. త. లు). (2) విస్మయాకులితము (తృ. త), (3) విస్మయాకులిత మనస్కులు (బహు)(4) కృష్ణ మృగము (కర్మ).

ఛందస్సు—చంపకమాల. చూ. 9 ప. వ్యా.

32. ప. అతి + రోష + పరుష + వచనుండు = మిక్కిలి కోపముచేత కఠినమగు మాటలు కలవాఁడు; స్వ + పక్ష + క్షత్త్రియులన్ + ఎల్లన్ = తనువైపు వారగు రాజుల నందఱను, ఒక్క (చెం)తన్ = ఒకచోటున, అనుమతంబున = అనుజ్ఞ (చెప్పిన) ననుసరించి, యుద్ధ + సన్నద్ధుండయి = యుద్ధమునకు సిద్ధపడినవాఁడై.

సమాసములు :-

(1) అతిరోషము = (కర్మధా) (2) అతిరోష పరుషము (తృ. త) (3) అతిరోష పరుష వచనుఁడు = (బహు) (4) స్వపక్షము (ష. త.) (5) స్వపక్ష క్షత్త్రియులు (స. త.) (6) యుద్ధ సన్నద్ధుఁడు (చ. త.)

33. ప. **Most. Imp.** యదు = యదువులు, వృష్ణి = వృష్ణులు, భోజ = భోజులు, కుకుర = కుకురులు, అంధక = అంధకులునను, వాహినియున్ = (సేన అనెడి) సముద్రమును, క్షణంబునన్ = క్షణములో, నిర్దయతర = మిక్కిలి క్రూరమగు, రోష = కోపమనెడి, మారుత = గాలిచే, నితాంత = ఎడతెగక, సమీరిత మై

(సమ్ + ఈరితమై) = అధికముగ కదలింపఁబడినదై; రయ = వేగముతో, వి + చలత్ = క్రిక్కిఁరిసలుచున్న, తురంగమ = గుఱ్ఱము లనెడు, తరంగములన్ = అలల చేతను, మద + నాగ = మదపు ఏనుఁగు లనెడు, నక్ర = మొసళుల యొక్క, సం + చయములన్ = పెక్కు మొత్తముల చేతను; సంచలత్ = మిక్కిలిగా సంచరించుచున్న, చటుల = పరాక్రమవంతులగు, సైనిక = భటులను, మత్స్యములన్ = చేఁపల చేతను, భయంకరంబు + అయి = భీతిఁ గొల్పునదియై, కలంగెన్ = కలఁతఁ జెందెను.

తాత్ప : వెంటనే యాదవసేనయను సముద్రము, కోపమను గాలివలనఁ గదలింపఁబడి, వేగముగల గుఱ్ఱములే యలలుగా మదపుటేనుఁగులే మొసళులుగా పరవళ్లుద్రొక్కు భటులే చేఁపలుగా భయంకరమై కలతఁ జెందెను.

వ్యా. వి :- సంచలత్ + చటుల = శ్చుత్వ సంధి.

సమాసములు :—

(1) యదు వృష్ణి భోజ కుకురాంధకులు = బహుపద ద్వంద్వము (2) యదు వృష్ణి భోజ కుకురాంధక వాహిని = అ. క.

అలంకారములు :—

తురంగములను తరంగములు, మదనాగములను నక్రములు, సైనికులను మత్స్యములు, రోషమును మారుతము, ననుటచేత రూపకము. వాహిని = సైన్యము, నదియునని రెండర్థములు. అందుచే వాహిని యనెడి వాహిని యని చెప్పుకొన్న శ్లిష్టరూపకము. లక్షణము : ఉపమేయమునకు ఉపమానాభేద తాద్రూప్యరంజనము రూపకాలంకారము.

శైలి :- నన్నపార్యుని యక్షర రమ్యతకును, రుచిరార్థసూక్తికి నిది యుదాహరింపఁదగిన పద్యము.

విశేషము:- ఇందు సూచింపఁబడిన ఉప్పెనవలన సకల క్షత్రియ క్షోభమును కనులకుఁ గట్టుచున్నట్లున్నది. చంపకమాలను గూడ మత్తేభమువలె నడిపించు వృత్తౌచిత్యమును పాటించుటచే నన్నయను శిల్పి యనవలెను.

గమనిక :—

ప్రతిపదార్థమునకు ప. 22 కంటె నిది ముఖ్యమైన పద్యము.

ఛందస్సు : చంపకమాల. చూ. 9 ప. వ్యా.

ప. 34 : సకల + క్షత్రియ + క్షోభంబున్ = క్షత్రియు లెల్లరియొక్క సంచలనమును, భయ + సంభ్రమ + ఆక్రాంత + హృదయుండు = భీతిచేతను, తత్తఱపాటుచేతను, ఆక్రమింపఁబడిన మనస్సుగలవాఁడు.

వ్యా. వి :—క్షోభంబు + చూచి = ప్రథము మీఁది పరుషములకు గ,స,డ,ద, వా దేశము. కాన క్షోభంబు సూచి.

సమాసములు :-

(1) సకల క్షత్త్రియులు = కర్మధా; (2) సకల క్షత్త్రియ క్షోభంబు = ష.త. (3) భయ సంభ్రమములు = ద్విపదద్వంద్వ; (4) భయ సంభ్రమాక్రాంతము = తృ. త; (5) భయ సంభ్రమాక్రాంత హృదయుండు = బహు.

35. ప : పితామహా = తాతా!, ధరణిలోఁ + కల = భూమిపై నున్న, రాజులు = క్షత్త్రియులు, ఎల్లను = ఎల్లరు, దారుణ క్షయకాల + సాగరముల + అట్లుఁ = క్రూరమగు ప్రళయకాలమందలి సముద్రము వలె, కలంగిరి = కలఁతఁ జెందిరి. ఇప్డు = ఇట్టితరుణమున, మఖ + ప్రయోగము = యాగవిధానము, విఘ్నముఁ = ఆటంకమును, పొరయక + ఉండఁ = పొందకుండునట్లును, ప్రజా + అపకారము = జనులకు నాపద, పుట్టకుండగఁ = కలుగ కుండునట్లును, వీరికిన్ = ఈ రాజులకు, ఇచ్చటన్ = ఈ సభయందు, నీవు + చెచ్చెరన్ = నీవు వెంటనే, చిత్త + శాంతి = మనస్సునకు సమాధానమును, ఒనర్పవు + ఏ = కలిగింపు(మా !) ము.

తాత్ప : ఓ తాతా ! ప్రళయకాలపు సముద్రము వలె రాజులందఱును గోపముచేఁ గలుషితులయిన యీ సమయమున వెంటనే వీరి మనస్సులు శాంతి పఱచి, మన యజ్ఞమునకు భంగము కలుగకుండునట్లును, ప్రజలకు నాపద గలుగ కుండునట్లును చేసి. కాపాడుమా !

వ్యా.వి:-(1) ఇప్డు = ఇపుడు '-అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాష నగు-' (2) చెచ్చెరన్ =-'అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు-' (3) ప్రజాపకారము = స. దీ. సంధి.

సమాసములు :-

(1) దారుణ క్షయ కాలము = కర్మధా (2) దారుణ క్షయకాల సాగరములు = స.త. (3) మఖ ప్రయోగము. (4) ప్రజాపకారము, (5) చిత్తశాంతి = ష. త. లు.

అలంకారము :—

ఉపమ· లక్షణము : ఉపమేయమునకు ఉపమానముతో సామ్యము చెప్పఁబడుచో ఉపమాలంకారము.

విశేషము :- యజ్ఞ యాగాదులకు మధ్యలో విఘ్నము తేరాదు. తెచ్చుచో వానికిఁ బ్రాయశ్చిత్త విధానము లెల్ల అకుఁదెలియవు. అందును రాజసూయము నడుమలో విఘ్నమునొందెనేనిఁ బ్రజానముదాయమునకుఁ గీడుమూడును.

ఛందస్సు : తరలమునందు పాద పాదమునకును న, భ, ర, స, జ, జ, గ లను గణములుండును. 12వ అక్షరము యతిస్థానము. ప్రాస నియమమున్నది. ఇందలి మొదటి రెండు లఘువులను ఒక గురువుగా మార్చిన, నిది మత్తకోకిల మగును.

ఉదా :– 'ధాత్రిలోగల రాజులెల్లను దారుణ క్షయకాలసా' అని పరివర్తన చేయఁబడినచో నీ తరల పాదము మత్తకోకిల పాదమగు చున్నది.

గమనిక :—

ఛందస్సునకీ పద్యపాదము ముఖ్యము.

ప· 37 : జిత = జయింపఁబడిన, దైత్యుఁడు = రాక్షసులు గలవాఁడును· యజ్ఞపురుషుఁడు = యజ్ఞ స్వరూపుఁడును, అజేయ + పరాక్రముఁడు = జయింప శక్యముగాని శౌర్యము గలవాఁడునునగు, నారాయణుఁడు = శ్రీకృష్ణుఁడు, దీనిన్ = ఈ యాగమును, చేకొని = స్వీకరించి, కావన్ = కాపాడుచుండఁగా, ఒరులు = అన్యులు,నీయజ్ఞమునకున్ = నీ రాజసూయయాగమునకు, విఘ్నము = ఆటంకము, చేయఁగన్ + ఓపుదురే ? = కలిగింపఁజాలుదురా ?

తాత్ప : రక్షోభీకరుఁడును, యాగ స్వరూపుఁడును, శౌర్యాధుర్యుఁడును నగు శ్రీకృష్ణుఁడీ యజ్ఞమును గాపాడుచుండఁగా, దీనికి నొరులవలన నంతరాయ మెట్లు కల్గును ? (కలుగఁజాలదు).

వ్యా· వి:—విఘ్నము సేయగ '-ప్రథము మీఁది పరుషములకు గ, స, డ, ద, వ, లగును.'

సమాసములు :—

(1) జితదైత్యుఁడు (2) అజేయ పరాక్రముఁడు (బహు)· (3) అజేయము = న· త.

ఛందస్సు - కందము. చూ. 1 పద్యము.

38. ప. చైద్యునికై = శిశుపాలుని సాహాయ్యమునకని, క్షణాని = ప్రయత్నించి, సన్నద్ధులు + అయి + ఉన్న = సిద్ధముగానున్న, ఈ రాజులు + ఇందఱు = ఈ క్షత్త్రియు లెల్లరు, ఈ + క్షణంబు + అ = ఈ క్షణమునందే, హరి = శ్రీకృష్ణుఁడు, అల్గి = కోపించి, చూచుడున్ = చూడఁగనే, అంతక + క్షయమునకున్ = యముని యింటికి, అరిగెడువారు = పోవుదురు, ఘోర + ఆహవమునన్ = భయంకరమగు యుద్ధమునందు, దమఘోష నందను దర్పంబున్ = శిశుపాలుని గర్వమును, ఇప్పుడు + అ = ఇప్పుడే, అడఁగెడున్ = నశింపఁగలదు, కుక్కలు = శునకములు, పెక్కులు + అయ్యున్ = చాలనుండి (యు)నను, ఇభ = ఏనుఁగుల, కుంభ = కుంభస్థలమును, దళన = చీల్చుటయందు, మహిష్ఠ = మిక్కిలి గొప్పవియు, (సమర్థములై), నిష్ఠుర = వాడిగలవియు నగు, నఖ = గోళ్లయొక్క, ముఖము + అగు = కొనలు గలది యైన, హరి + మీఁదన్ = సింహముపై, మొఱఁగి = అఱచి, ఏమి + చేయన్ + ఓపున్ = ఏమిచేయఁగల్గును ?, ఎల్లవారున్ = అందఱును, కృష్ణున్ = శ్రీకృష్ణుని, సింహ పరాక్రమున్ = సింహముయొక్క శౌర్యమువంటి శౌర్యముగల వానినిఁగా, ఎఱుఁగక + ఉన్నవారె? = ఎఱుఁగుదురుగదా !, అనినన్ = అని చెప్పఁగా, అవి + భీష్మ పలుకులు = ఆ భీష్ముని మాటలు, కర్ణ + శూలంబులు = చెవులకు ములుకులు, అయినన్ = కాఁగా, చేదినాథుఁడు = శిశుపాలుఁడు, ఆగ్రహించి = కోపించి, (తర్వాతి పద్యముతో నన్వయము)

తాత్ప : శిశుపాలుని పక్షము బూని తోడ్పడనున్న యీ రాజులెల్లరును శ్రీకృష్ణుఁ డాగ్రహించి చూచినంతనే తప్పక యముని సదనమున కేగుదురు. భయంకరమగు యుద్ధమున శిశుపాలుని గర్వ మిప్పుడే యుడుగును. కుక్కలు పెక్కులు మొఱఁగియు నేనుఁగుల కుంభస్థలమును జీల్చు గోళ్లుగల సింహము నేమి చేయఁగలవు? శ్రీకృష్ణుని బల పరాక్రమముల నెఱుఁగని వారెవరు? అని పల్కు భీష్ముని పల్కులు తన చెవులకు ములుకులు కాఁగా, శిశుపాలుఁడు కోపించి,

వ్యా. వి :-(1)అల్గి = అలిగి = '-లాతి యచ్చునకు సహితము ఒకానొకచో నుడి నడుమ లోపంబు గానంబడియెడి-' (2)చూచుడున్ = చూడఁగాఁ = 'డున్' అనంతర్యార్థకము, (3)ఘోర + ఆహవము = ఘోరాహవము = స. దీ. సంధి.

మహ(త్)చ్ఛబ్దము యొక్క తమ ప్రత్యయార్థకము మహిష్ఠ—(మహాత్— మహీయః—మహిష్ఠ.)

**సమాసములు :-**

(1) అంతక క్షయము (2)కర్ణశూలంబులు = ష. త. (3)ఘోరాహవము = కర్మధా. (4)సింహ పరాక్రమున్ = బహు.

విగ్రహ వాక్యములు :-

ఇభ కుంభ......నఖముఖము = ఏనుఁగుల యొక్క కుంభస్థలమును జీల్చుట యందు గొప్పవగు వాడిగల గోళుల కొనలు (చివరలు).

ఛందస్సు—సీసపద్యము.చూ. 8వ పద్య వ్యాఖ్య. ఈ పద్యము చివరనున్నది ఆటవెలఁది. తేఁటగీతి అనుటకు గుర్తుగా గీ పడినది.తప్పు.ఆ.వె.అని యుండదగును.

39. ప : ఈ + ముది = ఈ ముదుసలి వాఁడగు భీష్ముఁడు, వెఱ్ఱి = వెఱ్ఱి వాఁడు. (ఉన్మాదుఁడు). వీనిన్ = ఈ కృష్ణుని, పరమ + ఈశ్వరుఁగాన్ = పర మాత్మునిగా, కొనియాడెన్ =(స్తుతించెను.) పొగడెను.ధర్మ తత్త్వమ్ములు = ధర్మ శాస్త్ర రహస్యములు, పాండవేయులును = పాండవులును, తానును కాని = తానును దప్ప, ఎఱుంగరు + అట్టె = ఇతరులు తెలిసికొనలేరఁట!, సామమ్మునన్ = మంచి మాటల చేతనే, ఎల్లవారిన్ = అందఱిని, అవమాన్యులన్ + చేసెన్ = అవ మానించినాఁడు. (కాఁబట్టి)-అమాన్యుఁడు = గౌరవింపఁదగనివాఁడు, అంచున్ = అని పలుకుచు, రూక్షమ్ముగన్ = క్రూరముగ,భీష్మున్ + చూచి, బలగర్వితుఁడు = పరాక్రమముచే మదించియున్న శిశుపాలుఁడు,అల్కతో =కోపముచే,ఇట్లు + అని + పల్కెన్ = ఈ రీతిగ మాటలాడెను.

తాత్ప : ఈ భీష్ముఁడు ముసలితనముచే మతిచెడి కృష్ణునిఁ బరమాత్ముఁడని స్తుతించెను. ధర్మ సూక్ష్మములు పాండవులకును దనకును మాత్రమే తెలియు నఁట! ఈ ధర్మ ప్రవచనము పేరిట మెల్లఁగ నందఱను దూలనాడెను. కావున నితఁడు నీచుఁడనుచు శిశుపాలుఁడు భీష్ముని చురచుర చూచుచు నిట్లు పలికెను.

వ్యా. వి :- (1) ఇమ్ముది = త్రికసంధి.— '—త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు—' '-ద్విరుక్తంబగు హల్లు పరంబగునపుడు అచ్చికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు—' (2) అట్టె = అఁటకు రూపాంతరము. (3) అల్కతో '— అచ్చికంబులన్ పదమధ్యంబుల న, ల, డ, ర, ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగా నగు—'.

సమాసములు.-

(1) ధర్మ తత్త్వము = ష. త; (2) బల గర్వితుఁడు = తృ. త.

విశేషము :- శ్రీకృష్ణుని పరాక్రమమును భీష్ముఁడు పొగడెను. ఆ పొగడు టయే తమ్ము తెగడుట యని శిశుపాలుఁడు భావించెను. దానితో నవహేళన చేయుచున్నాఁడు. శిశుపాలుని బలగర్వమును మూర్ఖతయు నిందువలన వెల్లడి యగుచున్నవి.

ఛందస్సు : ఉత్పలమాల. చూ. 15వ పద్యము.

40 ప. నెట్టన = (అనివార్యముగ) తప్పక, ధర్మనందనుఁడు = ధర్మరాజు, నిన్ను = భీష్ముఁడవగు నిన్ను, అవలంబము + చేసి = ఆధారముగా చేసికొని, ఓడ తోన్ + కట్టిన = ఓడకుఁగట్టిన, ఓడపోలెన్ = మఱియొక యోడవలె, గత గౌరవుఁడు = పోయిన గొప్పతనము గలవాఁడై (తేలిక పడినవాఁడై), కడున్ = మిక్కిలి, తూలెన్ = చలించెను, (ఒఱగెను, వాలెను). ఈవు = నీవు; ఇప్పుడు = ఈ సమయమునందు, కృష్ణున్ = కృష్ణుని, చేపట్టి = ఆశ్రయించి, ధరణీపాలురకున్ = రాజులకు, బిభీషికల్ = బెదరింపులు, చూపెదు = చూపించు చున్నావు. ఎందున్ = ఎచటనేని, నీ + అట్టి = నీవంటి, దురాత్ములున్ = దుర్మార్గులు సైతము, కలరె? = ఉందురా? (ఉండరనుట). ధారుణీపతుల్ = రాజుల్, అంత = నీవనుకొనినంత, అధీరులె = ధైర్యములేనివారా?

తాత్ప : విధిలేక నిన్ను నమ్ముకొన్న ధర్మరాజు, ఓడకుఁ గట్టిన యోడవలెఁ దూలిపోయి గౌరవ హీనుఁడయ్యెను. కృష్ణునిఁ బెద్దఁజేసి తక్కిన రాజులను బెదిరించుచున్న నీవంటి దుర్మార్గు లెందును నుండరు. ఈ రాజు లింతమాత్రమునకే బెదరి పోవుదురనుకొంటివా?

వ్యా. వి :— (1) ఈవు = నీవు '— నీ, మీ, నే, మే హల్లులకు లోపంబు విభాషనగు-'(2) ధరణిపాల + లు = ధరణిపాలురు = '-అదంతంబై, దీర్ఘ పూర్వ లోపథంబైన (ల-ఉపధగాఁగల) మహత్తుమీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు-' (3) చూపెదు = లిఙ్లొట్టుల 'వ' కారంబునకు లోపంబు విభాషనగు—

సమాసములు :—

(1)గత గౌరవుఁడు = బహు. (2) ధరణిపాలురు = ష.త. (3) అధీరులు = న. త. (4) ధారుణీపతుల్ = ష. త.

అలంకారము :—

భీష్మునిపై నాధారపడి ధర్మజుఁడు పడవకుఁగట్టిన పడవవలె నున్నాఁడనుట చేత నిది ఉపమాలంకారము.

విశేషము :—

భీష్మునకు ధర్మరాజు లంకెయనియు, నట్టి భీష్ముఁడు శ్రీకృష్ణు నాశ్రయించినాఁడనియు నిందు శిశుపాలుని యవహేళనము.

ఛందస్సు : ఉత్పలమాల. చూ. 15 ప. వ్యా.

41 ప: పూతనాఘాతంబు = పూతనను జంపుటయు; చరణనిహతిన్ = కాలి తాఁకుచేత, చేతన + ఇతరము + ఐన = అచేతనమైన, శకటంబు త్రోపును = బండినిఁ బడఁద్రోయుటయును; వీఁకతోన్ = గర్వముతో, కడుఁబూచు = మిక్కిలి పూచునట్టి, మ్రాకుల విఱుపును = చెట్లను విఱుచుటయును; వల్మీక మాత్ర పర్వత మున్ = పుట్టయంతటి కొండను, ఎత్తికొని = మోచి, వీఁడు = ఇతఁడు, లావు గలఁడు = బలము గలవాఁడు, అనన్ = అనునట్లు, ఏడు దివసంబులు = ఏడు దిన ములు, ఉనికిన్ = ఉండుటయును, వృషవధయును = ఎద్దును చంపుటయును, పమ్మిన = అతిశయించిన, కృష్ణుబీరమ్ములు = కృష్ణుని పరాక్రమములు, పొగడు చున్ + ఉన్న = స్తుతించుచున్న, నీ నాలుక = నీ నాలుకను, ఒక్కడు + అయ్యున్ = ఒక్కటిగా నుండినను, నూరు వ్రయ్యలు గాఁగన్ = నూరు ముక్క లగునట్లు, వ్రయ్యవలయున్ = తునుగవలయును; అట్లు, అయినన్, కాని, అత నిన్ = ఆ కృష్ణుని, పొగడన్ + చాలవు = పొగడుటకు సరిపోవు; ఎల్లదానిన్ = అన్ని విషయములను, ఏను + అ = ఏన = (శిశుపాలుఁడనైన) నేనే, ఎఱుఁగు దును = తెలిసిన వాఁడను, ఎందున్ = ఏ విషయమునందు, వాఁడు = ఆ కృష్ణుఁడు, అర్ఘ్యదాన యోగ్యుఁడు + అయ్యె = అర్ఘ్యమిచ్చుటకుఁ దగినవాఁ డయ్యెనో, చెపుమ = చెప్పుము.

తాత్ప : అబలయగు పూతన వధయు, నచేతనమైన బండిని కాలఁదన్నుట యును, పూచు మద్దిచెట్టులను విఱుఁగఁ గొట్టుటయును, పుట్టవంటి గోవర్ధనమును ఏడునాళు లెత్తి పట్టుకొనుటయును, ఎద్దును జంపుటయు నను శ్రీకృష్ణుని పరాక్ర మములు పొగడుచున్న నీ నాలుక నూరు చీలికలైనఁ గాని నీవింకను బాగుగఁ బొగడ లేవు. ఆ కృష్ణుని చర్యలన్నియును నేనెఱుఁగుదును. అందొకటియు నతని కర్ఘ్యమీయఁ దగినయంతటి మహత్త్వము గలవి కాదు.

**విశేషము:-**

ఇందు శిశుపాలుఁడు శ్రీకృష్ణుని మహాకార్యములను హీన కృత్యములుగా భాసింపఁజేసి, యుపాలంభించుచున్నాడు. ఇది, యాతనికి సహజమైన దోషాన్వే షణ గుణమును దెల్పుచున్నది.

వ్యా. వి :—చేతన + ఇతరము = (అ + ఇ = ఏ) = చేతనేతరము. (గుణ సంధి). సంస్కృత పదాంతమునందలి 'అ'కారమునకు 'ఇ'కారము పరమగుటచే 'ఏ'కారము గల్గినది. (2) (లావు) కల + వాఁడు = కలఁడు. '—ఉన్న, కలన వర్ణ కంబుల మీఁది తచ్ఛబ్ద వకారమునకు లోపంబు విభాషనగు—' (3) నేను + అ = నేనే = నిశ్చయార్థంబునందు 'అ' కారంబగు.

సమాసములు :-

(1) పూతనాఘాతంబు,(2) చేతనేతరము,(3) శకటంబుత్రోపు,(4) వృష వథ = ష. త. లు.

అలంకారములు :

["నీ నాలుక యొక్కఁ డయ్యు వ్రయ్యవలయు నూఱు వ్రయ్యలుగాఁగ,] నట్లయినఁగాని చాలవనిఁ బొగడ"— వ్యాజస్తుతి యను నలంకారము. (పొగడ్త చే నిందతోఁపఁ జెప్పుట).

ఛందస్సు :— సీసపద్యము. చూ. 6వ పద్యము.

వ. 42 గోబ్రాహ్మణులన్ = గోవులను బ్రాహ్మణులను, కూడు పెట్టువారిని = అన్నము పెట్టువారిని, విశ్వసించిన వారిని = నమ్మినవారిని, వధియించుట = చంపుట, మహత్ + పాతకంబు = గొప్పపాపము, అట్టి + అందు = అట్టియందు = అట్టివానిలో, గోవిందుఁడు = కృష్ణుఁడు, స్త్రీ + వధము = పూతన వధయును, గో + వధయున్ = వృషభాసుర హత్యయు; ధర్మువు = ధర్మము; అర్ఘ్యంబు = పూజ; ఇప్పించితి = ఇప్పించితివి, అన్యకామ = ఇతరునిఁ బ్రేమించినది, విడిచిపుచ్చెన్ = విడిచి పెట్టెను.

వ్యా. వి :-(1) ధర్మువు = ధర్మము = '—అర్థాదుల కడయచ్చున కుత్వంబును, మీఁద 'వు' వర్ణకంబును వైకల్పికంబుగా నగు—' (2) ఇప్పించితి = ఇప్పించితివి = '-లిడ్లాట్టుల 'వ' కారంబునకు లోపంబు విభాషనగు—'

సమాసములు :—

(1) గో బ్రాహ్మణులు = ద్వంద్వ; (2) మహాపాతకము = కర్మ. (3) అన్యకామ = బహు.

43 వ. ధర్మ నివృత్త చరిత్రక = ధర్మమునుండి తొలఁగిన ప్రవర్తనము గలవాఁడా !, నీయందున్ = నీలోకూడ, జన నిందితము + అయి = జనులచే నిందింపఁబడి, అనపత్యత + అను = సంతానము లేకపోవుట అనెడి, అధర్మము + అది = ఆ యధర్మము, ఉండఁగన్, జనములకు = ప్రజలకు, నీ + అనుశాసనము = నీ యానతి, ఎట్లు + నమ్మన్ + అగున్ = ఏరీతిగా నమ్మ వీలగును ?

తాత్ప : అధర్మ నిరతుఁడవైన ఓ భీష్ముఁడా ! సంతాన రాహిత్యమను

సమాసములు :-

(1) ధర్మ నివృత్త చరిత్రక = బహు, (2) జన నిందితము = తృ. త.

విశేష :- 'ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః' అను వేదానుశాసనమును దప్పిన వాఁడై సంతానము పడయకపోవుటయు నొక యధర్మముగా నెంచఁబడినదని భావము.

ఛందస్సు :— కందము. చూ. 1 ప. వ్యా.

వ. 44 తొల్లి = మునుపు, వృద్ధహంస = ముసలిహంస, ధర్మ + అధర్మంబులు = చేయఁదగినవియు, చేయఁదగనివియు, వర్తిల్లుచుండుడు = మెలఁగుచుండఁగా, శిక్షించుచున్ = క్రమపద్ధతిని నడపుచు, ప్రాణిహింస = జీవహింస, తపస్ + వృత్తిన్ = తపోవ్యాపారమునందు, సముద్ర జలచరంబులు = సముద్రపు నీటియందు సంచరించుచున్నవి (జంతువులు), రుచ్యంబులు = రుచిగల, భక్ష్యంబులు = ఆహారములు, తత్ + సమీపంబునన్ = దానియొద్ద, తమతమ అండంబులన్ + ఎల్లన్ = వానివాని గ్రుడ్లనన్నిటిని, నిక్షేపించి = ఒప్పఁ జెప్పి, భక్షణ + అర్థంబు = ఆహారముకొఱకై, ఇటన్ = ఈ సముద్రతీరమునందు, అ + అండంబులన్ = ఆ గ్రుడ్లను, కని = చూచి, తద్దయున్ = మిక్కిలి, అంచను = హంసను, అధర్మ ప్రవృత్తుండవు + అయి = అధర్మ మార్గమున నున్నవాఁడవై, ధర్మశిక్ష = ధర్మబోధ, ఆపద = కీడు, ఆపాదించుచున్నవాఁడవు = కలిగించుచున్నావు.

వ్యా. వి :— (1) అయ్యండంబులు = త్రికసంధి, (2) తపోవృత్తి = స్వాది పదసంధి.

సమాసములు:-

(1) వృద్ధహంస = కర్మ, (2) ధర్మాధర్మంబులు = ద్వి. ద్వం. (3) ప్రాణిహింస, (4) తపోవృత్తి, (5) తత్సమీపము, (6) ధర్మ శిక్ష = ష. త.లు. (7) అధర్మము = న. త. (8) అధర్మ ప్రవృత్తుండవు = స. త.

45 ప. విదితముగన్ = తేటతెల్లముగ, ఉప + ఇంద్రుఁడు = ఉపేంద్రుఁడు = కృష్ణుఁడు, అవనిపాలురన్ = రాజులను, అధికబల సంపదన్ = గొప్ప శౌర్యము యొక్క సమృద్ధిచేత, ఓర్చెన్ = ఓడించెను, అంచున్ = అనుచును, మదిన్ = మనస్సునందు, పొగడితి = మెచ్చుకొంటివి. జనార్దను = కృష్ణుని యొక్క, బలంబున్ = శక్తియును, అతి + ఉన్నతియున్ = గొప్ప యౌన్నత్యమును, నా + ఎఱుఁగని + అది యే = నాకు తెలియనిదా ?

తాత్ప : మిక్కిలి పరాక్రమముచే రాజులెల్లరను కృష్ణుఁడు జయించినాఁడని మనస్ఫూర్తిగా మిక్కిలి పొగడితివి. ఆ కృష్ణుని బలమును, గొప్పయు నెఱుంగనివా ?

వ్యా. వి :- ఉపేంద్రుఁడు = గుణసంధి; (2) అవనిపాలుఁడు + లు = అవనిపాలురు = 'అదంతంబైన దీర్ఘ పూర్వ లోపదంబైన మహత్తు మీఁది విభక్తి లకారంబునకు రేఫంబగు—' (3) అంచున్ = అనుచును = 'చువర్ణంబు పరంబగునప్పుడన్వాదుల కుత్వలోపంబేని ను స్థానంబున బిందువేని విభాషనగు—' (4) అతి + ఉన్నతి = అత్యున్నతి = యణాదేశసంధి. (5) నాయొఱుఁగని = '—ధాతుజ విశేషణ భావార్థక పూర్వవ్యవహిత కర్తృపద ప్రథమకు షష్ఠియగును యొక్క షష్ఠియగు. యొక్కకు లోపంబు బహుళంబు—'

సమాసములు :—

(1) అధికబలము = కర్మ; (2) అధికబలసంపద, (3) జనార్దను బలంబు = ష. త. లు.

ఛందస్సు—కందము. చూ. 1ప. వ్యా.

46 ప. ఈ ముకుందుఁడు = ఈ కృష్ణుఁడు, సకల + క్షత్రి + భయంకరునకున్ = క్షత్రియులెల్లరకును భయము గల్గించునట్టి, బార్హద్రథికిన్ = జరాసంధునకు, అని + మొనన్ = యుద్ధమునందు, మార్కొనన్ + ఓపక = ఎదిరింపలేక, భయ + అతిరేకమునన్ = భయముయొక్క పెంపుచేత, పదిమారుల్ = పదిసారులు, వలియన్ + పాఱఁడె = చీకాకుతో పఱుఁగిడలేదా ?

తాత్ప : ఈ కృష్ణుఁడు క్షత్రియలోక భీకరుఁడైన జరాసంధునకు భయపడి పదిమాఱులు యుద్ధభూమినుండి పారిపోవలేదా ?

వ్యుత్పత్త్యర్థము :- బృహద్రథుని కుమారుఁడు బార్హద్రథి. (అపత్యార్థకము).

సమాసములు :-

(1) భయాతిరేకము = ష. త. (2) సకల క్షత్రియులు = కర్మ; (3) సకల క్షత్రి భయంకరము = ష. త.

ఛందస్సు : కందము. చూ 1వ పద్య వ్యాఖ్య.

వ. 47 ఆ + మహాసత్త్వున్ = అట్టి గొప్ప బలముగల, పరమ + బ్రహ్మణ్యున్ = ఉత్తమ వేదాంతియగు, జరాసంధున్, బ్రాహ్మణవేషంబునన్ =

బ్రాహ్మణుల వేషముతో, భీమ + అర్జునులన్ = భీముని,అర్జునుని, తోడుచేసికొని = సాహాయ్య మంచుకొని, త్రివిక్రమ పరాక్రమంబులు గాన్ = కృష్ణుని శౌర్యములుగా, అశ్రాంత వచనుండవు = ఎడతెగని మాటలు గల వాఁడవు.

వ్యా. వి :-(1) అమ్మహాసత్త్వన్ = త్రిక సంధి.

సమాసములు :-

(1) బ్రాహ్మణవేషము = ష. త. (2) భీమార్జునులు = ద్వంద్వ; (3) అశ్రాంత వచనము = న. త; (4) అశ్రాంత వచనుఁడు = బహు.

48 ప. బూతు = బట్టువాఁడు, పొగడినట్లు = పొగడిన రీతిగా, పొగడంగ వలయున్ + పనిన్ = స్తుతింపవలసి యున్నయెడల, సు + గుణవంతులు + అయిన = మంచిగుణములుగల, కర్ణశల్యులు = కర్ణుఁడు, శల్యుఁడును, ఆదిగాన్ + కల = మొదలగు; ప్రొద్దు + పోక = కాలము గడచునట్లు, పొగడుచుండ రాదె ? [ప్రొద్దు పోవ(న్) = పాఠాంతరము—సరళము].

తాత్ప : భట్టు (రాజు) వలె కృష్ణునిఁ బొగడుచుంటివి. కాలయాపనకై పొగడవలెనన్న కర్ణశల్యులు, మున్నైన వారిని పొగడరాదా ?

విశేష :-కర్ణశల్యాదులను సుగుణవంతులుగా భావించుట శిశుపాలునివంటి వానికిఁదగియున్నది.

వ్యా. వి :-బూతు + పొగడినట్లు = బూతువొగడినట్లు'-ప్రథమమీఁది పరుషములకు గసడదవాదేశము—'

ఛందస్సు : ఆటవెలఁది, చూ. 6 ప. వ్యా.

ప. 49. ఆపగా + తనూజ = (గంగాదేవి తనయుఁడవైన) ఓ భీష్మా, అన్య + కీర్తనంబు = ఇతరులను స్తుతియించుటయు, అన్య + నిందయు = ఇతరుని నిందించుటయును,తన్నున్ = స్వయముగ, పరఁగన్ = ఒప్పునట్లు, పొగడి + కోలు = పొగడి కొనుటయు, ప్రబ్బి + కోలు = తన్నుఁదా నిందించు కొనుటయును,వీనిన్ = ఈ చెప్పినవానిని,ఆర్యులు + అయినో = పూర్వులగు, మునులు = ఋషులు,ఆర్య + వృత్తములు = సజ్జనులకుఁగర్తవ్యములు, కావు + అనిరి = కావని చెప్పిరి.

తాత్ప: ఇతరునిఁగాని, తన్ను (తాఁ)గాని స్తుతించుట, నిందించుటయు, సదాచారము గాదని పూర్వమునీశ్వరులు చెప్పిరి.

వ్యా. వి:- (1) పొగడి+కోలు=పొగడికొనుట, (2) నిందకోలు=నిందించుకొనుట. సూ:- '-భావంబు నందును ప్రయుక్తంబగు కొనుటకున్ కోలు విభాషనగు-'

సమాసములు :-

(1) అన్య కీర్తనము, (2) అన్యనింద (3) ఆర్య వృత్తములు=ష.త.లు.

ఛందస్సు: ఆటవెలఁది. చూ. 6 ప. వ్యా.

వ. 50. రూక్ష+అక్షర+వచనంబులన్ = క్రూరమగు నక్షరములుగల మాటలచేత; ఆక్షేపించుచున్న=దూషించుచున్న. సహింపన్+ఓపక = సర్వ శక్యముగాక, భీమసేనుఁడు=భీముఁడు,అతి+రౌద్ర+ఆకారంబునన్=మిక్కిలి భయంకరమగు రూపముతో, అలిగినన్=కోపింపఁగా,

వ్యా. వి:-రూక్షాక్షరము, రౌద్రాకారము=స.దీ. సంధులు.(అ+ఆ=ఆ)

సమాసములు :-

(1) రూక్షాక్షరము=బహు: (2) రూక్షాక్షర వచనము=కర్మ, (3) అతి రౌద్రాకారము=కర్మ.

ప. 51. V. Imp. అచ్చటన్ = ఆ సభయందు, అంతకమూర్తికిన్= యముని ఆకారమువంటి ఆకారముగల, ప్రభంజన ప్రియతనూజునకున్=వాయు పుత్త్రుఁడగు భీమునకు,ప్రకటిత=బయలు పఱుపఁబడిన, కోప=కోపము యొక్క, వేగమున్=ఆవేశముచే, పద్మదళ=తామర రేకులవలె, ఆయత=విశాలమగు, నేత్రముల్=కన్నులు, అరుణ=ఎఱ్ఱని, ద్యుతిన్=కాంతిచేత, భయానకతర= మిక్కిలి భయంకరమగు, లీలన్=వైఖరిని, తాల్చెన్=ధరించెను. ఉద్యతము+ ఐ=పైకెత్త బడినదై, త్రి+శాఖము+ఐ=మూఁడు రేఖలు గలదియై, భ్రు+ కుటి=బొమముడి, లలాట+దేశమునన్=నొసటి ప్రదేశమునందు. త్రికూట= త్రికూట పర్వతపు, తటి = దరులయందలి, త్రిమార్గగా=గంగానదిని. అను కృతిన్=పోలుచు, పోల్చెన్=ఒప్పెను.

తాత్ప : కోపావేశముచే భీముని తామర రేకులవంటి కన్నులెఱ్ఱనై భయం కరముగా నగపడినవి. అతని కనుబొమ్మ లెత్తఁబడి మూఁడు రేఖలు గలిగి త్రికూట పర్వతపు కొండలందు మూఁడు పాయలుగాఁ బ్రవహించు గంగానది ననుకరించు చుండెను.

వ్యా. వి:- (1) పద్మదళ + ఆయత నేత్రముల్, (2) త్రిమార్గగా + అను కృతిన్ = స. దీ. సంధులు.

సమాసములు :—

(1) అంతః మూర్తికి, (2) త్రిశాఖమై = బహు. లు. (3) ప్రకటితకోపము (4) పద్మదళాయత నేత్రముల్, (5) భయానకతరలీల = కర్మ, (6) ప్రకటిత కోపవేగము (7) లలాట దేశము, (8) త్రికూట తటి = ష. త. లు (9) త్రికూట తటి త్రిమార్గగా = స. త.

అలంకారము :—

కోపముచే నెత్తఁబడిన కనుబొమలవలన భీముని ముఖమున నేర్పడిన మూఁడు రేఖలును గంగానదివైన మూఁడు పాయలతోఁ బోల్పఁబడినవి. కావున నిది యుపమాలంకారము.

శైలి :— నన్నయభట్టారకుని నానారుచిరార్థ సూక్తి నిధిత్వమునకును, ప్రసన్న కథాకలితార్థ యుక్తికిని, అక్షర రమ్యతకును గూడ, నీపద్య ముత్తమోదాహరణ మనఁదగియున్నది.

విశేషము :- భీముని తామరరేకులవంటి కన్నులు ఉత్తమ నాయకత్వమును నిరూపించు చున్నవి. 'త్రికూట తటి త్రిమార్గగా' అనునట్టి చోటులయందు ప్రదర్శింపఁబడిన కుదెంపు, భీముని సంయమనమును, నిరుద్ధావేశమును నిరుద్ధమయ్యు ననివార్యముగఁ బ్రకటితమగు కోపాటోపమును సూచించు చున్నవి. నన్నపార్యుని శైలికిని, వీరరస వర్ణనమునకును, నిది సజీవోదాహరణము. కోపము రాఁగూడదని, బ్రాహ్మణుఁడు కోపము నణఁచుకొనుచున్నట్లుగా, నిచటి శైలి, పొందుపడినదనియు, నది నన్నపార్యుని కోపమేగాని, క్షత్రియుఁడగు భీముని కోపముగా నగపడుటలేదనియు కొందఱ వాదము.

ఛందస్సు : వీరమున శార్దూల మత్తేభాదులను వాడుకచేయుదురు. నన్నపార్యుఁడు చంపకమాలనే శార్దూల మత్తేభముల నడకవంటి నడకతో నడిపించుట యందు రచనాశిల్పము గోచరించుచున్నది.

గమనిక : —

ఈ పాఠములో, 22, 23, పద్యములకంటెఁగూడ నిది ప్రతిపదార్థమునకుఁ గడుముఖ్యమైన పద్యమని యెఱుఁగునది.

-: భీమునకు భీష్ముఁడు శిశుపాలుని వృత్తాంతము చెప్పుట :-

వ. 52 నిఖిల క్షత్త్రియ = ఎల్లరు రాజులకు (రాజులందరికిని), త్రాస-జన నంబుగాన్ = భయము కల్గించునట్లుగా, అలిగి = కోపించి, దంత-సంపిష్ట-దారుణ-ముఖుండు-ఐ = పండ్లచే-కొఱుకఁబడినదై-క్రూరమగు-నోరుగలవాఁడయి; శిశు పాల-నిర్మూలన-అఖిల-సంరంభంబునన్ = శిశుపాలుని-తునుమాడుటకై-భయం కరమగు సన్నాహముతో, ఉన్న = ఉన్నట్టి, భీమసేనునన్ = భీముని, వారించి = ఆపి; ఈ+దురాత్ముండు = ఈ దుర్మార్గుఁడగు శిశుపాలుఁడు, తొల్లి = పూర్వము, సాత్వతికిన్ = సాత్వతియను స్త్రీకిని, చతుర్భుజ-లలాట నేత్రంబులతోన్ = నాలుగు చేతులతో, నొసటి కంటితో, ఉదయించి = పుట్టి, రాసభ-రవంబున = గాడిద ఓండ్రతో (గాడిద అరపు, లేక-కూఁతతో); భయ-విస్మయ-అధీన-మన స్కులు = బెదిరినట్టియు, వింతపడినట్టియు, మనస్సుగలవారై, అశరీర-భూతంబు = శరీరములేని భూతము. (ఆకాశవాణి).

సమాసములు :-

(1) చతుర్భుజములు = ద్విగు; (2) లలాట నేత్రము = ష.త. (3) చతు ర్భుజ లలాట నేత్రములతో = ద్వి. ద్వంద్వ. (4) రాసభరవంబు = ష.త. (5) భయ విస్మయములు = ద్వి. ద్వం. (6) భయ విస్మయాధీనము = ష.త. (7) భయ విస్మ యాధీన మనస్కుఁడు = బహు; (8) అశరీరము = బహు; (9) అశరీరభూతము = కర్మ.

53. క. ఏనిని = ఈ శిశువును, ఒరులు = అన్యులు (ఇతరులు), ఎవ్వరున్— చంపగాన్—ఓపరు = ఎవ్వరును చంపఁజాలరు (శక్తులుగారు). ఎవ్వరేనిన్ = ఎవ్వ రైనను, ఏనిన్ = ఇతనిని, ఎత్తికొనుడున్ = ఎత్తికొన్న వెంటనే, మిగిలి-ఉన్న = అధికముగానున్న, బాహు-యుగళంబు = చేతుల జంటయు, కన్నును = నొసటి యందలి కన్నును, అడఁగున్ = సమసి పోవునో, అతఁడు+అ = అతఁడే, ఏని కిన్ = ఈ బిడ్డకు, అంతకుండు = సంహారకుఁడు.

తాత్ప : ఎవ్వరితని నెత్తుకొన్నవెంటనే, యితని యధికమైన చేతులును, అధికమైన కన్నును, మాయమగునో, యాతఁడు మాత్రమే యితనినిఁ జంపఁ గలఁడు. మఱి యింకెవ్వరును జంపఁజాలరు.

సమాసము :-

బాహుయుగళంబు = ష. త.

ఛందస్సు : ఆటవెలఁది-చూ. 6 ప. వ్యా.

వ. 54 ఆ-అశరీరి-వచనంబులు = ఆ యదృశ్య (అగపడని) భూతము యొక్క మాటలు; ఆశ్చర్యమానసులు = వింతనొందిన మనస్సుగలవారు.

సమాసములు :-

(1) అశరీరి = న. త. (2) అశరీరివచనము = ష. త. (3) ఆశ్చర్యమానసులు = బహు.

55 ప. ప్రీతి తోడన్ = ప్రేమతో, అతి-వికృత-స్వరూప-ధరుఁడు-ఐన = మిక్కిలి-వికారమగు-నాకారముఁ- దాల్చినవాఁడగు, కుమారకున్ = బాలుని, తమ-మేనయత్తను = తమ తండ్రి సోదరియగు, సాత్వతిన్ = సాత్వతీదేవిని, ముదంబునన్ = సంతోషముతో, చూడఁగన్-కోరి = చూడఁదలఁచి, అద్భుత-ప్రతిభులు = ఆశ్చర్యముఁగొల్పు బుద్ధివైశద్యముగల, రామకేశవులు = బలరామ కృష్ణులు, ఒక్కనాఁడు = ఒక దినమున, అఖిల-బాంధవ-మంత్రి-సుహృత్-సమేతులు-ఐ = చుట్టములును, మంత్రులు, సుహృదు (స్నేహితు) లందఱితోఁ గూడిన వారై, పన్నుగన్ = యత్నముతోడ, చేది-ధారుణీ-పతి-పురికిన్ = దమఘోషుని పట్టణమునకు, ఏఁగిరి = పోయిరి.

తా॥ ఒకనాఁడు బుద్ధివిశేషముగల బలరామకృష్ణులు వికృతాకారముగల యాబాలునకు మాతయు, దమకు మేనయత్తయునగు సాత్వతినిఁ జూడవలయుననెడి కుతూహలముతో ప్రయత్నపూర్వకముగ బంధుమిత్రసహితులై చేది రాజధానికిఁ బోయిరి.

సమాసములు :-

(1) అద్భుత ప్రతిభ = కర్మ; (2) అద్భుత ప్రతిభులు = బహు; (3) రామకేశవులు = ద్వి. ద్వం.

ఛందస్సు :- చంపకమాల. చూ. 9 ప. వ్యా.

వ. 56. ప్రియ-సత్కారంబునన్ = ప్రేమతో గూడిన గౌరవములచే, ఆ + బాలున్ = ఆ శిశువును, బలదేవుని చేతికిన్ = బలరాముని చేతికి, ఎత్తికొనన్ = ఎత్తికొను నిమిత్తమై, తత్ - అనంతరంబు - అ = వెంటనే, నారాయణు చేతికిన్ = శ్రీకృష్ణుని చేతికి.

వ్యా. వి:- అబ్బాలున్ = త్రికసంధి.

సమాసము :-

ప్రియ సత్కారము = కర్మ.

ప. 57. ఆ + కొడుకున్ = ఆ బాలుని, అబ్జనాభుఁడు = శ్రీకృష్ణుఁడు, ఎత్తికొనుఁడున్ = ఎత్తికొనగనే, అక్కజముగన్ = ఆశ్చర్యముతో, అందఱున్, చూడన్, వాని = ఆ శిశువుయొక్క, మిక్కిలి కన్నున్ = అధిక నేత్రమును, (మూఁడవ కన్నును), మిక్కిలి చేతులును = అధికములగు బాహువులును, గ్రక్కునన్ = వెంటనే, ఒక్కటన్ = ఒకే తూరి, అడఁగెన్ = మాయమయ్యెను.

తా॥ శ్రీకృష్ణుఁడా శిశువు నెత్తుకొనఁగనే చూపఱకాశ్చర్యము గల్గునట్లు వాని యధిక నేత్రమును, అధికమైన చేతులు నొక్కమాఱు మాయమైనవి.

వ్యా. వి:- అక్కొడుకు = త్రికసంధి.

సమాసములు :-

(1) మిక్కిలి చేతులు (2) మిక్కిలికన్ను = కర్మధారయములు; (3) అబ్జనాభుఁడు = బహు.

ఛందస్సు :- కందము. చూ. 1 ప. వ్యా.

వ. 58. అద్భుత చిత్త = వింతపడిన మనసుగలది; అశరీరి = ఆకాశవాణి యొక్క, పలుకులు = మాటలు, మురవైరి వలనన్ = శ్రీకృష్ణునివలన.

ప. 59. ఉపేంద్రా = ఓ కృష్ణా, వీఁడు = ఈ బాలుఁడు, కు-పథ-ప్రవృత్తుఁడు - అయి = దుర్మార్గమున ప్రవర్తించుచు, అప - నయమునన్ = నీతికి విరుద్ధముగ, నీకున్, న + ఇష్టుఁడు = అనిష్టుఁడు + అయినను = విరోధియైనను, కరుణా-నిపుణుఁడవు - ఐ = దయగలవాఁడవై, అపరాధ - శతంబునన్ = నూరు తప్పిదములను, సైపుము - అయ్య = ఓర్చుకొనుమా?

తా॥ కృష్ణా! వీఁడు దుర్మార్గుఁడయి, నీతిఁదప్పి, నీతో విరోధించినను, దయఁబూని, యితని నూరు తప్పులను సహింపుమా!

వ్యా.వి:- సైపుమయ్య = '-సంప్రార్థనంబున ముజ్జునకదాదులు విభాష నను ప్రయుక్తంబులగు-'

సమాసములు :-

(1) కు + పథము = కుపథము = కర్మ. (2) కుపథ ప్రవృత్తుఁడు = స.త.; (3) కరుణా నిపుణుఁడవు = స. త. (4) అపరాధ శతంబున్ = ష. త.

ఛందస్సు-కందము. చూ 1 ప. వ్యా.

వ. 60. జగత్ - వల్లభుఁడు = లోకనాథుఁడు, జనార్దనున్ = శ్రీకృష్ణుని, ప్రార్థించి = వేఁడికొని, తత్ - ప్రసాదంబున్ = అతని యనుగ్రహమును, పడయుటన్ - చేసి = పొందుటచేత, శత - అపరాధంబులు = నూరు తప్పులు, నిండునంతకున్ = పూర్తియగువఱకు, అన్యులచేత = ఒరులచేత, అప్రతిహతుండు = ఎదిరింపరానివాఁడు, నిహతుండు = చంపఁబడినవాఁడు.

సమాసములు :—

(1) జగద్వల్లభుఁడు (2) తత్ప్రసాదంబు = ష. త. లు, (3) శతాపరాధంబులు = ద్విగు (4) అప్రతిహతుఁడు = న. త.

61 వ. గభీర - పరాక్రమ = అగాధమగు శౌర్యముగల, మారుత - ఆత్మజా = వాయునందనా!— నన్నున్, ఇట్లు, ఉఱక = ఊరక(నిష్కారణముగ), ఎగ్గులు = నిందలు, పల్కగన్ = మాటలాడుటకు, ఇతనికిన్ = ఈ శిశుపాలునకు, పోలెన్ - కాక = సరిపోయెనుగాని, ఉద్ధతమతిన్ = గర్వభావముతో, అన్యులు = ఇతరులు, ఈతని విధంబునన్ = ఇతనివలె, పల్కి = మాటాడి, మదీయ = నా యొక్క, చాప = వింటినుండి, నిర్గత = బయలువెడలి, చటుల = చంచలములు, ఉగ్ర = క్రూరములునైన, మార్గణ = బాణముల, నికాయ = సమూహమనెడి, పయోధిన్ = సముద్రమునందు, మునుంగక = మునుకలు వేయక, ఇట్లు = ఈవిధముగ, దర్పితులు - అయి = గర్వముగలవారై, పోవన్ = తప్పించుకొని పోవుటకు, నేర్తురె = శక్తులగుదురా? (ఎట్లు పోవనేర్తురు?)

తాత్ప : ఇతఁడన్యులకు వధ్యుఁడు గాఁదను కారణముచే నన్ను, నిష్కారణముగ నింత నిందించిన నూరకొంటినిగాని, మఱియొక్కఁడిట్లన్నచో నా వాడి బాణము లనెడి సముద్రములో ముంచివేయనా?

విశేషము :— ఉఱక యెగ్గులు పల్కుటయనఁగా 'మానక' నిందించుట యనియుఁ జెప్పవచ్చును. శతాపరాధములు త్వరలో నిండుటకై మానక తిట్టినను, శ్రీకృష్ణుఁడు సైరించెనని అప్పుడు సారస్యము.

వ్యా. వి :-(1) పలుకు-పల్కు [పల్కన్ + (అగు) కాన్]'-అచ్చికంబులన్ పద మధ్యంబుల న, ల, డ, ర, ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగానగు—' (2) నేర్చు + దురు (+ ఏ) = నేర్తురు(+ ఏ)'-చువర్ణంబుతోడి ధుర్గకారంబు తకారంబగు—'

సమాసములు :-

(1) గభీర పరాక్రమ = బహు. (2) మారుతాత్మజ = ష. త. (3) ఉద్ధతమతిన్ = కర్మ., (4) మదీయ...పయోధి = రూపక సమాసము.

అలంకారములు :—

మార్గణ నికాయ పయోధి = బాణముల సముదాయమే సముద్రముగా చెప్పఁబడినది. కావున నిందలి యలంకారము రూపకము.

లక్షణము:- విషయమునకు విషయియొక్క యభేదముచేతను తాద్రూప్యము చేతను రంజనము రూపకాలంకారము.

గమనిక :—

ఈ పద్యముకూడ ప్రతిపదార్థమునకు ముఖ్యమే.

ఛందస్సు :- చంపకము, చూ. 9 ప. వ్యా.

వ. 62 భీష్మ-భీములన్ = భీష్ముని, భీముని; అతిక్రమించి = దాఁటి, అభిముఖుండు = ఎదురుగఁ దిరిగినవాఁడు.

సమాసములు :—

(1) భీష్మభీములు = ద్వి. ద్వం. (2) అభిముఖుఁడు = బహు.

63 ప. కేశవ = శ్రీకృష్ణా !, అవమాన్యున్ = అవమానింపఁదగిన, నిన్నున్, పాండు తనయులు = పాండవులు, సౌహార్దంబునన్ = మైత్రిచేతను, కౌరవ-స్థవిర-ప్రేరణన్ = కౌరవులలో-వృద్ధుఁడగు భీష్మునియొక్క—ప్రోత్సాహముచేతను, సభలోనన్, మాన్యుఁడు-అని = పూజింపఁదగిన వాఁడని, తప్పంగన్ = తప్పుగా, పూజించిరి; ఆ-అవివేక-ఆస్పదులు-ఐన = అట్టి యజ్ఞానమున కాధారులైన, పాండవులన్, మోహ + అంధుండు = అజ్ఞానముచేఁ గన్నుగానని, భీష్ముండున్, నీవున్; సంగ్రామ-రంగంబునన్ = యుద్ధభూమియందు, నాకున్-ఎదురు-ఐ = ప్రతివీరులై, కడఁగుండు = ప్రయత్నింపుఁడు.

తాత్ప : కృష్ణా ! పాండవులు నీయందలి స్నేహముచేతను, తాత ప్రేరేపించుటచేతను, అవమానింపఁదగు నీకు నిండుసభలో అగ్రపూజ యొనర్చిరి. ఇట్టి తప్పిదముచేసిన యవివేకులగు పాండవులును, వారిని ప్రేరేపించిన యజ్ఞాని భీష్ముఁడును, బూజలనందిన నీవును, ఈ మీ ముగ్గురును గూడి రణరంగమున నాయెదుట నిలిచి, యుద్ధము చేయుఁడు.

వ్యా. వి :- (1) అయ్యవివేకము = త్రికసంధి (2) అయ్యవివేక + ఆస్పదులు = అయ్యవివేకాస్పదులు = స. దీ.

సమాసములు :—

(1) కౌరవస్థవిరుఁడు = స. త. (2) కౌరవ స్థవిర ప్రేరణ = ష. త. (3) మోహాంధుఁడు = తృ. త.

ఛందస్సు : మత్తేభము. చూ. 8 ప. వ్యా.

వ. 64 చక్రధరుండు = శ్రీకృష్ణుఁడు; అఖిలరాజచక్రంబు = ఎల్లరిరాజుల సమూహము, వినన్ = వినునట్లు.

సమాసములు :—

(1) అఖిల రాజులు (కర్మ) (2) అఖిల రాజ చక్రంబు = ష. త.

ప. 65. ప్రాగ్జ్యోతిషంబునన్ = ప్రాగ్జోతిషమను పట్టణము నందలి, భగదత్తుపైన్ = భగదత్తుఁడను రాజుమీఁదికి, ఏము = మేము, పోయినన్ = యుద్ధమునకుఁ బోఁగా, ఈతఁడు = ఈ శిశుపాలుఁడు, అన్యాయవృత్తిన్ = అన్యాయమగు నడతతో, ఇటన్ = నేను బయలుదేరినచోట, బాల - వృద్ధులకున్ - ఎల్లన్ = పసివారికిని, ముదుసళ్ళకు, నందఱికిని, భయంబుగాన్ = భయము గల్గునట్లు, ద్వారకాపురిన్ = ద్వారకయను పట్టణమును, కాల్చెన్ = తగలఁబెట్టెను. వీరులు-అయిన = శూరులగు, భోజరాజన్యులు = యాదవరాజులు, పొలఁతుల తోడన్ = తమతమ స్త్రీలతో, వతరైక - అద్రిన్ = రైవతక పర్వతమునందు, క్రీడా + అభిరతిన్ = విహారమునందలి పారవశ్యము చేత, ప్ర - మత్తులు = మిక్కిలి యేమఱినవారు, అయి - ఉన్నన్, వారలన్ = ఆ యాదవులను, అదయుండు—ఐ = కృపలేనివాఁడై, వధియించెన్ = చంపెను. దేవాభుఁడు = దేవతుల్యుఁడు, అగు = అయిన, వసుదేవు చేయు = వసుదేవుఁడు చేయునట్టి, అశ్వమేధమునకున్ = అశ్వమేధ యాగము కొఱకు, అభి - అర్చితంబు - ఐన = బాగుగ పూజింపఁబడిన, హయమున్ = గుఱ్ఱమును, అప - హరించి = దొంగిలించి, యజ్ఞమునకున్ = అశ్వమేధమునకు, విఘ్నము = ఆటంకము, ఆచరించెన్ = కలిగించెను. వీఁడు = ఈ శిశుపాలుఁడు, అతి-పాపుఁడు-ఐ = మిక్కిలి పాపిష్ఠుఁడయి, బభ్రు + భార్యన్ = బభ్రుఁడను యాదవుని భార్యను, తనకున్, భార్యన్ = భార్యనుగా, చేసెన్ = చేసికొనెను. [ఆమెను బలాత్కరించి కొనిపోయె ననుట.]

తా॥ నేను భగదత్తుని పైకిఁ బోయినపు డన్యాయముగ ద్వారకను దహించినాఁడు. క్రీడా పరాయణులై యున్న యాదవ వీరులను రైవతకాద్రియందు సంహరించెను. వసుదేవుని యశ్వమేధమునకు విఘ్న మాపాదించినాఁడు. పాపశీలుఁడై బభ్రుని భార్య నపహరించెను.

వ్యా. వి:- (1) ఏము = '-నీ, మీ, నే, మే, హల్లులకు లోపంబు విభాష నగు.' (2) క్రీడాభిరతి = స. దీ. సంధి.

సమాసములు:-

(1) అన్యాయము = న. త. (2) అన్యాయవృత్తి = కర్మ. (3) బాల వృద్ధులు = ద్వి. ద్వం. (4) ద్వారకాపురి, (5) రైవతకాద్రి = సంభావనా పూర్వ పద కర్మధారయములు; (6) క్రీడాభిరతి = స. త. (7) దేవాభుఁడు = బహు.

ఛందస్సు:-సీస పద్యము. చూ. 6 ప. వ్యా.

వ. 66. వాక్ - విషయంబులు = నోటిమాటలచే నయినవి, న - ఏకంబులు = పెక్కు (చాలా), అపరాధ-శతంబులు = నూరు తప్పులు, సహించితిన్ = ఓర్చితిని, అకారణ-వ్యతిక్రమంబు = హేతువులేని, అక్రమమును, ఉపక్రమించి = ఆరంభించి, అత్యంత - శత్రుండు = మిక్కిలి విరోధిగ; అతి-పరుష-వచనుండు = చాల కఠినమగు మాటలుగలవాఁడు; పురుష + ఉత్తమునకున్ = శ్రీకృష్ణునితో.

వ్యా. వి:- అత్యంతము = యణాదేశ సంధి.

సమాసములు :-

(1) అతిపరుష వచనుఁడు = బహు; (2) అనేకంబులు = న. త. (4) అపరాధ శతంబు = ష. త. (4) అత్యంత శత్రుండు = కర్మ. (5) పురుషోత్తముఁడు = స. త.

వ. 67. దుర్గుణ - ప్రియ = చెడుగుణములే యిష్టముగాగల కృష్ణా! నీ - కూర్మియున్ = నీ ప్రీతియును, నీ - అలుకయున్ = నీ కోపమును, అవి = ఆ రెండును, నాకున్-ఏమిటికి = నాకేల? (వానితో నాకుఁ బనిలేదనుట), మొదలన్ = తొలుత, నాకున్ - ఇచ్చిన = నా కిత్తునని చెప్పిన, (వాగ్దత్తయైన), ఆ-కన్యను = రుక్మిణి యను వధువును, చేకొని = భార్యగా చేసికొని, (స్వీకరించి), ఇట్లు - పలుకన్ = బభ్రు భార్యను గ్రహించితినని నాయందున నేరము లెన్నుటకు, నీకున్ సిగ్గును = లజ్జయైనను, లేదే = లేదా?

తా॥ దుర్గుణ ప్రియుఁడవైన కృష్ణా! నీ ప్రీతివలన నాకుఁ గావలసినదేమి? నీ ద్వేషమువలన నాకుఁ బోవునదియేమి? పూర్వము నాకిత్తుమన్న కన్య నపహరించుకొని పోయి పెండ్లియాడిన నీవుకూడ నిట్లు నాపై సిగ్గుమాలి దోషము లారోపించు చుంటివా?

వ్యా. వి:—అక్కన్య = త్రికసంధి.

సమాసము :—

దుర్గుణ ప్రియ = బహు.

ఛందస్సు : కందము. చూ. 1 ప. వ్యా.

-: చక్రాయుధముచే శిశుపాలుఁడు చచ్చుట :-

68 ప. అని = అనిపల్కుచు, శిశుపాలుఁడు, అట్లు = ఒక్కొక్కటిగా సభన్ = నిండుసభలో, హరిన్ = శ్రీకృష్ణునిఁగూర్చి, అప్రియముల్ = నిందలు పల్కుచున్నచో = పల్కుచుండఁగా, దనుజ-అంతక-చక్రము = శ్రీకృష్ణుని యొక్క సుదర్శనము, అనిల-శిఖా-ఆళి = అగ్నిజ్వాలల వరుస, తూలన్ = క్షీణించునట్లుగను; రాజ-చక్రము = రాజుల సముదాయము, ఎల్లను = అంతయును భయము-అందగన్ = భయపడునట్లుగను; బృహత్-రుధిర-ధారలు = గొప్ప రక్తధారలు, బోరన = బోరుమను ధ్వనితో, మీఁదికిన్ = పైకి, ఒల్కఁగాన్ = చిమ్మగా, చేదినందను-తనువున్ = శిశుపాలుని శరీరమును, మూర్ధ-వికలంబుగన్ = తలలేని దానినిఁగా, చేసెన్ = ఒనరించెను.

తాత్ప : నిండుసభలో నిట్లు శిశుపాలుఁడు శ్రీకృష్ణుని నెడతెగక నిందించు సమయమున నతని సుదర్శన చక్రము అగ్నిజ్వాలల కాంతుల నణఁచు తేజముతో రాజసంఘమునకు భయముగొల్పుచు శిశుపాలుని శరీరమును ఖండించెను. అప్పుడా తని దేహమునుండి రక్తధారలు బోరన బైటికిఁ జిమ్మినవి.

వ్యా. వి:- (1) ఒలుకు-ఒల్కు = ఆచ్ఛికంబులన్ పదమధ్యంబుల న, ల, డ, ర, ల ఉత్వంబునకు లోపంబు బహుళంబుగనగు (2) దనుజాంతకు చక్రము = స. దీ. సంధి.

సమాసములు :-

(1) అప్రియములు = న. త., (2) దనుజాంతక చక్రము, (3) అనల శిఖాళి, (4) బృహద్రుధిరధారలు, (5) రాజచక్రము = ష. త. లు. (6) బృహద్రుధిరము = కర్మ; (7) మూర్ధ వికలము (తలచేత లోపించినది) = తృ. త.

ఛందస్సు—చంపకమాల. చూ. 9 ప. వ్యా.

69 ప. ఇట్లు = ఈ విధముగ, శిశుపాలుఁడు, ప్రల్లదము-పది = దుర్భాషలుమాని, వ్రజ-హత-అద్రి-తుల్యుఁడు = వజ్రాయుధముచేఁగొట్టఁబడినకొండవలె, త్రెళ్లుడున్ = పడినయంతనే, వానిది-ఐన = వాని యొక్క, పృథుదేహమున్ = స్థూలమైన (బరువైన) శరీరమునుండి, వెల్వడి = బయలుదేరి, తేజము = ఒక తేజస్సు, అంబరంబు = ఆకాశము, ఎల్లన్ = అంతయును, వెలుంగన్ = ప్రకా

శించునట్లు, వచ్చి, విస్మయ–ఉత్ఫుల్ల–విశాల - నేత్రులు - అయి = ఆశ్చర్యముచే విచ్చిన విశాల నయనములు గలవారై, భూపతులు = రాజులు, ఎల్లను = అంతా యును, చూచుచుండఁగాన్ = దర్శించు చుండఁగనే, పరమ - ఈశ్వరు - దేహమునన్ = శ్రీకృష్ణుని శరీరములో, చొచ్చెన్ = ప్రవేశించెను.

తా॥ ఇట్లు శిశుపాలుఁడు దుర్భాషలాడి, తలతెగి, వజ్రఘాతముచే నొరిగిన కొండవలెఁ గ్రిందబడిన వెంటనే యాతని దేహమునుండి బయలుదేరి యొక వెలుఁగాకాశ మంతయు వెలుఁగునట్లు వచ్చి, శ్రీకృష్ణుని దేహమునందుఁ బ్రవేశించినది. ఈ యద్భుత విషయమును రాజులందఱు నాశ్చర్య వికసిత నేత్రులై దర్శించుచుండిరి.

వ్యా. వి:- (1) పృథు దేహమున్ = దేహమును = దేహమునుండి. ఇచట 'నుండి' అనుటకు బదులు 'ను' వాడఁబడినది, '-ఒకానొకచో నొక విభక్తికి మఱి యొక విభక్తియునగు-' (2) విస్మయోత్ఫుల్లము = (అ + ఉ = ఓ)గుణసంధి.

**సమాసములు :—**

(1) వజ్రహతము(2) విస్మయోత్ఫుల్లము = తృ. త; (3)వజ్ర హతాద్రి= కర్మ; (4) వజ్ర హతాద్రి తుల్యుఁడు = తృ. త. (5) విశాల నేత్రులు = బహు; (6) భూపతులు = ష. త.

**విశేషము :**

పదు = నశించు, పది = నశించి, ఉడిగి.

**అలంకారము :—**

తలతెగిన శిశుపాలుఁడు వజ్రఘాతముచే నేలకొరిగిన కొండతోఁ బోల్పఁబడి నాఁడు. కావున నిందలి యలంకారము ఉపమ.

ఛందస్సు:- ఉత్పలమాల. చూ 15వ పద్యము.

70 ప. చైద్యుని = శిశుపాలుని, పాతంబున = మరణముచేత, ఘన–జాలము = మేఘముల సంఘము, లేకయున్ = లేకున్నను, వెలుచన = హెచ్చుగా, పిడుగులతోడి వృష్టి = పిడుగులతోఁగూడినవాన, కురిసెన్ = వర్షించెను, ధరిత్రి = భూమి, సముద్ర = సముద్రములతోడను, మహత్-అద్రి–నికాయముతోన్ = మహా పర్వతముల సమూహముతోడను, దిద్దిరన్ = గిరగిర, తిరిగెన్ = భ్రమించెను,

తాత్ప : శిశుపాలుఁడు భూమిపై పడిపోయినవెంటనే మబ్బులు లేకయే పిడుగులతోడి వాన గురిసినది. సముద్రములతోను, పర్వతములతోను గూడిన భూమి గిరగిరఁదిరిగెను,

వ్యా.వి:- పిడుగులతోడి వృష్టి = '-చేత, తోడ, వలన లకు ఇత్వంబు సమాసంబులందగు-'

సమాసములు :—

(1) ఘనజాలము, (2) సముద్ర మహాద్రి నికాయము = ష. త. లు.

ఛందస్సు: కందము. చూ. 1 ప. వ్యా.

71 ప. అవ్యయున్ = నాశనములేనట్టియు, అంబుజ-నాభున్ = పద్మము నాభియందుఁగల్గినట్టియు, భువనవంద్యున్ = లోకములచే నమస్కరింపఁ దగినట్టియు, ఉప-ఇంద్రున్ = శ్రీకృష్ణుని, జయ-జయ-నినాదమునన్ = జయజయ యను ధ్వనితో, ప్రియమునన్ = ప్రీతితో, పొగడు = నుతించునట్టి, జనంబులది-అయిన = జనులయొక్క, మహత్-ధ్వనియు = గొప్ప నినాదమును (చప్పుడు). అతి-తుములంబు-అయి = మిక్కిలి దట్టమై, చెలఁగెన్ = ఒప్పెను (వినఁబడెను).

విశేషము:-

ఉపేంద్రుఁడు = అదితి దేవతల తల్లి. బలిని శిక్షించుటకు శ్రీమన్నారాయణుఁడు అదితికిఁగుమారుఁడై (వామనుఁడై) యుదయించెను. అదితి కుమారులలో ఇంద్రుఁడు పెద్ద. వామనుఁడాతనికిఁ దమ్ముఁడైనందున ఉపేంద్రుఁడనఁబడుచున్నాఁడు.

తాత్ప : జనులెల్లరును ప్రీతితో జయజయ ధ్వానములు చేయుచు శ్రీకృష్ణుని పొగడునట్టి సవ్వడి మిన్నుముట్టెను.

వ్యా. వి :- ఉపేంద్రుఁడు = (అ + ఇ = ఏ) గుణసంధి.

సమాసములు :-

(1) అవ్యయుఁడు, (2) అంబుజ నాభుఁడు = బహు.లు. (3) భువన వంద్యుఁడు = తృ.త. (4) మహాధ్వని, (5) అతితుములము = కర్మధారయములు.

ఛందస్సు :- కందము. చూ. 1వ పద్య వ్యాఖ్య.



# నన్నయ కవిత్వ గుణములు

సారమతులైన కవీశ్వరులు ప్రసన్న కథాకలిత(వి)తార్థయుక్తిలో నారసి మేలునా రచింతునని నన్నపార్యుఁడు తన భారత రచనమును గూర్చి కావ్య కళా కుశలుడై నుడివెను. ఉదంకుని కథ, దేవయాని వృత్తాంతము, ప్రమద్వరా వృత్తాంతము, శకుంతలోపాఖ్యానము, నలచరిత్రము, భీష్ముని చరిత్ర, మున్నైన వానిని శిల్పదృష్టితోఁ బరిశీలించిన యెడల నన్నపార్యుఁ డెంత చక్కగా కథ కట్టఁగలఁడో తెల్లము కాఁగలదు.

నన్నపార్యుఁడు తన్నుగూర్చి తాఁ జెప్పుకొనుచు, తన ప్రసన్న కథాభిధానమును పండితులు పరిశీలించి మెత్తురనుటయే గాక, యితరు లక్షర రమ్యతా నాదరింతురని కూడ చెప్పుకొని యున్నాఁడు. అక్షర రమ్యత యనఁగా నాద గాంభీర్యము. నన్నపార్యుని మృదు సంస్కృత పద లలితమైన శైలి వినువారి చెవులకు నింపు నింపుచు శబ్దముల గాంభీర్యముచే సంతసమును గూర్చుచుండును. అతఁడు దీనినే అక్షర రమ్యత యనెను; ఇదియే నాదగాంభీర్యము. ఈతని పద్యార్థ మొక్కొక్కప్పుడు స్పష్టముగఁ దెలిసినను, దెలియకపోయినను, ఆ పద్యమున గల పదముల పొందికచే వినువారి చెవులకవి ఆనందమును గూర్చుచుండును.

తాను నానారుచిరార్థ సూక్తినిధి ననికూడ నన్నయ చెప్పుకొనెను. భారతము ముందగ నితిహాసము. ఇతిహాస మనఁగా, ఇతిహ = ఈవిధముగా, ఆస = ఆయెను, అని జరిగిపోయిన గాథలను చమత్కారముతో, నేర్పుతో, సుసూక్తులతో, కవి వర్ణించి చెప్పునట్టి పురాణ గ్రంథము. నన్నయవంటి యైతిహాసికునకు ప్రసన్న కథా కలితార్థ యుక్తియు, నక్షర రమ్యతయు, రుచిరార్థ సూక్తులును ముఖ్యముగ నావశ్యకము. ఈ మూఁడు గుణములను మన 'ధర్మజుని రాజసూయము' అను పాఠ్యమున నెడనెడ గోచరించుచునే యున్నవి.

నన్నపార్యుని కవిత్వశైలియందు గోచరించు నింకొక గుణము అంతశ్శుద్ధి. ఈ యంతశ్శుద్ధి గలవానికి ఆత్మవిశ్వాస మధికము. ఈ పాఠ్యభాగమున భీష్మ, ధర్మజ, సహదేవ, శ్రీకృష్ణాదుల యందీ ఆత్మవిశ్వాసము నన్నపార్యునిదే ప్రతిబింబించుచున్నది.

భావనిగ్రహము నన్నపార్యుని కవిత్వగుణములలో నింకొకటి. ఈ నిరుద్ధావేశము శిశుపాలవధలో ప్రతిపాత్రయందును, చిట్టచివరకు భీమునియందు గూడ గోచరించుచున్నది.

పరిహాస రసికత నన్నపార్యుని కవిత్వమున మఱియొక గుణము. ఇది శిశుపాలుని యుపాలంభమునను, దానికి భీష్మాదుల సమాధానమునను ఈ పాఠ్యములో వెల్లడియగుచునే యున్నది.

నన్నపార్యుని వాక్య సంయోజనము సాంస్కృతిక మనుటకు ఈపాఠ్యమున పూజనీయులను గూర్చి చెప్పిన (ప. 4) మత్తకోకిలావృత్తమును, శిశుపాలుఁడు ధర్మజు నాక్షేపించినప్పటి (ప. 10) పద్యమును, ధర్మజుని వారించి శిశుపాలుని జూచి భీష్ముఁడు పలికిన (ప. 24) పద్యమును, పెక్కు లుదాహరింపఁదగి యున్నవి.

నన్నపార్యుని శైలికి అర్థసంగ్రహత, యింకొక లక్షణము. అనఁగా, పదముల యిమిడిక నన్నయశైలిలో చాల ప్రసిద్ధమైన గుణము. తక్కువ పదములలో నెక్కువ అర్థమును కుదించిన పద్యము లనేకములు పాఠ్యమున గలవు.

సహజముగ నన్నయది పురాణశైలి. కాని, వర్ణన శైలియు, సంవాద శైలియు, సంఘర్షమునుపట్టి వాడుక చేయుచునే యుండును. శిశుపాల ధర్మజులకును, ధర్మజ భీష్ములకును, భీష్మ శిశుపాలురకును, నడుమ నడచిన సంభాషణల యందు నన్నయ ప్రతిభ గోచరించుచునే యున్నది.

పాత్రల మనోవ్యాపారమును వర్ణించుటయందు ముందు తిక్కనను చెప్పి తరువాత నితరాంధ్ర కవులను జెప్పవలయుననుట నిజమేయైనను, "నీవెఱుఁగక యిచ్చిన నిది నావిషయమె యగు మనంబునందలఁపక" (ప. 13) మున్నగు పద్యములలో ఈర్ష్యాపరుల మనః ప్రవృత్తిని నన్నపార్యుఁడు హృదయంగమముగ నిరూపించెననుట నిజము.

మొత్తముమీఁద పాత్రల శీల పోషణమునందును, రససంపాదనమునందును, సంఘర్ష శుద్ధియందును, పర్వక్రమమున పోనుపోను నన్నయ భట్టారకుని కవితా ప్రతిభగూడ పరిణతమైన దనవచ్చును.

---

## ప్రశ్నోత్తరములు

ప్ర 1. శిశుపాల ధర్మరాజుల సంవాదము నభివర్ణింపుము :— (లేదా) శిశుపాలుఁడు అధోక్షజు నాక్షేపించుచు ధర్మజున కేమనెను ? ధర్మజుఁడాతనిని ప్రియ వచనముల నెట్లనునయించెను ? (లేదా) శిశుపాలుఁడు కృష్ణ ధర్మజ నదీసుతుల నేమని యెగ్గు లాడెను ? ధర్మనందనుఁడా శిశుపాలు నేమని పట్టువఱచెను ?

"పూజనీయులగు రాజులును, విప్రులును నుండుచున్నను, పాండవులు భీష్ముని దుర్బోధలు విని, నీచ ప్రవర్తనుఁడును, అనాహ్వానితుఁడును నగు గొల్లని బూజించి, నీ యజ్ఞానమును వెల్లడించుకొంటివి. ధర్మశాస్త్రములను గమనించుట దుస్సాధ్యము. అట్టిచో వివేక విహీనుఁడైన భీష్ముఁడు ధర్మరహితుఁ డవగు నిన్ను, నీచుఁడగు కృష్ణుని బూజింప బ్రోత్సహించినాఁడు. ఇతనిపై మీకు ప్రేమయున్నచో ధనమీయవచ్చును; ప్రియముగఁ బోషింపవచ్చును. కాని మహోన్నతులగు రాజులును బ్రాహ్మణులును గల నీసభలో నతని నగ్రపూజ చేయవచ్చునా ?

వృద్ధతముఁడగు వసుదేవుఁడుండఁగా, ఋత్విక్కులలో నుత్తముఁడగు వ్యాసుఁడుండఁగా, ద్రోణ కృపాదులగు నాచార్యోత్తములుండఁగా రాజుకాని యాదవుని బూజానర్హునిఁ బూజించితివేమి ? నీవు [illegible] గలవాఁడవు; పూజనీయుఁడవు నని నమ్మి నీ యాగమునకు వచ్చిన రాజుల నెల్లర నవమానించితివి.

ఒకవేళఁ దెలియక నీ వర్ఘ్యమిచ్చితివే యనుకొందము. కృష్ణుఁడు దానిని గ్రహింపఁదగునా? తన యోగ్యతఁ దానెఱుఁగ వలదా ! పేడివానికిఁ జేసిన పెండ్లి వలెను, చెవిటివానికి వినిపించిన సంగీతమువలెను, గ్రుడ్డివానికిఁ జూపిన యద్దము వలెను, కృష్ణునకుఁ జేసిన యీ యగ్రపూజ వ్యర్థము.

ఇందుచే ధర్మరాజను నీ విశేషనామముగూడ వ్యర్థమైనది. నీవు పదిమందిలో పరిహాసపాత్రుఁడవైనావు" అని శిశుపాలుఁడు ధర్మరాజును నిందించుచు సభ వీడి పోవ నెంచెను.

దీనికిఁ గోపింపక ధర్మజుఁడు వానిని బ్రియవచనములతో ననునయింపఁబూని, యిట్లు పలికెను.

"సద్గుణ సంపూర్ణులగు రాజులు, పరుషవచనములు బలుకవచ్చునా ? శ్రీకృష్ణుఁడు బహ్మకుఁ దండ్రియు, వేదాది సంస్తుతనామాంకుఁడును, బ్రహ్మాండమూలమును, త్రిలోక పూజనీయుఁడును నని తెలిసియే భీష్ముఁ డాతనిని బూజింప నియోగించెను. భీష్ముఁడు తత్త్వబుద్ధితో శ్రీకృష్ణు నెఱిఁగినట్లు శిశుపాలుఁడా ! నీ వెఱుఁగఁజాలవు. శ్రీకృష్ణుఁడు గురుఁడనియు, లోకమునందు నుత్తముఁడనియుఁ దలఁచి వృద్ధరాజన్యులెల్లరును ఈ పూజావిధానమున నంగీకరించి [illegible] యుండఁగా నీవు తప్పనవచ్చునా ?"

ఇది శిశుపాల ధర్మజుల సంవాదము.

ప్ర 2. భీష్మ శిశుపాల సంవాదమును వర్ణించునది; (లేదా) ధర్మజుని వారించిన భీష్ముఁడు శిశుపాలునితో నేమనెను ? దానికి చైద్యుని సమాధాన మెట్టిది ? (లేదా) కృష్ణుని సమర్థించిన భీష్ముని చైద్యుఁడేమని యుపాలంభించెను ?

"మూర్ఖా! ఈ సభలోని రాజులు శ్రీకృష్ణుని దయవలనఁ జెఱనుండి విడిపింపఁబడినవారో, నాతనిచే నోడిపోయినవారో, యాతని శరణుఁజొచ్చిన వారో, తప్ప వేఱుగలరా?

జ్ఞానాధికుఁడైనచో వయసు తక్కువయియున్నను బ్రాహ్మణుఁడు పూజనీయుఁడు. అట్లే పరాక్రమాధికుఁడైనచో వయస్సుచేఁ జిన్నవాఁడయ్యును క్షత్రియుఁడు పూజార్హుఁడు.

ఈ జ్ఞాన పరాక్రమములు రెండును శ్రీకృష్ణుని యందధికముగ నున్నవి. కావున నితఁడే యగ్రపూజకుఁ దగినవాఁడు. ఇతఁడు మాకేకాక ముల్లోకముల వారికినిఁ బూజ్యుఁడు.

పలువురు వయోవృద్ధులున్నను వారినిఁ బూజించుటకు మనసురాదు. శ్రీకృష్ణుఁడు రాజులందఱిలో గుణగరిష్ఠుఁడని పూజించితిమి.

ఇతరులెవ్వరినిఁ బూజించినను, ఆ పూజింపఁబడినవారుమాత్రమే తనివి నొందుదురు. కాని యీ గోవిందునిఁ బూజించినచో, ముల్లోకములును దనివి చెందును.

భూతములును, ప్రకృతియు, పురుషుఁడును, జరాచరాత్మకమైన ప్రపంచమును, తానెయైయున్న యీ పరమాత్ముని, యోగీశ్వరులు తెలిసికొనఁగలరు. కాని నీకేమి తెలియును?" అని భీష్ముఁడు శిశుపాలుని జక్కపఱపఁ జూచెను.

కాని చైద్యుఁడు బలగర్వితుఁడగుటచే భీష్ముని పలుకుల విననొల్లక యాతనిని రూక్షతరవచనములతో నాక్షేపించుచు నిట్లు సమాధానించెను.

"భీష్మా! ధర్మజుఁడు నీపలుకులు విని తన గౌరవమును బోఁగొట్టుకొనినాఁడు. నీవు కృష్ణునంత గొప్పవానిని జేసి బెదరింతువే! ఇచటి రాజులందఱు భయశీలురా?

పూతనను జంపుటయు, బండిని దన్నుటయు, చెట్లు విఱుచుటయు, పుట్టయంతటి కొండ నొకదాని నెత్తుటయు, నెద్దును మడియించుటయు, ననునవి యీ కృష్ణుని పరాక్రమములు. వీనిని పెద్దఁజేసి పొగడు నీనాలుక నూఱు చీలికలయినను బాగుండును. స్త్రీవధయు, గోవధమును జేసిన కృష్ణున కర్ఘ్యమిప్పించితివి. మఱియు నితరుని ప్రేమించిన యంబనుఁ దెచ్చితివి. సంతానము లేకపోవుట యను దోషము గల్గి, యధర్మ ప్రవృత్తుఁడవగు నీవుచేయు ధర్మోపదేశముల నెవరు నమ్ముదురు? ముందు, కృష్ణుని బలము నేనెఱుఁగనా? ఇతఁడు జరాసంధునకు పదిమాఱులు వెన్నిచ్చి పాఱిపోవలేదా? ఇతఁడు భీమార్జునులతో బ్రాహ్మణవేషమునఁ బోయి కపటోపాయముచే నతనిని జంపలేదా?

కాలము గడచుటకు పొగడవలెనని కోరెదవేని సజ్జనులగు భీష్మ శల్యాదులను బొగడరాదా ? ఆత్మస్తుతియు నాత్మనిందయు నాయుష్కరములైన వానికి హానియని పూర్వఋషీశ్వరులు చెప్పిరి గదా !"

ప్ర 3. శిశుపాల జనార్దనుల సంవాదమును వివరింపుఁడు:- [లేదా శిశుపాలుఁడు శ్రీకృష్ణుని కథిమఖుఁడై యేమనెను ? దానికి సమాధానముగా చక్రధరుఁడు రాజచక్రము పిన నేమనెను ?]

"కృష్ణా ! ముదిమిచే మది తప్పిన భీష్ముని ప్రోత్సాహము వలనఁ బాండవులనర్హుఁడవైన నీకు సభా పూజగావించిరి. అందుచేఁ బ్రోత్సహించిన భీష్ముఁడును, బూజించిన పాండవులును, బూజింపఁబడిన నీవును, యుద్ధమునందు నాకెదురై నిల్వుఁడు" అని శిశుపాలుఁడు గర్వించి పలికెను.

దీనికి కృష్ణుఁడీవిధమున సభాసదుల నుద్దేశించి సమాధానించినాఁడు. "నేను భగదత్తునిమీఁదికి యుద్ధమునకై పోయినప్పు డీతఁడన్యాయముగ నాపట్టణమునకు నిప్పుపెట్టెను. యాదవులు రైవతకాద్రిలో క్రీడించుచు మైమఱచియుండఁగా నీతఁడు వారినిఁ జంపెను, వసుదేవుని యాగాశ్వము నపహరించి యాతని యజ్ఞమున కీతఁ డాటంకము కల్గించినాఁడు. బభ్రువను యాదవుని భార్యను బలాత్కరించి కొనిపోయెను. మఱియు నీతఁడు నాయెడ వాగ్రూపములైన యపరాధములు చాలఁ జేసెను.

మాయత్త వీని యపరాధములు నూఱు మన్నించునట్లుఁ బ్రార్థించినది. అందుచేత వీనినన్నిటి నోర్చుకొంటిని. ఇప్పుడు నిష్కారణ వైరము పూని నన్నుఁ దూలనాడుటయు మీరెఱిఁగినదే గదా !"

ప్ర 4. శిశుపాలుని జన్మ వృత్తాంతమేమి ? [లేదా, భీష్ముఁడు భీమునకు శిశుపాలుని జన్మవృత్తాంత మేమని చెప్పెను ?]

చేదిరాజవంశమున దమఘోషుఁడను వానికిఁ గృష్ణుని మేనయత్త సాత్వతి భార్య. ఆ దంపతులకు నాలుగు భుజములతోడను నొసటి కంటితోడను, నొకశిశు వుదయించి గాడిద స్వరముతో నేడ్చుచుండఁగాఁ దలిదండ్రు లాశ్చర్య భయ సమన్వితులై యేమి చేయుటకును దోఁపక చూచుచుండిరి.

అప్పుడీ బాలు నెవరెత్తుకొనఁగా నీతని మిక్కిలి కన్నును, మిక్కిలి చేతులును మాయమగునో వానిచే నీతఁడు నిహతుఁడగునని యశరీరవాణి వినవైనది.

ఆ తలిదండ్రులామాటల కాశ్చర్యపడి ఆ బాలునకు శిశుపాలుఁడని పేరుంచి, చూడవచ్చినవారి చేతికెల్ల నెత్తుకొన నిచ్చుచుండిరి.

వికారాకారము గల యాబాలకునిఁ జూడవలయునని యొకనాఁడు కృష్ణ బలరాములు బాంధవ మిత్త్రబంధు సమేతులై కదలి చేదిరాజధాని కేతెంచిరి. అపుడు మేనయత్త సాత్వతి వారిని సత్కరించి తన పుత్త్రుని బలరాముని చేతికిచ్చి యనంతరము కృష్ణుని చేతికందిచ్చినది. కృష్ణుఁడెత్తుకొనఁగనే యాబాలుని మిక్కిలి కన్నును, మిక్కిలి చేతులును మాయమైనవి.

అది చూచి సాత్వతి యాశ్చర్యచకిత యైనది. ఇంతలో నశరీరవాణి తలఁపునఁ దట్టెను. వెంటనే యామె తన కొడుకు నూఱపరాధములు చేసినను సైరింప వలసినదిగాఁ గృష్ణునిఁ బ్రార్థించినది. దానికి శ్రీకృష్ణుఁ డంగీకరించినాఁడు. ఇది శిశుపాలుని జన్మగాథ.

తల్లిచే సంపాదింపఁ బడిన వరగర్వము వలన నున్మత్తుఁడై శిశుపాలుఁడు పెద్దల ధిక్కరించియు, నింతకాలము బ్రతుకఁ గల్గినాఁడని భీమసేనునకు భీష్ముఁడీ కథ వివరించెను.

---

## పాత్రల శీలములు

### 1. శిశుపాలుఁడు.

ఉపోద్ఘాతము:-

శిశుపాలుఁడు చేది వంశమున జన్మించెను. ఇతని తండ్రి దమఘోషుఁడు. తల్లి సాత్వతి. చిన్ననాఁడొకప్పు డీతని మేనమామ పుత్త్రుఁడైన శ్రీకృష్ణుఁ డెత్తుకొనెను. దానితో నీతని మిక్కిలి చేతులును, మిక్కిలి కన్నును అడఁగినవి. ఇందుచేత కృష్ణుని వలననేగాని, యితరుల వలన నీతఁడు నిహతుఁడు గాఁడని తెల్లమైనది. అప్పుడు సాత్వతి తన కుమారుని శతాపరాధముల మన్నింపుమని కృష్ణుని వేఁడుకొనెను. దానికి కృష్ణుఁడంగీకరింప శిశుపాలుఁడు వరబల గర్వముచే నున్మత్తుఁడై లోక కంటకుఁడై ప్రవర్తించినాఁడు.

1. ఉపాలంభనము :-

భీష్ముని మాటను బట్టి ధర్మజుఁడు శ్రీకృష్ణున కర్ఘ్యమొసఁగి నందులకు శిశుపాలుఁడు ముందు ధర్మజుని, పిదప భీష్ముని, తుదకు శ్రీకృష్ణునిఁగూడ నానావిధముల నాక్షేపించినాఁడు. బలగర్వితుఁడైన శిశుపాలునియందు ఎంతవారినైన అవహేళనచేయు గుణము ప్రధానముగ గోచరించుచున్నది.

అర్ఘ్యమునకు శ్రీకృష్ణ నర్హునిగ నెఱింగించుట ముందు భీష్ముని దుర్వ్యవసాయమని శిశుపాలుని వాదము. పిదప కృష్ణుఁడు కష్టచరితుఁడు; పూజార్హుఁడు కాని దాశార్హుఁడు; అందఱను మించిన యవివేకి ధర్మజుఁడు; నని శిశుపాలుని యధిక్షేపము.

2. దురహంకారము :-

ధర్మతత్త్వమెల్లరకు నెఱుఁగ శక్యము కాదనియు, భీష్ముఁడు విచార విదూరుఁడును, ధర్మ బాహ్యుఁడు ననియు, వృద్ధుఁడగుటచే నాతని బుద్ధి సంచలించెననియు, శిశుపాలుఁడు పల్కుట దురహంకారమును వెల్లడించుచున్నది. భీష్ముఁడు కృష్ణుని మహత్త్వమును పొగడెను. అది శిశుపాలునకు కర్ణశూలమైనది. కృష్ణుని పాండవులు పూజించుట తమ్మెల్లర నవమానించుట యని శిశుపాలుని దుర్వ్యాఖ్య. తా నధర్మ ప్రవృత్తుఁడై యుండి కూడ పైకి ధర్మశిక్ష చేయు చున్నాఁడని భీష్ముని శిశుపాలుఁడు తిట్టును; జనార్దనుని బలము నా యెఱుఁగనిదా? యని అహంకృతి చూపును. ఆర్య వృత్తములను గూర్చి భీష్మరకే యుపన్యసింపఁ బూనినవాఁడు శిశుపాలుఁడు.

3. వాక్పారుష్యము:-

వాసుదేవుని జడుఁడనియు, నాతనిని పూజించుట పేడికి (పిల్ల నిచ్చుట) దారక్రియ యనియు శిశుపాలుఁడు నిందించినాఁడు. ఇది యాతని పలుకుఁ దనమునకు తార్కాణము. అట్లే ధర్మరాజను విశేష సమాఖ్య నిరర్థకమైనదని ధర్మజునిఁ గూడ నెగ్గులాడును.

4. అల్పబుద్ధి:-

నరేశ్వరు లెల్లరు నచ్యుతు నర్చన నెడ చాల నభినందింపఁగా, నొక్క శిశుపాలుఁడే దానికి నొల్లఁడాయెను. తమోహరుఁడగు నచ్యుతుని లోకోత్తరుఁడని యెఱుఁగఁజాలక పోవుటచే శిశుపాలునిఁ, యల్పబుద్ధి యనఁదగును.

5. మూర్ఖత:-

శిశుపాలుఁడు రాగకోప దూషిత మనస్కుఁడు. అల్పరాజ్యలక్ష్మివలన నంధుఁడైనవాఁడు. అనిమిత్తముగ మహనీయులతో పరివాదమునకు దిగువాఁడు. అవినయశీలుఁడు. ఆ సభయందలి రాజులు కృష్ణునిచే పరిముక్తులో, ఆహవజితులో, శరణార్థులో యై యుండిరి. అట్లు సర్వవిధముల వారిని మించిన కృష్ణునకు నర్ఘ్యము అయోగ్యమనుటయు, పెద్దలు చెప్పినను వినకపోవుటయు శిశుపాలుని మూర్ఖతకు నిదర్శనము.

6. దుర్జనత్వము:-

శిశుపాలుని మించినవాఁడు అతని సేనాపతి. ఇతఁడు అతిరోష పరుష వచనుఁడై తమ పక్షమునందలి రాజులనెల్లఁ జేర్చఁగా, శిశుపాలుఁడు అతనికి పాండవులతోడి యుద్ధమునకు అనుమతి యొసఁగిన దుర్జనుఁడు. ప్రొద్దుపోవుటకు కావలెనన్నచో సుగుణవంతులైన కర్ణ శల్యాదులను పొగడరాదా? యని భీష్ముని హేళన జేసిన దుర్మార్గుఁడు.

7. పూర్వపుణ్యము:-

ఇతఁడు ద్వారక నన్యాయముగఁ గాల్చెను. భోజరాజన్యుల నదయుఁడై వధించెను. వసుదేవుని యశ్వమేధమునకు విఘ్న మాచరించెను. బభ్రు భార్యను తనకు భార్యగాఁ జేసికొన్న పాపి. ధర్మజ, నదీసుత, కృష్ణులను దూషించికూడ, తల్లి పడసిన వరముచే శతాపరాధములు నిండు వఱకు బ్రతికిపోయినవాఁడు. తాను ట్రెళ్లిన పిమ్మట నీతని తేజము పరమేశ్వరుని దేహమునందు చొచ్చుటయు గూడ నొక పూర్వపుణ్య విశేషమే యనక తీరదు.

ఉపసంహారము:-

ఉపాలంభన శీలియు, దురహంకారియు, వాక్పారుష్యనిధియు, అల్పబుద్ధియు, మూర్ఖుఁడును, పరమ దుర్జనుఁడునునై కూడ శిశుపాలుఁడు పరమేశ్వరునితో సాయుజ్యము నొందుట యొక మహాదృష్టము. అది పూర్వపుణ్య ఫలమనవలెను.

## 2. శ్రీకృష్ణుఁడు.

ఉపోద్ఘాతము :—

ఈ పాఠ్యమునందు శ్రీకృష్ణుఁ డుత్తమ మానవుఁడు, నాదర్శపురుషుఁడు నయ్యు దివ్యశక్తి సంపన్నుఁడై యున్నాఁడు.

1. యజ్ఞపురుషుఁడు :-

ధర్మజునకు భీష్ముఁడు వివరించి చెప్పినరీతిగ, శ్రీకృష్ణుఁ డఖిలలోక పూజ్యుఁడు. ఆతనినిఁ బూజించుటయే యజ్ఞఫలము.

2. త్రిలోక పూజ్యుఁడు :-

బ్రహ్మా యుదయమునకే యితఁడాస్పదమైనవాఁడు; వేదములు మున్నగు సమస్త వాఙ్మయములు నీతనిని పొగడినవి. కృష్ణుఁడీరీతిగ లోకాది యనఁదగి ముల్లోకములకుఁ బూజ్యుఁడయ్యెను.

3. తమోహారుఁడు :-

ఇతఁడజ్ఞానాంధకారమును బోగొట్టఁగలఁడు. భీష్మాది ప్రతిభావంతు లెఱిఁగినట్లుగ శిశుపాలాది మూర్ఖులితని నెఱుఁగఁ జాలరైరి. అల్పులకు పెద్దలచరిత్రలు తెలియశక్యము గాకపోవుటయే యిందులకు హేతువు.

4. జ్ఞాన వృద్ధుఁడు :-

శ్రీకృష్ణుఁడు వయసుచే వృద్ధుఁడు గాకపోయినను ఉత్తమమైన జ్ఞానముచే వృద్ధుఁడే యనఁదగును. ఉత్తమ జ్ఞానవృద్ధుఁడు వయస్సుచే బాలుఁడైనను బూజ్యుఁడగుచున్నాఁడు. అట్లే అమితవిక్రమవంతుఁడైనయెడల క్షత్రియుఁడు రాజులందఱిలోను బూజ్యుఁడగునని శాస్త్రములు చెప్పుచున్నవి.

5. లోక స్వరూపుఁడు :-

శ్రీకృష్ణుఁడు పూజింపఁబడినచో ముల్లోకములును పూజింపఁబడి తృప్తి నొందుచున్నవి. అతని నారాధించుటవలని పుణ్యసమృద్ధి యంతటిది.

6. పరాక్రమశాలి :-

ఇతఁడు రాక్షసుల నోర్చినవాఁడు. తన యజ్ఞమునకు శిశుపాలాదులవలన విఘ్నము వాటిల్లునని ధర్మజుఁడు భీతిల్లినప్పుడు భీష్ముఁడు పల్కినట్లుగ నితఁడు తాత్త్వికముగ యజ్ఞపురుషుఁడు; భౌతికముగ నజేయుఁడు, సింహ పరాక్రముఁడు.

7. అద్భుత ప్రతిభుఁడు :-

తన మేనయత్తకు వికృత రూపుఁడైన కుమారుఁడు (శిశుపాలుఁడు) కల్గెనని విని శ్రీకృష్ణుఁడు చేది దేశమునకుపోయి, యాతని నెత్తుకొనెను. గ్రక్కున నాబాలుని మిక్కిలి చేతులును మిక్కిలి కన్నును అడఁగినవి. కావున శిశుపాలుని వికృతరూపమును మాపిన యద్భుత ప్రతిభుఁడు శ్రీకృష్ణుఁడు.

8. సహనశీలి :-

ఇతఁడు తన మేనయత్త సాత్వతికి మాటయిచ్చిన ప్రకారము, శిశుపాలుని శతాపరాధములను సహించినాఁడు. అతిపరుషవచనుఁడై నిష్కారణ విరోధము తనయందుఁబూనిన శిశుపాలునియెడ నీతని ప్రవర్తనము ఉదారమై, ప్రశంసావహమై యున్నది.

8. స్తుతిపాత్రుఁడు :-

వాగ్విషయములును, క్రియాది విషయములును నైన శతాధికాపరాధము లను శిశుపాలునివి యోర్చి యెట్టకేలకాతని శరీరమును శిరస్సుచేత లోపించు దానినిగాఁ జేయును. ఇట్లు చేసియు తనదేహములో కృష్ణుఁడాతని తేజము నిమిడ్చికొని జనుల పొగడ్తకు పాత్రుఁడయ్యెను.

ఉపసంహారము :-

ఇందుచే యజ్ఞపురుషుఁడు, త్రిలోకపూజ్యుఁడు, తమోహరుఁడు, జ్ఞాన వృద్ధుఁడు, లోకస్వరూపుఁడు, పరాక్రమశాలి, యద్భుత ప్రతిభుఁడు. సహనశీలి, స్తుతిపాత్రుఁడునగు శ్రీకృష్ణుని యందెంత దైవాంశ గలదో యంత యుత్తమ మానవత్వమును గలదు.

## 3. భీష్ముఁడు.

ఉపోద్ఘాతము :-

ఇతఁడు గంగా శంతనుల పుత్త్రుఁడు; కురు వృద్ధుఁడు; పాండవులకు విశ్వాసపాత్రుఁడు; పరమాత్ముని తత్త్వము బాగుగ నెఱిఁగినవాఁడు.

1. ధర్మవేది :-

ధర్మజు రాజసూయమునకు సంతుష్టుఁడై యజ్ఞపురుషుఁడగు శ్రీకృష్ణునిఁ బూజించుటయే యజ్ఞఫలమని తన్నడిగిన ధర్మజున కెఱిఁగించిన ధర్మవేత్త భీష్ముఁడు.

2. సంతుష్టుఁడు :-

ధర్మస్వరూప మెఱిఁగిన కారణముచే నితఁడు మిక్కిలి ప్రశాంతుఁడు; నిత్య సంతుష్టుఁడును. సభా పూజ్యు నెఱుఁగఁగోరిన ధర్మజునకు శ్రీకృష్ణునిఁ బూజించు టయే యజ్ఞఫలమని నిరూపించి చెప్పగల్గిన జ్ఞాని భీష్ముఁడు. శిశుపాలునకు ధర్మ జుఁడు చెప్పినట్లు, శ్రీకృష్ణుని త్రిలోక పూజ్యుఁడని భీష్ముఁడాత్మలో నెఱిఁగిన పర మార్థజ్ఞాని.

3. ఖండితవాది :-

రాగకోపములచే దూషితమైన మనస్సుగల శిశుపాలుని స్వల్ప రాజ్యలక్ష్మీ మదోన్మత్తునిగను, నిష్కారణ వాదశీలిగను, గుఱుతించిన భీష్ముఁడు ధర్మతత్త్వ

మును కేవలము జీర్ణించుకొనినవాఁడేగాదు. అట్టి ధర్మజ్ఞాన బలముచే శిశుపాలా దులను శాసింపఁగల్గి 'నీవు మూర్ఖుఁడవు' అనియు ముఖాముఖి చెప్ప నేర్చినవాఁడు.

4. హేతువాదశీలి :-

ధర్మజుఁడు శ్రీకృష్ణుని సభా పూజార్హునిగ నేల నిర్ణయించెనో దానికిఁగల నాలుగైదు కారణములను వివరించిన హేతువాద పరిజ్ఞానము గలవాఁడు భీష్ముఁడు.

అట్లే జ్ఞాన వృద్ధత్వము వయోవృద్ధత్వము నను వానినిగూర్చి శిశుపాలున కీతఁడు వివరించెను.

5. ధీరుఁడు :-

భీష్మునియందు సంతాన రాహిత్యమను దోషమును, శ్రీకృష్ణునిఁ బరమేశ్వరునిగాఁ గొనియాడు దోషమును, సామోపాయమున నెల్ల రాజుల నవమానించిన దోషమును, గలవని శిశుపాలుఁ డాక్షేపించి సకల క్షత్రియ క్షోభముచేయఁ బోవును. దీనినిఁజూచి ధర్మజుఁడు, యాగప్రయోగము విఘ్నమునొందునని భీతిల్లి, యెల్ల రాజులకును చిత్తశాంతి కల్గింపుమని భీష్మునిఁ బ్రార్థించినాఁడు. "నారాయణుఁడు నీ యాగమును రక్షించుచుండ నితరులేమి చేయఁగలర"ని యప్పుడు భీష్ముఁడు ధర్మజునకు ధైర్యముగొల్పును. మఱియు భీమునకు శిశుపాలుని జన్మవృత్తాంతమునుదెల్పి యతఁడు కృష్ణునిచే నిహతుఁడు గావలసిన కారణమువలన తనచేతిలో బ్రతికిపోయినాఁడనికూడ సూచించిన గంభీరుఁడు, ధీరుఁడు, భీష్ముఁడు.

ఉపసంహారము :-

ఇందుమూలమున భీష్ముని ధర్మవేదియు, సంతుష్టుఁడును, ఖండితవాదియు, హేతువాదశీలియు, ధీరుఁడునని చెప్పవచ్చును.

## 4. ధర్మరాజు.

ఉపోద్ఘాతము:-

ఇతఁడు పాండురాజునకు జ్యేష్ఠపుత్త్రుఁడు. యముని వరప్రసాదమున జన్మించినవాఁడు. కృష్ణుని యందీతనికిఁ గల భక్తి యపారమైనది. ఇతని ధర్మనిత్యతను నారదాది మహామునులు కొనియాడిరి. పితృదేవతలకు సంతుష్టిగూర్చు నిమిత్తమును, పరమోత్తమములైన లోకములు వారికి ప్రాప్తించు నిమిత్తమును రాజ

సూయ మహాధ్వరమును దలపెట్టిన యీతనిని ధర్మమతియని కొనియాడుట తగి యున్నది.

## 1. ధృతిమంతుఁడు:-

భీష్ముని వచనమును బట్టి యీతఁడు శ్రీకృష్ణున కర్ఘ్యమిచ్చెను. దానికి శిశుపాలుఁ డీతనిని యవివేకి యనియు, ధర్మబాహ్యుఁడనియు, బేలయనియు, పాడిగాని, ధర్మువుగాని, యెఱుఁగనివాఁడనియు, నజ్ఞాని యనియు, నాక్షేపించినాఁడు. ఉపాలంభనపరుఁడైన శిశుపాలుఁ డెట్టకేల కలుకఁబూని సపుత్త్రిబలుఁడై సభవీడి పోయెను.శిశుపాలుఁడింత మూర్ఖునివలె బ్రవర్తించినను, ధర్మజుఁ డింద్రియ నిగ్రహమును గోల్పోవలేదు. ఇందుచే నితఁడు ధృతిమంతుఁడు.

## 2. హిత వచస్కుఁడు:-

ధర్మజుఁడు కేవలము సంయమన శీలియగుటయే ... అన్ను అధ క్షేపించి సదంబు వీడి చనుచున్న శిశుపాలుని బ్రియవచనంబుల ననునయింప నెంచిన సౌహార్దయముగలవాఁడు. విషముకంటె దహనము కంటెను మహాదారుణమైన వాక్పారుష్యము ధరణి వల్లభులకు తగదు కావున దానిని మాని,భూరి గుణోన్నతుఁడవు కమ్మని, నట్లు శిశుపాలునకు బోధించిన మితహిత మనస్కుఁడు, ధర్మరాజు.

## 3. గురుజన భక్తుఁడు:-

లోకాదియు, త్రిలోకపూజ్యుఁడును నగుటచేత కృష్ణుఁ డర్ఘ్యదాన యోగ్యుఁడని నిర్ణయించి, భీష్ముఁడు తనకుఁ దెల్పెను. భీష్ముఁడు కృష్ణుని మహాత్త్వము నాత్మలో నెఱుఁగును. దానిని తానును నమ్మి ధర్మజుఁ డగ్రపూజ గావించినాఁడు. ఇందేమియు నతనికి దోష మగపడలేదు. అది కడు యుక్తముగఁగూడ నున్నది. అచ్యుతుఁడు తమోహరుఁడు. సత్య బుద్ధితో భీష్ముఁ డెఱిఁగినట్లి విషయమ్మును శిశుపాలుఁ డెఱుఁగఁజాలఁడు. పెద్దల చరితము లల్పులకెఱుకపడవు. తనకంటె పెద్ద లంగీకరించిన యొకానొక సందర్భము నందాతనికి నమ్మిక కలదు. అది నమ్మికలేని శిశుపాలుఁ డకారణ మాత్సర్యము బూని తగవులాడుట తగదని ధర్మజుఁడు మెత్తనగఁ జెప్పి తన గురుజన భక్తిని బ్రకటించినాఁడు.

## 4. ప్రజాక్షయ భీతుఁడు:-

సునీధుఁడు శిశుపాలు ననుమతమున సేనను గూర్చుకొని యుద్ధమునకు సన్నద్ధుఁడుగ నుండెను. దానితో సకల క్షత్త్రియ క్షోభమును వాటిల్లినది. నిష్కారణముగ బ్రజాపకారము-గల్గునని ధర్మసూతి భయ-సంభ్రమాక్రాంత హృదయుఁడైనాఁడు.

**5. ధర్మహాని భీతుఁడు:-**

తన యాగమునకు వచ్చిన రాజులెల్లరు ప్రళయకాల సాగరమువలె కలఁత నొంది యుద్ధ సన్నద్ధులైరి. ఇది చాల విచారకరమైన సంగతి. తన్మూలమున యజ్ఞ ప్రయోగము విఘ్నమగునేమో యని ధర్మజునకు భీతి గల్గినది. ఆ రాజులకెల్ల చిత్త శాంతి యొనర్పుమని యప్పుడాతఁడు భీష్ముని ప్రార్థించెను. ఏ మాత్రము ధర్మహానియు నోర్వఁజాలని ధర్మబద్ధబుద్ధి యాతఁడని యిందువలన విశదమగుచున్నది.

**ఉపసంహారము:-**

ధర్మజుఁడు ధృతిమంతుఁడును, హితవచస్కుఁడును, గురుజన భక్తుఁడును, ప్రజాక్షయ భీతుఁడును, ధర్మ (గ్లాని) హాని భీతుఁడును, నగుటచేతనే యజ్ఞము నిర్వహించి, శిశుపాలాది ధర్మబాహ్యుల వినాశనమునకు హేతుభూతుఁడు కాఁగల్గెను.

---

## -: సందర్భ సమన్వయ వ్యాఖ్యలు :-

ఈ క్రిందివానిని సందర్భములను వివరించి వ్యాఖ్యానింపుఁడు :-

1. 'అదియ చూవె యజ్ఞఫలము'

**సందర్భము:-**

యజ్ఞ పురుషుఁడును, నఖిలలోక పూజ్యుఁడును నగు నచ్యుతుని పూజింపుమని ధర్మజునకు భీష్ముఁడు చెప్పు సందర్భములోనిది యీ వాక్యము.

అర్థము :- యాగస్వరూపుఁడైన శ్రీకృష్ణుని బూజించుటచేతనే యజ్ఞము సార్థకమై పరిపూర్ణ ఫలము నీయఁగల్గుచున్నది.

వ్యాఖ్య :- సద్గుణములచేతఁ బెద్దయైన పూజ్యుఁడెవ్వరో తనకు నెఱిఁగింపుమన్న ధర్మపుత్త్రునకు భీష్ముఁడు శ్రీకృష్ణుని మహనీయతను వర్ణించి చెప్పి యట్టి యజ్ఞనాథుని పూజించుటయే సర్వయజ్ఞములకు ఫలమనును. అట్లు కాదేని యజ్ఞము నిష్ఫలమని భావము.

వ్యా. వి:- అదియము + అ = అదియ = అదియే = అవధారణా(నిశ్చయా)ర్థమునందు 'అ' కారంబగు. చూవె = చుమా! (చూ. పద్య వ్యాఖ్యానము)

సమాసము :-

యజ్ఞఫలము = యజ్ఞముయొక్క ఫలము (షష్ఠీ తత్పురుషము)

శీలము :-

శ్రీకృష్ణునియందు భీష్మున కున్న భక్తిభావమును, నాతని తత్త్వజ్ఞానమును నిందు మూలమున విదితము.

2. "దాశార్హుండు పూజార్హుఁడే ?"

సందర్భము:-

పెక్కుమంది యోగ్యులున్న నిండు సభలో వారినెల్లర వదలివేసి, యయోగ్యుఁడైన శ్రీకృష్ణుని పూజించినందులకు శిశుపాలుఁడు ధర్మరాజు నధిక్షేపించుచున్నాఁడు.

అర్థము:- దాశార్హుని సంతతిలోని వాఁడగు శ్రీకృష్ణుఁడు పూజ కెట్లర్హుఁడగును ?

వ్యాఖ్య:— ఈసభలో నవనీనాథులును, నార్యులైన మహీదివిజులును పల్వురు పూజ్యులు నుండిరి. వీరినందఱను వదలి ధర్మరాజు భీష్ముని మంతనమును బట్టి కష్టచరితుఁడైన కృష్ణుని బూజించినాఁడు. దీనితో నాతని యవివేక మెల్లరకుఁ దెల్లమైనది. ఎవ్వఁడు పూజ కర్హుఁడో యెవ్వఁడు పూజ కనర్హుఁడో కూడ భీష్మునకుఁ దెలియ లేదు. లేనిచో దాశార్హు నాతఁడు పూజించునా యని శిశుపాలుని భావము.

వ్యా. వి:- దాశార్హుఁడు :- దశార్హుఁడను యాదవుని సంతతివాఁడు. ఇది యపత్యార్థకము. పూజా + అర్హుఁడే = పూజార్హుఁడే = చతుర్థీ తత్పురుషము; సవర్ణ దీర్ఘ సంధియు.

అలం :- అనుప్రాసమను శబ్దాలంకారము.

శీలము :-

ఇది శిశుపాలుని యాక్షేపణ గుణమును పట్టియిచ్చుచున్నది. తాను సర్వజ్ఞుఁడనని శిశుపాలునకున్న గర్వము కూడ దీనివలన వెల్లడి యగును.

3. "వృద్ధుల బుద్ధులు సంచలింపవే !"

సందర్భము :-

నిండు సభయందున్న పెక్కుమంది యోగ్యులను నర్హులనుకాదని భీష్ముననుమతంబున ననర్హుఁడైన కృష్ణుని బూజించినాఁడని ధర్మజుని శిశుపాలుఁ డుపాలంభించుచున్నాఁడు.

అర్థము :-ముసలివారి మతులు చెడిపోవా ?

వ్యాఖ్య :- పై సందర్భమును బట్టి యీ వాక్యమునకు రెండర్థములు రావచ్చును."(1) ముదుసలివారికి మతి భ్రష్టమగును. భీష్ముఁడు ముసలివాఁడు. కావున ధర్మజుఁడాతని నియామకము ననుసరించరాదు" అని; యిది భీష్ముని నిందించుట." "(2)ధర్మజునంతటివాఁడే యిట్టి యకార్యములకు బూనుకొనినచో సభాసదులలో గల వృద్ధులైనవారి మనస్సులు కలవరపాటు నొందవా?" అని; యిది ధర్మజుని నిందించుట.

పనిచిన భీష్మునిది వెఱ్ఱితనమనియు, చేసిన ధర్మజునిది దుష్కార్యమనియును శిశుపాలుని భావము.

అలంకారము :

అనుప్రాసము.

శీలము :-

శిశుపాలుని యుపాలంభన పరత్వము వ్యక్తము.

4. "మహోదారుణమది విషముకంటె దహనము కంటెన్":-

సంద్వర్భము :-

చైద్యుఁ డలుకతో-సపుత్త్రి బలుఁడై సభ వీడిపోవుచుండఁగా ధర్మనందనుఁడు వానిని ప్రియ వచనములతో ననునయించు ఘట్టములోనిది యీ వాక్యము.

అర్థము :-పరుషవచనములు పలుకు గుణము విషముకంటెను, నిప్పుకంటెను మిక్కిలి క్రూరమైనది. కావున నాశనము చేయును.

వ్యాఖ్య :-ఉత్తమ గుణములును గాంభీర్యమును గల రాజులు పెళుసు మాటలాడుట తగదు అని తెలుపు ధర్మజుఁడు శిశుపాలుని గుణోన్నతుఁడవును ధీరుఁడవును గమ్మని బోధించుచున్నట్లున్నాఁడు.

అది = వాక్పారుష్యము.

వ్యా. వి:- మహాత్ + దారుణము = మిక్కిలి క్రూరము; కర్మధారయము.

శీలము :-

పరమశత్రువై తన్నుపాలంభించిన శిశుపాలుని సైత మిట్లనునయించు ధర్మనందనుని ప్రియవచస్సందర్భముగల వాఁడన నగును. శత్రుత్వము పాటించు వానిఁ యెడఁ ప్రేమచూపుటచేతనే పగ యడఁగునన్న ధర్మము నిచట ధర్మనందనుఁడు నిరూపించుచున్నాఁడు.

5. "యుక్తమ కాకిది యేమి దోసమే ?"

సందర్భము :-

తనపై నలిగి పుత్త్రబల సమేతుఁడై సభా భవనమును వీడిపోవు శిశుపాలుని నిలువరించి ప్రీతి పురస్సరముగ ధర్మజుఁడు ననునయించుచు నున్న సందర్భమిది.

అర్థము:- శ్రీకృష్ణుని మహత్త్వ మెఱిఁగినవాఁడు గావున భీష్ముఁ డాతనిని పూజార్హుఁడని సూచించెను. ఇది యుక్తముగాక దోషమగునా ?

వ్యాఖ్య :- ముల్లోకములకుఁ బూజింపఁదగిన వాఁడని శ్రీకృష్ణునిగూర్చి భీష్ముఁ డెఱుఁగును. భీష్ముని యెఱుకయందు ధర్మజునకు విశ్వాస (నమ్మిక) మున్నది. కావున నాఁటి యగ్రపూజ కడుయుక్తము. అందు దోషమేమియును లేదని ధర్మరాజు శిశుపాలు నూఱడించుట సరసముగను సహేతుకముగను నున్నది.

వ్యా. వి :- యుక్తము + అ = యుక్తమే = నిశ్చయార్థంబునందు 'అ' కారంబగు. కాక + ఇది = కాకిది = అత్తునకు సంధి బహుళము.

(చూ. బా. వ్యా. సం. సూ. 4)

శీలము :-

ఇది ధర్మజుని ప్రియవచన రచనాచాతుర్యమునకు నిదర్శనము.

6. "పెద్దల చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్"—

సందర్భము :-

ఈ వ్యాక్యము తనపై నలిగి పుత్త్రబల సమేతుఁడై సభ వీడిపోవు శిశుపాలు నూఱడించుచు ధర్మరాజు పలికిన ప్రకరణములోనిది.

అర్థము :- మహాత్ముల నడతలలోని పరమార్థము దెలిసికొని చెప్పుశక్తి తక్కువ వారికెంతైనఁగలదా ?

వ్యాఖ్య :-"భీష్ముఁడు సత్యబుద్ధితో నజ్ఞాన నివారకుఁడగు శ్రీకృష్ణుని తత్త్వమును గమనించినట్లు నీవు గమనింపఁజాలవు" అని, ముందు శిశుపాలునకుఁ జెప్పి, మహాత్ముల చరిత్రలయందలి రహస్యముల నెఱిఁగి యెదుటివారికిఁ జెప్పుట యందఱకు సాధ్యముకాదని, దానిని లోక సామాన్యమైన ధర్మముగ పిమ్మట భీష్ముఁడు సాధించుట మెత్తఁగ శిశుపాలుని "నీవు అజ్ఞానివి" యనుటయే.

అలంకారము :—

ఇందు విశేష విషయముచేత సామాన్యవిషయము సాధింపఁబడినది. కావున నిది అర్థాంతర న్యాసాలంకారము.

శీలము :-

ఇది యుధిష్ఠిరుని మాటనేర్పునకును, మితహిత సత్యభాషణమునకును నుదాహరణము. ఈ గుణమును వ్యాస నన్నపార్యాదులు జయమేజయ నందనాదుల యందాసించిరి. నన్నపార్యునకీ మితహిత వాక్కు మఱియు నిష్టమనఁదగును.

7. "బాలుఁడయ్యును బూజ్యుఁడు బ్రాహ్మణుండు"

సందర్భము :-

శిశుపాలుని ఒప్పింపఁ జూచుచున్న ధర్మజుని వారించి యర్ఘ్యము గొనుటకు శ్రీకృష్ణునకుఁగల యోగ్యతనుగూర్చి భీష్ముఁడు శిశుపాలునకు వివరించు ఘట్టము లోనిది యీ వాక్యము.

అర్థము :- ఉత్తమమైన జ్ఞానముచేత వృద్ధుఁడనఁదగినచో బ్రాహ్మణుఁడు వయస్సుచేత బాలుఁడైనను బూజార్హుఁడే యగును.

వ్యాఖ్య :- వృద్ధుఁడుగాని, ఋత్విజుఁడుగాని, భూనాథుఁడుగాని యనిపించుకొనఁజాలని కృష్ణుఁడెట్లు బూజనీయుఁడయ్యెనని ధర్మజుని శిశుపాలుఁ డధిక్షేపించును. శ్రీకృష్ణునియందు వయోవృద్ధత్వము లేకున్నను జ్ఞాన వృద్ధత్వమున్నదని శిశుపాలున కిందుమూలమున సమాధానించు చున్నాఁడు.

"జ్ఞానాధికుఁడైనచో బాలుఁడయ్యును బ్రాహ్మణుఁడు పూజ్యుఁడు. పరాక్రమవంతుఁడైనచో క్షత్త్రియుఁడైనను బూజ్యుఁడు." అని చెప్పి శ్రీకృష్ణునియందీ రెండుగుణములు నున్నవని భీష్ముఁడు నిరూపించును.

శీలము :-

గుణములే పూజాస్థానము. లింగ వయోవిభేదములు పాటింప రానివనెడి భీష్ముఁడు గుణ పక్షపాతి.

8. "కలహాబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్" :-

సందర్భము :-

శ్రీకృష్ణుని మహాత్త్వమును భీష్ముఁడు శిశుపాలునకు తెలియఁబఱచెను. కాని యాతఁ డియ్యకొనలేదు. సామోపాయము కలసిరాని యా సమయమున నాగ్రహించిన సహదేవుఁడు శ్రీకృష్ణునిఁ గాదనిన దుర్జనుల శిరస్సుపై నిడెదనని చరణమెత్తుటతో రాజులెల్లరు భీతిల్లి యూఱకుండగా సహదేవుని దుష్టశిక్షణ శీలమును మెచ్చి దేవతలు పుష్పవృష్టి గురిసిరి. ఈ వాక్య మా సందర్భములోనిది.

అర్థము :- కలహ ప్రియుఁడైన నారదుఁడు (రానున్న యుద్ధమునకు) సంతోషముతో నాట్యము చేయఁబూనెను.

వ్యాఖ్య :- నారదునకు కలహాశనుఁడని పేరు. కలహము లాతనికి సంతోషము గూర్చును. ఇట్టి కలహములు తఱచుగా దుష్టులు శిక్షింపఁ బడుటకును, తన్మూలమున లోకమునకు కల్యాణము చేకూరుటకును హేతువులగుచుండును. కావున నారదమహర్షి లోక కల్యాణ కారకుఁడని యెఱుంగునది. సహదేవుని వీరావేశమునకు సభాసదులెల్లరు భయభ్రాంతులైరి. కాని శిశుపాలాదు లీతని యౌద్ధత్యమును సహింపరు. కయ్యము తప్పదు. గర్వితుఁడగు శిశుపాలునకు శిక్ష కాఁదగును. అని నారదుఁ డెఱుఁగును. కలహమనఁగా తనకు ప్రీతి. అందుచే పట్టరాని సంతసమున నారదుఁడు నాట్యము చేయుచున్నాఁడు.

తఱచుగ కావ్యములలోఁ జేతనొకకుంచెయు, నల్లని యిఱ్ఱిచర్మము చుట్టయుఁదాల్చి, సంతోషము కలిగినపుఁడా కుంచెతో వీచుకొనునట్లు నారదుఁడు వర్ణింపఁబడును.

శీలము :-

ఇందు సహదేవుని నిర్భీకత్వము, దుష్టశిక్షణాభినివేశముతోఁబాటు, నారదుని కలహ భోజనత్వముగూడ వెల్లడింపఁ బడినది.

ఇట్లే యీాదిగువ వాక్యములనుగూడ మూఁడు ఘట్టములక్రింద విభజించి వ్యాఖ్యానించునది :-

1. "సామమ్మున నెల్లవారి నవమాన్యులఁ జేసె నమాన్యుఁడు" (ప. 39)
2. "ఓడతోఁ గట్టిన యోడవోలె గతగౌరవుఁడై కడుఁదూలె" (ప. 40)
3. "అంత యధీరులె ధారుణీ పతుల్" (ప. 40)
4. "నీ యనుశాసన మెట్లు నమ్మనగు జనములకున్" (ప. 43)
5. "ఆర్యవృత్తములు గావనిరి వీని నాద్యులైన మునులు" (ప. 49)
6. "గ్రక్కున నొక్కట నడఁగెను మిక్కిలి చేతులును వాని మిక్కిలి కన్నున్" (ప. 57)
7. "కడగుండు నాకు నెదురై సంగ్రామరంగంబునన్" (ప. 63)
8. "బభ్రు భార్యఁ దనకు భార్యఁ జేసె". (ప. 65)
9. "నాకిచ్చిన యక్కన్యకఁ జేకొని నీకిట్లు పలుక సిగ్గును లేదే?" (ప. 67)

---

# పూ ర్వ గా థ లు

## 1. "పూతనా ఘాతంబు" [పుట 7 - పద్యము 40.]

పూర్వగాథ :-

కంసుని చెఱసాల యందే దేవకి శ్రీకృష్ణుని గనఁగా వసుదేవుఁడా బాలుని గోకులమునకుఁ జేర్చి యోగమాయను దీసికొనిపోయి తన పుత్త్రికగాఁ జూపెను. కంసుఁడు దానిని జంపఁబోఁగా నది చావక కంసహంత గోకులములోఁ బెరుగుచున్నాఁడని చెప్పిపోయెను. అంత గంసుఁడు ఆతనిని బాల్యముననే చంపవలయునని తలఁచి పూతన యను రాక్షసిని బంపెను. అది సుందరాకారము గల మనుజ స్త్రీ వేషమును ధరించి, పసిబాలురపైఁ బ్రేమగలదానివలె నటించుచుఁ దన విషపూరితములగు పాల నిచ్చి బాలురను జంపుచు నందుని యింటికి వచ్చెను. ఈమె మోసమును గ్రహింపలేక యశోదాదులు శ్రీకృష్ణు నెత్తుకొన నిచ్చిరి. ఆపె యంతట శ్రీకృష్ణునకుఁ బాలీయఁగాఁ గృష్ణుఁడామె పాలనేగాక ప్రాణములను సయితము పీల్చి చంపి వేసెను.(ఈ పూతన పూర్వము రత్నమాల యనునది యట.)

## 2. "శకటంబు త్రోపును జరణనిహతి" [పుట 7 - ప 40.]

పూర్వగాథ :-

శ్రీకృష్ణుఁ డొదిగిలఁబడు ప్రాయమందతని జన్మనక్షత్రమునాఁడు యశోద బిడ్డలకు దలకుఁబోసి, అన్న వస్త్రాది దానములు పాత్రులగు వారికిచ్చి బాలుని నొక శయ్యపైఁ బన్నుండబెట్టి గోపగోపికలకుఁ బూజలు చేయుచు, నేమఱి యుండెను. అట్టి సమయమున శ్రీకృష్ణుఁ డాఁకలిగొని యేడ్చుచుఁ గాలుసేతు లాడించుచు నటనున్న యొక బండినిఁ దన్నఁగా నది యాకసమున కెగిరెను. దాని యిరుసును జక్రములును వికావికలై నేలరాలెను. ఇట్లు కృష్ణుఁడు తన్నుఁ జంపఁ గంసుని ప్రేరణచే వచ్చిన శకటాసురుని జంపెను.

## 3. "వీఁకతోఁ గడుఁ బూచు మ్రాకుల విఱుపును" [పుట 8- ప 40]

పూర్వగాథ :-

కుబేరుని కొడుకులు నలకూబర మణిగ్రీవు లిద్దఱును అహంకారము గలిగి కైలాసమునఁ బువ్వులతోఁటలోఁ బాడుచున్న స్త్రీలతోఁ గ్రీడించుచుండిరి. కొంత సేపటి కచటికి నారదుఁడు రాఁగా నాస్త్రీలు వస్త్రములు ధరించిరి గాని నలకూబర మణిగ్రీవులు చెట్లవలె నగ్నులై నిలువఁబడియుండిరి. వారిని చూచి నారదుఁడు నూఱు దివ్య సంవత్సరంబులు చెట్టులై యుండి నారాయణ పాదస్పర్శముచే శాపవిముక్తిఁ బొందుఁడని శపించెను. వారు ఆ శాపమువలన గోకులమున మద్దిచెట్ల జతగా నుద్భవించి యుండిరి.

గోపికలు కృష్ణుని దుడుకుఁదనములు తనతో నివేదింపఁగా, యశోద యతనిని బొరుగింటికిఁ బోకుండఁ జేయుటకై ఱోటికిఁ గట్టివైచి తన పనులు చూచుకొను చుండెను. ఇంతలో శ్రీకృష్ణుఁడు ఱోటిని ఆ మద్దుల సందుగ లాగెను. శ్రీకృష్ణుని పాదస్పర్శము గలుగఁగనే యా మద్దులు కూలిపోయెను. అందుండి నలకూబర మణిగ్రీవులు బయటికి వచ్చి శ్రీకృష్ణస్వామికి నమస్కరించి వెడలి పోయిరి.

## 4. "వల్మీకమాత్ర పర్వతము నెత్తి....ఏడుదినము లునికియు" [పుట 8 - ప 40]

పూర్వగాథ :-

నందాదులు తమ పూర్వాచారము చొప్పున నింద్ర యాగము చేయదలఁచు కొనఁగా శ్రీకృష్ణుఁడు దాని వారించి యా పదార్థములన్నియు నొక కొండకు నివేదింపుఁడని వారికిఁ జెప్పి, తానాకొండ రూపమున నుండి యా పదార్థముల నెల్లను భుజించెను. ఇంద్రుఁడిది తన్నవమానించుటగా నెంచి సంవర్తకాది మేఘంబుల

నెల్లఁ బంచి ఘోరముగ వాన కురిపించెను. గోపకులు కృష్ణుని జేరి, యింద్రునకుఁ గలిగిన కోపమును విన్నవించి యా యాపదఁ దప్పింప వేఁడిరి. అంత శ్రీకృష్ణుఁడు గోవర్ధనమును దన చేతితోఁ బైకెత్తి గోపగోపీ జనములును, గోవులును, వారి యుపకరణములును, దానిక్రింద నుండునట్లు చేసెను. ఇంద్రునకు మఱియును గోప మతిశయించి; యేడహోరాత్రములు రాళ్లవానఁ గురిపించెను. కాని యేమియుఁ బ్రయోజనము లేకపోయెను. తుదకింద్రుఁడు శ్రీకృష్ణునొద్దకు వచ్చి తన తప్పు క్షమింపఁ బ్రార్థించెను.

## 5. "వృషవధయును" [పుట 8- ప 40]

పూర్వగాథ :-

కంసుని ప్రేరణముచే నరిష్టాసురుఁడనువాఁడు కృష్ణునిఁ జంపఁదలఁచి ఘోర మగు వృషభము నాకారము ధరించి మందలోఁ దూఱెను. గోపాలు రాభయంక రాకారముఁ జూచి బెదరి కృష్ణునితోఁ జెప్పుకొనిరి. కృష్ణుఁడచటికి రాఁగనే యా వృషభాసురుఁ డతనిపైఁ గవిసెను. శ్రీకృష్ణుఁడా యెద్దు కొమ్ములు పట్టుకొని త్రిప్పి నేలపైఁ గొట్టఁగా వాఁడు మరణించెను.

## 6. "మొదలన్ నాకిచ్చిన యక్కన్యను జేకొని నీకిట్లు వలుక సిగ్గును లేదే?" [పుట 12- ప 67]

పూర్వగాథ :-

విదర్భదేశమునందుఁ గుండిననగరమున భీష్మకుఁడను రాజు పాలించుచుం డెను. అతనికి రుక్మిణియను కొమరితయును, రుక్మి, రుక్మకేతువు, రుక్మబాహువు నను కొమరులు నుండిరి. రుక్మిణి శ్రీకృష్ణుని రూప యౌవనాదులు విని యతనిఁ బ్రేమించి యుండెను. రుక్మి శిశుపాలుని మిత్రుఁడై కృష్ణుని ద్వేషించుచుండెను. కడకు ఆ రుక్మి తన చెల్లెలిని శిశుపాలున కిచ్చుట కేర్పాటుచేసెను. వృద్ధులగు తలి దండ్రులు తమ కిష్టము లేకున్నను వాని పూనికను నివారింపఁ జాలలేకపోయిరి. కడకు రుక్మిణి అగ్నిద్యోతనుఁడను బ్రాహ్మణుని ద్వారా తన్నీ యాపదనుండి యుద్ధ రించి స్వీకరించుటకై శ్రీ కృష్ణునిఁ బ్రార్థించెను. రుక్మిణి గౌరీపూజకై దేవాలయ మునకుఁ బోయివచ్చునపుడు కృష్ణుఁడామెను దన రథముపై నెక్కించుకొని పోవు చుండెను. శిశుపాలాదు లాతని నడ్డగించిరిగాని లాభము లేకపోయెను. అతఁడు పట్టణము దాఁటునప్పటికి రుక్మికి వర్తమానము తెలిసెను. అతఁడు వేగముగాఁ బోయి కృష్ణు నెదుర్కొనెను. రుక్మిణి తన యన్న ప్రాణము తీయవద్దని ప్రార్థించి నందున కృష్ణుఁడతనినిఁ బట్టికొని రేవులువార తలఁ గొరిగి విడిచి పుచ్చి, తన నగ రము చేరినంతటనే రుక్మిణిని వివాహము చేసికొనెను.

# శ్రీమదాంధ్ర మహాభాగవతము

## అంబరీషోపాఖ్యానము

### నవమ స్కంధము

(పోతనామాత్యుఁడు)

## శ్రీమద్భాగవతము : సంస్కృతము :

ఆంధ్ర మహాభాగవతమునకు మూలము సంస్కృతమున వ్యాసమహర్షి రచించిన శ్రీమద్భాగవతము. వ్యాసమునీంద్రుఁడు భారతము మఱికొన్ని పురాణములు, బ్రహ్మసూత్రములు మున్నగు మహాగ్రంథములను రచించియు మనశ్శాంతి చిక్కక చింతాక్రాంతుఁడై యుండెను. అప్పుడు నారదుఁడువచ్చి భాగవతమును రచింపుమని యాతనికి బోధించినాఁడు. దానితో వ్యాస సంయమీంద్రుఁడు శ్రీమద్భాగవత రచనకుఁ గడంగి దానిని ముగింపఁగా మనశ్శాంతి సమకూరినదఁట.

వ్యాసముని భాగవతమును ముందు తన సుతుఁడగు శుకమహర్షికి నుపదేశించి నాఁడు. శమీకుఁడను వానినిఁ బరాభవించి, వాని పుత్త్రుఁడగు శృంగియను యోగీంద్రునివలన నేడు దినములలో సర్పదష్టుఁడయి, మరణము నొందునట్లు [అర్జునుని మనుమఁడగు] పరీక్షిత్తుఁడను రాజు శాపము నొందెను. ఇట్లు శప్తుఁడైన పరీక్షిత్తు తనకు మిగిలియున్న యల్పాయుర్దాయములోననే మోక్షమును సంపాదింపఁగోరి యా మార్గమునకై వెదకుచుండెను. ఈ స్థితిలో శుకయోగి యాతనికి భాగవత పురాణము నుపదేశించెను. శుకుఁడు పరీక్షిత్తునకు వినిపించిన యా భాగవతమునే సూతుఁడు శౌనకాది మహర్షులకును వినిపించెను. క్రమక్రమముగ భాగవతమీ లోకమునందు వ్యాప్తిఁగాంచినది.

సంస్కృత భాగవతము ప్రౌఢమైన గ్రంథము. వేదాంత ఘట్టములు వ్యాఖ్యాన సాపేక్షములై సాధారణ పండితులకు బోధపడవు. అందుచేతనే పండితులకుఁగూడ సంస్కృత భాగవతము పరీక్షాస్థానమందురు. ఆంధ్ర మహాభాగవతము భక్తిరస పరిపూర్ణమై ఆంధ్రలోకమున విస్తృత కీర్తి నార్జించినది.

## ఆంధ్ర భాగవతము :

దీనినిఁ బ్రధానముగ రచించిన వాఁడు పోతనార్యుఁడు. ఇతఁడు పరిపూర్తిగనే భాగవతము ననువదించె నను వారి వాదమునుబట్టి కొంతకాలమునకీ గ్రంథము

పెక్కు కారణములవలన శిథిలమైనది. అందుచే నుత్పన్నములైన భాగములను నార యాదులు పూరించిరి. అట్లుఁగాక తన రచన త్వరలో ముగియవలెనని పోత నయే స్వయముగఁ గొన్ని స్కంధములను శిష్యాదులచే రచింపించె నను వారి వాద మును బట్టియు నాంధ్ర భాగవతము నల్వురు కవుల రచనము.

ఇంచైదవ స్కంధము బొప్పరాజు గంగనది. ఆఱవ స్కంధము 'ఏర్చూరి సింగన'ది. కాఁగా, పదునొకండు పండ్రెండు స్కంధములు వెలిగందల నారయ విరచితములు. కడమ స్కంధములు నేఁడు మనకు లభించునవి పోతనార్యకృత ములు. మొత్తముమీఁదఁ జెప్పుచో నాంధ్ర భాగవతమునకు పోతనార్యుఁడే కర్త. ఇతఁడు నల్గురు కవులలో జ్యేష్ఠుఁడు, శ్రేష్ఠుఁడు కూడ. రసవత్తరమైన కవితఁ జెప్పఁగలవాఁడు. తెలుఁగున భాగవతము గాంచిన ప్రఖ్యాతికి బమ్మెర పోతనామాత్యుని సహజ కవితా మాధుర్యమే కారణము.

## పోతనార్యుఁడు : అతని కవిత్వము

### 1. పోతన :- (15 వ శతాబ్ది)

పోతన కడపమండలములో నున్న యేకశిలానగరమను నామాంతరముగల 'యొంటిమిట్ట' నివాసియని కొందఱు వాదించిరి. కాని పోతన ఓరుగల్లు (నేఁటి వరంగల్లు) నగరమున కనతిదూరములోనున్న బమ్మెర గ్రామవాసియని యనేక ప్రమాణములతో విద్వాంసులు నిరూపించిరి. ఈ ఓరుగల్లే శాసనములలోను, ప్రతాపరుద్రీయాది గ్రంథములలోను ఏకశిలానగరమని పేర్కొనఁబడినది. పోత రాజుగారు గ్రంథారంభమునఁ దెలిపిన ఏకశిలానగర మీ ఓరుగల్లే. గ్రామనామము లింటిపేళ్లగుట తెలుఁగువారికి సహజమే. పోతన యింటిపేరు బమ్మెర. బమ్మెర యనునది వరంగల్లు జిల్లా 'జనగామ' తాలూకాలో గల యొక పల్లెటూరు.

కవి సార్వభౌముఁడు శ్రీనాథుఁడు పోతనకు బావమఱఁదియని వాడుక యున్నది. వారివారి జీవిత కాలమును బట్టియు, వయస్సులను బట్టియు, నట్టి సంబంధము కుదుర్చుట దుస్సాధ్యమని కొందఱనుచున్నారు. సర్వజ్ఞ సింగ భూపా లుని దర్శించిన వీరిద్దరును సమకాలీను లనుట నిర్వివాదమైనది. మఱియు నొకరు భోగులు, నింకొకరు త్యాగులు; ఒకరు శ్రీమంతులు, నింకొకరు నిశ్శ్రీకులు. వీరి బాంధవ్యమును, భిన్న దృక్పథమును, మహిమలను గూర్చి తెలుఁగునాఁట పెక్కు గాథలు చెప్పుకొనఁబడు చున్నవి.

భద్రాత్మకుఁడును, కవియునగు నట్టి నాభాగునకు అంబరీషుఁడు పుత్త్రుఁడై జన్మించెను. జగములో నప్రతిహతమగు బ్రాహ్మణ శాపముకూడ విష్ణు భక్తుఁడగు నీ యంబరీషునందు నిరర్థకమై పోయినది. దురంతమైన బ్రహ్మదండమునుండి యే కారణమున నంబరీషుఁడు విడువఁబడెనో మన ప్రస్తుతకథ వివరించుచున్నది.

## ప్రస్తుత కథా సంగ్రహము

శ్రీమంతుఁడై విశాలమైన భూమినిఁ బరిపాలించుచు, వైష్ణవార్చనా తత్పరుఁడై యంబరీషుఁడను రాజు కీర్తిఁగాంచెను.

అతఁడు సరస్వతీ నదీతీరమున వసిష్ఠాదుల సాహాయ్యముచేఁ జాల నశ్వమేధములు సలిపి సర్వ కర్మలును హరి పరముగ నొనరించుచుండుటవలన నాతనికి రాచతపసి యనెడి పేరు కల్గినది.

అతఁడు నిస్సంగుఁడై, పుణ్యచిత్తుఁడై, ప్రజలఁ బరిపాలించుటకు మెచ్చి భక్తలోకవత్సలుఁడగు శ్రీవిష్ణుదేవుఁ డాతనికొక చక్రమును బహూకరించెను. అది శత్రుసంహారకము, స్వజన సంరక్షకము. దాని మహత్త్వమట్టిది.

ఇట్లుఁ గొంతకాలము చనఁగా, నంబరీషుఁడు సభార్యుఁడై విష్ణు ప్రీతికరమగు ద్వాదశీవ్రతము నొక యేఁడాదిపాటు సలిపెను. అనంతరము భూరి గోదానములు నన్న దానములును గూడ ముగించి పారణ సేయ యత్నించు చుండెను.

అంతలో దుర్వాసుఁ డతిథియై వచ్చి ప్రార్థితుఁడై భోజనమున కంగీకరించి, స్నానార్థము కాళిందీ నదికేగి యెంతతడవునకునుఁ దిరిగి రాఁడయ్యెను.

ఇంతలో ద్వాదశి ఘటికలు గడచిపోవుచుండెను. ద్వాదశి గడియలుండఁగనే పారణఁ గావింపవలెను. కాని స్నానము ముగించి ముని రాఁడు. పండితులు, "ద్వాదశి చనకమునుపు నీరైనను ద్రాగుట మంచిది; అటు కుడుచుటగాదు; ఇటు కుడువ కుండుటయు గాద"ని బోధించిరి. రాజట్లే చేసెను.

పిమ్మట ముని వచ్చెను. వచ్చుచునే రాజు నీర పారణము చేయుట యూహించినాఁడు. కోపము పట్టరానిదయ్యెను. దానితో తన జడ నొకదాని నూడఁబెరికి కృత్యను సృజించి ఖడ్గధారిణియగు నామెను రాజుపైకిఁ బంపెను. అది తన భక్తుఁడైన యంబరీషుని బాధించుటగా విశ్వరూపుఁడగు విష్ణు వెఱిఁగి దానినిఁ జక్కఁబెట్టుమనుచుఁ దన చక్రమును ప్రయోగించెను. ఆ విష్ణుచక్రము ప్రళయాగ్నివలెఁ బైకొని నా కృత్యను దహించి యంతటఁ దనివిదీరక దుర్వాసుని వెన్నాడఁ జొచ్చెను.

అతఁడీ చక్రజ్వాలలనుండి తప్పించుకొనుటకై యేలోకమునకుఁ బారిపోయి నను, అదియు నాలోకమునకెల్ల తన్ను వెన్నాడుచు రాగా, విసిగి వేసారి యా జడదారి బ్రహ్మను, శర్వునిఁగూడ వారివారి లోకములకేగి ప్రార్థించియు విఫల మనోరథుఁడాయెను.

నిఖిలలోకనాథుని చక్రమును దొలఁగఁజేయుట తనకు దుర్లభమని చెప్పిన శివుఁడే దుర్వాసమునికి విష్ణువునే ప్రార్థింపుమని కూడ బోధించెను.

ఎట్టకేలకు దుర్వాసుఁడు వైకుంఠమునకేగి శ్రీమహావిష్ణువును వేఁడికొనఁగా, నతఁడు సదయుఁడగు నా యంబరీషునే ప్రార్థింపుమని యుపదేశించెను.

దానితో నాముని వేగమే వచ్చి యా భక్తాగ్రణి పాదములపై వ్రాలఁగా, నాతఁడు విష్ణుచక్రమును బహుథా స్తుతించి దానిని మఱలించెను. అప్పుడుగాని దుర్వాసునకు మనశ్శాంతి గూరలేదు.

విష్ణు పూజానిరతుఁడగుట, దానమిచ్చుట, యార్తుల రక్షించుట, మున్నగు సుగుణములు గల యంబరీషుని దుర్వాస మహర్షి స్తుతించి, పశ్చాత్తాపమును వెల్ల డించి దీవించెను.

ఆ రాజును వినమ్రుఁడై, యిష్ట మృష్టాన్నములచే మునిని సంతుష్టు నొనర్చి వీడ్కొని, యాతని భుక్తశేషమును తాను భుజించినాఁడు. మునీశ్వరుల బాధలు తీర్చునంతటి వాఁడను తాను గాననియు, నది యెల్ల శ్రీహరి కృపా మహత్త్వమే యనియు, మనసా విశ్వసించిన భక్తాగ్రసరుఁ డంబరీష ప్రభువు.

మునీశ్వరుల పలుకునకుఁ దిరుగులేదు. ఐనను విష్ణు భక్తులయెడ ఋషుల శాపముగూడ వ్యర్థమగునని యీ పాఖ్యము బోధించుచున్నది.

---

## ప్రతిపదార్థ తాత్పర్యాదులు

1వ పద్యము : ఇలన్ = భూమియందు, సద్గుణ + గరిష్ఠుండు = మంచి గుణములచే శ్రేష్ఠుఁడగు, అంబరీషుండు = అంబరీషుఁడను పేరుగల రాజు, సప్తదీప = ఏడు దీవులచే, విశాల = విపులమైన, భూభరము = భూ భారమును, దోః + స్తంభంబునన్ + పూని = బాహువు లనెడు స్తంభములపై వహించి, సంప్రాప్త = పొందఁబడిన, శ్రీయుతుఁడై = ధనముతోఁ గూడినవాఁడై, మహీవిభవ = భూమి పైనున్న భోగములనెడు, సంపత్ + భాతురిన్ + కల్గి = సంపదఁ గలవాఁడై, దుర్వ్యాప్తిన్ + చెందక = దుర్మార్గమునఁబోక, వైష్ణవార్చనల మేరన్ = విష్ణు

పూజలయందే, కాలమున్ + పుచ్చుచున్ = కాలమును గడపుచు, సుప్తిన్ + పొందక = తన పనుల యందేమరుపాటులేక, ఉన్నెన్ = ఉండెను.

విశేషాంశములు:- ద్వీపము - (ప్రకృతి) - దీవి (వికృతి); భరము (ప్ర) - బరువు (వి); స్తంభము (ప్ర) - కంబము (వి); శ్రీ (ప్ర) - సిరి (వి).

వ్యాకరణము :-

దోఃస్తంభంబునన్ + పూని
సంపచ్చాతురిన్ + కల్గి
వ్యాప్తిన్ + చెందక
మేరన్ + కాలము
కాలమున్ + పుచ్చుచున్
సుప్తిన్ + పొందక
} ద్రుత సంధి

సూ. (1) ద్రుత ప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు.

(2) ఆదేశ సరళంబులకు ముందున్న ద్రుతంబునకు బిందు సంశ్లేషలు విభాషనగు.

బిందువనఁగా - ఖండబిందువు, పూర్ణబిందువు; సంశ్లేషమనఁగా - మీఁది హల్లుతోఁ గూడుకొనుట. పక్షంబున స్వత్వ్వంబగు. (స్వత్వంబనఁగా - ద్రుతంబునకుఁ బ్రకృతి భావము.)

వైష్ణవ + అర్చనలు = సవర్ణ దీర్ఘసంధి.

**ఛందస్సు** :- శార్దూలము. శార్దూల పద్యమునకుఁ బ్రతిపాదమునందును వరుసఁగా మ - స - జ - స - త - త - గ - గణము లుండవలయును. ప్రతిపాదమునందును, పాదముయొక్క మొదటి యక్షరమునకు, నాపాదములోని 13వ అక్షరమునకు యతిమైత్రి చెల్లును. ప్రాసనియమము గలదు. ప్రాసయతి మాత్రము వాడకూడదు.

పద్యముల మార్పు :-

శార్దూల పద్యమునందలి మొదటి గురువును తీసి, దాని స్థానమున రెండు లఘువులను జేర్చినచో "మత్తేభ" మగును.

2. ఆ రాజచంద్రునకు = రాజశ్రేష్ఠుఁడగు నా యంబరీష మహారాజునకు, చిత్తంబు = మనస్సు, మధురిపు = (వ్యు) మధు యను రాక్షసునకు శత్రువైన

శ్రీకృష్ణుని యొక్క శ్రీ = శోభతో గూడిన - పాదములయందు + అ = పాద ములయందే (యుండును) పలుకులు = మాటలు, హరి - గుణ - పఠనములందు + అ = శ్రీకృష్ణుని గుణములను చదువుటయందే (యుండును). కరములు = చేతులు, విష్ణు - మందిర - మార్జనములందు + అ = శ్రీమహావిష్ణువు యొక్క - గృహమును (విష్ణ్వాలయము) - శుభ్రము చేయుటయందే (యుండును). చెవులు, మాధవ - కథా - శ్రవణమందు + అ = విష్ణువు - కథలను - వినుటయందే (యుండును). (మాధవుఁడు (వ్యు) లక్ష్మీదేవికి భర్త = విష్ణువు), చూపులు = దృష్టులు, గోవింద - రూప - వీక్షణమందు + అ = విష్ణువు - రూపమును - చూచుటయందే (యుండును). (గోవిందుఁడు (వ్యు) గోవులను రక్షించువాఁడు = విష్ణువు), శిరము = తల, కేశవ - నమస్కృతులయందు + అ = విష్ణువునకు - నమస్కారము చేయుటయందే (యుండును). (కేశవుఁడు (వ్యు) నీటియందు శయనించువాఁడు = విష్ణువు), పదములు = పాదములు, ఈశ్వర - గేహ - పరిసర్పణములందు + అ = విష్ణు - మందిరమున - కరుగుటయందే (యుండును). కామంబు = కోరిక, చక్రి - కైంకర్యమందు + అ = విష్ణువునకు - సేవజేయుటయందే (యుండును). (చక్రి (వ్యు) చక్రము ధరించువాఁడు = విష్ణువు), సంగము = కలయిక, అచ్యుత - జన - తను - సంగమందు + అ = విష్ణు - భక్తుల - దేహములతో - కలయుట యందే (యుండును). (అచ్యుతుఁడు (వ్యు) నాశనము లేనివాఁడు = విష్ణువు), ఘ్రాణము = వాసనచూచుట, అసుర + అరి - భక్త + అంఘ్రి - కమలమందు + అ = విష్ణు - భక్తుల - పాదపద్మములను - వాసనచూచుటయందే (యుండును). (అసుర + అరి (వ్యు) రాక్షసులకు శత్రువు = విష్ణువు), రసన = నాలుక, తులసీ దళములందు + అ = తులసీదళముల రుచిచూచుటయందే (యుండును). రతులు = ఆసక్తులు, పుణ్య - సంగతులయందు + అ = పుణ్యమును కలిగించు - ప్రసంగ ములయందే (యుండును).

తాత్ప :- రాజచంద్రుఁడగు నా యంబరీషుఁడు తన చిత్తము మహావిష్ణువు పాదములయందును, మాటలు హరిగుణమ్ముల బఠించుటయందును, హస్తములు విష్ణుమందిరమును శుభ్రము గావించుటయందును, చెవులు మాధవు కథలను వినుట యందును, చూపులు గోవిందుని రూపమును జూచుటయందును, శిరము విష్ణువు నకు నమస్కారము చేయుటయందును, పాదములు విష్ణుమందిరమున కరుగుట యందును, కాలము చక్రి కైంకర్యమునందును, సంబంధము విష్ణుభక్తుల దేహ సంగంబునందును, ఘ్రాణము విష్ణుభక్తుల పాదపద్మముల యందును, నాలుక తులసీదళములను రుచిచూచుటయందును, అనురాగము పుణ్యకథలయందును, గల వాఁడై యుండెను.

విశేషము :- కోశము = (సం) ... (సం) చేయుటకు పనికివచ్చు తొండము, కిరణము (తె) కప్పము మిక్కిలి ... కథా (ప్రకృతి) ... కత (వికృతి).

వ్యా. వి:- పదయుగ్ము + ఈశ్వర = పదయుగ్మేశ్వర (ఉత్వ సంధి); అసుర + అరి = అసురారి (సవర్ణ దీర్ఘ సంధి).

3. అ + మహీ విభుఁడు = అమ్మహీ విభుఁడు = భూమికి భర్త (త్రిక సంధి)

4. అతఁడు = ఆ యంబరీషుఁడు, ఘన - వైభవంబునన్ = గొప్ప - వైభవముతో, కల్మష - దూరుఁడై = పాపము - లేనివాఁడై, అబ్జాక్షున్ = పద్మమువంటి నేత్రములుగ్గల, యజ్ఞేశున్ = యజ్ఞముల కధిపతియైన, ఈశున్ = విష్ణుమూర్తి నిగూర్చి, వసిష్ఠాది - ముని - వల్లభులతోఁడ = వసిష్ఠుఁడు మొదలగు - ఋషి - శ్రేష్ఠులతో, సరస్వతీ - తటమునందు = సరస్వతీ నది - యొడ్డున, గణుతింపరాని = లెక్కింపశక్యముగాని, దక్షిణల్లు వెట్టి = దక్షిణ లొసంగి, బహు - వాజిమేధంబులు = అనేకములగు - అశ్వమేధయాగములు, ఒనరించె = చేసెను. సమ - లోష్ట - హేముఁడై = బంగారము - మన్ను - సమానముగాఁ జూచువాఁడై, సర్వ కర్మంబులు = తా నొనరించు నెల్ల కార్యములు, హరి-పరంబులు-గాఁగన్ = విష్ణు - పరములగునట్లుగా, అవని + ఏలెన్ = భూమిని పాలించెను. విష్ణుభక్తులందు, విష్ణువునందు, కలంక మేడల = నిష్కలంకమైయున్న, మనసు - లంకె - పెట్టి = మనస్సును - లగ్నము - గావించి, విహిత = నిర్దిష్టమైన, రాజ్య - వృత్తి = రాజ్య - పరిపాలనా విధానము, విడువని వాఁడునై = విడువకున్నవాఁడై, రాచ - తపసి - యనఁగన్ = రాజర్షి యన, ఒప్పెన్ = ప్రసిద్ధికెక్కి యుండెను.

తాత్ప:- ఆ యంబరీషుఁడు నిష్కల్మష హృదయుఁడై గొప్ప వైభవముతో వసిష్ఠాది ఋషి పుంగవులతోఁ గలిసి యజ్ఞాధిపతియగు విష్ణువునుగూర్చి సరస్వతీ నదీతీర మందనేక యశ్వమేధ యాగముల నొనరించెను. లెక్కలేనన్ని దానములను చేసెను. మన్ను, బంగారము సమముగాఁ జూచువాఁడై సమస్త కార్యములు విష్ణు పరముగా రాజ్యమేలెను. విష్ణుభక్తులందు, విష్ణువునందు నిష్కలంకమగు మనస్సును లంకెవెట్టి, రాజ్యవృత్తి విడువనివాఁడై, "రాచ తపసి" యని ప్రసిద్ధికెక్కెను.

వ్యా. వి:- యజ్ఞ + ఈశు = గుణసంధి; అబ్జ + అక్షు = సవర్ణ దీర్ఘ సంధి; దక్షిణల్లు + పెట్టి = గసడదవా దేశ సంధి.

5. వెండియు = మఱియు; అ + మహా భాగవతుండు = ఆ గొప్ప భగవద్భక్తుఁడు - (త్రికసంధి).

6. సంభావించును = గౌరవించును, ఆఘ్రాణించున్ = వాసనచూచును, అలవియె = సాధ్యమగునా?

7. ఈశ్వర + ఆయత్తుండు = పరమాత్మకు వశమైనవాఁడు (సవర్ణ దీర్ఘ సంధి).

8. అతనికి = అంబరీషునకు, హరులందు = గుఱ్ఱములందును, కరులందు = ఏనుఁగులయందును, ధనములందును, కేళివనములందు = ఉద్యాన వనములయందును, పుత్త్రులందు = కుమారులయందును, బంధుమిత్త్రుల యందును = బంధువుల యందు స్నేహితులయందును, అంతిపురమునందు = అంతః పురమునందును, ఈహ = కోరిక, మానెన్ = లేకుండపోయెను.

విశే :- హరి = (నానా) విష్ణువు, గుఱ్ఱము, ఇంద్రుఁడు; కరి (వ్యు) తొండముకలది (ఏనుఁగు); వనము (నానా) నీరు, అడవి; పుత్త్రుఁడు (వ్యు) పున్నామ నరకమునుండి తప్పించువాఁడు (కుమారుఁడు); మిత్త్రుఁడు (నానా) స్నేహితుఁడు, సూర్యుఁడు; పురము (ప్రకృతి) – ప్రోలు (వికృతి).

వ్యా.వి:-హరి + లు. సూ - ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్త్వంబగు. ఉదా॥ హరులు, కరులు. మొ॥

9. ఆ + మేదినీ + కాంతుఁడు = ఆ (భూభర్త) రాజు (త్రికసంధి), తగులము = సంబంధము, ఏకాంతము = ఒంటరితనము, భక్తలోక – వత్సలుఁడు = భక్తుల సమూహమునందు – వాత్సల్యముగలవాఁడు, పురుషోత్తముఁడు (వ్యు) పురుషులలో శ్రేష్ఠుఁడు = శ్రీమహావిష్ణువు, ప్రతిభట – శిక్షణంబును = శత్రువీరులను - శిక్షించునదియు, నిజ - జన - రక్షణంబును = ఆప్త – జనుల - రక్షించునదియు, అఖిల - జగత్ + అవక్రంబును = సమస్తమైన - లోకములయందు - మొక్కపోనిదియునగు, చక్రంబు నిచ్చి = చక్రము నిచ్చి, చనియెన్ = పోయెను. అంత = తరువాత.

విశే :-భక్తి (ప్ర) - బత్తి (వి);

వ్యా. వి :-ఆ + మేదినీకాంతుఁడు (త్రికసంధి); పురుష + ఉత్తముఁడు (గుణసంధి).

10. జన విభుఁడు = జనుల కధిపతియగు అంబరీషుఁడు, ఒకయేఁడు = ఒక సంవత్సరము, తనతోడి నీడకైవడి = తనతోనుండు నీడవలె, అనురూప = తగిన, గుణ + ఆఢ్యయైన = మంచిగుణములతోఁ గూడిన, ఆత్మ మహిషితోన్ = తన పట్టపుదేవితో, హరిన్ + కూర్చి = విష్ణువునుగూర్చి, ద్వాదశీ వ్రతము = ద్వాదశినాఁడు చేయు వ్రతము, ఒనరఁగన్ = ఒప్పునట్లుగా, చేసెన్ = చేసెను.

తాత్ప:- అంబరీషుఁ డొక సంవత్సరము, తనతోడి నీడవలెనుండి, తగిన గుణగణమునుగల, పట్టమహిషితోఁ గూడి విష్ణునిఁగూర్చి ద్వాదశీ వ్రతమొనర్చెను.

వ్యా. వి:- గుణ+ఆఢ్య (సవర్ణ దీర్ఘసంధి); పఁడు+అధిపా(ఉత్త్వసంధి)

11. వ్రతాంతంబునన్ = వ్రతము పూర్తి అయిన తరువాత, ఉపవసించి = ఉపవాసముచేసి, కాళిందీ జలంబుల = యమునా నదియందు, స్నాతుండయి = స్నాన మొనర్చినవాఁడై, మధు వనంబునన్ = మధు వనమునందు, విహిత - పరికర - సంపన్నుండై = నిర్ణయింపఁబడిన - సామగ్రితోఁ - గూడినవాఁడై, హరిన్ - అభిషేకంబు సేసి = విష్ణువున కభిషేక మొనర్చి, మనోహరంబులయిన = రమ్యములయిన, గంధ + అక్షతంబులు = చందనము అక్షతలును, సమర్పించి = ఉంచి, అభినవ + ఆమోదంబులైన = నూతనమైన పరిమళముతోఁగూడిన, పుష్పంబులన్ + పూజించి = పువ్వులతోఁ బూజచేసి, తదనంతరంబ = తరువాత.

విశేషము:-

కాళింది (వ్యు) కళిందమునుండి జన్మించినది (యమునానది); పుష్పము (ప్ర) - పువ్వు (వి).

వ్యా. వి:- వ్రత + అంతము; మహా + అభిషేకము; గంధ + అక్షతలు; అభినవ + ఆమోదము = సవర్ణ దీర్ఘ సంధులు.

12. విభుఁడు = అంబరీష మహారాజు, ఉద్యత్ + వైదిక + శ్రేణికిన్ = గొప్ప బ్రాహ్మణ ముఖ్యులకు, పాలు + ఏరు + ఐ = పాలు ప్రవాహమై, ప్రవహింపన్ = ప్రవహించు చుండఁగా, లే + ప్రాయంబులై = లేఁత వయస్సుకలవై, రూపముల్ మేలు + ఐ = రూపమునందు శ్రేష్ఠమై, ధూర్తలుగాక = పొగరు గలవిగాక, వెండి గొరిజల్ = వెండితో చేయఁబడిన డెక్కలు, హేమ + ఉరు + శృంగంబులున్ = బంగారముతోఁగూడి - గొప్పవియగు కొమ్ములు, క్రాలన్ = ప్రకాశించుచుండఁగా, డగ్గఱుచు = దగ్గఱిల్లుచు, క్రేపుల = దూడలయొక్క, అఱ్ఱు = మెడ, నాకుచున్ = నాకుచున్నవై, అంగచ్ఛాయలై యున్న = దేహకాంతులతోఁ గూడియున్న, మందలన్ = ఆవుల మందలను, న్యర్బుద షట్కమున్ = ఆఱు అర్బుదముల సంఖ్యఁగలవానిని, ఇచ్చెన్ = ఇచ్చెను. (అర్బుదము = పదికోట్లు - ఒకకోటి యని కొందఱు.)

తాత్ప :- అంబరీష మహారాజు, వేద నిష్ఠాపరులగు బ్రాహ్మణోత్తములకు - పాలు నదివలె బ్రవహించుచుండ, లేఁతవయస్సుగలిగి, సాధువులై, వెండిడెక్కలతోను, బంగారు కొమ్ములతోను బ్రకాశించునట్టివి యగుచు, సమీపించిన తమ దూడల యఱ్ఱులను నాకుచున్న గోవులను న్యర్బుద షట్కమును దాన మొనర్చెను.

గమనిక :—

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

విశేషము :—

శృంగము (నానా) కొమ్ము, శిఖరము.

వ్యా. వి:- పాలు + ఏఱు + ఐ (ఉత్వ సంధి); లేఁత + ప్రాయము - సూ (1)—సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు - ఉదా॥ లే + ప్రాయము.

సూ. (2) లుప్త శేషంబులకుఁ బరుషంబులు బరంబులగునపుడు నుగాగమం బగు - ఉదా ॥ లే + ను + ప్రాయము. పిమ్మట ద్రుత కార్యములచే - లేఁబ్రాయము.

సూ. (3) దీర్ఘముమీఁద సాధ్యపూర్ణములేదు. అందువలన, బూర్ణబిందు రూపము (లేంబ్రాయము) ఉండదు.

13. విభుఁడు = రాజు, పెక్కండ్రు = అనేకులగు, విప్రవరులకు = బ్రాహ్మణోత్తములకు, చొక్కపుటన్నంబిడి = మేలైన (షడ్రసోపేతమైన) భోజనము పెట్టి, పారణము - సేయన్ + ఉద్యోగింపన్ = తానును ఉపవాస వ్రతాంత భోజనము – సేయ ప్రయత్నించుచుండఁగా;

తాత్ప :- అంబరీషుఁడు పెక్కండ్రు బ్రాహ్మణులను రావించి వారల కతి భక్తితోఁ దృప్తిగా భోజనములు పెట్టి, తానును బారణ సేయఁ బ్రయత్నించు చుండఁగా;

వ్యా. వి :- పారణము + చేయ (గసడదవాదేశసంధి) ; చొక్కము + అన్నము – సూ (1) కర్మధారయమునందు ము వర్ణకంబునకుం బుంపులగు - ఉదా :- చొక్కపు + అన్నము.

సూ (2) కర్మధారయంబు లందుత్తున కచ్చు పరంబగునపుడు టుగాగమం బగు- ఉదా॥ చొక్కపు + టు + అన్నము = చొక్కపుటన్నము.

14. ఆ + అవసరంబున = అయ్యవసరంబున (యడాగమానంతరము త్రిక సంధి).

15. భాసుర = ప్రకాశవంతమైన, నిగమ + పద + ఉపన్యాసుఁడు = వేద - మార్గము – నుపన్యసించువాఁడును, సు + తపః + విలాసుఁడు = గొప్ప - తపస్సే - విలాసముగాఁ గలవాఁడును, అనుపమ + యోగ + అభ్యాసుఁడు = సాటిలేని - యోగము యొక్క - అభ్యాసముగలవాఁడును, రవి - భాసుఁడు = సూర్యునివలె- బ్రకాశించువాఁడును నగు, దుర్వాసుఁడు = దుర్వాసుఁడనెడి ముని,

తత్ + నివాసంబునకున్ = ఆ యంబరీషుని - భవనమునకు, అతిథి యయ్యెన్ = అతిథియై వచ్చెను.

విశేషము :

అతిథి (వ్యు) నియతమైన యొక తిథియని లేక ఇచ్చవచ్చినపు డనాహూతుఁడై భోజనార్థము వచ్చువాఁడు.

16. ఆ + మునివల్లభునకు (త్రికసంధి), ప్రత్యుత్థానంబు సేసి = లేచి యెదురుగాఁజని, గద్దియ = పీఠము; కుడువుమని = తినుమని; ఆ + మహాత్ముఁడు = ఆ మునిశ్రేష్ఠుఁడు (త్రికసంధి), కాళిందీజలము = యమునానది యందలి నీరు; తడవు సేసినన్ = ఆలస్యముచేయఁగా, ముహూర్తార్థావశిష్టయగు = అర్థక్షణమువాత్రమే మిగిలియున్న, పారణసేయుట = వ్రతాంతమున భుజించుట, చింతించి = ఆలోచించి, బ్రాహ్మణ + అతిక్రమ + దోషంబునకు = బ్రాహ్మణుని - విడిచి భుజించిన-దోషమునకు, శంకించి = సందేహించి, విద్వత్ + జనంబులన్ = పండితులను;

విశేషము :—

గద్దియ - (రూపాంతరము) గద్దె; ముహూర్తము (ప్ర) - మూరుతము (వి); భోజనము (ప్ర) - బోనము (వి).

వ్యా. వి :- ప్రతి + ఉత్థానము = యణాదేశసంధి.

17. ముని = దుర్వాస మహర్షి, వెడలఁడు = బయటికిరాఁడు. ఇంత చనియెను = ఇంతగడచెను, అర్హ - ధర్మ - విధము = తగిన - ధర్మ - పద్ధతి.

తాత్ప:— దుర్వాసముని. స్నానమునకు నీట ప్రవేశించి, యెంతకును బయటికి రాఁడు. ద్వాదశియుఁ గడచిపోవుచున్నది. ఈ లోపల పారణ సేయవలయును. తగు ధర్మమార్గమేదియో వినిపింపుఁడు.

విశేషము :-

ధర్మము (ప్ర) - దమ్మము (వి); విధము (ప్ర) - వితము (వి).

వ్యా. వి :— నీరు సొచ్చి (నీరు + చొచ్చి) = గసడదవాదేశసంధి.

18. బుధజనులు = పండితులు.

19. రామిన్ = రాకుండుటచే, పాడిగాదు = ధర్మముగాదు; సలిల భక్షణంబు = నీరుత్రాగుట, కుడువక + ఉంట + కాదు = తినకుండుటగాదు; కుడుచు

టయునుగాదు = తినుటయునుగాదు. సమ్మతంబు = కావున చేయఁదగినది. (మంచి నీరు ద్రాగినచో తినుటయుఁగాదు; తినకుండుటయుఁగాదు; ఆపద్ధర్మముగా సమ్మతము.)

తాత్ప:- రాజా! అతిథి స్నానమునకేగి యెంతకును రాకుండుటచే ద్వాదశి పారణము మానుట ధర్మముగాదు. మంచి నీరము ద్రాగియున్నచో నటు భుజించినట్లును గాదు; ఇటు భుజింపనట్లునుగాదు. కావున నీరు మాత్రము ద్రాగియుండుట మంచిదని విద్వాంసులు ధర్మసూక్ష్మము నెఱింగించిరి.

వ్యా. వి:- అతిథి + పోయి = గసడదవాదేశసంధి. రామి - (సూ) వ్యతిరేకార్థమున 'మిజి' యగు.

20. ధర్మ + సందేహంబు = ధర్మ విషయమున గలిగిన సందేహము; రాజ + ఋషి = రాజై యుండి ఋషి కృత్యముల నాచరించువాఁడు. నీర పారణంబు సేసి = నీరుమాత్రము ద్రాగి, తపసి రాకకు = దుర్వాసుని రాకకై.

వ్యా. వి:- రాజ + ఋషి (గుణసంధి) = రాజర్షి.

21. యమునలో = యమునానదిలో, కృతకృత్యుఁడై = స్నానము సంధ్య మొదలగు పనులను పూర్తి చేసినవాఁడై, వచ్చి, రాజుచే = అంబరీషునిచే, సేవితుండై = సేవింపఁబడినవాఁడై, రాజు చేష్టితంబు = రాజు సలిల భక్షణంబుఁ గావించుట, బొమముడి మొగముతో = కనుబొమలు ముడివడిన ముఖముతో, అదరెడి మేనితో = అదరుచున్న దేహముతో, ఆగ్రహించి = కోపించి, ఈ + సంపత్ + ఉన్మత్తున్ = ఐశ్వర్యముచే మదించిన వీనిని, ఈ నృశంసున్ = ఈ దుర్మార్గుని, ఈ దురహంకారున్ = దు ఈష్టమైన గర్వముకలవానిని, కుడువ రమ్మని = భుజించుటకు పిలిచి, మునుముట్ట = మొట్టమొదటిగా, కుడిచినాఁడు = భుజించినాఁడు. ధర్మభంగముచేసి = ధర్మమునకు లోపముచేసి, దుష్కర్ముఁడయ్యె = దుర్మార్గుఁడయ్యెను. ఇన్నిదిశలన్ = ఇన్నిదిక్కులందు, మాన్పువాఁడు = మాన్పించువాఁడు.

తాత్ప :- దుర్వాసుఁడు యమునలో స్నానమొనర్చి, సంధ్యావందనాది కర్మల నాచరించి వచ్చి, యంబరీషునిచే సేవితుండై, రాజు సలిల భక్షణము చేయుట నూహించి బొమముడి మొగముతో, నదరెడు దేహముతో, నాఁకలి రెట్టింప, "నీ యైశ్వర్య మత్తుని, దుర్మార్గుని, దురహంకారుని మీరెల్లరు చూచితిరిగదా ! వీఁడు విష్ణుభక్తుఁడుగాఁడు: నన్ను భుజింపరమ్మని పిలిచి, మునుముందు భుజించినాఁడు. ధర్మభంగముచేసి దుర్మార్గుఁడైనాఁడు. అయిననేమి ? నా శక్తి

నిప్పుడు చూపెదను. నేను కోపింప వీనిని రక్షించువాఁడెవ్వఁడు?" అనుచు, (ఇందు కుపితుఁడైన వాని యాకారము వర్ణింపఁబడినది.)

విశేషము :—

ముఖము (ప్ర) - మొగము (వి); విష్ణువు (ప్ర) - వెన్నుఁడు (వి).

22. మునీంద్రుఁడు = దుర్వాసమహర్షి, పెటపెట పండ్లు గీటుచును = పెటపెటమనునట్లు పండ్లుగొరుకుచు, భీకరుఁడై = భయంకరమైన యాకారము కలవాఁడై, కనుఁగ్రేవ = కనుకొనలనుండి, నిప్పుకల్ = నిప్పుకణికలు, పొటపొట రాల = పొటపొటమని రాలుచుండఁగా, గండములు పొంగ = గండస్థలములు పొంగునట్లు, హుంకరించుచున్ = హుంకారముచేయుచు, జట = తన జడనొక దానిని, మొదలంటఁగాన్ = మూలముతో సహా, పెఱికి = లాగి, దానన = దాని తోడనే, కృత్యన్ = శక్తిని, ఆయుధ + ఉత్కట + వలమాన + హస్త + యుత గాన్ = ఆయుధముతో - దిరదిర - తిరుగుచున్న - హస్తముకలదానినిఁగా, ఒన రించి = సృష్టించి, రాజుపై = అంబరీషునిపై, కవించె = ప్రయోగించెను.

తాత్ప :- ఆ దుర్వాసుఁడు పెటపెటమని పండ్లుగొరుకుచు, భయంకరమైన ఆకారముకలవాఁడై, కనుఁగొనలనుండి నిప్పుకలు పొటపొటరాల, గండములు పొంగ, హుంకారముచేయుచు, జడ మొదలంటఁగాఁ బెఱికి, దిద్దిరఁదిరుగు గొప్ప యాయుధము హస్తమునందుఁగల శక్తి నొకదానిని సృజించి, యంబరీషునిపైఁ బ్రయోగించెను.

విశేషము :—

పెటపెట; పొటపొట - ఇవి ధ్వన్యనుకరణ పదములు. జట (ప్ర) - జడ (వి).

వ్యా. వి :— కను + క్రేవ = కనుఁగ్రేవ. - (సూ) సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకును, (పు, ంపు- లకును) బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. ఇచ్చట స్త్రీ సమంబునకు పరుషము పరమైనది. పిమ్మట ద్రుతకార్యములు కాఁగా 'కనుఁగ్రేవ' అయినది.

మునీంద్రుఁడు = ముని + ఇంద్రుఁడు (సవర్ణదీర్ఘసంధి); ఆయుధోత్కటము = ఆయుధ + ఉత్కటము (గుణసంధి).

ఛందస్సు :— చంపకమాలా వృత్తము. దీనికి నాలుగు పాదములు లోకే మాదిరిగా నుండును. ప్రతిపాదమునందును వరుసగా న-జ-భ-జ-జ-జ-ర- గణములుండ వలయును. ప్రతి పాదమునందును, పాదముయొక్క మొదటి

యక్షరమునకు, నాపాదములోని 11వ యక్షరమునకును యతిమైత్రి చెల్లును. ప్రాస నియమము కలదు. ప్రాసయతి వాడకూడదు.

**పద్యముల మార్పు :-**

చంపకమాల పద్యపాదమునందలి మొదటి రెండు లఘువులను తీసి, యొక గురువు చేర్చినచో 'ఉత్పలమాల' పాదమగును.

23. అంత -

24. మహాకృత్య = ఆ మహాశక్తి, కాల + అనల సన్నిభమై = ప్రళయ కాలమందలి యగ్నితో సమానమైనదై, శూల + ఆయుధ + హస్త యగుచు = శూల మను - నాయుధము - చేతియందు కలదై, సురసుర స్రుక్కన్ = సురసుర మను నట్లు, నేలఁ - బదంబులఁ - ద్రొక్కుచు = నేలపైఁ - బాదములతోఁ - ద్రొక్కుచు, వ్రాలి = దుర్వాసునకు నమస్కరించి, మనుజ వల్లభున్ = మానవుల కధిపతియగు రాజును, చేరెన్ = చేరెను.

తాత్ప:- ఆ మహాశక్తి, ప్రళయ కాలమందలి యగ్నితో సమానమైనదై, శూలమను ఆయుధము హస్తమున ధరించి, భూమి గ్రక్కదలఁ, బాదంబులనేలఁ ద్రొక్కుచు, దుర్వాసునకు నమస్కరించి, యంబరీషుని సమీపించెను.

వ్యా. వి:- (1) కాల + అనలము = కాలానలము; (2) శూల + ఆయు ధము = శూలాయుధము (స. దీ. సంధులు).

25. విశ్వరూపుఁడు = ప్రపంచమే రూపముగాఁగల, హరి = విష్ణువు, ఆ ప్రకార మెఱిఁగి = కృత్య రాజుపై కేఁగుట తెలిసికొని, వెఱ్ఱి తపసి = పిచ్చివాఁ డగు దుర్వాసుఁడు, చేయు = చేయునట్టి, వేడబంబు = ఆటోపమును (మాయను), చక్కఁబెట్టుము = సరిచేయుము, అనుచు = అని, చక్రంబున్ = తన చక్రాయుధ మును, పంచినన్ = పంపఁగా, అదియు = ఆ చక్రము, ప్రళయ + వహ్ని + పగిది = ప్రళయాగ్నివలె, వచ్చెన్ = వచ్చెను.

తాత్ప:- విశ్వరూపుఁడగు శ్రీమహావిష్ణువు, మూఢుఁడగు దుర్వాసుఁడు చేయు నాటోపమును, కృత్య యంబరీషుపై కేఁగుటయు నెఱింగి, దానిని జక్కఁ జేయుమని చక్రమును బంపెను. అదియుఁ బ్రళయకాలాగ్నివలె వచ్చెను.

**గమనిక :—**

'వేడబము' అనుటకు, 'నేడబము' అచ్చు పొరపాటు.

26. దహించి = తగులబెట్టి, తనివి సనక = తృప్తిఁ జెందక, వ్యాళము = క్రూర సర్పము, దవానలంబు = కాలాగ్ని, తోన = వెంటనే, చొచ్చి = ప్రవేశించి.

27. హరి చక్రంబు = విష్ణు చక్రము, అన్య + దూర్వక్రమై = ఇతరులకు వారింప శక్యము కానిదై, ఒక్కవడిన్ = గొప్ప వేగముతో, తాపసు వెంటనంటి = ఆ దుర్వాసుని వెంబడించి, భువిమూరన్ = అతఁడు భూమిలో ప్రవేశించినచో, భువి దూరున్ = తానును భూమిలోఁ బ్రవేశించును. అబ్ధిఁజొరన్ = సముద్రములోఁ బ్రవేశించిన, అబ్ధుల్ సొచ్చు = సముద్రములలోఁ బ్రవేశించును. ఉద్వేగియై = తొందరపాటు గలవాఁడై, దివిఁబ్రాకన్ = స్వర్గమునకుఁ బ్రాకిన, దివిఁబ్రాకు = స్వర్గమునకుఁ బోవును. దిక్కులకుఁబోన్ = దిక్కులకుఁబోయినచో, దిగ్వీథులం బోవు = దిగ్భాగములకుఁబోవును. చిక్కి = విసిగి, వెసన్ = వేగముగా, క్రుంగినన్ = మునిఁగినచో, క్రుంగు = మునుఁగును. నిల్వన్ = నిలిచినచో, నిలుచున్ = నిలబడును. క్రేడింపన్ = అతఁడు తొలఁగఁగా, క్రేడించున్ = తానును తొలఁగును.

తాత్ప:— ఆ విష్ణుచక్రము వారింప శక్యముగానిదై, గొప్ప వేగముతో, దుర్వాసుని వెంటనంటి, యతఁడు భువిదూఱినచో భూమిలో దూఱును; సముద్రములోఁ బ్రవేశించినచో సంద్రమును జొచ్చును; తొందరపాటుతో స్వర్గమున కేగినచోఁ దానును స్వర్గమున కెగఁబ్రాకును; అతఁడు దిక్కులకుఁ బోవునెడల, తానును దిగ్వీథులకే పోవును; విసిగి శీఘ్రముగా గ్రుంగినఁ గ్రుంగును; నిలిచినచోట నిలుచుండును; అతఁడు తొలఁగినప్పుడు తాను నటుప్రక్కకే తొలఁగును.

విశేషము:-

అబ్ధి (వ్యు) నీటికి నిధి (సముద్రము).

**ఛందస్సు** :— మత్తేభము. మత్తేభ పద్యమునకు నాలుగు పాదము . లొకే మాదిరిగానుండును. ప్రతిపాదమునందును వరుసఁగా, స - భ - ర - న - మ - య - వ - గణము లుండవలయును. పాద పాదమునందును మొదటి యక్షరమునకు నా పాదములోని 14వ యక్షరమునకు యతి మైత్రిచెల్లును. ప్రాసనియమము కలదు. ప్రాసయతి వాడకూడదు.

పద్యముల మార్పు ;—

మత్తేభ పద్యపాదమునందలి మొదటి రెండు లఘువులను తీసి యా స్థానమున నొక గురువుఁజేర్చినచో శార్దూల పద్యపాదమగును.

28. ఏ లోకంబునకైనన్ = ఏ లోకమునకుఁబోయినను, వెంటఁబడి = వెంబడించి, తో నేతెంచు = వెంటవచ్చు, చక్ర + అనలజ్వాలల్ = చక్రము యొక్క

యగ్నిజ్వాలలను, మానుపువారు = మాన్పించువారు, లేమిన్ = లేకుండుటచే, చని = వెళ్లి, దేవజ్యేష్ఠు - లోకేశున్ = సత్యలోకాధిపతియగు బ్రహ్మను, వాఁడు = దుర్వాసుఁడు, ఆలోకించి = చూచి, విధాత = ఓ బ్రహ్మా!, విశ్వ-జనన-వ్యాపార - పారీణ - రేఖా - లీలేక్షణ = ప్రపంచమును - సృష్టించు - వ్యాపారమునందు - నిమగ్నమైన - విలాసముతోఁగూడిన - దృష్టిఁగలవాఁడా !, చూడవే = చూడుము; కరుణన్ = దయతో, చక్రంబున్ = చక్రమును, నివారింపవే = అడ్డగింపుము.

తాత్ప :- ఏ లోకమున కేగినను వెంబడించు చక్రాగ్ని జ్వాలలను మానుపువారెవ్వరును లేకుండుటచే, బ్రహ్మలోకమున కేగి, ప్రపంచమును సృష్టించు విధాతా ! చూడుము. దయతో చక్రమును వారింపుము - (అనిన బ్రహ్మ యిట్లనియె)

విశేషము :—

లోకము (నానా) భువనము, జనము. విధాత (వ్యు) సర్వమును సృజించువాఁడు.

29. విశే:- బ్రహ్మ (ప్ర) - బమ్మ (వి)

30. కర ఘూర్ణిన్ = మిక్కిలి కోరికతో, ద్వి - పరార్ధ -సంజ్ఞ గల = "పూర్వ పదార్ధము, ఉత్తర పదార్ధము" అను సంజ్ఞగలిగిన, ఈ కాలంబున్ = ఈ కాలమును, కాలాత్ముఁడై = కాల స్వరూపుఁడై, సొరిదిన్ = క్రమముగా, కనుఁగ్రేవఁగెంపుగదురున్ = కనుకొనలయందు రక్తిమ కలుగఁగా (అనఁగా కోపమురాగా), లోకములను = ఆ చోటులను, క్రేగంటి చూపుతో, భస్మంబుగాఁజేయు = బూడిదగఁజేయు, విభుఁడెవ్వఁడో = ప్రభువెవ్వఁడో, ఆ + హరి + చక్ర + అనల + కీలకు = ఆ విష్ణువుయొక్క చక్రాగ్ని జ్వాలకు, అన్యుఁడొకరుఁడు = ఇతరుఁడొకఁడు, అడ్డంబు గానేర్చునే = అడ్డము కాగలఁడా ?

తాత్ప :- పూర్వ పదార్ధము, ఉత్తర పదార్ధము ననెడి గుర్తులుగల యీ కాలమును, కాలస్వరూపుఁడై సృజించి కూడ, తానే మఱల కంటి యెఱ్ఱచేత నా కాల నిర్మితములగు లోకములను బూడిదగా నే విభుఁడు చేయుచున్నాఁడో, శ్రీహరియైన యా విభుని చక్రమునుండి వెలువడు నగ్నికీలల నాగఁగలవాఁడొక్కరుఁడుండునా ? (అన్యునకు తరముగాదనుట).

గమనిక :—

ఈ పద్యము ప్రతిపదార్ధమునకు ముఖ్యమైనది.

31. ఏనున్ = నేనును, భవుఁడున్ = ఈశ్వరుఁడును, దక్షుఁడు = దక్ష ప్రజాపతియు, ఇంద్ర + ఆదులును = ఇంద్రుఁడు మొదలైనవారును, ప్రజాపతు లును, భృగుమహర్షి, భూతనాథులును, భూరి కార్యమతులమగుచు = గొప్ప కార్య ముల నాచరించువారమై, జగత్ + హితంబంచు = ప్రపంచమునకు మేలు కలి గించునదని, అతనియాజ్ఞ = ఆ మహావిష్ణువు నాజ్ఞను, శిరములందు దాల్తుము = తలలపై ధరింతుము.

తాత్ప :— నేను, శివుఁడు, దక్షుఁడు, ఇంద్రుఁడు మొదలగువారును, ప్రజా పతులు, భృగుఁడు, భూతపతులును, గొప్ప కార్యముల నాచరించు కోరికతో లోకహితమని, యా విష్ణువు నాజ్ఞను శిరసావహింతుము.

విశేషము :—

ఆజ్ఞ (ప్ర) - ఆన (వి); భూరి (నానా) గొప్ప, బంగారము.

32. సుదర్శన + నివారణంబునకు = చక్రమును వారించుటకు, నోపను = సమర్థుఁడనుగాను. విరించి = బ్రహ్మ; కైలాసంబు = శివుఁడు నివసించు పర్వతము, శర్వున్ = ఈశ్వరుని, ఆలోకించి = చూచి; ఆ + మహాదేవుఁడు = ఆ శివుఁడు,

విశేషము :—

సుదర్శనము (వ్యు) భక్తులచేత సుఖముగఁ జూడఁబడు నట్టిది; విరించి (వ్యు) భూతములను సృజించువాఁడు; శర్వుఁడు (వ్యు) ప్రళయమందు భూతములను హింసించువాఁడు.

వ్యా. వి :- ఆ + మహాదేవుఁడు = అమ్మహాదేవుఁడు (త్రికసంధి).

గమనిక :—

'సుదర్శనము' సాధురూపము. 'భక్తులచేత బాగుగఁ జూడఁబడునది' యని వ్యుత్పత్త్యర్థము. 'సుదర్శున' మనుట అచ్చుపొరపాటు.

33. తండ్రి = ఓ దుర్వాసమహామునీ !, వినవయ్య = వినుము. ఏ విశ్వ + ఈశ్వరునియందు = సమస్తమైన లోకముల కధిపతియగు నే విష్ణువునందు, చతు రాస్య - జీవకోశములు = నాలుగు మోములుగల బ్రహ్మ - ప్రాణులు, పెక్కు వేలసంఖ్యలుకూడి = అనేకవేల సంఖ్యతోఁగలిసి, వేళతోన్ = సమయమునకు, ఈ + భంగి = ఈ విధముగా, అగుచుండు = సృష్టింపఁబడుచుండును. అదియుఁగాక, ఏ + వానిచే = ఏ పరమాత్మచేత, ఏము = మేము, భ్రాంతినందుచున్నారము =

గ్రోంతఁ జెందుచున్నా మో ?, ఏను = నేను, దేవలుఁడు, అసుర + ఇంద్రసుతుఁడు = రాక్షసరాజకుమారుఁడగు ప్రహ్లాదుఁడు, నారదుఁడు, అజుఁడు = బ్రహ్మ, సనత్కుమారుఁడు, ధర్ముఁడు, కపిలుఁడు, మరీచి + ఆదులు = మరీచి మొదలగువారు, అన్యపారవిదులు = ఇతరులగు తత్త్వవేత్తలు, సిద్ధపతులు, ఎవ్వనిమాయన్ = ఏ విష్ణుమాయను, మూల మిట్టిదనుచు = దాని మూల మిటువంటిదని, ఎఱుఁగలేము = తెలిసికొనలేకున్నా మో !, అట్టి = అంతటిశక్తిగల, నిఖిలనాథు = సమస్తమున కధిపతియైన పరమేశ్వరుని యొక్క, ఆయుధ శ్రేష్ఠంబున్ = శ్రేష్ఠమగు చక్రాయుధమును, తొలఁగఁజేయ = మాన్పుటకు, మాకు = మాకందఱకు, దుర్లభంబు = శక్యముకాదు.

వ్యా. వి :- విశ్వ + ఈశ్వరు = విశ్వేశ్వరు (గుణసంధి); చతుర్ + అస్య = చతురాస్య = నాలుగు మోములుగలవాఁడు (బహువ్రీహి); ఏ + వానిచే = ఎవ్వానిచే (త్రికసంధి); మరీచి + ఆదులు (యణాదేశసంధి).

34. ముని + ఇంద్రా = ఋషిశ్రేష్ఠుఁడా !, ఆ + మహాత్ముని = ఆ విష్ణుమూర్తిని; నిరాశుండై = ఆశ నశించినవాఁడై, వైకుంఠనగరము = విష్ణుమూర్తి యుండు నగరము.

35. ఆ వైకుంఠములోని = ఆ వైకుంఠ నగరములో, శర్మ + మణి + సౌధ + అగ్రంబుపై = బంగారముతోడను - మణులతోడను-నిర్మింపఁబడిన మేడ యొక్క-పై భాగమున, లచ్చి = లక్ష్మి, క్రేవన్ = ప్రక్క, నర్మ సంభాషణములన్ = పరిహాసముతోఁగూడిన మాటలతో, క్రీడించు = ఆడుకొను, దేవా + అధీశ్వరున్ = దేవతల కధినాథుఁడగు, పుణ్యున్-హరిన్ = పుణ్యాత్ముఁడగు-శ్రీమహావిష్ణువును, కాంచి = చూచి, ఓ వరద = వరముల నిచ్చువాఁడ !, దేవ + ఈశ = దేవతలకు ప్రభువైనవాఁడ !, భక్త-రక్షా-విద్యా-పరతంత్ర = భక్తులను-రక్షించుటయను-విద్యయందు-ఆసక్తిఁ గలవాఁడ !, చక్ర + అనలజ్వాలలన్ = నీ చక్రము యొక్కయగ్నిజ్వాలలను, మానుపఁగదే = పోగొట్టుమయ్యా !

తాత్ప :- వైకుంఠ నగరమున మణిసౌధాగ్రముపై లక్ష్మితోఁగూడి నర్మోక్తులఁ గ్రీడించు దేవాధీశ్వరుఁడగు మహావిష్ణువును గాంచి, ఓ వరద ! దేవేశ ! భక్తులను రక్షించు విద్యయందాసక్తి గలవాఁడ ! నీ చక్రానలజ్వాలల మాన్పుము.

విశే :- సౌధము(వ్యు)సుధానిర్మితము, సున్నముతోఁ గట్టఁబడినది (మేడ); లక్ష్మి (ప్ర)-లచ్చి (వి).

36. నీ మహిమార్ణవంబు తుదిన్ = నీ మహిమయను సముద్రముయొక్కయంతమును, నిక్కముగాన్ = నిజముగా, ఎఱుఁగంగలేక = తెలిసికొనలేక, నీ

ప్రేమకువచ్చు = నీదయకు పాత్రులైన, దాసులకు = భక్తులకు, క్రించుతవంబు నన్ = నీచమగు బుద్ధితో, ఎగ్గుచేసితిన్ = కీడుచేసితిని. నా మఱపున్ = నా యజ్ఞానమును, సహింపుము = క్షమింపుము. నారకుఁడైనన్ = నరకమును బొందు వాఁడైనను, మనంబులో = మనస్సులో, భవత్ + నామము = నీ పేరు, చింత చేసినన్ = స్మరించినచో, అనంతసుఖస్థితిన్ = గొప్ప సుఖమును, ఒందకుండునే = పొందకుండునా ?

తాత్ప : నీ మహిమ నెఱుఁగలేక, నీదయకుఁ బాత్రులగు నీభక్తులకు నీచ స్వభావముతో నపకారము చేసితిని. నా యజ్ఞానమును సహింపుము. మహాపాపినై అటు నరకమునకుఁ బోవువాఁడయినను, మనమున నీ నామము స్మరించినంతనే యనంత సుఖముల నొందును గదా !

37. పాద + కమలంబులకు = పాదములనెడి పద్మములకు, మ్రొక్కి = నమస్కరించి,

38. చలమునన్ = పట్టుదలతో, బుద్ధిమంతులగు = మంచిబుద్ధిగల, సాధులు = సత్పురుషులు, నా హృదయంబు = నా హృదయమును, లీలన్ = విలాసముగా, దొంగిలి = అపహరించి, కొనిపోవుచుందురు = తీసికొని పోవుచుందురు. అకిల్బిష = దోషరహితమైన, భక్తి లతాచయంబులన్ = భక్తియను తీఁగెల సమూహముచే, నిలువఁగబట్టి = కదలకుండ పట్టుకొని, నేరుపుతో = సామర్థ్యముతో, కట్టుదురు = కట్టివేయుదురు. తాపసా = ఓ దుర్వాసమహర్షీ !, మదకుంభికైవడిన్ = మదించిన యేనుఁగువలె, వలలకుఁజిక్కి = భక్తుల భక్తి పాశములలోఁ దగుల్కొని, వత్స లతన్ = వారిపై వాత్సల్యముతో, చనుచుందున్ = పోవుచుందును.

తాత్ప : పట్టుదలతో భక్తులు నాహృదయమును విలాసముగా దొంగిలించి తీసికొని పోవుచుందురు. దోషరహితమైన భక్తియను లతా సమూహములతో నిలబెట్టి నేర్పుతో నన్ను గట్టివేయుదురు. ఓ దుర్వాసా ! మదపుటేనుఁగు వలె వారి వలలలోఁజిక్కి భక్తజనులయందు వాత్సల్యముతో నుందును.

వి శే :- హృదయము(ప్ర)-ఎద(వి); భక్తిలతాచయంబులన్ (రూపకము); కుంభి (వ్యు) కుంభస్థలము కలది(ఏనుఁగు).

39. అదియునుఁగాక,

40. తనువు మనువు విడిచి = దేహరక్షణము విడిచి, తనయులన్ = కుమారులను, చుట్టాలన్ = చుట్టములను, ఆలిన్ = భార్యను, విడిచి, సంపదాలిన్ = ఐశ్వర్య సమూహమును, విడిచి, నన్నకాని = నన్నేకాని, అన్యమెన్నఁడున్ + ఎఱుఁగ

గని = ఇతర మెప్పుడును తెలియని, వారిన్ = నా భక్తులను, ఎట్టివారినైనన్ = ఏటువంటి వారినైనను, విడువన్ = విడిచిపెట్టను.

తాత్ప :- దేహముపై నాసవిడిచి, కుమారులను, బంధువులను, భార్యను విడిచి, ఐశ్వర్యములనువీడి, నన్నే నమ్మికొని యితర మెఱుంగని, భక్తులెట్టి వారైనను, వారిని విడువఁజాలను.

విశేషము :—

తనయులు (వ్యు) దేహమునుండి పుట్టినవారు (కుమారులు).

వ్యా. వి:- చుట్టము + లు. (సూ) లు-ల-నలు పరంబు లగునపు డొకా నొకచో ముగాగమంబునకు లోపంబును,దత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబును విభాష నగు- ఉదా॥ చుట్టాలు.

41. విప్రా = ఓ బ్రాహ్మణుఁడా !, సాధుల హృదయము నాయది = సత్పురుషుల హృదయము నాది. సాధుల హృదయంబు నేను = నేను సత్పురుషుల హృదయమును. జగముల నెల్లన్ = అన్ని లోకములయందు, సాధులన్ = సత్పురుషులను, నేను + అ = నేనే, ఎఱుంగుదు = తెలిసికొందును. సాధులు = సత్పురుషులు, నాదు చరితము = నాచరిత్ర, ఎఱుంగుదురు = తెలిసికొందురు.

తాత్ప :- దుర్వాసా ! సత్పురుషుల హృదయము నాది. నేను సత్పురుషుల హృదయము లందుందును. సాధుల హృదయము నేనెఱుఁగుదును. నా చరితమును సాధులెఱుఁగుదురు.

వ్యా. వి:- నా + అది = (సూ) అది, యది - శబ్దముల యత్తునకు వృత్తిని లోపంబు బహుళంబుగ నగు. ఉదా॥ నాది. లోపము రానిచో, యడాగమము = నాయది.

నా + చరితము = (సూ) నీ, నా, తన - శబ్దములకు నుత్తర పదంబు పరంబగునపుడు 'దు' గాగమంబగు. ఉదా॥ నాదు చరితము.

42. నా తేజము = నా తేజస్సు, సాధులలో = సత్పురుషులలో, ఆతతమై = విస్తారమై, ఉండును. వారిన్ = నా భక్తులను, అలఁచు = బాధించు, జనులకున్ = మానవులకు, హేతిక్రియ = ఖడ్గమువలె, భీతి నిచ్చున్ = భయమును గలిగించును, చేతోమోదంబున్ = మనస్సు నందానందమును, చెరచున్ = పోగొట్టును. సిద్ధము సుమీ = సత్యము సుమా !

తాత్ప :- నా తేజము సాధువులలో నుండును. నా భక్తులగువారిని బాధించి నచో నది ఖడ్గమువలె భయమును గలిగించును. హృదయమున కానందము లేకుండఁ జేయును. ఇది నిజము సుమా !

వ్యా. వి :- చేతస్ + మోదము = చేతోమోదము (అసంతపదసంధి)

43. బ్రాహ్మణ = ఓ బ్రాహ్మణుఁడా!, అదెపో = అదిగో పొమ్ము, నీకును, సదయుఁడు = దయతోఁగూడినవాఁడును, నాభాగసుతుఁడు = నాభాగుని కుమారుఁడు, జన-వినుత-గుణ-ఆస్పదుఁడు = జనులచేఁ - బొగడఁబడు - గుణములుగలవాఁడంబరీషుఁడు, అభయమిచ్చు = రక్షణ నిచ్చును. అతనిన్ = ఆ రాజును, మది సంతసపఱచి = మనస్సున కానందమును గలిగించి, శరణంబున్ - వేడుమీ = శరణు-వేడుకొనుము.

తాత్ప :- ఓ దుర్వాస ! అదిగో పొమ్ము. నీకు దయాస్వభావము కలవాఁడును, సత్పురుషులచేఁ బొగడఁబడు గుణములు కలవాఁడునునగు, నంబరీషుఁడభయమిచ్చును. అతని మనమును సంతసపఱచి శరణువేడుము.

44. అని,- శ్రీవల్లభుఁడు = లక్ష్మీపతి, అనతిచ్చిన = ఆజ్ఞాపింపఁగా, మహో + ఉద్యత్ + చక్ర + కీల + ఆవలీ + జనిత + ఆయాసుఁడు = మిక్కిలి గొప్పదియగు చక్రాయుధము యొక్క యగ్నిజ్వాలల సమూహముచేఁ గలిగిన ఆయాసము కలవాఁడు, నిర్వికాసుఁడు = కాంతిహీనుఁడు, ఉదిత + శ్వాసుఁడు = నిట్టూర్పులు పుట్టినవాఁడును, అగు, దుర్వాసుఁడు, అల్లన + ఏతెంచి = నెమ్మదిగావచ్చి, సుభక్తి = గొప్పభక్తితో, కరుణా + లావణ్య + వేషున్ = దయతోఁగూడిన మనోహరమగు వేషముకలవాఁడును, విదోషున్ = దోషములేనివాఁడును, నయ + ఉదారమనీషుఁడు = న్యాయ సమ్మతమైన ఔదార్యముతోఁ గూడినవాఁడును, అగు, అంబరీషున్, వెసన్ = శీఘ్రముగా, కాంచెన్ = చూచెను.

తాత్ప:- అని, లక్ష్మీపతియగు శ్రీమహావిష్ణు వానతిచ్చిన, మిక్కిలి గొప్పదియగు చక్రాగ్నిజ్వాలా సమూహము వలన గలిగిన ఆయాసము గలవాఁడును, కాంతిహీనుఁడును, నిట్టూర్పుల నిగిడించువాఁడును, అగు, దుర్వాసుఁడు మెల్లగా వచ్చి భక్తితో దయాస్వరూపుఁడును, దోషరహితుఁడును, న్యాయ సమ్మతమైన నౌదార్యముతోఁ గూడినవాఁడును, రమ్యముగను మితముగను మాట్లాడువాఁడును, అగు నంబరీషుని చూచెను.

విశే :- శ్రీ (ప్ర)-సిరి (వి)

వ్యా. వి:- మహా + ఉద్యత్ = మహోద్యత్ (గుణసంధి); కీల + ఆవలి = కీలావలి; జనిత + ఆయాసుఁడు = జనితాయాసుఁడు (స. దీ. సంధులు)

మితభాషున్ + అంబరీషున్ = మితభాషు నంబరీషున్ - కావలెను. కాని నన్నయగారి 'అన్నిష్టసఖ' వలె నయినది. ఇది పోతనగారి కిష్టమైన సంధి. 'సర్వము న్నతని దివ్య కళామయమంచు...' మొదలైనవి యీకవి ప్రయోగము లిట్టివే.

"ప్రత్యఙ్ఙాత్మా, సుగణ్ణీశః, సర్వస్మిన్నస్తి" - మున్నైన సంస్కృత సంధులను బట్టి తెలుఁగు కవులు కొందఱిట్లు సంధులు గూర్చినారు.

45. కని = చూచి, దుఃఖితుండై = దుఃఖించువాఁడై, ఆ + మహీవల్లభున్ = ఆ భూభర్తయగు నంబరీషుని; ఆ నరేంద్రచంద్రుఁడు = ఆ రాజశ్రేష్ఠుఁడు, చరణ + స్పర్శంబునకు = పాదముల నంటినందులకు, ఓడుచు = బాధపడుచు, కరుణా + రస + భరిత + హృదయుండయి = దయారసముతోఁగూడిన హృదయము గల వాఁడై, స్తుతించె = స్తోత్రము చేసెను.

**విశేషము :-**

నరేంద్రుఁడు (నానా)రాజు, పాములవాఁడు.

వ్యా. వి:- ఆ + మహీవల్లభుఁడు = అమ్మహీవల్లభుఁడు (త్రికసంధి); నర + ఇంద్రుఁడు = నరేంద్రుఁడు (గుణసంధి)

46. నీవ = నీవే, పావకుఁడవు = అగ్నివి; నింగి = ఆకాశము, సమీరము = గాలి, నికరము = సమూహము, లోక + ఈశులు = లోకాధిపతులు, యజ్ఞభోజి = యజ్ఞఫలమును భుజించువాఁడు, నీరజాక్షుఁడు = విష్ణువు, మన్నించునట్టి = గౌరవించునట్టి, శస్త్రముఖ్యము = శ్రేష్ఠమైన చక్రము.

**విశేషము :—**

పావకుఁడు (వ్యు) పవిత్రము జేయువాఁడు (అగ్ని); సమీరము = సమ్ + ఈరము (వ్యు) బాగుగా వీఁచునది (గాలి); నీరజము (వ్యు) నీటినుండి పుట్టినది (పద్మము); నీరజాక్షుఁడు (వ్యు) నీటినుండి పుట్టిన పద్మమువంటి నేత్రములు గల వాఁడు (విష్ణువు); శస్త్రము (వ్యు) హింసించునది.

సత్యము (ప్ర) - సత్తెము (వి); యజ్ఞము (ప్ర) - జన్నము (వి); ఫలము (ప్ర) - పండు (వి).

47. చక్రమా!, నీయుద్ధంబులన్ = నీవు యుద్ధము చేయునప్పుడు, హరిచే = విష్ణువుచే, నీవు, విసృష్టమైచనఁగ = ప్రయోగింపఁబడఁగా, నీ ధారలన్ = నీ పదములను, మున్నాలించి = ముందుగా విని, ధరణిన్ = భూమియందు, వ్రాలుట = పడుట, నిక్కమంచు = నిజమని, మునుచే = ముందే, దైత్య + ఈశ్వర +

వ్రాతము = రాక్షసరాజ సమూహములు, శిరముల్ = తలలు, పాదములున్ = కాళ్లు, భుజా + యుగళముల్ = చేతుల జంటలు, ఛేదిల్లి = తెగి, అంగంబులు = మొండెములు, అప్డు = ఆ సమయమునందు, ఒరఁగన్ = క్రిందపడఁగా, ప్రాణ సమీరముల్ = ప్రాణవాయువులు, వదలు = విడిచిపోవును.

తాత్ప :- ఓ చక్రమా ! యుద్ధములందు నీవు శ్రీమహావిష్ణువుచే విడువఁబడి పోవుచుండఁగా, నీ శక్తి పూర్వము విని భూమిపైఁబడుట నిజమని నిశ్చయించి, ముందుగానే రాక్షస రాజశ్రేష్ఠులు, తలలు, పాదములు, బాహువులు తెగి దేహము నేలపైఁబడఁగా వారి ప్రాణవాయువు లెగిరిపోవును.

విశేషము :—

ధార (నానా) కత్తిపదను, జలధార; దైత్యులు (వ్యు) దితి సంతతివారు (రాక్షసులు);

వ్యా. వి :-మున్ను + అలించి (ఉత్వసంధి); దైత్య + ఈశ్వర (గుణసంధి)

48. కలఁగి = కలతఁజెంది, నిద్ర + పోవన్ = నిద్రపోఁగా, కలలోన వచ్చిన నిన్నుఁజూచి = కలలోఁగన్పించిన నిన్నుఁజూచి, అసురవరులు = రాక్షస శ్రేష్ఠులు, శయ్యలందున్న సతులు = తమ ప్రక్కలపైనున్న భార్యలు, ప్రభాతమందు + అ = ప్రాతఃకాలమునందే, లేచి = నిద్రమేల్కొని, పలువరింప = దుఃఖింపఁగా (దుఃఖించు నట్లుగా), దీర్ఘనిద్ర + పోదురు = శాశ్వతమైన నిద్ర పోయెదరు (మరణింతురు).

తాత్ప:- కలతఁజెంది నిద్రపోయిన, కలలో గన్పించిన నిన్నుజూచి యో చక్రమా ! ప్రక్కలయందున్న భార్యలు ప్రాతఃకాలమున నిద్రమేల్కొని దుఃఖించు నట్లుగ, రాక్షసవీరులు చచ్చిపోవుదురు. నీవన్న రాక్షసులకంత భీతి సుమా !

విశేషము:-

శయ్య (ప్ర)- సెజ్జ (వి).

49. నీ రుచులు = నీ కాంతులు, చెల్వుగ = రమ్యముగ, ధర్మసమేతలై = ధర్మముతోఁగూడినవై, చీఁకటిఁబాపుచున్ = చీఁకటిని పోగొట్టుచు (అజ్ఞానమును పోగొట్టుచు), వెలుఁగు సేయుచు = కాంతిని గలుగఁజేయుచు (జ్ఞానమును కలుగఁజేయుచు), సజ్జనకోటి నెల్ల = సత్పురుషుల నందఱిని, సుశ్రీకులన్ = మంగళప్రదమైన వారినిగా, చేయున్ = చేయును. నిను = నిన్ను, వాకున = మాటలతో, ఇట్టిదట్టిదని = ఇంత అంతయని, వర్ణన సేయ = వచింప, విధాత = బ్రహ్మ, నేరఁడు = శక్తుఁడుగాఁడు. నీదు రూపు = నీరూపము, అస్తోకము = గొప్పది. పరాత్పరా

ద్యమై = పరాత్పరునితో సమానమై, కలదున్ = ఉన్నది. తుదిలేదు = అంతము లేదు.

తాత్ప :- ఓ చక్రమా ! నీకాంతులు రమ్యములైనవై:ధర్మసమేతలై, అజ్ఞానమును(చీఁకటిని)తొలఁగించుచు,జ్ఞానమును(వెలుఁగు)కలుగఁజేయుచు,సత్పురుషుల నెల్ల సుశ్రీకుల జేయుచుండును. నీ శక్తి యింతంతయని వాకొన నలుమోములుగల యా బ్రహ్మకైన నలవిగాదు. నీ రూపము గొప్పది. పరాత్పరునితో సమమై యున్నది. అంతము లేనిది.

విశేషము :—

కోటి (నానా) అంచు, బాణపు కొన, నూఱు లక్షలు (సంఖ్యావాచకము); రుచి (నానా)కాంతి, తీపి-పులుపు మొదలగు రుచులు, కిరణము.

'కలదు, చూడరు' మున్నగువానికి, 'కలదున్, చూడరున్' వంటి పూర్వ కవి ప్రయోగములు సకృత్తుగ నున్నవి.

ఛందస్సు:-ఉత్పలమాల. దీని ప్రతిపాదమునందును భ-ర-న-భ-భ-ర-లగ-గణము లుండవలయును.ప్రతిపాదము నందును పాదముయొక్క మొదటి యక్షరమునకును, ఆ పాదములోని 10వ యక్షరమునకును యతి మైత్రిచెల్లును. ప్రాస నియమము కలదు. ప్రాసయతి వాడకూడదు.

పద్యముల మార్పు :-

ఉత్పలమాల పద్యమునందు పాదము మొదటిలోగల గురువును దీసి రెండు లఘువులు చేర్చిన చంపకమాల పాదమగును.

50. కమల లోచనుండు = పద్మములవంటి నేత్రములుగల విష్ణువు, ఖలులన్ = దుర్మార్గులను, శిక్షింపగన్ = శిక్షించుటకు, పాలుసేయ = పంపఁగా, నీవు, పాలుపడితి = ఈ పనికి పూనుకొంటివి. ఐనన్ = అయినప్పటికి, ఇంకన్ + చాలు = ఇఁక చాలును ; ఈవు = నీవు. ధర్మవృత్తిన్ = ధర్మమార్గముతో, ఆపన్నుఁడై యున్న = ఆపదలోనుండి శరణుఁజొచ్చిన, తపసిన్ = మునిని (దుర్వాసుని), కావుము = రక్షింపుము.

తాత్ప:- శ్రీ మహావిష్ణువు, దుర్మార్గులను శిక్షించుటకై నిన్ను నియోగింపఁగ, నీవు పాలు పడితివి. ఐనను నింక చాలును. నీవు ధర్మమార్గమున, ఆపదలో నుండి శరణు వేఁడిన దుర్వాసుని, రక్షింపుము.

విశేషము :-

కమలలోచనుండు = బహువ్రీహి సమాసము.

51. వినుతించి = స్తోత్రముచేసి, చేదమ్మి + దోయి = పద్మములవంటి చేతుల జంట, నొసలన్ + పొసంగించి = నొసటియందుంచి.

వ్యా. వి:- చేయి + తమ్మి = ప్రాంతాది సూత్రముచే లోపము - చే + తమ్మి. పిదప ను గాగమము - చే + ను + తమ్మి - పిమ్మట ద్రుత కార్యములు - చేఁదమ్మి (పూర్ణబిందు రూపముండదు.)

52. ఇంద్ర + శాత్రవ = ఇంద్రుని శత్రువులైన రాక్షసులయెడ, ధూమకేతువునకు = తోఁకచుక్కవంటిదియు, ధర్మసేతువునకు = ధర్మమునకు వారధి వంటిదియు, విమలరూపమునకు = స్వచ్ఛమైన రూపముగలదియు, విశ్వదీపమునకు = ప్రపంచమునకు వెలుఁగు నిచ్చునదియు, గుప్త శక్రమునకు = ఇంద్రుని రక్షించునదియు నగు, చక్రమునకు, ఏన్ = నేను, నమస్కరింతున్ = మ్రొక్కెదను.

తాత్ప :- ఇంద్రుని శత్రువులగు రాక్షసులకు నాశనహేతువగు (ధూమకేతువు) తోఁకచుక్కవంటిదియు, ధర్మమునకు సేతువువంటిదియు, స్వచ్ఛమైన రూపము గలదియు, ప్రపంచమునకు వెలుఁగు నిచ్చునదియు, ఇంద్రుని రక్షించునదియు నగు చక్రమునకు నేను నమస్కరించెదను. (తోఁకచుక్క కీడును సూచించు నొక యుత్పాతము).

53. అని, మఱియు నిట్లనియె.

54. అఖిల-గుణాశ్రయుఁడగు = సమస్తమైన-సద్గుణములకు నిలయమైన, హరి = విష్ణువు, నా కొలువువలనన్ = నా సేవవలన, సుఖియై = సుఖముగలవాఁడై, చొక్కెడినేనిన్ = సంతోషించువాఁడైనచో, భూమి సురుఁడు = బ్రాహ్మణుఁడగు దుర్వాసుఁడు, ఇవ్వేళన్ = ఈ సమయమున, నిఖిలాత్మ మయ్యుండగుటకు = సర్వాంతర్యామి యగుటకు, సుఖమందుంగాక = సుఖమును బొందుగాక !

తాత్ప :- సమస్త సద్గుణముల కాశ్రయుండగు శ్రీమహావిష్ణువు, నా సేవ వలన సుఖియై యానందముతో నుండుచో, సర్వాంతర్యామియై యుండుటవలన నీ బ్రాహ్మణుఁడగు దుర్వాసుఁడీ సమయమున సుఖమును బొందుగాక ! (విశ్వరూపుఁడు సుఖించిన విశ్వమెల్ల సుఖించునుగదా ! విశ్వములోని భాగమగు ఈ ముని తప్పక సుఖించునని భావము).

55. పుడమిఱేడు = రాజు, మన్నించి = క్షమించి, దాహంబు = కాల్చుట, రక్కసుల గొంగ = రాక్షసుల శత్రువు(శ్రీమహావిష్ణువు). మేలిమాటలు = మంచి మాటలు.

56. నరనాథ + ఉత్తమ = ఓ రాజశ్రేష్ఠుఁడా !, నా తప్పు మన్నించి = నా తప్పును క్షమించి, మేలుచేసితిగదా = మేలు కలిగించితివిగదా !, శ్రీహరి పాదాబ్జములు = శ్రీమహావిష్ణు పాదపద్మములు, ఇంతముట్ట = ఇంతగొప్పగా, కొలుతే = సేవించెదవా ?, ఆశ్చర్యము + ఔన్ = అది వింతయగుచున్నది. ఎన్నుచోన్ = లెక్కించుచో, అరుదు + అంద్రు + ఎ = తక్కువయని యందురు. నినుబోటి సాధులకు = నీవంటి సత్పురుషులకు, తాన్నై = తమంతట తామే, ఇచ్చుటల్ = దానము చేయుటయును, కాచుటల్ = రక్షించుటయును, సైజములై = స్వాభావికములై, మిత్త్రాకృతిన్ = మిత్త్రునివలె, సరసవచ్చున్ + గాదె = వెంటనంటి వచ్చు చుండునుగదా !

తాత్ప :- మహారాజ ! నా తప్పును మన్నించి నాకు మేలుచేసితివి. శ్రీహరి పాదపద్మముల నింత యధికముగా సేవించు చుంటివి. ఆశ్చర్యమగుచున్నది. ఆలోచించుచో, నీవంటివారు చాల తక్కువయుందురు. నీవంటి మహాత్ములకు, యాచింపకయే దానము చేయుట, రక్షించుట, అనునవి సహజగుణములై మిత్త్రునివలె వెంటనంటి యుండునుగదా !

విశేషము :-

ఆశ్చర్యము (ప్ర) - అచ్చెరువు (వి)

వ్యా. వి:- మేలు + చేసితి (గసడదవాదేశసంధి); మిత్త్ర + ఆకృతి (సవర్ణ దీర్ఘ సంధి).

57. అదియునుంగాక = మఱియు,

వ్యా. వి:- సూ॥ కొన్ని యెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి. అదియును + న్ + కాక. పిదప ద్రుతకార్యములు - అదియునుంగాక.

58. రాజ + అగ్రణి = రాజశ్రేష్ఠుఁడా!, ఒకమాటు = ఒక పర్యాయము, ఎవ్వనిపేరు = ఏ పరమాత్మపేరు, కర్ణములలోన్ = చెవులలో, ఒయ్యారమై = ఒయ్యారముగా, సోఁకినన్ = ప్రవేశించి నప్పటికిని, సకలాఘంబులు = సమస్తమైన పాపములు, పల్లటిల్లి తొలఁగున్ = కదలి తొలఁగిపోవును. అట్టి = అటువంటి, సత్ + సుకరున్ = సజ్జనులకు లభించునట్టియు, మంగళ తీర్థపాదు = మంగళప్రదమైన పాదములు గలట్టియు, విష్ణున్ = సర్వాంతర్యామి యైనట్టియు, దేవదేవేశున్ =

దేవతలకెల్ల రాజైన ఇంద్రునే శాసించువాఁడైన, హరిన్ = విష్ణువును, తాన్ = తాను, అకలంకస్థితిన్ = నిర్మలమైన విధానముతో, కొల్చు = సేవించు, భక్తులకు, అడ్డంబులేదు = అడ్డులేదు.

తాత్ప:- ఒక్కమారు శ్రీకృష్ణపరమాత్మ నామము విలాసముగా చెవులలోఁ బ్రవేశించినచో, సమస్తమైన పాపములు తొలఁగిపోవును. అట్టి మంగళనామముఁ డగు శ్రీవిష్ణువును నిష్కల్మష భక్తితోఁ గొలుచు భక్తుల కేలోపములేదు.

వ్యా. వి:- దేవదేవ + ఈశుఁడు(గుణసంధి); రాజ + అగ్రణీ (స. దీ. సంధి).

59. భూవరా = రాజ !, తప్పులోఁగొని = తప్పును క్షమించి, చక్రపావక దాహమున్ = చక్రాగ్నితాపమును, పెడబాపితి = పోఁగొట్టితివి. ఔన్ = ఔను. భవద్దయారసము = నీ దయాస్వభావము, ఒప్పున్ + ఒప్పున్ = చాల తగియున్నది. ఓ నరేశ్వర = ఓ రాజ !, ప్రాణముల్ = నా ప్రాణములు, మున్మును = ముందుగా, పోయి, క్రమ్మఱఁ జేరెన్ = తిరిగి చేరుకొని నట్లైనవి. ధన్యుఁడనైతిని, ఏను = నేను, నీకెప్పుడున్ = నీకు సర్వకాలములయందును, శుభము గోరెద = మేలు ఆసింతును. ఇంకన్ = ఇఁక, పోయెద = వెడలెదను.

తాత్ప:- ఓ రాజ ! నా తప్పు మన్నించి చక్రాగ్నితాపమును పోఁగొట్టితివి. నీ దయారసము చాలఁ దగియున్నది. ఓరాజ ! నా ప్రాణములు, ముందు పోయి నట్లై తిరిగి నన్ను జేరుకొన్నవి. ధన్యుఁడనైతిని. నీకు నేనెప్పుడును మేలు కోరు చుందును. ఇంకఁ బోయివచ్చెదను.

ఛందస్సు:- మత్తకోకిల. ఈ పద్యమునకు నాలుగుపాదములు సమానముగా నుండును. ప్రతిపాదమునందును వరుసగా, ర-స-జ-జ-భ-ర-గణము లుండవల యును. ప్రతి పాదమునందును పాదముయొక్క మొదటి యక్షరమునకు, నా పాదములోని 11వ యక్షరమునకు యతిమైత్రి చెల్లును. ప్రాస నియమము కలదు. ప్రాసయతి వాడకూడదు.

గమనిక :—

ఛందస్సున కీ వృత్తము చాల ముఖ్యము.

60. అనినన్ విని = అని దుర్వాసుఁడు చెప్పఁగా విని, రాజ + ముఖ్యుఁడు = రాజ శ్రేష్ఠుఁడగు నంబరీషుఁడు, మునివల్లభు పాదములకు = ముని శ్రేష్ఠుని పాద ములకు, మ్రొక్కి = నమస్కరించి, కడున్ మన్ననచేసి = మిక్కిలి గౌరవించి, ఇష్టభోజనము = ఇష్టమైన భోజనము, అనువుఁగన్ = తృప్తియగునట్లుగా, పెట్టించె = పెట్టించెను. అతండున్ = ఆ దుర్వాసుఁడును, తృప్తుఁడయ్యెన్ = తృప్తి జెందెను.

తాత్ప:- దుర్వాసుఁ డావిధముగాఁ బలుక, విని యంబరీషుఁడు, దుర్వాసు పాదములకు మ్రొక్కి మిక్కిలి గౌరవించి, యిష్టభోజన మనువుగఁ బెట్టించెను. ఆ దుర్వాసుఁడును తృప్తుఁడయ్యెను. (ఇందు అంబరీషుని వినయ సంపద, సచ్ఛీలము గోచరించుచున్నది.)

విశేషము :-

ముఖ్యుఁడు (నానా) ప్రధానుఁడు, శ్రేష్ఠుఁడు.

61. మఱియు, ఆ + మునీంద్రుఁడు = అమ్మునీంద్రుఁడు (త్రిక సంధి)

62. నరేంద్రాగ్రణీ = రాజశ్రేష్ఠుఁడా!, నేఁటికి = ఈ రోజునకు, నిన్నున్, కంటిని = చూచితిని. నీ వచనముల్ = నీ మాటలు, కర్ణద్వయిన్ ప్రీతిగా = రెండు చెవులకు నింపుగా, వింటిన్ = వినియుంటిని. నీ గృహమునన్ = నీ యింటియందు, అన్నము గొంటిన్ = భుజించితిని. నేను మంటిన్ = నేను బ్రతికితిని. పోయెదన్ = వెడలెదను. నీ చరిత్రము = నీ కథ, అమరుల్ = దేవతలు, మర్త్యుల్ = మానవులు, సుఖాసీనులై = సుఖముగాఁ గూర్చుండి, మింటన్ = ఆకసమందు, మేదినిన్ = భూమి మీఁదను, ఇఁక మీఁదన్ = ఇఁక ముందు, నుతింపఁగలరు = స్తోత్రము చేయఁ గలరు.

తాత్ప:- మహారాజ! ఈ నాఁటికి నిన్నుఁ జూడఁగల్గితిని. చెవుల కింపుగా, నీ మాటలను వినఁగల్గితిని. నీ గృహమున భోజనము చేసితిని. కృతార్థుఁడనైతిని. ఇఁకఁ బోయివచ్చెద. నీ చరిత్ర యాకసమునందు దేవతలును, భూమిపై మానవులును సుఖాసీనులై యిఁకముందు స్తోత్రము చేయఁగలరు. (సత్పురుషుని తోడి సల్లాపము, వాని కతిథి యౌటయుఁ గృతార్థత్వమునకు హేతువులుగదా!)

విశేషము:-

అమరులు (వ్యు) చావులేనివారు = దేవతలు.

వ్యా. వి:- సుఖ + ఆసీనులు (స. దీ. సంధి); నర + ఇంద్ర (గుణసంధి); నరేంద్ర + అగ్రణీ (స. దీ. సంధి).

63. దీవించి = ఆశీర్వదించి, కీర్తించి = పొగిడి, మింటితెరువున = ఆకాశ మార్గమున, మగుడన్ + చను = తిరిగివెళ్ళు, పరిపూర్ణంబయ్యె = పూర్తియయ్యెను.

64. అవనిసురుఁడు = బ్రాహ్మణుఁడగు దుర్వాసుఁడు, కుడువన్ = తినఁగా, అతి + పవిత్రంబైన = మిక్కిలి పవిత్రమైన, వంటకము = వండిన పదార్థములు, భూమివరుఁడు = భూభర్తయగు నంబరీషుఁడు, కుడిచెన్ = భుజించెను. వెగులు = బాధ, హరి కృపామహత్త్వము = శ్రీహరి దయామహిమ.

తాత్ప:- దుర్వాసుని బాధ మాన్ప నేనెంతటివాఁడను. అది శ్రీహరి దయా: మహత్త్వమేయని, యనుకొనుచు, బ్రాహ్మణుఁడగు దుర్వాసుఁడు భుజింపఁగా మిగిలినట్టియుఁ, బవిత్రమైనట్టియుఁ, బదార్థముల, నంబరీష మహారాజు భుజించెను. (అతిథిశేషము యజ్ఞశేషము వంటిది. పరను పవిత్రమైన యట్టి ప్రసాదము నంబరీషుఁడు భుజించె ననుట యా భక్తాగ్రగణ్యుని శీలమున కెంతయుఁ దగియున్నది.)

విశేషము:-

అవనిసురుఁడు (వ్యు) భూమిపై దేవతవంటి వాఁడు(బ్రాహ్మణుఁడు); భూమివరుఁడు (వ్యు) భూమికి భర్త (రాజు).

---

## ప్రశ్నోత్తరములు

1. అంబరీషుని ద్వాదశీవ్రతచర్య నభివర్ణింపుఁడు:-

అంబరీషుఁడు సప్తద్వీప విశాలమైన భూమికిఁ బరిపాలకుఁడు; సంపచ్చాతుర్యమును గలవాఁడు. ఇతఁడు నిత్యమును వైష్ణవార్చనలచేఁ గాలముఁ బుచ్చుచుండెను. అన్నివిధముల నితఁడు సద్గుణ గరిష్ఠుఁడని ప్రశస్తి.

అంబరీషుని చిత్తమెప్పుడును శ్రీమహావిష్ణుని పాదముల యందే నిలచును; పలుకులు హరిగుణ పఠనమందే తగిలి యుండును; మఱియు నీతని చేతులు విష్ణు మందిరముల సమ్మార్జనము నందును, చెవులు మాధవుని కథాశ్రవణమునందును, చూపులు గోవిందుని రూపమును జూచుట యందును, శిరము కేశవునకు నమస్కరించుటయందును, బదములు విష్ణ్వాలయమునకు నడచుట యందును, కోర్కులు చక్రి పరిచర్యలయందును, ఆసక్తి వైష్ణవ భక్తుల శరీర సంగము నందును, ఘ్రాణము విష్ణుపాద పద్మమునందును, రసన తులసీదళముల సేవయందును, ననురాగము పుణ్యవంతమైన సంగతుల యందే నిమగ్నమై యుండెడిది.

మఱియు నా మహీవిభుఁడు ఘనమైన వైభవముతో నజ్ఞాఘుని గూర్చి వసిష్ఠాదుల సాహాయ్యమున, సరస్వతీ నదీతీరమునఁ బెక్కు నశ్వమేధముల నిర్వర్తించి, గణుతింపరాని దక్షిణలు పెట్టెను. మట్టిగడ్డయు బంగారమును గూడ సమములే యన్న దృష్టిగల యారాజు సర్వకర్మలను హరిపరములుగాఁ జేయుచు భూమి నేలినాఁడు. విష్ణుభక్తులయందును విష్ణుదేవుని యందును మనసు లంకె పెట్టి

యుండియు, స్వధర్మమగు రాజ్యపాలనము వీడక యుండుటచే నాయంబరీషునకు రాచతపసి యనెడి పేరుగూడ కలిగినది.

అతఁడేదియేని సంకల్పించు నపుడుగాని, యెవరినేని దర్శించునపుడు గాని, హరినామస్మరణ చేయక మానలేఁడు.

ఇట్లుఁ బుణ్యచిత్తుఁడు, నీశ్వరాయత్త సర్వకర్ముఁడునై యధిక రాజ్యము చేయుచున్న కారణమున నారాజవరేణ్యునకు కరుల యందును,హరుల యందును, కోర్కెలుడిగినవి. ధనములుఁ గేళివనములును, బుత్త్రి బంధుమిత్త్రులను, బురములు నంతిపురములును గూడ నాకర్షణీయములై తోఁచెడివిగావు.

పోనుపోను సంసారము వలని తగులమును విడిచి నిర్మలుఁడై యేకాంతమున భక్తి పరవశుఁడై యుండఁగా, విష్ణుదేవుఁడా రాచతపసికిఁ బ్రత్యక్షమై శత్రువులను శిక్షించునదియు, స్వజనమును రక్షించునదియు నగు చక్రాయుధము నొసఁగి దీవించి యంతర్హితుఁడయ్యెను.

తనకుఁ దోడునీడయై యనురూప గుణములు గలదైన తన సతితో నారాజు ద్వాదశీవ్రత మొక సంవత్సరకాలము హరినిగూర్చి నిర్వర్తించినాఁడు. వ్రతానంతరము కార్తీక మాసమున మూఁడు రాత్రు లుపవసించి, కాళిందీ జలములలో స్నానమాచరించి, మధువనమునందు మహాభిషేక విధానమునకు విహితమైన పరికరములచేత సంపన్నుఁడై, శ్రీహరినిఁగూర్చి యభిషేకము చేసి, మనోహరమగు గంధాక్షతలు సమర్పించి, క్రొంగ్రొత్త సువాసనలు గల పుష్పసముదాయముచేఁ బూజలు సలిపెను.

పిమ్మట, లేఁతవయస్సు గలిగి, రూపసంపదచే మనోహరములై, సాధువులై, వెండి గొరిజలు, బంగారు తొడుగుతోడి కొమ్ములును గలవై, దూడల మెడలు నాకుచు, పాలు చేపునకువచ్చి యేఱులై ప్రవహించునట్టి యావుల మందల నసంఖ్యాకములైన వాని నారాజు వైదికశ్రేష్ఠులకు దానముగా నిచ్చెను.

ఇట్లు దానాదికము ముగించి, బ్రాహ్మణోత్తములకు నతిభక్తితో నిష్టమృష్టాన్నములచే సంతుష్టిఁగొల్పి తానును బారణ చేయ నుద్యోగించుచుండఁగా, నారాజును జూడ దుర్వాసమహర్షి యేతెంచెను. అంబరీషుఁ డాతనిని బూజించి భుజింపుమని వేడుకొనఁగా, అతఁడంగీకరించి కాళిందికి స్నానార్థమై పోయి చాల కాల మాలసించినాఁడు.

ఇంతలో ద్వాదశి ఘటికలు పోఁజొచ్చినవి. రాజున కేమియుఁ దోఁచలేదు. బుధుల యనుమతిని సలిల భక్షణముచేసి వ్రతము భంగము గాకుండఁ గాపాడు

కొనినాఁడు. ఇది యూహించిన దుర్వాసుఁడు రాజు తన్నవమానించెనని భావించి కృత్యనొకదానిని సృజించి రాజును బీడించుటకై కవ్వించెను.

ఇది యెఱిఁగిన శ్రీమహావిష్ణువు తన భక్తుఁడైన రాచతపసిని రక్షించుకొనఁ దన చక్రమును బంపెను. అది మునిని వెన్నాడఁగా నతఁడు బ్రహ్మను, శివుని, విష్ణునిగూడ శరణువేడియు దాని బారినుండి తప్పించుకొనలేక యెట్టకేలకు విష్ణుని బోధచే నంబరీషునే శరణు జొచ్చెను.

దయామయుఁడైన యంబరీషుఁడా చక్రమును స్తుతింప నది యుపశమించినది. పిమ్మట భయము తీరఁగా, దుర్వాసుఁడు రాజు నభినందించి, దీవించి, సోత్రముచేసి వీడ్కొనెను.

వినమ్రుఁడైన యంబరీషుఁ డది యంతయుఁ దన ప్రజ్ఞ కాదనియుఁ, దపసి యొక్క యార్తిఁ దీర్చినది హరి కృపామహత్త్వమనియు, విశ్వసించి, దుర్వాస మునీంద్రుని భుక్తశేషమును భుజించి, తన వ్రతమునకుఁ బారణ ముగించెను.

2. దుర్వాసుని దురహంకారము, దాని పరిణామమును వివరించునది.

యమునానదిలో స్నానము ముగించి వచ్చి యంబరీష రాజర్షిచే దుర్వాస మునీంద్రుఁడు సేవింపఁబడెను. రాజు వ్రతభంగమునకు భయపడి నీరపారణము చేయుట, బ్రాహ్మణాతిక్రమణ గర్వమని యపోహనొంది దుర్వాసుఁ డుగ్రుఁ డయ్యెను. మొగమునఁ గనుబొమలు ముడి వడినవి; మేను అదరినది. ఆగ్రహమును రెట్టించి యాకలి కొట్టు మిట్టాడఁజొచ్చెను.

భరింపరాని కోపాగ్రహముచే దుర్వాసుఁడు చిత్తశాంతిఁ గోల్పోయి యంబరీషుని సంపదున్మత్తుఁడనియు, నృశంసుఁడనియు, దురహంకారియనియు, విష్ణుభక్తుఁడు గాఁడనియు, దూలనాఁడెను. తనతోడఁ గుడువ రమ్మని మునుముందుగాఁ గుడిచి కూర్చున్నాఁడనియు, నది ధర్మభంగమనియు, నట్టి రాజు దుష్కర్ముఁడనియు నిందించి, తానుఁ గోపింప నన్నిదిశల యందును మాన్పెడివాఁడు లేడని బెదరించెను.

అతని కోపాటోపము పట్టరానిదయ్యెను. పండ్లు పటపటలాడినవి. భీకరుఁడై కడకండ్ల నిప్పులు పొటపొట రాల్చినాఁడు. చెక్కిళ్లు పొంగునట్లు హుంకరించెను. అంతటఁ దన తలనుండి యొక జడ పెరికి దానితో కృత్యను నిర్మించి రాజుపై కవింపఁగా, నది తన చేత కత్తిని దిరదిరఁ ద్రిప్పుకొనుచు వచ్చుచుండెను.

దాని వెలుఁగు ప్రళయ కాలాగ్నితో సమానమైనది. దాని చేతనొక శూలము గూడ గలదు. సుఱసుఱ స్రుక్కునట్లుగా నది తన పాదములచే నేలను ద్రొక్కుచు, మహారాజును సమీపించినది.

విశ్వరూపుఁడైన హరి, యీ ప్రకారమంతయు నెఱిఁగి వెఱ్ఱితపసి చేయు నాగడమును మాన్పుటకై తన చక్రాయుధమును బంపెను. అదియుఁ బ్రళయ వహ్నివలె వచ్చి కృత్యను దహించి, దుర్వాసుని వెన్నాడినది. ఆ చక్రము బాఱి నుండి బ్రహ్మయు, శివుఁడును, విష్ణువుగూడ నా బ్రాహ్మణుని రక్షింపలేకపోయిరి. ఎట్టకేలకు విష్ణుని బోధనుబట్టి దుర్వాసుఁడా యంబరీషునే శరణుఁజొచ్చెను. అంతట నారాజు విష్ణు చక్రమును స్తోత్రముచేసి దాని బారినుండి బ్రాహ్మణుని కాపాడ గల్గినాఁడు.

మునీశ్వరుఁడు తన దురహంకారమునకుఁ బశ్చాత్తప్తుఁడై రాజునెడఁ జాల సంతసించి, వానినిఁ బొగడి దీవింపఁగా, నతఁడు నీతనిని నిష్టాన్నాదులచే సంతుష్టునిఁజేసి వీడ్కొల్పెను.

శి. బ్రహ్మయు శివుఁడును దుర్వాసున కేమనిరి ? [లేదా, శ్రీవిష్ణుని మహిమను వారిని బట్టి వర్ణింపుము.]

విశ్వరూపుఁడగు హరి వెఱ్ఱి తపసి చేయు మాయమర్మములను జక్కఁబెట్టు మనుచుఁ దన చక్రమును బంప నదియుఁ బ్రళయాగ్నివలె వచ్చి మునిచేసిన కృత్యను దహించి, మునిని నానాలోకములకు వెంటనంటి తరిమెను. చక్రమును నివారించి దాని కీలలనుండి తప్పింపుమని దుర్వాసమహాముని తొలుత బ్రహ్మదేవు నర్థింపఁగా, నాతఁడిట్లనెను. "కాలస్వరూపుఁడై ద్విపదార్థ సంజ్ఞగల యీకాలమును, లోకములు మున్నగు వాని నెవ్వఁడు సృజించెనో, తిరిగి తన కోపాగ్నిచే నెవ్వఁడు వానిని లయ మొనరించునో, యట్టి మహావిష్ణువు చక్రాగ్నికీలల నెవ్వఁడాపఁగలడు ? నేనును, శివుఁడును, దక్షుఁడు, నింద్రాదులును, బ్రజాపతులు, భృగుఁడు, భూతపతులును శ్రీమహావిష్ణువు నాజ్ఞను లోకహితమని శిరమునఁ దాల్తుము. అందుచేత సుదర్శన చక్రమును నివారింప మా తరముగాదు."

ఇది విన్న దుర్వాసుఁడు కైలాసమునకుఁ జని శివుని దర్శించి, చక్రాయుధాగ్ని బాధను గూర్చి మొరలిడెను. దానికి శివుఁడు దుర్వాసునితో, "తండ్రీ ! వినుము; ఏ విశ్వేశ్వరునియందు జంతుకోటి జనించి నశించుచుండునో, యే విశ్వేశ్వరునిచే మేము భ్రాంతి నొందుచున్నామో, యే విశ్వేశ్వరుని మాయకు మూలము నెల్ల వారలము నెఱుఁగఁజాలకున్నామో, యట్టి యఖిలనాథుని యాయుధమును దొలఁగఁజేయుట మాకు దురశకము" అని పలికినాఁడు.

4. శ్రీ మహావిష్ణువు దుర్వాసున కేమనెను ? [లేదా, భక్తులయెడ విష్ణు దేవుని ప్రేమాదరము లెట్టివి ?]

వైకుంఠమునకు వచ్చి తన్ను దర్శించి స్తుతించిన దుర్వాసునితో శ్రీవల్లభుఁ డిట్లు పలికెను.

"తపసా ! బుద్ధిమంతులును, సాధువులు నగు భక్తులు పట్టుదలతో నాహృద యము నవలీలగా దొంగిలించుకొని పోవుచుందురు. పిమ్మట నిర్మలమైన భక్తిలత లతో వారు నన్ను బట్టి కట్టుదురు. నేనును వలలకుఁ జిక్కిన మత్తగజము వలె భక్తజన వత్సలత కధీనుఁడనై మెలఁగు చుందును.

మఱియు, విప్రా ! దేహమును, బ్రతుకు తెరవును, కొడుకును, జుట్టాలను, భార్యను, సమస్త సంపదలను విడిచి, నన్నుఁదప్ప నన్యమెఱుఁగని భక్తజన మెట్టి దైనను నేను దానిని విడనాడఁ జాలను.

సాధుల హృదయము నాది. సాధుల హృదయమే నేను. సమస్త జగముల యందును సాధువుల చరిత్ర నేనే యెఱుఁగుదును; నా చరిత్ర సాధువులే యెఱుఁ గుదురు.

నా తేజము సాధు జనములో నధికముగ నుండును. వారిని బాధించు జను లకు నా తేజము ఖడ్గమువలె భయంకరమై హృదయానందమును రూపువాపఁ గలదు.

ఓ బ్రాహ్మణా ! నాభాగసుతుఁడైన యంబరీష మహారాజు నీయందును దయామయుఁడు. అతఁడు సకల సుజన వినుత గుణాస్పదుఁడు. కావున నీ కభయ మిచ్చును. అతనిని నీవు సంతోషపెట్టి శరణు వేడికొనుము."

5. అంబరీషుఁడు విష్ణుచక్రము నెట్లు స్తుతించెను ?

"ఓ ఆయుధ శ్రేష్ఠమా! నీవే పృథ్వియు, జలమును, తేజమును, వాయువును, నాకాశమునై యున్నావు. నీవే భూతేంద్రియ నికరమవు, నీవే బ్రహ్మమును, సత్యమును, యజ్ఞమును, యజ్ఞ ఫలమును, లోకేశ్వరులును, సర్వాత్మయు, కాలము, జగమును, బహుయాగ భోజివియు, నిత్య మూలతేజమవును నగుటచేత నీకు నేను మ్రొక్కుచున్నాను. నీరజాక్షుఁడు మిక్కిలి మన్నించునట్టి శస్త్రిమవు నీవు. ఇంతటితో మన్నించి, మునిని కాపాడుము.

ఓ చక్రమా! నీవు యుద్ధములలో విష్ణువుచే విసరివేయఁబడి పోవుచుండఁగా నీ సవ్వడి నాలించి, నీ యంచులవలనఁ గూలుట నిక్కమని యెఱిఁగి, రాక్షసులు

తమ శిరస్సులు, పాదములు, భుజములును, మునుముందే త్రెయ్యఁగా ప్రాణములను విడుచుచుందురు గదా!

మఱియు చక్రమా! గలఁత నిద్దురలలో నగపడిన నిన్నుఁజూచి రాక్షసులు భీతిల్లి తెలవారుజాములయందు తమ శయ్యలపైఁ జూచుకొన్న తమతమ భార్యలు దుఃఖించునట్లుగా మరణించి యుందురు.

ఇంకను నీ కాంతులు చీఁకటిఁ బాపును; వెలుఁగు సేయును; సజ్జనుల నైశ్వర్యవంతులుగా నొనరింపఁ గలవు. అవి ధర్మసమేతలైనవి. నీ సామర్థ్యము నిట్టి దట్టి దని వాక్కుచే వర్ణింప బ్రహ్మయుఁ జాలఁడు. నీ రూప మస్తోకము. నీకు తుదియని లేదు. నీవు పరాత్పరుని కంటె నాద్యమై యుంటివి.

రాక్షస సంహారకమా! కమలలోచనుఁడైన శ్రీహరి దుర్మార్గులను శిక్షించుటకు నీవు తోడ్పడితివి. అయ్యును నీ మహిమ మింకఁ జూపకుము. బ్రాహ్మణుఁ డాపన్నుఁడై యున్నాఁడు. అట్టి తాపసునిఁ గాచుట నీకు ధర్మము.

ఇంద్రుని శత్రువులకుఁ దోఁకచుక్కవును, ధర్మమునకు సేతువవును, విమల రూపముగలదానవును, విశ్వమునకు దీపమవును, గుప్త శక్రమవును, నగునో చక్రమా! నీకు నమస్కారము".

ఇట్లుఁ బొగడు రాజును మన్నించి, యా చక్రాయుధము తపసిని దాహము నొందింపక తిరిగి చనెను.

౯. దుర్వాసుని కృతజ్ఞత వర్ణింపుము.

అంబరీషుని స్తోత్రమును మన్నించి విష్ణు చక్రము మునిని సంతాప పెట్టుట మానెను. అంత దుర్వాసుఁడు శాంతినొంది మెల్లని మేలిమాటలతో నారాజును దీవించి యిట్లనెను.

"నరనాథోత్తమా! నాతప్పు మన్నించి మేలు సేసితివి కదా! నీవు శ్రీహరి పాదపద్మముల నింతగా సేవింతువని యెఱుఁగను; ఆశ్చర్యమగుచున్నది. నీవంటి సాధువులకు దానమును రక్షణయును నైజగుణములై మిత్రరూపమున వచ్చును గదా!

అదియునుఁ గాక, యో రాజాగ్రణీ! యొక మా రెవ్వరి పేరు చెవులలో సోకినంతనే పాపములు పోవునో, అట్టి శ్రీహరిని నిష్కళంకమైన భక్తితోఁగొలుచు భక్తుల కెట్టి యాటంకములును రావు.

ఓ నరేశ్వరా! నాతప్పు మన్నించి చక్రాగ్నిజ్వాలలనుండి నన్ను సంరక్షించితివి. నీదయారసము పొగడఁదగియున్నది. ముందు, పోయిన నాప్రాణములు మఱల చేరుకొన్నవి. నేను ధన్యుఁడనైతిని. నీ కెప్పుడును శుభములగుఁ గాక !

నరేంద్రాగ్రణీ ! నే నిన్నినాళ్లకు నిన్నుఁ జూడఁ గంటిని. నీ వచనములను చెవుల కింపుగా వింటిని. నీ గృహమున నాతిథ్యము నొందితిని. నా కోర్కులు ఫలియించినవి. నేను తిరిగి బ్రతికినాఁడను. నాకు సెలవిమ్ము. నేఁటినుండి స్వర్గమున దేవతలును, భువిలో మానవులును సుఖాసీనులై నీ కీర్తి నుతింపఁ గలరు."

ఈ రీతిగ దుర్వాసుఁ డంబరీషుని దీవించి, కీర్తించి, యాకాశమార్గమున బ్రహ్మలోకమునకుఁ జనినాఁడు.

---

## పాత్రల శీలములు

### 1. అంబరీషుఁడు :

**ఉపోద్ఘాతము :—**

ధర్మ సత్యాది సుగుణములకుఁ బేర్వడిన నాభాగుని తనయుఁ డంబరీషుఁడు. ఇతఁడు సప్తద్వీపములచే విశాలమైన భూమిని పరిపాలించుచు శ్రీయుతుఁడై విష్ణు భక్తాగ్రణియైన రాజశ్రేష్ఠుఁడు.

**1. విష్ణు భక్తుఁడు :-**

మహీవిభవమును సంపచ్చాతురియుఁ గల్గి యంబరీష మహారాజు వైష్ణవార్చనలతోఁ గాలముఁ బుచ్చెడివాఁడు. అతఁడు సద్గుణ గరిష్ఠుఁడై విష్ణుపూజా విధానమునందు నిర్నిద్రుఁడైన కారణముచే భక్తాగ్రేసరుఁడని సద్వ్యాప్తిఁ గాంచినాఁడు.

**2. హరిపర కర్ముఁడు :-**

ఈ రాజచంద్రుఁడు మనోవాక్కాయ కర్మలచే మధురిపు భక్తుఁడగుటయు, నచ్యుత జన తను పంగమే సంగమ్ముగాఁ గల్గిన, ష్వాఁదగ్గుట్టయ్యు వలనఁ బర్గను

పుణ్యాత్ముఁడై యుండెను. కల్మషదూరుఁడై యజ్ఞాఘునిఁగూర్చి వసిష్ఠాది మునీశ్వరులతోఁడ సరస్వతీ నదీ తటము నందితఁడు బహు వాజిమేధము లొనర్చినవాఁడు. ఈ రాజు గణుతింపరాని దక్షిణలుపెట్టి సమలోష్టహేముఁడైన త్యాగశీలి. పంచేంద్రియ వ్యాపారమంతయు హరిపరముగ నడపిన యిట్టి రాజును మించిన పుణ్యచిత్తుఁడుండఁడు.

3. రాచ తపసి:-

విష్ణుమూర్తి యందును, విష్ణుభక్తుల యందును నిష్కళంకమైన మనసును లంకెపెట్టి విహితమైన తన రాజ్య పరిపాలనా విధానమును పీడని వాఁడగుటచేత నతఁడు రాచతపసి యనఁగ నొప్పెను.

4. నిరీహుఁడు :—

హరులు, కరులు, ధనములు, కేళీవనములు, బురములు, నంతఃపురములు మున్నైనవానియందును,పుత్త్రబంధుమిత్త్రాదులయందును నారాజునకుఁ గోరిక సన్నగిల్లెను. మఱికొంత కాలమునకు సంసారమువలని తగులము విడిచి, నిర్మలుఁడై యేకాంతమున భక్తిపరవశుఁడై యుండెను.

5. గృహీత విష్ణుచక్రుఁడు :—

భక్తలోక వత్సలుఁడగు పురుషోత్తముఁ డా రాచతపసికిఁ బ్రత్యక్షమై ప్రతిభటుల శిక్షించునదియు, నిజ జనమును రక్షించునదియు,నిఖిలలోకముల యందును తిరుగులేనిదియు నగు చక్రమొకదానిని బహూకరించినాఁడు.

6. వ్రతశీలి :—

తనతోడి నీడవలె మెలఁగుచు ననురూప గుణాఢ్యయైన భార్యతో నారాజు హరినిగూర్చి యొకయేఁడు ద్వాదశీవ్రత మొనరించెను. వ్రతాంతమునఁ గార్తికమాసమున మూఁడురాత్రు లుపవాసముండి కాళిందీ జలములో స్నానమాచరించి, మధువనమునందు మహాభిషేకముచేసి గంధపుష్పాక్షతలచే శ్రీ మహావిష్ణునిఁ బూజించినాఁడు. దానయోగ్యమైన యుత్తమ గోధనము నమితముగ నీ రాజు వైదికశ్రేణికొసఁగి పెక్కుమంది విప్రవరుల కిష్ట మృష్టాన్నమిడి పారణచేసెడి వ్రతశీల సంపన్నుఁడు.

7. ధర్మభీతుఁడు :—

ఒకనాఁ డతిథియైవచ్చి భోజనమున కంగీకరించిన దుర్వాసుఁడు స్నానమున కేగి ద్వాదశి దాటకముందు పారణకు రాలేదు. ఇటు, వేళకు పారణ సేయ

వలెను. అట్లుచేసినచో నటు, బ్రాహ్మణాతిక్రమ దోషము వచ్చుననుశంక. ఈ రెండు ధర్మసందేహములకును నడుమ త్రొక్కిళ్లుపడి రాజర్షిశ్రేష్ఠుఁడు విద్వజ్జనముల యనుమతితో నెట్టకేలకు హరినిఁ దలఁచి సలిలభక్షణమున కంగీకరించినాఁడు. ఇట్టి యుదాహరణములనుబట్టి యాతనిని ధర్మాతిక్రమ భీతుఁడనవచ్చును.

8. కరుణామయుఁడు :-

దేవాధీశుఁడైన హరి దుర్వాసున కంబరీషునిగూర్చి చెప్పి యాతనినే శరణు వేడుకొమ్మని బోధించినాఁడు. అట్లే యతఁడు సదయుఁడును, జనవినుత గుణాస్పదుఁడును, నగు నాభాగ పుత్త్రుని సంతసపఱచి బాధానివృత్తుఁడయ్యెను. అంబరీషుని దయాభరిత హృదయుఁడనుట కిది యుత్తమోదాహరణము.

9. ఉదారుఁడు :-

తపస్వి తన పాదములు తాకుట యధర్మమని భావించి హరిచక్రమును నిర్వర్తింపఁ జేసిన కారణముచేత నంబరీషుఁడు కేవలము కరుణా లావణ్యావేషుఁడే గాక విదోషుఁడనియు, నయోదార మనీషుఁడనియు సువ్యక్తము.

10. మితభాషి :-

పంచభూతములును సర్వాత్మయు నీవేయని యంబరీషుఁడు విష్ణుచక్రమును నుతించి దాని శత్రు విచ్ఛేదన కౌశలము నుగ్గడించినాఁడు. ఈతని మంజువిహిత భాషిత్వ మీ సుదర్శన స్తవమువలన సువిదితము.

11. పరమ సాధువు :-

తపస్వి తప్పు మన్నించి, తన విష్ణుభక్తి ప్రపత్తులను తాపసుల యెడఁ జూపఁదగు నయోదార మనీషను రాజర్షి సత్తముఁడగు నంబరీషుఁడు ప్రకటించినాఁడు. దానికి సంతసించిన దుర్వాసుఁ డీతనిని సాధు సజ్జనుఁడని నుతించెను. శాంతమె తనకు రక్షయై యుండఁ దానై యిచ్చుటయుఁ గాచుటయును బట్టి, యంబరీషునకు సాధుత్వము నైజగుణమని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

12. వినమ్రుఁడు :-

మునీశ్వరుఁడు కుడుచుటచే నతి పవిత్రమైన వంటకమును రాజు భుజించెను. దుర్వాస మునీంద్రు నంతటివాని బాధ మాన్పఁగల సామర్థ్యము తనది కాదనియు, నిది యెల్ల హరికృపా మహత్త్వమే యనియు, నా రాచతపసి భావించినాఁడు. ఇం

దుచే నంబరీషుఁడెంత వినయాది సుగుణ సంపన్నుఁడో, యెంత నిరాడంబరుఁడో, యెంత వినమ్రుఁడో విశదపడుచున్నది.

**ఉపసంహారము:-**

విష్ణు భక్తాగ్రణియు, హరి పర సర్వకర్ముఁడును, రాచతపసియు, నిరీహుఁడును, గృహీత విష్ణు చక్రుఁడును, వ్రతశీలియు, ధర్మభీరుఁడును, కరుణామయుఁడును, నుదారుఁడును, మితభాషియు, పరమ సాధువును నగు నంబరీషునిఁ బోలిన రాజులు లేరన్నను తప్పుగాదు.

## 2. దుర్వాసుఁడు :—

**ఉపోద్ఘాతము:-**

దుర్వాసుఁడు మహా తపస్సంపన్నుఁడు; అనుపమయోగాభ్యాసుఁడు; రవిభాసుఁడు; కాని మిక్కిలి కోపనుఁడు. ఆ కోపము పోయిన మరుసటిక్షణములో నంతటి దయాళుఁడు లేఁడనిపించువాఁడు దుర్వాసుఁడు. కావున నెంతతపస్వియో యంత దురహంకారి; యెంత దురహంకారియో ప్రసన్నుఁడైనపుఁడంత సాధువు.

1. ఆగ్రహపరుఁడు :—

యమునలో స్నానమాచరించి యేవేళకు నితఁడు రాకపోవుటచేత, రాజు ధర్మహానికి శంకించి పండితుల నిర్ణయమునుబట్టి నీరపారణ మొనరించెను. దీనిని బుద్ధితో నూహించి, బొమముడి వడిన మొగము గండుపెట్టుకొని, యదరెడి మేనితో నితఁడాగ్రహము మూర్తీభవించినట్లుఁ దోచినాఁడు; దీనికిఁదోడు ఆఁకలి రెట్టించి కొట్టు మిట్టాడినది. అందుచే నితనికిఁ బట్టరాని కోప మావహిల్లెను; అంబరీషుని దూలనాడినాఁడు.

2. దురహంకారి :—

తన తప్పిదముఁ దానెఱుఁగఁడు, దుర్వాసుఁడు. పై పెచ్చు, సంపదున్మత్తుఁడనియు, నృశంసుఁడనియు, దురహంకారియనియు, విష్ణుభక్తుఁడు గాఁడనియు, దుష్కర్ముఁడనియు నంబరీషుని నిష్కారణమున నీతఁడు దూఱుట జరిగినది. తన్నుఁ గుడువరమ్మని ముందుగ నారాజు నీరము కుడిచినాఁడని యీతఁ డాతనిలో దోషముపట్టును. ఇంతేగాని తాను వచ్చులోఁగా తిథి దాటిపోయినచో రాజే డాదిపోటు పట్టినవ్రతము భంగమగుట దుర్వాసుఁ డాలోచింపలేఁడు. ఇతఁడు

తానుఁ గోపింప మాన్పువాఁడెవ్వఁడు నేదిక్కునను లేఁడని భావించినంతటి యహం యువు.

3. భావావేగి :—

వ్యాళమును వెన్నాడు కార్చిచ్చువలె తన్ను విష్ణుచక్రము వెన్నాడి, యే లోకమునకుఁబోయిన నా లోకమునకు వచ్చి తపింపఁజేసినది. కరుణమై యా చక్రమును నివారింపుమని పరిదీనుఁడై యాతఁడు బ్రహ్మను బ్రార్థించినాఁడు; శివుని బ్రార్థించినాఁడు; తుదకు శ్రీహరినే బ్రార్థించినాఁడు. కాని భక్తవత్సలుఁడగు విష్ణువు దానికి నంబరీషుఁడే దక్షుఁడనగా దుర్వాసుఁడు పోయి యా రాజచంద్రుని చరణములు పట్టి విడువలేదు. దీనినిఁబట్టి యాతనినిఁ గోపావేశ మెంత లోఁగొనఁగలదో, భక్త్యావేశమును నంత లోఁగొనఁగలదని చెప్పనొప్పును.

4. పశ్చాత్తప్తుఁడు :—

తానేలోకమున కేగిన చక్రమును నాలోకమునకు తన్ను వెన్నాడఁజొచ్చినది. దాని యవక్ర పరాక్రమ మాతనికి నిరూపితమయ్యెను. పశ్చాత్తప్తుఁడై త్రిమూర్తులను దర్శించి, చక్రానల జ్వాలల మాన్పుఁడని ప్రార్థించినాఁడు. కాని యెవరికివారు తామశక్తులమని చెప్పిరి. ఆ యాయుధ శ్రేష్ఠమును తొలఁగఁజేయుట యంబరీషునకుఁదక్క తక్కినవారికి దుర్లభమని ధ్రువమైనది. చక్ర కీలావలీ జనితాయాసుఁడును, నిర్వికాసుఁడును, నుదిత శ్వాసుఁడునునై, దుర్వాసుఁడమ్మహీ వల్లభుని పాదములు పట్టి వదలక యతిదీనుఁడై ప్రార్థించెను. ఇందుచే, నగుటకు సులభ కోపనుఁడేగాని దీర్ఘమత్సరుఁడు గాఁడనియు, నాత్మదోషము తెలిసి వచ్చినఁ బశ్చాత్తాపపడు లఘుహృదయుఁ డీతఁడనియు, విదితము.

5. కృతజ్ఞుఁడు :—

చక్రము తిరిగి చనినది. దుర్వాసుఁడు శాంతినొందినాఁడు. మెల్లని మేలి మాటలతో నంబరీషుని దీవించెను. తనతప్పు మన్నించి నందులకు కృతజ్ఞతయు, నంబరీషుని విష్ణుభక్తికి నాశ్చర్యమును నాతని మనమున వెల్లివిరిసినది. అంబరీషుని సాధువు అనెను. "నీకడ్డములేదు; నీకెప్పుడు నేను శుభములనే కోరెద"ననెను. రాజిడిన మృష్టాన్నములచే సంతుష్టుఁడై యాతని నాశీర్వదించిన దుర్వాసుని బహు కృతజ్ఞుఁడనక తీరదు.

ఉపసంహారము :—

దుర్వాసుఁడెంత దురాగ్రహ గ్రస్తుఁడో, యెంత దురహంకార పూరితుఁడో, యెంత నిర్నిరుద్ధ భావావేగియో, యంత పశ్చాత్తప్తుఁడు, నంత కృతజ్ఞుఁడు ననుట లెస్స.

# సందర్భ సమన్వయ వ్యాఖ్యలు

ఈ దిగువవానిని సందర్భ సమన్వయ పూర్వకముగ వ్యాఖ్యానింపుఁడు :-

1. 'కుడువకుంటగాదు, కుడుచుటయునుగాదు, సలిల భక్షణంబు సమ్మతంబు'—(వ. 19)

సందర్భము :-

కాళిందికి స్నానార్థమేగిన దుర్వాసుఁ డాలసించెను. ఇంతలో ద్వాదశి తిథి పోవుచున్నది; పారణ చేయక తప్పదు; లేదా, వ్రతభంగము. అంబరీషుఁడు బుధులను ధర్మసందేహనివృత్తి కోరినాఁడు. ఆ సందర్భములో రాజునకు బుధజను లిట్లనిరి.

అర్థము :- నీరు త్రాగినచో భుజించినట్లును, గాదు; భుజింపనట్లును గాదు. తిథి పోవులోపున పారణ చేసినట్లగును. కావున నీరుత్రాగి యుపవాసమును ముగింపవచ్చును.

వ్యాఖ్య:-"కుడువకుంట గాదు = భుజింపకుండ నుండరాదు; కుడుచుటయును గాదు = భుజింపను భుజింపరాదు. (అందుచే,) సలిల భక్షణము = నీరుత్రాగుట, సమ్మతంబు = అంగీకరింపఁదగినది." ఈ రీతిగ నర్థము చెప్పువారును గలరు.

కాని, పై వాక్యములో పారణము మానుట పాడిగాదని ముందే పండితులు నిర్ణయించి వేసిరి. ఇఁక, భుజింపనురాదు, భుజింపకుండనురాదు; ఇదియొక క్లిష్టసమస్య. దీనికి బరిష్కారమేమి ? అని యాలోచింపవలసిన యక్కఱలేదు. అందుచే,"నీరు ద్రావినచోఁ గుడిచినట్లును గాదు; కుడువనట్లును గాదు"అను నర్థమే మిక్కిలి పొంది పొసఁగి యుండఁగలదు.

ఇది నేఁటికి నొక లోకోక్తియైనది. భుజించు సందర్భములో శంకవచ్చినపుడీ వాక్యమును చెప్పుకొని నీరు త్రాగుదుము. దుర్ఘటమైన రెండు ధర్మములకు విప్రతిపత్తి కల్గినపుడిది యాపద్ధర్మముగ నవలంబింపఁబడు మధ్యేమార్గము.

వ్యా. వి:– ఉంట = ఉండుట; సలిల భక్షణంబు = ష. త.

2. "అదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు చందంబునఁ దోనచొచ్చి" (వ. 26)

సందర్భము :-

దుర్వాసుఁడు సృజించిన కృత్యను దహించియు, తనివి తీరక దుర్వాసుని వెంటఁబడి మేరుగుహచొచ్చిన చక్రాయుధమును వర్ణించు సందర్భములో పోతనార్యునిచే నీ వాక్యము చెప్పఁబడినది.

అర్థము:- పులిని వెంబడించి తరుము కార్చిచ్చువలె దుర్వాసుని వెంటఁబడి విష్ణుచక్రము తరుముచు—

వ్యాఖ్య:- వ్యాళమనఁగా క్రూర జంతువు. విశేషించి పాము,పులి, తులువ యేనుఁగు నను నర్థములున్నవి. ఈ మూఁటికి నగ్ని యన్న భయమే. కాని పులికిఁ గల యంతటి క్రౌర్యము పాము, ఏనుఁగు, మున్నగువానికి లేదు. అట్లే గుహలో దాఁగియుండు గుణముకూడ పులికి మిక్కుటము. కాఁగా, దుర్వాసుని పులితోడను, చక్రమును కార్చిచ్చుతోడను బోల్చుట యుచితము.

పులికి దావాగ్నియనఁగా భయము సైతము మిక్కుట మనవచ్చును.

| | | |
|---|---|---|
| పోల్పఁబడినవి | మేరుగుహ = కొండగుహ.<br>ముని = పులి.<br>చక్రాగ్ని = దవానలము. | పోలికలు |

'చందము' అనునది ఉపమా వాచకము. ఇది యుపమాలంకారము.

శీలము:-

దుర్వాసుఁడు హింస్రక మృగమైన పులివలె క్రూరుఁడని సూచన.

విష్ణుచక్రము దుర్మార్గమును దహించునది యనియు సూచ్యము.

సుదర్శనాగ్ని దుర్వాసు నెంతభయపెట్టుచు వెన్నాడినదో తెలుపుట యీ యలంకార ప్రయోజనము.

3. "........అట నారకుఁడైన మనంబులో భవన్నామము చింత సేసిన, ననంత సుఖస్థితి నొందకుండునే!" (ప. 36)

సందర్భము:-

ఈశ్వరునివలన నిరాశుఁడై దుర్వాసుఁడు వైకుంఠమునకుఁ జని, చక్రానల జ్వాలల మాన్పుమని శ్రీహరిని బ్రార్థించుచుఁ బశ్చాత్తప్తుఁడైన ఘట్టములో పోతన పల్కినదీ వాక్యము.

అర్థము:- ఓ హరీ! ఎంత నరకకూపములోఁ బడువాఁడైనను మనసా నిన్ను బ్రార్థించినచో శాశ్వత కైవల్యమును బొందునుగదా!

వ్యాఖ్య :- విష్ణుభక్తుల కెగ్గుఁదలఁచిన తన యజ్ఞానమునకు దుర్వాసుఁడు శ్రీ మహావిష్ణువు నెదుటఁ బశ్చాత్తాపమును వెల్లడించు చున్నాడు.

విష్ణుని మహిమ దుర్వాసున కిప్పుడనుభవైక వేద్యమైనది. అందుచే నిది దుర్వాసుని యచ్చమైన పశ్చాత్తాపమును వెల్లడించు వాక్యము.

శీలము:-

దుర్వాసుఁ డెంత కోపనుఁడో యంత పశ్చాత్తప్తుఁడనుట కిది యుజ్జ్వలమైన నిదర్శనము.

నారకుఁడు = నరక నివాసమునకుఁ దగినవాఁడు.

వ్యా. వి:- భవత్ + నామము = భవన్నామము = అనునాసిక సంధి.

చింత + చేసిన = ప్రథమము మీది పరుషములకు గ, స, డ, ద, వ, లగు. గ, స, డ, ద, వాదేశ సంధి.

అనంత సుఖము = కర్మధారయము.

అనంత సుఖస్థితి = షష్ఠీ తత్పురుషము. (శాశ్వతమైన మోక్షము)

4. "........మదకుంభికైవడిన్ వలలకుఁ జిక్కి భక్తజనవత్సలతం జను చుందుఁ దాపసా!"— (ప. ౩౭)

సందర్భము:-

ఈశ్వరునివలన నిరాశుఁడై దుర్వాసుఁడు వైకుంఠమునకు వచ్చి తన పాద ములకు మ్రొక్కి లేవకున్నపుడు శ్రీహరి యాతనితో తన భక్తవాత్సల్యమును గూర్చి చెప్పు సందర్భములోని దీ వాక్యము.

అర్థము :- ఓ మునీ! మత్తగజమువలె భక్తుల భక్తియనెడి ఉరులలో జిక్కు కొనుచుందును.

వ్యాఖ్య :- విష్ణువు మదగజమువంటివాఁడు. భక్తుల భక్తి వలవంటిది. ఏనుఁగు వలలోఁ జిక్కినట్లు విష్ణువు భక్తులకుఁ జిక్కును.

చిక్కుట = ఉపమావాచకము; కైవడిన్ = వలె.

అలంకారము:-

ఇందలి యలంకారము ఉపమ.

శీలము:-

శ్రీ మహావిష్ణుని భక్త వాత్సల్యము దీనివలన సూచింపఁబడినది.

విశేషము:-

ఏనుఁగునుఁ బట్టుకొనుటకై దాని దారిలో గోయి త్రవ్వి ఉచ్చులు పన్నుట వేఁటకాండ్రకుఁ బరిపాటి. మదించినదిగాన నా యేనుఁగు క్రింద మీఁదుఁగానక

యెప్పటి త్రోవయే యనుకొనుచు నా ఊబి గోతిలో (దిగఁబడి) కూరుకొని పోవును. ఇది వేటకాలు గజములను బట్టుకొను తీరు. భక్తులుకూడ భక్తి మూలమున విష్ణుని వశపఱచుకొందురనుట కిది యుపమానమైనది.

5. "...దీర్ఘనిద్ర బోదు రసురవరులు, శయ్యలందున్న సతులు ప్రభాత మందు లేచి పలవరింప"

సందర్భము:-

విష్ణుమూర్తి బోధనుఁబట్టి దుర్వాసుఁ డంబరీషుని పాదములు పట్టి విడువకుండెను. ముని తన పాదముల నంటుట కిష్టములేనివాఁడై యంబరీషుఁడు హరి చక్రము నిట్లని స్తుతించుచున్నాఁడు.

ఓ చక్రమా! నీవు కలలోన వచ్చినంతనే రక్కసులు శాశ్వతనిద్ర పోవుదురు. వారి ప్రక్కలలో నిదురించు భార్యలకుసైతమది తెలియదు. తెల్లవారి లేచి, భర్తలు మరణించిరని గుర్తించి యేడ్వవలసినదేగాని, ముందిసుమంతయు రాక్షస స్త్రీలకీ యశుభము తెలియదు.

వ్యాఖ్య :- విష్ణుచక్ర మహత్త్వము నంబరీషుని ముఖమున పోతనార్యుఁడు చెప్పుచున్నాఁడు. రాక్షసులకు విష్ణుచక్రమనఁగా సింహస్వప్నము. అది కలలో తోఁచిన చాలును. చత్తురు. ప్రక్కలో పరున్న భార్యకుసైత మాజాడ తెలియ నంతటిది, ఆ హఠాన్మరణము.

అర్థము:- దీర్ఘనిద్ర = మరణము; అసుర = రాక్షసుఁడు.

సతి = పతివ్రత; (వ్యు) ఎవర్తె దర్శనముచే పాపములు తొలఁగునో యట్టి స్త్రీ; ప్రభాతము = వేకువ. పలవరింపన్ = కలవరము చెందఁగా.

వ్యా.వి:- సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దంబు వైకల్పికముగా స్త్రీ తుల్యంబులగు.

అసురవరులు = ఉ. ప. కర్మధారయము.

ముఖ్యమైన యీ దిగువవానినిఁగూడఁ బైని సూచించిన తీరుగనే మూఁడు ఘట్టముల క్రింద సందర్భ పూర్వకముగ వ్యాఖ్యానించునది:-

(1) అతఁడు రాచతపసి యనఁగ నొప్పె. (ప. 4),

(2) నన్నిదిశల నేను గోపింప మాన్పువాఁ డెవ్వఁడనుచు, (ప. 21)

(3) దానన కృత్యా నాయుధోత్కట వలమాన హస్తయుతఁగా నొనరించి కవించె రాజుపై. (ప. 22)

(4) వచ్చెనదియుఁ బ్రళయ వహ్నిపగిది.........(ప. 25)

(5) ఆ హరిచక్రానలకీల కన్యుఁడొకరుం డడ్డంబుగా నేర్చునే!—(ప. 30)

(6) అట్టి నిఖిలనాథు నాయుధ శ్రేష్ఠంబుఁ దొలఁగఁ జేయ మాకు దుర్లభంబు—(ప. 33)

(7) ......ఓ భక్త రక్షావిద్యా పరతంత్ర, మానుపఁగదే! చక్రానల జ్వాలలన్—(ప. 35)

(8) సాధుల నేన యెఱుంగుదు, సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా! (ప. 41)

(9) 'కలలోన వచ్చిన నిన్నుఁజూచి దీర్ఘ నిద్రపోదురు.'—(ప. 48)

(10) అస్తోకము నీదురూపు గలదుం దుదిలేదు పరాత్పరాద్యమై.-(ప.49)

(11) తపసిఁగావు మీవు ధర్మవృత్తి.—(ప. 50)

(12) చక్రమునకు గుప్తశక్రమునకు.—(ప. 52)

(13) సొరిదిన్ నైజగుణంబులై సరస వచ్చుంగాదె మిత్త్రాకృతిన్ (ప. 56)



# మనుచరిత్రము

## ప్రవరుని హిమాచల యాత్ర

## (ప్రథమ ద్వితీయాశ్వాసముల నుండి)

(అల్లసాని పెద్దన)

ప్రతిపదార్థము:—

ప. 1. ఆర్యావర్తంబునన్; (హిమవత్పర్వతమునకు వింధ్యపర్వతమునకు నడుమనుండు దేశ మార్యావర్త మనఁబడును) వరణా ద్వీపవతీ తటాంచలమునన్ = వరణయనెడి నదియొక్క సమీపమునందు; వప్రస్థలీ చుంబితాంబరమై = ప్రాకార ప్రదేశములచేత తాఁకఁబడిన ఆకాశము గలదై; సౌధ........ హారిణంబై — సౌధ = మేడల యందలి, సుధా = సున్నపు గచ్చుయొక్క, ప్రభా = కాంతులచేత, ధవళిత = తెల్లగాఁ జేయఁబడిన; ప్రాలేయ రుఙ్మండలీ = చంద్రబింబము నందలి; హారిణంబై = జింకగలదై; మహీ కంఠహార తరళస్ఫూర్తిన్ = భూమియొక్క మెడయందలి ముత్యాల హారములోని నాయకమణియొక్క ప్రకాశమును; విడంబించుచున్ = అనుకరించుచు; అరుణాస్పదంబనఁగన్ = అరుణాస్పదమను పేరుతో; పురము = ఒక పట్టణము; ఒప్పున్ = ఒప్పిదమగు చుండును.

తాత్ప : ఆర్యావర్త దేశమందు నరుణాస్పదమను పట్టణమొకటి కలదు. అది ఆకాశము నొరయునట్టి మిక్కిలి యున్నతములయిన ప్రాకారములును, చంద్ర మండలము నొరయుచు, నందలి జింకను గూడఁ దెల్లగాఁ జేయునట్లు తళతళ వెలిఁగెడి పాలగారచేతఁ దెల్లనివై, యున్నతములైన మేడలును, గలిగి, భూదేవి ధరించిన కంఠహారముయొక్క పతకమో యనునట్లుండెను.

వ్యాకరణ విశేషములు :

(1) చుంబిత + అంబరము, తట + అంచలము } (అ + అ = ఆ) స. దీ. సంధులు.

అరుణ + ఆస్పదంబు = (అ + ఆ = ఆ) ,,

మహి కంఠహారము, లేదా — మహీ కంఠహారము.

సౌధము : (వ్యు) సుధ (సుద్ద-సున్నము)తోఁ గట్టఁబడినది.

సమాసములు :—

(1) వప్రస్థలీ చుంబితాంబరము = బహు; ప్రాలేయ.... హారిణంబు = స. త. ప్రాలేయ.... హారిణంబై = బహు; మహీ కంఠము = ష. త; మహీ కంఠహారము = స. త;

గమనిక:—

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

అలంకారములు :—

అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, ఉపమయును.

ఛందస్సు :- చూ. రాజసూయము. 8వ పద్య వ్యాఖ్య. పుట. 15.

ప. 2. అర్థము:- అచటి విప్రులు = ఆ యరుణాస్పద పురము నందలి బ్రాహ్మణులు; అఖిల విద్యా ప్రౌఢిన్ = ఎల్లవిద్యల యందలి నేర్పుచేత; ముదిమది దప్పిన మొదటి వేల్పున్ = ముసలితనముచేత మనస్సు నిలకడ చెడిన బ్రహ్మను; మెచ్చరు = లక్ష్యము చేయరు. (అచటి బ్రాహ్మణులు తాము సర్వ విద్యలయందు మిక్కిలి పండితులగుటచే ముసలివాఁడయి చిత్తభ్రమ నొందిన వాఁడని బ్రహ్మను సరకు సేయరనుట. అనఁగా నచటి బ్రాహ్మణులు మిక్కిలి విద్యావంతులని భావము) అచటి రాజులు = ఆ పట్టణము నందలి రాచవారు; బంటున్ = సేవకుని; అంపి = పంపి; భార్గవునైనన్ = పరశురాము నయినను; బింకానన్ = గర్వముచేత; అంకమునకున్ = తమ దగ్గఱకు; పిలిపింతురు = పిలువ నంపుదురు. (అచటి క్షత్త్రియులు మహాబలశాలులు కాఁబట్టి పరశురాము నైనను లక్ష్యము చేయక బంటు నంపి తమ యొద్దకు బలవంతముగాఁ బట్టి తెప్పింతురనుట. అనఁగా నచటి రాచవారు మిక్కిలి పరాక్రమవంతులని భావము). అచటి మేటికిరాటులు = ఆ పట్టణమునందలి ప్రముఖులైన కోమట్లు; అలకాధిపతి నైనన్ = అలకాపురికి రాజైన కుబేరునైనను; మును = ముందుగా; సంచి మొదలు = బండ వలమును,- అనఁగా మూల ధనమును; ఇచ్చి = తామే యిచ్చి; మనుపన్ = రక్షించుటకు; దక్షులు = సమర్థులు (అచటి వైశ్యులు కుబేరునకుఁ గూడ బండాలమిచ్చి, కాపాడఁదగిన వారనుట. అనఁగా మిక్కిలి ధనవంతులని భావము.) అచటి నాలవజాతి = ఆ పట్టణము నందలి శూద్రజనులు; హాల ముఖాత్త విభూతిన్ = నాగేటి మొనచేత పొందఁబడిన ఐశ్వర్యముచేత; ఆది భిక్షువు భిక్షము నైనన్ = మొదటి బిచ్చగాఁడయిన శివుని యొక్క భిక్షావృత్తినయినను; మాన్పున్ = పోఁగొట్టును. (అచటి శూద్రులు సేద్యముచే మిక్కిలి సంపద గల వారును, దాతృత్వము గలవారునని భావము.) అచటి వెలయాండ్రు = ఆ పట్టణములోని వేశ్యలు; నాట్య........నిరూఢిన్ = నృత్య పద్ధతి యనెడు విద్య

యొక్క భారమును వహించిన సామర్థ్యము చేత; రంభాదులైనన్ = రంభ మొదలగు నప్సరసలైనను; ఒరయన్ = సరిపోవలయునని వచ్చిన యెడల; కాసె కొంగునన్ = వెనుక దోఁపుకొనెడి కోక చెఱఁగుచేత; వారించి = (కొంతదూరము నందే నిలుచునట్లు చేసి) తిరస్కరించి; కడవఁగలరు = అతిక్రమింపఁగలరు. (అచటి వేశ్యలు నాట్యవిద్య యందు రంభ మొదలగు నప్సరసల సయిత మవ మాన పఱుపఁగలరనుట. అనఁగా నచటి వేశ్యలు నాట్యమందు మిక్కిలి సమర్థలని భావము.) అచటన్ = ఆ పట్టణమునందు; పుట్టిన చిగుడుఁగొమ్మైనన్ = పుట్టినట్టి చిగురుతోడి లేఁత కొమ్మయైనను; చేవ = సారము గలది. (ఆ యూర బుట్టిన వన్నియు మిక్కిలి సారవంతములని భావము.)

తాత్ప : అచటి బ్రాహ్మణులు బ్రహ్మనే ధిక్కరింపఁగలరు; ఆ పురము నందలి క్షత్రియులు పరశురాముసైన నెదిరింపఁ జాలుదురు; వైశ్యులు కుబేరు నకే పెట్టుబడి పెట్టఁగలరు; శూద్రులు పుట్టుకచేతనే దరిద్రుఁడైన శివుని దారిద్ర్య మును బాపనోపుదురు; వేశ్యలు నాట్యాదులచే రంభాదులనే దూరముగ నిల్ప సమర్థురాండ్రు; వేయేల ? లేఁత కొమ్మయు నచ్చట చేవగలది.

వ్యా. వి :- బింకము + చేతన్ = (చూడు. బాల. వ్యా. కార 23 సూ.) 'బింకమునన్' అని యగును. పిదప (బా. వ్యా. తత్స. 43 సూ. చేత) బింకానన్ అగును.

వెల + ఆలు = వెలయాలు (చూ. బా. వ్యా. సంధి 4 సూ.) వెల యాలు + లు (చూ. బా. వ్యా. ఆచ్ఛిక. 11 సూ.) = వెలయాండ్రు.

అలక + అధిపతి = (అ + అ = ఆ) = స. దీ. సంధి.

చిగురు + కొమ్మ : కర్మధారయము నందుత్తున కచ్ఛపరంబగునపుడు 'ను' గాగమంబగు. చిగురు + న్ + కొమ్మ: ద్రుత ప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు : చిగురు + న్ + గొమ్మ : ఆదేశసరళములకు ముందున్న ద్రుతము మీఁది బిందు సంశ్లేష విభాషనగు. చిగురుఁగొమ్మ.

సమాసములు:—

మొదటివేల్పు = ద్విగు; అఖిల విద్యాప్రౌఢి = స. త; ముదిమది దప్పిన = తృ. త; అఖిల + విద్య = కర్మ; అఖిల విద్యాప్రౌఢిన్ = ష. త; హాల + ముఖ = ష. త; హాల ముఖాత్త విభూతిన్ = కర్మధా; ఆది భిక్షువు = కర్మధారయము.

గమనిక :—

ఇందలి నుడికారము సొంపు ప్రసిద్ధిఁగన్నది.

అలంకారము:—

అతిశయోక్తి.

విశేషములు:—

ఈ నగర వర్ణనము మితముగాను హృద్యముగాను నున్నది. ప్రబంధములు అష్టాదశ వర్ణనములు గలిగియుండవలెనని లాక్షణికులందురు. కాని కథా సందర్భమునుబట్టి యే వర్ణనము లవసరమో కవియెఱిఁగి వానినే మితముగా వర్ణించును. అమితవర్ణనములు సహృదయులకు ఆనందమునకు బదులు జుగుప్సనే కలిగించును. పెద్దన హితమితోక్తులు రసికానంద దాయకములు. ఇచట 'చిగురు కొమ్మైనఁజేవ' అను పాఠమును గ్రహించి, చిగురుచెట్టు కొంచెమైనను పటుత్వము లేనిదనియు, అట్టి చెట్టుకొమ్మకూడ నా యూరఁ జేవఁగలదయి యుండుననియు, చెప్పుదురు. ములగ చెట్టువలె పెళుసై, చేవలేని, యొకానొక చెట్టు 'చిగురు చెట్టు' అను పేరిట, నేఁటికిని అల్లసాని పెద్దనార్యుఁడు జన్మించిన మండలములోనుండుట, యీ పాఠమునకు ఊపిరి పోయుచున్నది.

ఛందస్సు :- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 8. ప్రతిపదార్థము:-మకరాంక, శశాంక, మనోజ్ఞ మూర్తి = మన్మథుని వలెను, చంద్రునివలెను సుందరమయిన ఆకారము కలవాఁడును; భాషాఽపరశేషభోగి = మాటలయందు రెండవ శేషాహి యయినవాఁడును; వివిధ...... పరతంత్రుఁడు — వివిధ = నానా విధములయిన: అధర్వ = యాగములనెడి; నిర్మల = దోష రహితములయిన: ధర్మకర్మ = పుణ్యక్రియల యందలి; దీక్షా = నియమమునకు; పరతంత్రుఁడు = అధీనుఁడును; అంబురుహ గర్భకులాభరణంబు = బ్రాహ్మణజాతికి అలంకారమయిన వాఁడును; అనారతాధ్యాపరతత్పరుండు = ఎల్లప్పుడును వేదములు చదివించుటయందు ఆసక్తిగల వాఁడును నయిన; ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁడు అను పేరుగలవాఁడు; అలేఖ్య తనూవిలాసుఁడై = చిత్తరువునందు వ్రాయనలవిగాని రూపరేఖ గలవాఁడై; ఆ పురిన్ = ఆ నగరమును; పాయక = విడువక; ఉండున్ = వాసము చేయుచుండును.

తాత్ప : ఆ యరుణాస్పద పురమునందు సుందరుఁడును, వాగ్మియు, కర్మిష్ఠియు, బ్రాహ్మణకుల భూషణుఁడును, వేద పాఠముల నేర్పువాఁడును నగు ప్రవరుఁడు నివసించును.

విశేషార్థము :—

ప్రవరుని సౌందర్యము, వాక్నైపుణి, ధర్మకర్మ నిష్ఠ, బ్రాహ్మణ్యము మొదలైన గుణసంపత్తియే కథా నిర్వహణమునకు మున్ముందుఁ దోడ్పడునవి.

ఇచట నాఁటబడిన బీజములే ఉత్తరోత్తర విస్తరిల్లును. కాన, కవి మొదటి నుండియు కథను పన్నుకొనుచునే పోవుచున్నాఁడు. కావుననే అల్లసాని వాని యల్లిక బిగిజిగి యని ప్రశస్తి వచ్చినది.

వ్యా. వి:- వివిధ+అధ్వర....(అ+అ = ఆ); గర్భకుశ+ఆభరణంబు; మకర+అంకుఁడు; అనారత+అధ్యాపన తత్పరుఁడు; ప్రవర+ఆఖ్యుఁడు = స. దీ. సంధులు.

సమాసములు :—

అ+లేఖ్య = నఞ్ త. అలేఖ్య తనూవిలాసుఁడు = బహు; మకరాంక... మూర్తి = బహు; భాషా.......భోగి = స. త; ధర్మ కర్మ దీక్షాపరతంత్రుఁడు = స. త; అనారతాధ్యాపన తత్పరుండు = స. త; ప్రవరాఖ్యుఁడు = బహు ప్రీ.

అలంకారములు :-

ఉపమ—రూపకములు.

ఛందస్సు :- చూ. రాజసూయము. 15వ పద్య వ్యాఖ్యా. పుట 23.

ప. 4. వాని చక్కఁదనము = ఆ ప్రవరుని సౌందర్యము; వైరాగ్యమునన్ చేసి = విషయేచ్ఛ లేమిచేత; కాంక్షసేయు జార కామినులకున్ = వలచునట్టి కులటలకు; పూచిన సంపెంగ పోలుపు = వికసించిన సంపెఁగ పువ్వు యొక్క వికాసము; మధుకరాంగనలకుఁ బోలెన్ = ఆఁడు తుమ్మెదలకు వలె; భోగ బాహ్యము = అనుభవమునకు వెలియయినది; అయ్యెన్.

తాత్ప :- ఆ ప్రవరుఁడు విరక్తుఁడైనందున వాని సౌందర్యమును వలచి వచ్చిన జార స్త్రీలకు నబ్బకయుండెను. వికసించిన సంపెఁగ పువ్వు తుమ్మెదలకు నుపయోగపడనట్లు వాని సౌందర్యము జారిణీ స్త్రీలకు ననుభవింప నలవికాని దయ్యెనని తాత్పర్యము. తుమ్మెదలకును, సంపెంగకును విరోధము సుప్రసిద్ధము.

వ్యా. వి :- (1) చక్క+తనము = ఉదంత స్త్రీ సమంబులకు, పు,ంపు లకును, అదంతగుణవాచకంబులకును, 'తనంబు' పరంబగునపుడు నుగాగమంబగు. (2) వైరాగ్యము చేతన్ = [బా. వ్యా. కార. సూ. 23] వైరాగ్యమునన్ అగును. దానికి (ప్రౌఢ. కా. సూ. 4) 'చేసి' యనుప్రయుక్త మగుచున్నది. (3) మధుకర+అంగన = (అ+అ = ఆ) స. దీ. సంధి.

సమాసములు :—

సంపెఁగ పోలుపు (ష. త)

అలంకారము :—

ఉపమ.

అలంకారౌచిత్యము :—

తన్ను వాంఛించు జారిణులకు, ప్రవరుని యందము అనుభవయోగ్యము కాఁజాలదన్న కావ్యార్థసూచన మిందున్నది. ఇందలి ఉపమ మనోహరమైనది. ప్రకృతి పరిశీలనాపూర్వకమైనది.

ఛందస్సు :- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 5. అర్థము : యౌవనమందున్ = వయసు నందు; యజ్వయును = యాగము చేసినవాఁడును, - సోమయాజియును; ధనాఢ్యుఁడునై = ధనవంతుఁడునై; కమనీయ కౌతుక శ్రీవిధిన్ = మనోహరమయిన కంకణ బంధమున సంపత్కరమయిన క్రియయందు—వివాహమునం దనుట; కూఁకటుల్ = పిల్ల జుట్లను; కొలిచి = కొలఁత పెట్టి—ఈడు చూచి యనుట; (ఇద్దఱయందును ఈడు కొంచెము హెచ్చు తక్కువగాఁ జూచి యని భావము) చేసిన = పెండ్లి చేసినట్టి; కూరిమి సోమిదమ్మ = ప్రియురాలైన సోమిదేవి—అనఁగా భార్య; సోమిదమ్మ యనఁగా సోమయాజి భార్య. సౌఖ్యావహయై = సుఖము కలిగించునదియై; భజింపన్ = సేవింపఁగా; సుఖులై = సుఖము గలవారలై; తలిదండ్రులు = ఇతని తల్లియుం, దండ్రియు; కూడి = జతగూడి; దేవియున్ దేవరవోలెన్ = పార్వతీ పరమేశ్వరుల వలె; ఉండి = ఇంట నున్నవారై; ఇలు తీర్పఁగన్ = గృహ కృత్యములు చక్కఁ బెట్టుచుండఁగా; వానికిన్ = ఆ ప్రవరునికి; కాపురము = సంసారము; ఒప్పున్ = చక్కఁగా జరుగుచుండును.

తాత్ప :- ఆ ప్రవరుఁడు ధనవంతుఁడయి, తనకు ఈడయిన ప్రియ భార్య సేవింపఁగా, యౌవనమందే యజ్ఞముచేసి, పార్వతీ పరమేశ్వరులవలెఁ దన తల్లి దండ్రులు క్షేమముగ నింటనుండి, గృహకృత్యములు విచారించుకొనుచుండఁగా సుఖముగఁ గాపురము చేయుచుండెను.

వ్యా. వి :- (1) ధన + ఆఢ్యుఁడు; సౌఖ్య + ఆవహయై; స. దీ. సంధులు. (2) దేవర + పోలెన్ = గసడదవాదేశము ప్రథమముమీఁద కలుగఁగా దేవరవోలెన్ - అయినది.

నుడికారములు :-

కూఁకటుల్ కొలిచి చేయుట, ఇలు దీర్చి కాపురించుట-ఇవి పెద్దనార్యుని భాషా ప్రభుత్వమునకుఁ దార్కాణములు.

సమాసములు:-

కమనీయ కౌతుక శ్రీవిధి = కర్మధా; తలిదండ్రులు = ద్వంద్వ.

ఛందస్సు:— చూ. రాజసూయము, 15వ పద్య వ్యాఖ్య. పుట 23.

ప. 6. అర్థము:— వరణా...గంధమున్—వరణా తరంగిణీ = వరణానది యందు; దరవికస్వర = ఇంచుక వికసించిన: నూత్న = క్రొత్తవైన; కమల = తామరపూవుల యొక్క; కషాయగంధమున్ = వగరుతోడి వాసనను; వహించి = పూని; ప్రత్యూష పవనాంకురములు = వేకువ యందలి పిల్లవాయువులు— మంద మారుతములనుట; పైకొను వేళన్ = మీఁద సోఁకునట్టి సమయమునందు—తెల్ల వారు సమయము నందనుట; వామనస్తుతి పరత్వమునన్ = దధి వామన స్తోత్రము నందలి యాసక్తిచేత-శ్రీకృష్ణ స్తోత్ర పారాయణముతో ననుట; లేచి = నిద్రలేచి; సచ్ఛాత్త్రుఁడు = శిష్యులతోఁ గూడినవాఁడు; అగుచున్; నిచ్చలున్ = ఎల్లప్పుడును— ప్రతిదినము ననుట; ఏఁగి = పోయి; అయ్యేటన్ = ఆ వరణానదియందు అఘమర్షణ స్నానము = అఘమర్షణ సూక్తములు పఠించుచుఁ జేయునట్టి స్నానమును; ఆచరించి = చేసి; సాంధ్యకృత్యమున్ = సంధ్యావందనాది కార్యమును; తీర్చి = జరపి; సావిత్రిన్ = గాయత్రీ మంత్రమును; జపియించి = జపముచేసి; సైకతస్థలిన్ = ఇసుక దిన్నెయందు; కర్మసాక్షికిన్ = సూర్యునకు; ఎఱఁగి = నమస్కరించి— సూర్యోపస్థానముచేసి యనుట; ఫల....తతియున్ = పండ్లు, సమిధలు, దర్భలు, పువ్వులు మొదలుగాఁగల పెక్కు వస్తువుల సమూహమును; ఉదికిన మడుఁగు దోవతులున్; కొంచున్ = తీసికొంచు; బ్రహ్మచారులు = శిష్యులైన వడుగులు; వెంటరాన్ = తనతోడ రాఁగా: ప్రజ = జనసమూహము; తన్నున్; మెచ్చి; చూడన్; బ్రాహ్మణుండు = ప్రవరుఁడు; ఇంటికిన్; వచ్చున్.

తాత్పర్యము:-

వరణానదిమీఁదుగ, కమల సుగంధముతోఁ దెలవారుజాము గాలులు వీవఁగనే ప్రవరుఁడు లేచి శిష్యులతో నా నదికిఁ బోవును. స్నాన సంధ్యాద్యనుష్ఠానములు తీర్చుకొని, పూజా ద్రవ్యములతోడను, నుదికిన దోవతుల తోడను శిష్యులు వెంట రాగా, ప్రవరుఁడు ప్రతిదినము నింటికి వచ్చువాఁడు. ఇది చూచి ప్రజ లాతనిని మెచ్చుకొనెడివారు.

వ్యా. వి :- (1) సచ్ఛాత్త్రుఁడు = (స + ఛాత్త్రుఁడు, స + త్ + ఛాత్త్రుడు) శ్చుత్వసంధి; (2) ఆ + ఏట = అయ్యేట = త్రి. సం. చూ. బా. వ్యా. సమాస. 13, 14 సూ.

నిచ్చే(లు) = అవ్యయము. దీనికి ప్రకృతి—నిత్యము. నిచ్చే-ఏకవచనము = సదా, ఎల్లపుడు నని అర్థము.

విశేషములు:-

అఘమర్షణము = పాపము నశించుటకై జపించునట్టి మంత్రము; ఇది ఋగ్వేదమున 190వ సూక్తము. జలములందుండి మూఁడు మాఱులు దీనిని జపింపఁగా మహాపాతకములు కూడ నశించునని శాస్త్రము.

సమాసములు:-

కషాయ గంధము = ష్ఠీ.త; కమల ... గంధము = ష. త; దరవికస్వర సూక్ష్మ కమల ... గంధము = కర్మ; వరణా తరంగిణీ ... గంధము, ప్రత్యూష పవనాంకురములు, పైకొను వేళ, వామన స్తుతిపరత్వము = స. త. లు; సచ్ఛాత్త్రుఁడు = బహు వ్రీ. ఫల ... కుసుమము = బహు. ద్వంద్వము.

ఛందస్సు:- చూ. రాజసూయము, 6వ పద్య వ్యాఖ్య. పుట-13.

ప. 7. అర్థము:- శీలంబున్ = సదాచారమును; కులముఁ = మంచి వంశమును; శమంబున్ = బహిరింద్రియ నిగ్రహమును; దమమున్ = అంతరింద్రియమగు మనస్సు యొక్క నిగ్రహమును; చెల్వంబున్ = చక్కఁదనమును; లేఁత్రాయమున్ = లేఁత వయస్సును; పోలన్ = పొసఁగి యుండఁగా; చూచి; ఇతండు = ఈ బ్రాహ్మణుఁడు; పాత్రుఁడు = దానమిచ్చుటకుఁ దగినవాఁడు; అని; ఏ భూపాలురు = ఏ రాజులు; ఈవచ్చినన్ = దాన మియ్యవచ్చినను; సాలగ్రావము మున్నుగాన్ = సాలగ్రావము మొదలుకొని; (సాలగ్రావ దానము దోషము లేనిదని శాస్త్రము) కొనఁడు = తీసికొనఁడు; మాన్య క్షేత్రముల్ = మాన్యపు భూములు (పూజ్యులని గౌరవించి యినాముగా రాజులు మొదలగువా రిచ్చునట్టి భూమి మాన్యమనఁబడును.) పెక్కు చందాలన్ = బహువిధములుగా; పండున్ = ఫలించును; ఇంటన్ = ఇంటి యందు; పాఁడియున్ = పాల సమృద్ధియు; పంటయున్ = పైరులు పండుటవలని ధాన్యసమృద్ధియు; ఒకప్పుడున్ = ఒక కాలమందును; తఱుఁగదు = తగ్గదు.

తాత్ప :- ప్రవరుని యోగ్యతను జూచి, రాజులు నానావిధములయిన దానముల నీయవత్తురు. అతఁడు ప్రతిగ్రహము పాపము కలిగించునని నిర్దోషమైన సాలగ్రావ దానము సయితము తీసికొనకుండును. అయినను మాన్యపు భూములు తప్పక పండుచుండును; కావున నతని యింటఁ బాఁడి పంటలు కొఱఁత లేక యుండును.

వ్యా. వి:- లేఁత + ప్రాయము:- (ప్రాఁతాది సూత్రము):- (1) సమాసంబులం బ్రాఁతాదుల తొలియచ్చు మీఁది వర్ణంబులకు లోపంబు బహుళంబుగానగు. లేఁత్ + ప్రాయము :- (2) లుప్త శేషంబునకుఁ బరుషములు పరంబగునపుడు ను'గాగమంబగు! లేత్ + న్ + ప్రాయము. (3) ద్రుత ప్రకృతికముమీఁది పరు

షములకు సరళములగు = లే+న్+ ప్రాయము. (4) ఆదేశ సరళమునకు ముందున్న ద్రుతముమీఁది బిందుసంశ్లేష విభాషనగు - లేఁప్రాయము.

సమాసము:-

కర్మధారయము.

విశేషము:-

సాలగ్రావ(మ)ము = విష్ణుమూర్తి చిహ్నముగల యొక పుణ్య శిల. దీనిని దానము పట్టిన పాపము రాదు. కడమ దానములు పట్టిన పాపము వచ్చును.

ఛందస్సు:- చూ. అంబరీషోపాఖ్యానము- 1 వ పద్య వ్యాఖ్య-పుట 85.

ప. 8 అర్థము:- అన్నపూర్ణకున్ = అన్నపూర్ణాదేవికి; ఉద్దియా = ఈడైన; అతని గృహిణి = ఆ ప్రవరుని భార్య; వేవురు = వేయిమంది; వచ్చిరేనిన్ = అన్నార్థులయి వచ్చినను; వండన్ = వంటచేయుటకు; అలయదు = విసుగుకొనదు; అతిథులు = ఆగంతుకులు-(లేక) విందులు; ఏతేరన్ = రాఁగా; నడికి రేయైనన్ = అర్ధరాత్రమండైనను; ఇంటన్ = తమ యింటియందు; వలయు భోజ్యంబులు = కావలసిన భోజన వస్తువులు; అవ్వారిగాఁగన్ = సమృద్ధము అగునట్టుగా; పెట్టున్.

తాత్ప :- వేయిమంది యతిథులు వచ్చినను ప్రవరుని భార్య యలయక వండిపెట్టఁగలదు. ఆమె అన్నపూర్ణాదేవికే సాటి. భోజ్యము లింట నిత్యము నుండుటచే, నతిథులు నడిరేయి వచ్చినను నామె వారి కాతిథ్య మీయఁగలైడిది.

వ్యా. వి :- నడిమికిన్ + రేయి = ఐచ్ఛిక సమాసములో 'మి' లోపము. అందుచే నడికి రేయి. రూపాంతరము 'నడిరేయి'.

వ్యు:- అతిథి (న+తిథి) = తిథి నియమములు లేక వచ్చువాఁడు.

సమాసము:-

అతిథి = నఞ్ తత్పురుషము. (న+తిథి)

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13

ప. 9. అర్థము :- అత్తరుణాగ్నిహోత్రి = ఎలప్రాయముగల ఆ యాహితాగ్ని- ప్రవరుఁడు; (అగ్నిహోత్రి యనఁగా నియతితో నగ్నిహోత్రమును వేల్చుచుండువాఁడు) అనుదినము = ప్రతిదినమును; తీర్థ సందర్శనాభిలాషము = తీర్థములఁజూచుట యందలి కోరిక; ఆత్మన్ = మనస్సునందు; ఉప్పొంగన్ = అతిశయింపఁగా; తీర్థసంవాసులు = పుణ్యా తీర్థములందు వాసముచేయువారు; (తీర్థ

యాత్రలు సలుపువారనియుఁ జెప్పవచ్చును.) ఏతెంచినారు = వచ్చినారు; అని విన్నన్ = అని యెవరేని చెప్పఁగా వినినయెడ; దవ్వు = దూరము; ఎంతయైనన్ = ఎంత యధికమైనను; ఎదురుగాన్ = వారికి నెదురోర్కొలుగా; ఏఁగున్ = పోవున్; ఏఁగి; తత్పదములకున్ = ఆ తీర్థవాసుల పాదములకు; ఎఱఁగి = మ్రొక్కి; ఇంటికిన్ = తన యింటికి; తెచ్చున్ = దీసికొని వచ్చును. తెచ్చి; సద్భక్తిన్ = మంచి భక్తితో; ఆతిథ్యము = అతిథి పూజను; ఇచ్చున్ = సమర్పించును. చేయుననుట; ఇచ్చి; మృష్టాన్న సంతృప్తులఁగాన్ = షడ్రసోపేత భోజనముచేతఁ దృప్తినొందిన వారలనుగా; చేయున్; చేసి; కూర్చున్నచోన్ = వారు భోజనముచేసి కూర్చుండినప్పుడు; చేరవచ్చున్ = వారిదగ్గఱకు వచ్చును. వచ్చి; ఇద్ధరన్ = ఈ భూమియందు;కల్గు...మాహాత్మ్యముల్ = ఉండునట్టి సముద్రముల యొక్కయు, నదుల యొక్కయు, పుణ్యనదీ క్షేత్రముల యొక్కయు, ప్రభావములను; తెలియన్ = విశదముగా; అడుగున్; అడిగి; యోజన పరిమాణము = ఆ తీర్థములకును, దానుండు చోటునకును గల యామడల కొలఁదిని; అరయున్ = విచారించును; అరసి = విచారించి; చూడన్ = ఆ తీర్థక్షేత్రములను జూచుటకు; పోవలయున్ = తాను బోవలయును; అనుచున్ = అని; ఊర్పులు = నిట్టూర్పులను; నిగుడ్చున్ = పుచ్చును.

తాత్ప:— తీర్థయాత్రాపరులు తమ పురికి వచ్చిరని విన్నచోఁ బ్రవరుఁడు పోయి వారి నాహ్వానించి తెచ్చి పూజించి తానును తీర్థయాత్రలు చేయవలెనని యువ్విళులూరుచుండును.

వ్యా. వి:- అత్తరుణాగ్నిహోత్రి; ఇద్ధరన్ = త్రికసంధులు; తీర్థ సందర్శన + అభిలాష, అత్తరుణ + అగ్నిహోత్రి = స. దీ. సంధులు.

సమాసములు :-

తీర్థ సంవాసులు = స.త; సద్భక్తి = కర్మ; మృష్టాన్న సంతృప్తులు = తృ.త; 1 వనధి పర్వత సరిత్, 2 తీర్థమాహాత్మ్యముల్ = 1 ద్వం. 2 ష.త; తీర్థ సందర్శనాభిలాష = స.త.

అలంకారము :-

ముక్తపద గ్రస్తము. ఇది శబ్దాలంకారము.

అలంకారౌచితి :-

ఇది సిద్ధాగమనమున కుపపత్తి; చిరకాలమునుండి హిమాచలమును జూడఁ బోవుటకై పెరుగుచున్న కారణసంపత్తి. ఈ పద్యమునకు మార్కండేయ పురాణమునందు, "అతిథి జనార్చనాభిరతుఁడై" యన్న పద్యము మూలము. కాని యీ ముక్తపదగ్రస్తమువల్ల వెల్లడియగు నుత్కంఠ మూలములో లేదు.

ఛందస్సు:- చూ॰ రాజసూయము- 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 10. అర్థము:- ఈ విధమునన్ = ఈ రీతిని; అభ్యాగత...జీవనుఁడై = భోజనార్థులయి యింటికి వచ్చిన యతిథుల యొక్క పరిచర్యకు అధీనమయిన సమస్తమయిన బ్రతుకుతెరువు గలవాఁడై —తన బ్రతుకున కంతయు నతిథి సేవయే ముఖ్యముగాఁ దలంచినవాఁడై ; భూదేవ కుమారకుఁడు = బ్రాహ్మణ పుత్రుఁడయిన ప్రవరుఁడు; ఉండంగాన్ = ఉండఁగా; వినుము—దీనికిఁ గర్త కృతిపతి. ఒకనాఁడు; కుతపకాలము నందున్ = మధ్యాహ్నానంతర కాలమునందు; (పగటిలోఁ బదునాల్గు గడియలకు మీఁది ముహూర్తము కుతపకాల మనఁబడును.) తరువాతి పద్యముతో నన్వయము.

తాత్ప :- ఈ రీతిగ నభ్యాగతులఁ బూజించుచుఁ బ్రవరుఁడుండఁగా నొక నాటి మట్టమధ్యాహ్నము దాఁటి—

సమాసములు :-

అభ్యాగత సేవ = ష.త; అభ్యాగత...జీవనుఁడయి = బహు; భూదేవి కుమారకుఁడు = ష.త.

విశేషము :—

సిద్ధుఁడు కుతపకాలమునకు వచ్చెననుట సంగతమని శ్రీ బోడపాటి రాజన్న పంతులుగారు సిద్ధాంతీకరించిరి. ఆ వాదము సాధువుగా నున్నది. అందుచే, కుతప కాల నిర్ణయము వారినిబట్టియే యెల్లరు స్వీకరించుచున్నారు.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 11. అర్థము :— ముడిచిన యొంటి కెంజెడ మూయన్ = ముడి వేసిన ఒక్కటయిన యెఱ్ఱని జెడ కమ్ముకొనునట్లు; ముువ్వన్నె మొగము తోలు = మూఁడు రంగులు గల మృగమైన పులియొక్క చర్మమును; కిరీటముగన్ = కుళ్లాయగా; ధరించి; కకపాల.........పాణిన్-కకపాల = కఱపాలను—సన్న్యాసులు చంకనుంచుకొనునట్టి యొకవిధమైన సంచిని; కేదార కటక = పంచ లోహములు చేర్చి చేసిన కడియముచేత; ముద్రిత = గుఱుతు గలదిగాఁ జేయఁబడిన - ఆ కడియమును ధరించిన యనుట; పాణిన్ = హస్తము చేత; కుఱుచ లాతము తోడన్ = పొట్టిదయిన యోగదండముతో; కూర్చి పట్టి = చేర్చి పట్టుకొని; ఐణేయమైన = ఆఁడు జింకతోలుతోఁ జేయఁబడినట్టి; ఒడ్డాణంబుల వడిచేన్ = నడికట్టు పట్టెయొక్క బిగువుచేత; అక్కళించిన పొట్టన్ = లోపలికి నణఁగిన కడుపును; మక్కళించి=ఉబ్బించి; ఆరకూటచ్ఛాయన్ = ఇత్తడి చాయను; అవఘళింపఁగఁ జాలు = అతిక్రమించుటకుఁ దగినట్టి; బడుగు దేహంబునన్ = బక్కటిల్లిన శరీరము

నందు; భస్మము = విభూతిని; అలఁది = పూసికొని; మిట్టయురమునన్ = ఎత్తయిన రొమ్మునందు; నిడుయోగపట్టె = యోగాభ్యాస సమయమునందు యజ్ఞోపవీతము వలె వేసికొనెడి నిడుపయిన పట్టుపట్టె; మెరయన్ = ప్రకాశింపఁగా; చెవుఁన్ = చెవులయందు; రుద్రాక్షపోఁగులు = రుద్రాక్షలు గ్రుచ్చిన రాల చెవిపోఁగులు; చవుకళింపన్ = ఊఁగులాడఁగా; కావికుబుసంబున్ = ఎఱ్ఱమట్టి చాయ చొక్కాయ యును; జలకుండికయును = నీళ్లతోడి కమండలవును; పూని = ధరించి; ఔషధ సిద్ధుఁడు = ఓషధుల సిద్ధిగల యోగీశ్వరుఁడు; ఒకఁడు; తద్గేహము = ఆ ప్రవరుని యింటిని; చేరెన్ = ప్రవేశించెను.

తాత్ప:- పులితోలుతోఁ జేయఁబడిన కుళ్లాయయు, పంచలోహములు చేర్చి చేసిన కడియమును, కక్షపాలయును, యోగదండమును, ఆఁడుజింక తోలుతోఁ జేసిన నడికట్టు పట్టెయు, యోగపట్టమును ధరించి, పసుపు వన్నెగల దేహమునందు విభూతి పూసికొని, రుద్రాక్షపోఁగులు పెట్టుకొని, కావి చొక్కాయ తొడిగి, నీళ్ల తోడి కమండలువును జేతఁబట్టినవాఁడయి యొక సిద్ధ పురుషుఁడు ప్రవరుని యింటికి వచ్చెను.

వ్యా. వి :- (1) కెం+జెడ = (1) సమాసంబులం బ్రాఁతాదుల తొలి యచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు = కె+జెడ. (2) లుప్తశేషంబునకుఁ బరుషములు పరములగునపుడు 'ను'గాగమంబగు. ఇచ్చట పరుషము పరముకాలేదు. (3) అన్యంబులకు సహితము ఇక్కార్యము (నుగా గమము) కానంబడియెడి. కావున—కె+న్+జెడ (4) పిమ్మట ద్రుతకార్య ములు = కెంజెడ రూపము సిద్ధించుచున్నది.

మూఁడు+వన్నెలు = (1) సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగు నపుడు మూఁడు శబ్దము డు వర్ణంబునకు లోపంబును మీఁది హల్లునకు ద్విత్వంబు నగు. కావున మూ+వ్వన్నె. (2) ద్విరుక్తమైన హల్లు పరముగ నాచ్ఛిక శబ్ద దీర్ఘమునకు హ్రస్వము- అందుచే మువ్వన్నెలు (3) ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగనగు = మువ్వన్నె.

**సమాసములు:-**

మొగముతోలు = ష.త; మువ్వన్నె మొగముతోలు = ద్విగు;

ఏణ శబ్దము. ఏణ సంబంధమైనది ఐణేయము = ఆఁడు జింక చర్మముతోఁ జేయఁబడినది యైణేయమైన ఒడ్డాణము.

**అలంకారము:-**

స్వభావోక్తి. (ఒక జాతిధర్మము నున్నదాని నున్నట్టు వర్ణించుట.)

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 12. ఇట్లు = ఈరీతిని; చనదెంచు = వచ్చిన; పరమ యోగీంద్రున్ = ఉత్తమ యోగీశ్వరుని; కాంచి = చూచి; (ప్రవరుఁడు); భక్తి సంయుక్తిన్ = భక్తితోడి కూడికచేత— భక్తితోఁగూడినవాఁడై యనుట; ఎదురేగి = ఎదురుగాఁ బోయి; ప్రణతుఁడు = నమస్కరించినవాఁడు; అగుచున్; అర్ఘ్యపాద్యాది పూజనంబు = అర్ఘ్యము, పాద్యము, మొదలుగాఁగల యుపచారములతోఁ బూజను; [అర్ఘ్యము =పూజకొఱకైనది; పాద్యము = పాదములకొఱకైనది; కాళ్లు చేతులు కడుగుకొన నీళ్లిచ్చి, పుష్పాదులతోఁ బూజించి యనుట.] ఆచరించి = చేసి; ఇష్ట మృష్టాన్న కలనన్ = ఇష్టమును, తృప్తికరమయినదియు నగు భోజనము పెట్టుట చేత; సంతుష్టున్ = సంతోషించినవానిఁగా; చేసి; దీనికిఁ దర్వాతి పద్యముతో నన్వయము.

తాత్ప :- పైన వర్ణింపఁబడిన రీతిగ వేషము సవరించుకొని వచ్చిన సిద్ధున కెదురేగి తెచ్చి యతిథి పూజలచే సంతోషపఱచి,—

వ్యా॰ వి :- మృష్ట + అన్నము = మృష్టాన్నము, పాద్య + ఆది = పాద్యాది = స. దీ. సంధులు.

సమాసములు :—

పరమ యోగీంద్రుఁడు; ఇష్ట మృష్టాన్నము = కర్మధారయములు.

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13

ప. 13. విద్వద్వందిత = పండితులచేఁ గొనియాడఁ బడినవాఁడా! (మీరలు) ఎందుండి = ఎక్కడనుండి; ఎందు బోవుచున్ = ఎక్కడికి బోవుచు; ఇందులకు = ఇక్కడికి; ఇప్పుడు = ఈ సమయమునందు; ఏతెంచినారలు = వచ్చినారు ? నేడుగదా = ఈ దినమునఁగదా; మన్మందిరము = మా యిల్లు; పవిత్రము = పావనము; అయ్యెన్; (నేను) మాన్యుఁడన్ = పూజింపఁ దగినవాఁడను; ఐతిన్.

తాత్ప:- ఓ యోగీంద్రా ! మీ రెచటినుండి యెచటికి బోవుచు, నిచటికి వచ్చినారు ? పెద్దలయిన మీ రాకచేత మాయిల్లు పావనమైనది. మీ దర్శనము చేత నేను బూజ్యతను బొందితిని.

వ్యా॰ వి :- మత్ + మందిరము = [నా యొక్క యిల్లు] అనునాసికము వికల్పముగా వచ్చును. కావున, మన్మందిరము (అనునాసిక సంధి) మద్మందిరము - అనునాసికము రాని రూపము.

సమాసము :—

షన్మందిరము = ష. త;

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 14. ఉర్విన్ = భూమియందు; మీ మాటలు = మీరు చెప్పెడి మాటలు; మంత్రంబులు = మంత్రముల వంటివి; మీ మెట్టినయెడ = మీరు త్రొక్కిన చోటు- మీరడుగు పెట్టిన తావు; ప్రయాగ = ప్రయాగ క్షేత్రమువంటిది; మీ పాద పవిత్రామల తోయములు = మీ పాదములు కడిగిన పరిశుద్ధములు, నిర్మలములు నయిన నీళ్లు; అలఘు ... పౌన రుక్త్యములు = అధికమయిన ఆకాశమార్గమునఁ బోవు నేఁటయిన గంగానదియొుక్క జలముల యొక్క పునరుక్తిగలిగినవి- అనఁగా అవియే మరలఁ జెప్పఁబడినవి. వానిని జెప్పినవెనుక వీనిని జెప్పుట పునరుక్తియే. వానినే మరలఁ జెప్పుట యగుననుట. మీ పాద తీర్థము లాకాశగంగా జలములతో సమానములని భావము.

వ్యా. వి:- మీ + మెట్టిన యెడ :- (మీ యొుక్క మెట్టిన యొుక్కచోటు) ష. తత్పురుషము. మెట్టిన + ఎడ = మెట్టిన యెడ. అత్తునకు సంధి బహుళముగా నగు. (చూ. బా. సం. సూ. 4)

సమాసములు :—

మీ మాటలు = ష.త; అలఘు = న. తత్పురుషము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 15. భవాదృశ యోగి జనంబు = మీవంటి యోగుల సమూహము; ఎవ్వాని గృహాంతరంబునన్ = ఎవని యింటిలోపల; వేఱు సేయక = భేద మెంచక; పావన ... పానములన్ = పవిత్రమయిన స్నానవిధిచేతను, భోజనముచేతను, నీళ్లు త్రాగుటచేతను; నిచ్చలున్ = ఎల్లప్పుడును; సంతసము అందుచున్ = సంతోషమును బొందుచు; బోవున్ = పోవుచుండునో; వానిది = అటువంటి వానిది; భాగ్య వైభవము = అదృష్ట సంపద; వానిది = ఆ పురుషునిది; పుణ్య విశేషము = సుకృతాతిశయము. వానిది; ఎమ్మెయిన్ = ఏవిధము చేతను; అవంధ్య జీవనము = వ్యర్థముగాని బ్రతుకు; వానిది; జన్మము = పుట్టుక - అటువంటి గృహస్థుని పుట్టుకయే సార్థకమనుట.

తాత్ప:- ఓ యోగీశ్వరా! మీవంటి పెద్ద లెవనియింట భేదములేక స్వబంధువులవలెనే స్నాన భోజన పానములు చేసి, తృప్తినొంది పోవుచుందురో, యా గృహస్థుఁడు భాగ్యవంతుఁడును, బుణ్యవంతుఁడు నగును. అటువంటి గృహస్థునిదే సార్థక జన్మము నగును.

వ్యా. వి :- (1) ఎమ్మెయిన్; ఎవ్వాని = త్రికసంధులు. (2) వేఱు + చేయక = ప్రథమముమీఁది పరుషములకు గ, స, డ, ద, వా, దేశము, (3) వాని + అది = వానిది = అది, అవి శబ్దంబుల అత్తునకు వృత్తిని (సమాసములో) లోపంబు బహుళంబుగానగు-కాన, వానిది. చూ. బా. వ్యా. సంధి. సూ. 45. (4) గృహ + అంతరంబు = స. దీ. సంధి.

సమాసములు:-

(1) న + వంధ్యము = అవంధ్యము = నఞ్ తత్పురుషము. (2) యోగి జనంబు = ష. త.

ఛందస్సు- చూ. రాజసూయము. 15వ పద్య వ్యాఖ్య. పుట 23.

ప. 16. మౌనినాథా = ముని శ్రేష్ఠుఁడా!; కుటుంబ... మండలంబున్ — కుటుంబ = సంసారమనెడి; జంబాల = బురద యొక్క; పటల = సమూహము నందు; మగ్న = మునిగిన; మాదృశ = నావంటి; గృహమేధి మండలంబున్ = గృహస్థుల యొక్క సమూహమును; ఉద్ధరింపంగన్ = ఆ యడుసునుండి లేవనెత్తుటకు; యుష్మదంఘ్రి రజోలేశము = మీ పాదముల యొక్క దుమ్మురవ; ఒకటి తక్కన్ = ఒకటే తప్ప; ఔషధము = మందు; ఒండు = ఇతరము; కలదె = ఉన్నదా?— లేదనుట.

తాత్ప:- ఓ మునీంద్రా! బురద యందువలెనే పెట్టిన కాలూఁడదీసికొన శక్యముకాని సంసారమునందు మునిఁగియున్న మావంటివారి నుద్ధరింపఁజాలినది మీపాదధూళి యొకటే కాని, మఱి యేదియుంగాదని తాత్పర్యము. పాదధూళి సోఁకినమాత్రమున, సంసార బంధము వీడిపోవునని భావము.

వ్యా. వి:- రజస్ + లేశము = రజోలేశము. అసంతపద సంధి.

సమాసములు :—

కుటుంబ + జంబాలము = కర్మధా; కుటుంబ జంబాల పటలము = షష్ఠీ తత్పురుషము.

అలంకారము :—

రూపకము.

విశేషము :—

'కుటుంబ జంబాల పటల మగ్న' అనుటచే 'మేము సంసారమునం దగులు వడి, యిల్లు వదలిపోవుటకు వీలులేని వారము. కావున మీరలై మాయింటికివచ్చి,

మీ పాద ధూళిచే మమ్ము సంసారమునుండి యుద్ధరింప వలయు' నని ధ్వని. పటల శబ్దముచే సంసారము యొక్క బాహుళ్యమును, సులభముగాఁ బరిహరింప రామియు సూచితములు. 'జంబాల మగ్న'లకు 'అంఘ్రి రజ'మే యుద్ధారక ముగాఁ జెప్పుటచే బురదయందు రజముపడి, నిండినయెడల నందలి నీరింకునుగాన, నందు మరల దిగఁబడుట కలుగదు. కావున నదియే మము బోఁటులకు నుద్ధారక మగునని సారస్యము. మిమబోఁటి వారి పాద సేవచే మా సంసార బాధ నివృత్తి మగునని ధ్వని.

ఛందస్సు:- చూ. రాజసూయము—6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 17. నాన్ = అని ప్రవరుఁడు చెప్పఁగా, విని; ముని = సిద్ధుఁడు; ఇట్లనున్; వత్సా ! = ఓయి చిన్నవాఁడా ! విను = నా మాట వినుము; మావంటి తైర్థికావళికిన్ = మాబోఁటి తీర్థయాత్ర చేయువారి సమూహమునకు; ఎల్లన్ = అందఱకును; తీర్థ సేవయున్ = గంగా ప్రయాగాది పుణ్య తీర్థముల సేవించుట గూడ; తలఁపన్ = విచారింపఁగా; మీ వంటి గృహస్థుల సుఖ జీవనమునఁ గాదె = మీబోఁటి గృహస్థులు సుఖముగా జీవించుట చేతనే కదా !

తాత్ప:- ప్రవరుఁడిట్లు విన్నవింపఁగా, సిద్ధుఁడు "ఓ చిన్నవాఁడా ! మీవంటి గృహస్థులు సుఖముగా జీవించుచుండుట వలననే మావంటి తీర్థయాత్రాపరు లాతిథ్యము మొదలయినవి పడసి, తీర్థయాత్రలు సేయఁగల వారైరి. మీవంటివారే లేనియెడ యాత్రాపరు లూరక యున్నతావుననే యుండవలసిన వారేకదా!" యని పలికెను.

వ్యా. వి:- తైర్థిక + ఆవళి = తైర్థికావళి = సవర్ణ దీర్ఘ సంధి.

సమాసములు:-

(1) తైర్థికావళి, (2)తీర్థసేవ = ష. తత్పురుషములు.

ఛందస్సు:-చూ. రాజసూయము-1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 18. గృహమేధి=గృహస్థుఁడు; బధిర....అనాథులకున్—బధిర = చెవిటివారు; పంగు = కుంటివారు; అంధ = గ్రుడ్డివారు; భిక్షుక = బిచ్చగాండ్రు; బ్రహ్మచారి = వడుగులు; జటి = వానప్రస్థులు; పరివ్రాజక = సన్న్యాసులు; అతిథి = అగంతకులు; క్షపణక = క్షపణక మతస్థులు- అనఁగా బౌద్ధులయిన భిక్షుకులు; అవధూత = దిగంబరులు; కాపాలిక = కాపాలిక మతస్థులు— తల పుఱ్ఱె పెంకుతో భిక్షమెత్తి జీవించువారు; ఆది = మొదలుగాఁగల; అనాథులకున్ = దిక్కులేని వారలకు; ఎల్లన్ = అందఱకును; కెలఁకులన్ = పార్శ్వములయందు; ఉన్న; తంగేటిజున్ను = తంగేటి చెట్టునందుఁబెట్టఁబడిన; తేనెపెరవంటివాఁడు; యజమా

నుఁడు = గృహస్థుఁడు; అంకస్థితార్థపేటి = తొడపైనుండెడి రూకల పెట్టెవంటి వాఁడు; వాస్తవ్యుఁడు = గృహస్థుఁడు; పండిన పెరటి కల్పకము = ఫలించిన యింటివెనుక దొడ్డి యందలి కల్పవృక్షమువంటివాఁడు; కాఁపు = గృహస్థుఁడు; దొడ్డిన్ = పశులదొడ్డియందు; పెట్టిన వేల్పుగిడ్డి = కట్టివేసి యుంచిన కామధేనువు వంటివాఁడు; సంసారి = గృహస్థుఁడు; కడలేని యమృతంపు నడబావి = అంతము లేని అమృతము యొక్క నడవ యేర్పఱచినట్టి బావివంటివాఁడు; భవన భర్త = గృహస్థుఁడు; సవిధమేరునగంబు = సమీపము నందున్న మేరుపర్వతము వంటివాఁడు; కులపతి = గృహాధిపతి— గృహస్థుడు; మరుదేశ పథ మధ్యమ ప్రప = నీళ్లులేని ప్రదేశమునందు మార్గమధ్యమున నుండెడి చలి పందిరివంటివాఁడు; కుటుంబి = గృహస్థుఁడు; ఆఁకటికిన్ = ఆఁకలియెత్తినవేళకు; ఒదవు సస్యము = ఉపయోగించునట్టి పైరువంటివాఁడు; భూసురోత్తమా! = బ్రాహ్మణ శ్రేష్ఠుఁడా!; గార్హస్థ్యమునకున్ = గృహస్థ ధర్మమునకు; సరియె = (ఇతరాశ్రమ ధర్మములు) సమానములా? కావనుట. ఇందుఁ దంగెటిజున్ను మొదలగునవి యనాయాస ముగా లభించునను నర్థముం దెలుపును.

తాత్ప :-చెవిటి, కుంటి, గ్రుడ్డి మొదలయిన దిక్కుమాలినవారి కెల్లను గృహస్థుఁడే రక్షకుఁడు. కాఁబట్టి గృహస్థాశ్రమమువంటి యాశ్రమము లేదు.

వ్యా. వి :-(1) అమృతంబు + నడబావి = అమృతంపు నడబావి. 'మ్బుము' అనునవి పు,ంపులుగా మారును. (చూ. బా. వ్యా. సం. సూ 32) (2) పంగు + అంధ = పంగ్వంధ (యణాదేశ సంధి). (3) భూసుర + ఉత్తమ = భూసురోత్తమ. (గుణ సంధి)

సమాసములు :-

(1) గృహ + మేధి = (మేధృ సంగమే) (గృహిణీ గృహ ముచ్యతే - గృహమనగా నిట భార్య) భార్యతోఁగూడినవాఁడు. తృ. తత్పురుష సమాసము. (2) అంకస్థితము = స.త; (3) అర్థపేటి = ష.త. (4) అంకస్థితార్థపేటి = క.ధా. (5) భవన భర్త = ష. తత్పురుష సమాసము. (6) సవిధమేరు నగము = స. త. (7) వేల్పుగిడ్డి = ష.త. (8) బధిర పంగ్వంధ .... కాపాలిక 1 + 2 ఆది + అనాథులు = 1 ద్వంద్వము 2 కర్మధా.

అలంకారములు :-

రూపకము, ఉల్లేఖమును. (ఒకఁడే బహువిధములుగ వర్ణింపఁబడుట యుల్లేఖాలంకారము. ఒక్క గృహస్థుఁడే తంగెటి జున్ను అనియు; అర్థపేటి యనియు పెక్కురీతులఁ బ్రశంసింపఁబడుటచే నిందలిది యుల్లేఖాలంకారముకూడ నగును.)

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 19. నావుడున్=అని సిద్ధుఁడు చెప్పఁగనే; ప్రవరుండు; ఇట్లు; అనున్; దేవా !=స్వామి !; దేవర=దేవరవారు - మీరు; ఇలపై =భూమిమీఁద; సమస్త తీర్థాటనమున్ = ఎల్ల తీర్థములను గూర్చి తిరుగుటను - సకల తీర్థయాత్ర లనుట; కావింపుదురు = చేయుదురు. అటుగావునన్ = అట్లు కాఁబట్టి; విభజించి= (ఒక్కొక్క విషయమును) వేఱుపఱచి - వేఱు వేఱుగా ననుట; అడుగన్ = అడుగుటకు; కౌతుకము అయ్యెన్ = వేడుక కలిగెను.

వ్యా. వి :- కావింపుదురు. 'అగు' ధాతువు, ఇంచుక్ ఆగమముచేఁ 'కావించు' అగును. అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు= కావింపు+దురు = కావింపుదురు.

సమాసములు:-

సమస్తతీర్థాటనము = కర్మ; తీర్థాటనము = ష. త.

ఛందస్సు:- చూ. రాజసూయము, 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 20: మహాత్మా = ఓ మహానుభావా!; మీరు; ఏయే దేశములన్ = ఏయే దేశములయందు; చరించితిరి = తిరిగితిరి?; ఏయే గిరుల్ = ఏయే పర్వతములు; చూచినారు = చూచితిరి?; ఏయే తీర్థములందున్ = ఏయే పుణ్యోదకములందున్; క్రుంకిడితిరి = స్నానము చేసితిరి?; ఏయే ద్వీపముల్ = ఏయే దీవులను; మెట్టినారు = త్రొక్కిరి?— ప్రవేశించితిరి?; ఏయే పుణ్యవనాళిన్ = ఏయే పుణ్యారణ్య పంక్తి యందు; క్రమ్మరితిరి = తిరిగితిరి?; ఏయే తోయధుల్ = ఏయే సముద్రములను; డాసినారు = సమీపించితిరి?; స్నానార్థము చేరఁబోయితిరనుట; ఆయాచోటన్ = ఆయా ప్రదేశములందు; కల్గువింతలు = కలయట్టి యాశ్చర్యములను; నాకున్; ఎఱింగింపరే? = తెలియఁజేయరయ్యా!

తాత్ప:- ఓ మహానుభావా! మీరు తిరిగినదేశములను, మీరాడిన తీర్థములను, చూచిన కొండలను, చొచ్చిన దీవులను, విహరించిన పుణ్యారణ్యములను, స్నానార్థము పోయిన సముద్రములను, వానివాని యందుఁగల వింతలను నాకు విశదముగా నానతీయవలయును.

వ్యా. వి:- పుణ్యవన + ఆళి = స. దీర్ఘసంధి.

సమాసములు:-

(1) పుణ్యవనము = కర్మధారయము; (2) పుణ్యవనాళి = ష. తత్పురుషము

ఛందస్సు:- చూ. అంబరీషోపాఖ్యానము- 1వ పద్య వ్యాఖ్య. పుట 85.

ప. 21. పోయి = పుణ్యతీర్థయాత్ర పోయి; సేవింపలేకున్నన్ = ఆ పుణ్య తీర్థానుభవము చేయలేక యున్నను; పుణ్య తీర్థమహిమ = పుణ్యతీర్థముల యొక్క ప్రభావమును; వినుటయున్ = (మీబోఁటి పెద్దలవలన) వినుటకూడ; అఖిల కల్మష హారంబ = ఎల్లపాపములను పోఁగొట్టునదే! ( అగుడు); కానన్ = కనుక; వేఁడెదన్ = ప్రార్థించెదను; అనినన్ = అని ప్రవరుఁడు వేఁడఁగా: అమ్మౌనివరుఁడు = ఆ మునిశ్రేష్ఠుఁడు; ఆదరాయత్త చిత్తుఁడై = ఆదరమునకు నధీనమయిన మనస్సు గలవాఁడై - ఆదరణతో ననుట; అతనికిన్ = ఆ ప్రవరునితో; అనియెన్ = ఇట్లు చెప్పెను.

వ్యా. వి:- (1) ఆ + మౌనివర్యుఁడు = త్రికసంధి. (2) కల్మషహారంబు + అ = పాపములను బోగొట్టునదియే. అకారము నిశ్చయార్థకమైన అవ్యయము.

సమాసములు:-

(1) మౌనివర్యుఁడు = విశేషణోత్తర పద కర్మధారయము.(2)ఆదరాయత్త చిత్తుఁడు = బహువ్రీహి.

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 22. ఓచతురాస్య...శశాంక = ఓయి, బ్రహ్మయొక్క వంశమనెడు పాల సముద్రమునకు నిండు చంద్రుఁడయిన ప్రవరుఁడా!; తీర్థయాత్రాచణ శీలినై = తీర్థయాత్రలు చేయుటయందు సమర్థమయిన స్వభావముగలవాఁడనై ; జనపదంబులున్ = దేశములను; పుణ్యనదీనదంబులున్ = పవిత్రములయిన నదులను, నదములను (తూర్పుతట్టు ప్రవహించునవి నదులు; పడమరతట్టు ప్రవహించునవి నదములు అని తెలియునది.) చూచితిన్; ఆ పటీరాచల...దిశాచలంబులన్—ఆ = ప్రసిద్ధమైన; పటీరాచల = మలయ పర్వతము; పశ్చిమాచల = అస్తపర్వతము; హిమాచల = హిమవత్పర్వతము; పూర్వదిశాచలంబులన్ = ఉదయ పర్వతము; ఈ నాలుగు పర్వతములందు; అందునందున్ = అక్కడక్కడ; కల చోద్యములన్ = ఉన్నట్టి వింతలను గూడ; కనుఁగొంటిన్ = చూచితిని.

తాత్ప:- బ్రాహ్మణోత్తమా! తీర్థసేవలు సేవించుచు పెక్కు నగరములును, బుణ్యనదీనదములును, నలుదిక్కులయందలి పర్వతములును కనుగొంటిని.

వ్యా. వి:- (1) చతుర + ఆస్య = చతురాస్య (స. దీ. సంధి) (2) కలశ + ఉదధి = గుణసంధి.

విశేషార్థము:-

బ్రాహ్మణవంశమనుటకు 'చతురాస్యవంశమ'ని బ్రహ్మకుఁగల నాలుగు మోములను దలఁపించుట, తాను పటీరాచలాదికములైన నాల్గిటిని జూచుటచే సార్థకము.

సమాసములు:-

(1) చతురాస్యుఁడు = బహు; చతురాస్యవంశము = ష. తత్పు; (3) చతురాస్యవంశ కలశోదధి = కర్మధారయ సమాసము, (4) చతురాస్య.... పూర్ణ శశాంక = ష. తత్పురుషము.

అలంకారము:-

(1) వంశకలశోదధి (వంశమనెడి పాలసముద్రము) = రూపకము. (2) "ఓ చతురాస్యవంశ..."అను సంబోధనము శ్రీనాథుని పాదమును బోలినను నిది సాభిప్రాయమైనది. కాన పరికరాలంకారము.

ఛందస్సు:- చూ. రాజసూయము- 15వ పద్య వ్యాఖ్య. పుట 23.

గమనిక:-

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

ప. 23. కేదారేశున్ = కేదారేశ్వరుఁ డనెడి శివమూర్తిని; భజించితిన్ = సేవించితిని; హింగుళాపాదాంభోరుహముల్ = హింగుళ యనెడి మహాదేవి యొక్క పాదకమలములను; శిరమునన్ కీలించితిన్ = తలయందు చేర్చితిని–నమస్కరించితి ననుట; ప్రయాగ నిలయున్ = ప్రయాగక్షేత్ర మునికిపట్టుగాఁగల; పద్మాక్షున్ = మాధవస్వామిని; సేవించితిన్ = కొలిచితిని; యాదోనాథ సుతాకళత్రున్ = సముద్రుని యొక్క కూతురైన లక్ష్మీదేవి భార్యగాఁగల; బదరీ నారాయణున్ = బదరికాశ్రమమునందలి నారాయణ దేవుని; కంటిన్ = చూచితిని; ఈ యా దేశంబు = ఈ దేశ మా దేశము; అనన్ ఏల? = అనుట యేమి?; సమస్తాశావకాశంబులన్ = ఎల్లదిక్కుల మధ్య ప్రదేశములను; చూచితిన్.

తాత్ప :- కేదారేశుని, శివుని, హింగుళ యనెడి మహాదేవిని, ప్రయాగలోని విష్ణుని, బదరీ నారాయణునిఁ బెక్కు దేవతలను బూజించి నానాదేశములను బర్యటించినాఁడను.

వ్యా. వి :- (1) కేదార + ఈశు = కేదారేశు (గుణసంధి) 2. పాద + అంభోరుహముల్, (3) పద్మ + అక్షు = స. దీ. సంధులు. (4) అంభస్ + రుహము, (5) యాదస్ + నాథుఁడు = అసంతపద సంధులు. యాదస్సు అనఁగా జలజంతువు. దానికి నాథుఁడు సముద్రుఁడు. అతని కూతురు లక్ష్మి. ఆమెను భార్యగా గలవాఁడు విష్ణువు, లేక బదరీనారాయణుఁడు.

సమాసములు :-

యాదోనాథసుతాకళత్రుఁడు = బహువ్రీహి; పద్మాక్షుఁడు = బహువ్రీహి. పాదాంభోరుహములు = కర్మధారయము.

అలంకారము :—

ఇందలి యలంకారమును రూపకము.

ఛందస్సు :— చూ. అంబరీషోపాఖ్యానము. 1వ పద్య వ్యాఖ్య. పుట 85.

వ. 24. గృహస్థరత్నంబ! = గృహస్థులలో శ్రేష్ఠుఁడయిన యో ప్రవరుఁడా! అది = ఆ వృత్తాంతము; అట్లుండెన్ = అటుండనిమ్ము. వినుము = నే నీకు మీఁదఁ జెప్పఁబోవు వృత్తాంతము వినుము. లంబమాన...సముదయంబగు-లంబమాన = వ్రేలుచున్న; రవిరథ = సూర్యుని తేరిదైన; తురంగ = గుఱ్ఱములకు; శృంగార = అలంకారముగా నున్న; చారు = సుందరములయిన; చామర = వింజామరల యొక్క; ఛటా = గుదులను; ప్రేక్షణ = చూచుట యనెడి; క్షణ = ఉత్సవము చేత; ఉద్గ్రీవ = పైకెత్తఁబడిన మెడలుగల; చమర = సవరపు మృగముల యొక్క; సముదయంబగు = సమూహము కలిగినట్టి; ఉదయంబునన్ = ఉదయ పర్వతము నందు; కల విశేషంబులు; శేష...శక్తినైనన్ = (వేయినోళ్లు గల) యాదిశేషుని కైనను; లెక్కింపన్ = ఇన్ని యని లెక్కలు పెట్టుటకు; శక్యంబె = తరమా ? అంధక...వలయంబగు. అంధకరిపు = అంధకాసురుని శత్రువైన శివుని యొక్క; కంధరా = మెడయే; ఆవాస = ఉనికిపట్టుగాఁ గల: వాసుకి = సర్పరాజైన వాసుకి యొక్క; వియోగ = ఎడఁబాటువలన; భవ = పుట్టిన; దుర్వ్యథా = చెడ్డ విచారము యొక్క; ఆభోగ = అతిశయముగల; భోగినీ = సర్పస్త్రీల యొక్క; భోగభాగ = శరీర భాగములచేత; పరివేష్టిత = అంతటను జుట్టఁబడిన; పటీరవిపటి = గంధపు మ్రాఁకుల యొక్క; వాటికా = వరుసలయందు; వేల్లత్ = అల్లుకొను చున్న; ఏలాలతా = ఏలకి తీఁగెలయొక్క; వలయంబు అగు = సమూహములు గలిగినట్టి; మలయంబునన్ = గంధపుఁ గొండయందు; కల చలువకున్ = ఉన్న చల్లఁ దనమునకు; విలువ ఎయ్యది = వెల ఏది?- లేదనుట; అకటకట = ఆశ్చర్యము! వికట....హస్తంబగు- వికట = హెచ్చు తగ్గులై యుండెడి; కూటకోటి = శిఖర సమూహముల యందలి; విటంక = ముంజూరునందలి గువ్వగూండ్ల సందులవంటి సందులయందుఁగల; శృంగాటక = నాలుగు త్రోవలును కలియు మార్గములందు; ఆఘాకమాన = అంతటను సంచరించుచున్న; శరదిందుబింబ = శరత్కాల చంద్ర మండలమువల్ల నుండి; గళత్ = జాఱుచున్న; అమృతపు బిందు = అమృతపు బొట్ల చేతనైన; దుర్దిన = మబ్బుకమ్మిన దినముచేత; ఆర్ద్రీకృత = తడిసినవిగాఁ జేయఁ బడిన; సల్లకీ పల్లవ = అందుగుఁ జిగుళ్ల యొక్క; ప్రభంజనపర = మిక్కిలి ధ్వంసము చేయుటయం దాసక్తి గల; అంజనహస్తి = అంజనమనెడి పడమటి దిగ్గజము యొక్క; హస్తంబు = తొండము గలిగినట్టి; అస్తంబునన్ = అస్తమయ పర్వతమునందు; కల మణిప్రస్తరంబుల విశ్రాంతిన్ = ఉన్న మానికపురాలపై విశ్రమించుటను; చింతిం చినన్ = తలఁచికొన్నచో; మేనన్ = దేహమునందు; పులకలు = గగుర్పాటు; ఇప్పుడున్ = ఇప్పుడుగూడ; పొడమెడున్ = పొటమరించుచున్నవి. స్వస్వ...మూర్తాశ్ం

బగు- స్వస్వప్రవర్ధిత = తమ తమ చేతఁ బెంపఁబడినవైన; వర్ధిష్ణు = పెరుఁగు స్వ స్వభావము గల; ధరణీరుహ = వృక్షముల యొక్క; సందోహ = సమూహము యొక్క; దోహద = అకాలమునందుఁ బుష్పింపఁజేయు క్రియయే; ప్రధాన = ముఖ్యమౌనట్టుగాను; అసమాన = సరిలేనట్టుగాను; ఖేలత్ = క్రీడించుచున్న; ఐ బిల విలాసినీ = కుబేరుని యంతఃపుర స్త్రీల యొక్క; విలాస = వినోద విహా ములయందు; వాచాల = మ్రోఁగుచున్న; తులాకోటి = అందెల యొక్క; కలకల = కోలాహల ధ్వనులచేత; ఆహూయమాన = పిలువఁబడుచున్న; మానస = మానస మనెడి సరోవరమునందున్న; మదాలస = మదముచే మందము లగుచున్న; మరా ళంబగు = హంసలు గలిగినట్టి; రజత శైలంబు నోలంబులన్ = వెండికొం యొక్క, మఱుఁగుతావులయిన; కాలగళు విహార ప్రదేశంబులన్ = శివుని వినో సంచార స్థానములను; కన్నన్ = చూచినయెడ; సంసృతి క్లేశంబులు = సంసా దుఃఖములు; పాయవె? = తొలఁగిపోవా? [స్త్రీలు నడచునప్పుడు కాలియందెల మ్రోఁగుట హంసలు కూయునట్లుండును, గనుక కుబేర స్త్రీలు విహరించునప్పు యందెల చప్పుళ్లు విని, హంసలు తమజాతిపక్షుల ధ్వనులని భ్రమించి, వారివారి జేరవచ్చునని సంబంధము.] సతత...ధురంధరం బగు- సతత = ఎల్లప్పుడు; మద జల స్రవణ = మదపునీటిని జార్చుటయందు; పరాయణ = ఆసక్తమయిన; ఐరా వణ = ఇంద్రుని యేనుఁగైన యైరావతము యొక్క; విషాణకోటి = కొమ్ము కొనలచేత; సముట్టంకిత = చక్కఁగాఁ బొడువఁబడిన; కటక = కొండ కడిమి నేలలందు; పరిస్ఫురత్ = మిక్కిలి వెలుఁగుచున్న; కురువింద = (మదకోకి ముల నేత్ర కాంతివంటి కాంతిగల) కెంపుల యొక్క; కందళ = వెలుఁగు మొ కల యొక్క; వ్రాత = సమూహము వలన; జాత = పుట్టిన; అలాతశంకా = కొఱవు లనెడి సందేహముచేత; అపసర్పత్ = ఎడముగాఁ దొలగి పోవుచున్న; అభ్రము = ఐరావత గజము భార్యయయిన యభ్రమువు యొక్క; భ్రమీ = గిరగిరఁ దిరుగుట వలని; విలాస = ఒయ్యారము యొక్క. ధురంధరంబు అగు = భారము వహించి నట్టి; మేరుధరాధరంబు శిఖరంబుల సోయగంబులు = మేరు పర్వతపు శృంగముల యొక్క చక్కఁదనములను; కలయన్ = అంతటను; కనుంగొనుట = చూచుట; బహు...పాకంబునన్ = అనేక జన్మములయందు చేయఁబడిన పుణ్యముల యొక్క పరిపక్వమయిన ఫలము చేత; కాక = కాని; ఏల చేకూర నేర్చున్ = ఎట్లు సిద్ధింపఁ గలదు? (అభ్రమువు కురువిందమణులను గొఱవులనుగా శంకించెనన్న చోట యలంకారము- భ్రాంతిమంతము). నేను-(ఇది సిద్ధుని కన్వయము) ఇట్టి మహాద్భుతంబులు = ఇటువంటి దొడ్డవింతలను; ఈశ్వరానుగ్రహంబునన్ = దేవుని యనుగ్రహముచేత; అల్పకాలంబునన్ = కొంచెపుఁ గాలముననే; కనుంగొంటిన్ = చూచితిని; అనుటయున్ = అని సిద్ధుఁడు చెప్పఁగా; ఈషత్...యుగళుండు = కొంచెము నవ్వును గ్రమింగునట్టి స్వభావము గల (అణఁచుచున్న) చెక్కిళ్లజంట గలవాఁడు; అగుచున్; ప్రవరుండు; అతని కిట్లనియెన్.

తాత్ప :- ఉదయ పర్వతమునందలి విశేషముల నాదిశేషుఁడు గూడ లెక్కింపలేఁడు. మలయాద్రి చలువ, విలువ కట్టరానిది. అస్తగిరిని దలఁచినఁ బుల్కలు బొడమును. హిమాద్రిని గన్న సంసారక్లేశములే తీరిపోఁగలవు. మేరువును జూచుట పూర్వజన్మ సుకృతము.

విశేషము:—

రజతశైలమనఁగా వెండికొండ. ఇదియే హిమాద్రి. ఇందు శివుఁడు విహరించిన తావుల దర్శించినచోఁ దిరిగి పుట్టుటయను బాధ తప్పునని ప్రవరుని నమ్మిక. సిద్ధుని పలుకులలో వచ్చిన యీ హిమాద్రి ప్రసంగమే యుత్తరోత్తర ప్రవరుని యాత్రకుఁ బ్రోత్సాహకమైనది.

వ్యా. వి :- రజత శైలంబు+ఽ+ఓలంబు = రజత శైలంబు నోలంబు = (శైలము యొక్క మఱుఁగుతావు). షష్ఠీ తత్పురుషము. షష్ఠీ సమాసమునందు కార ఋకారముల కచ్చు పరమగు నపుడు నుగాగమంబగు. (చూ. బా. వ్యా. సం. సూ. 34)

సమాసము :—

(1) లంబమాన........చమర సముదయంబు = ష. తత్పురుషము; (2) అంధకరిపు........వాటికా వేల్లి దేలాలతా వలయంబు = ష. తత్పు; (3) వికట కూట కోటి....... హస్తి హస్తంబు = బహువ్రీహి; (4) స్వస్వ ప్రవర్ధిత........ మరాళంబు = బహువ్రీహి.

అలంకారములు :—

సూర్యుని గుఱ్ఱములకు నలంకారముగా వ్రేలవేసిన వింజామరలను దమ జాతి మృగములని చమర మృగములు భ్రమయుట, హంసలు స్త్రీల యందెల చప్పుడు తమ జాతి పక్షుల కూతలని భ్రమయుట-అను నిట్టిచోట్ల భ్రాంతి మదలంకారము గమ్యము. వాసుకి వియోగమువలని తాపము చేత సర్పస్త్రీలు గంధపు మ్రాఁకులం జుట్టుకొనె నన్నచోట అలంకారము ఉత్ప్రేక్ష.

ప. 25. వెఱవక = భయపడక; ఒక విన్నపము = ఒక విజ్ఞాపనము; మీకున్ = తమకు- ఒనర్తున్ = చేయుదును- మిమ్మునొక్క విషయమడిగెదనుట; ఇట్టివి యెల్లన్ = ఇటువంటి వింతలన్నియు; చూచిరాన్ = చూచివచ్చుటకు; ఎఱకలు = ఱెక్కలను; కట్టుకొన్నన్ = కట్టుకొనినను- ఱెక్కలు కట్టుకొని యెగిరి పోయినను; మఱి = ఇంకను; పండ్లును బూండ్లును = అనేక సంవత్సరముల కాలము; పట్టున్; మీ మొగము; ప్రాయపుం జిఱుతతనంబున్ = వయస్సు యొక్క లేఁతఁదనమును; చెప్పక చెప్పెడున్ = ఒకఱు చెప్పనక్కఱ లేకయే

తెలియఁజేయుచున్నది— మీ ముఖమే మీ లేఁతవయస్సును దెలుపుచున్నదనుట. అద్దిరయ్యా ! = ఆశ్చర్యము ! మీ మహిమలు = మీ ప్రభావములు; మాకున్ = మావంటి వారికి; ఎఱుఁగన్ తరంబె = తెలిసికొన సాధ్యమా ? ఈర = మీరే; ఎఱుంగుదురు = సుతెలుఁగుదురు- మీ మహిమ మీకేగాని యితరులకుఁ దెలియ దనుట. ఏమి చెప్పుదున్ = ఇఁక నేనేమి చెప్పఁగలను ?

తాత్ప :- నేను జంకక మిమ్ము నొక్క విషయ మడిగెదను. మీరు చెప్పిన విశేషములను లెక్కలు గట్టుకొని పోయి చూచి రాదలఁచినను లెక్క సంవత్సరములు పట్టును. ఇఁక నడచిపోయి చూచి రాఁవలయునన్న ఁజెప్పవలయునా? ఇది యిట్లుండ మీ మొగముఁ జూడఁగా మీరు మిక్కిలి పసివారగుట స్పష్టముగ తెలియుచున్నది. ఇంతలో వాని నెల్ల నెట్లు చూడఁజాలితిరో ! మీ మహిమ మీకే కాక మఱి యెవ్వరికి ఁదెలియును ?

వ్యా. వి :- నీ, మీ, నే, మే,-హల్లులకు లోపంబు విభాషనగు. (ప్రౌఢ. వ్యా.) అట్లగుటచేత నిచట, ఈరు='మీరు' లోని హల్మాత్రమైన మకారము లోపింపఁగా సిద్ధించిన రూపము అని వైయాకరణులు. బహువచన వాచకమగు 'ము' కంటె పరమైన "ఈ" సంధిచే, 'మీ'గా మాఱి, 'మీరు' అనుపదము సిద్ధించుటకు కారణమైనదని భాషాతత్త్వజ్ఞులు.

నుడికారములు:—

(1) చెప్పక చెప్పుట, (2) పండ్లును పూండ్లును బట్టుట.

ఛందస్సు:— చూ. రాజసూయము 9 వ పద్య వ్యాఖ్య. పుట 17.

ప. 26. అనినన్ = ఇట్లని ప్రవరుఁడడుగఁగా; పరదేశి = సిద్ధుఁడు; గృహపతికిన్ = గృహస్థుఁడైన ప్రవరునితో; అనియెన్ = ఇట్లు చెప్పెను; సందియమున్ = కలిగిన సందేహమును; తెలియన్ = విశదముగాఁ దెలియునట్లు; అడుగుట తప్పా = నేరమా ? (కాదనుట). వినవయ్యా = వినుము. సిద్ధులము అగుటన్ = (మేలు) ఔషధసిద్ధిగలవారము కావున; మమ్ము: జరయున్ = ముసలితనమును; రుజయున్ = వ్యాధియును; చనకంగాన్ = ముట్టుటకు; వెఱచున్ = భయపడును- మాకు ముసలితనమును, వ్యాధియు రావనుట.

తాత్ప : వినయముతోఁబలికిన ప్రవరునకు సిద్ధుఁడు, "సందేహము కల్గిన నడుగుట తప్పేమియు లేదు. మేము సిద్ధులము. కావున ముదుసలితనముగాని వ్యాధిగాని రాదు", అని చెప్పినాఁడు.

వ్యా. వి:-(1) అనినన్ + పరదేశి; (2) సందియమున్ + తెలియుట; (3) రుజయును + చెనకంగాన్ = ద్రుత కార్యములు.

సమాసము:-

గృహపతి = షష్ఠీతత్పురుషము.

అలంకారము:-

కావ్యలింగము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 27. భూమి నిర్జర వంశోత్తమ = బ్రాహ్మణ శ్రేష్ఠుఁడవయిన ప్రవరుఁడా! పరమంబైన = మిక్కిలి; రహస్యము = గోప్యవిషయము; ఔన్ = ఔను; అయినను = అయినప్పటికిని; డాఁపన్ = నేను దాఁచను; చెప్పెదన్. పాదలేపమను పేరన్ = పాదలేపము అనెడి పేరితో; కల్గు దివ్యౌషధంబురసంబు = కలిగిన శ్రేష్ఠమైన యౌషధరసము! ఈశ్వర సత్కృపన్ = దేవుని దయచేత; కలిగెన్ = నాకు లభించెను; తద్భూరి ప్రభావంబునన్ = దాని దొడ్డ మహిమచేత; భవమాన....అహంకృతిన్ = వాయువును, మనస్సును, అవమానపఱచునట్టి వేగముచేతనయిన గర్వముచేత; చరియింతున్ = తిరుగుదును;

తాత్ప:- ఓ బ్రాహ్మణోత్తమా! నాకు నింతటి మహిమకలిగిన విషయము మిక్కిలి రహస్యము. అయినను దానిని దాఁపక చెప్పెదను. పాదలేపము అను పేరుగల దివ్యౌషధరసమొకటి నాకు నీశ్వరానుగ్రహమువలన దొరికినది. దానిచే వాయువు కన్నను, మనస్సుకన్నను హెచ్చయిన వేగముతో నెల్లదేశములును దిరుగుదును.

వ్యా. వి :- డాఁపన్- (రూపాంతరము) దాఁపన్. 'దకు్క లోనగువాని "ద్రా" కు డకారంబు విభాషనగు. (చూ. బా. వ్యా. ప్రకీర్ణ. సూ. 14)

సమాసములు:-

(1) భూమి నిర్జర వంశోత్తమ = స. త, (2) దివ్యౌషధము = వి. పూ. కర్మ; (3) పాదలేపము = ష. త.

ఛందస్సు:- చూ. రాజసూయము- 8వ పద్య వ్యాఖ్య. పుట 15.

ప. 28: దివిన్ = ఆకాశమునందు; బిసరుహ....సంఘంబు = కమలములకు చుట్టమయిన సూర్యుని గుఱ్ఱములయొక్క సమూహము; ఎంత దవ్వు = ఎంత దూరములు; దగలేక = దప్పిలేక-అనాయాసముగా ననుట; అరుగున్ = పోవునో; భువిన్ = భూమియందు; అంతదవ్వున్ = అంత దూరమును; ఏమును = మేమును; తవతవలేక = ఆయాసములేక; హుటాహుటి నడలన్ = అతి త్వరితములయిన గమనములచేత; అరుగుదుము.

తాత్ప:- ఆ పాదలేప ప్రభావముచే సూర్యుని గుఱ్ఱముల వేగముతో సమానముగ నెంత దూరమైనం బోంగలము.

వ్యా. వి :- దగలేక + అరుగున్ = దగలే కరుగున్ - అత్తునకు సంధి బహుళము. (చూ. బా. వ్యా. సం. సూ. 4.)

సమాసములు:-

(1) బిసరుహ...సంపము = షష్ఠీ తత్పురుషము; (2) బిసరుహబాంధవుండు- (3) బిసరుహబాంధవ సైంధవము = ష. తత్పురుషములే.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట. 6.

ప. 29 అనినన్ = అని సిద్ధుండు చెప్పంగా; విప్రవరుండు = బ్రాహ్మణశ్రేష్ఠుండైన ప్రవరుండు; కౌతుక...అంతరంగుండున్ = కుతూహలము యొక్క అతిశయముచేత తొట్రుపడుచున్న మనస్సుగలవాండును; భక్తి ...బంధురుండునయి = భక్తిచేత కట్టంబడిన దోసిలిచేత ఒప్పిన వాండునై; మీ దివ్యప్రభావంబు = మీ యొక్క ఘనమయిన మహిమను; ఎఱుంగని నా ప్రల్లదముల్ = తెలియని నా యొక్క దుర్భాషణములను - వ్యర్థవాక్యముల నుంట; సహించి = ఓర్చి; మునిలోకగ్రామణీ = ముని సమూహమునందు శ్రేష్ఠుండవయిన యోసిద్ధుండా!; సత్కృపన్ = మంచిదయ చేత; మీ శిష్యున్ = మీ శిష్యుండయిన; ననున్ = నన్ను; తీర్థయాత్రవలనన్ = తీర్థములను గూర్చి పోవుటవలన; ధన్యాత్మున్‌గాన్ = కృతార్థమయిన మనస్సుగలవానింగా- మనస్సులోని కొఱంత తీఱినవానింగా; చేయరే = చేయుండు.

తాత్ప:- ప్రవరుండు కౌతుకమును భక్తియు పెనంగొన వినయపరుండై, తన్ను తీర్థసేవలచే ధన్యాత్మునిం జేయుమని ప్రార్థింపంగా,—

వ్యా. వి:- (1) వ్యగ్ర + అంతరంగుండు; (2) నిబద్ధ + అంజలి; (3) ధన్య + ఆత్ముండు = స. దీ. సంధులు.

సమాసములు :—

(1) విప్రవరుండు = స. త. (2) మునిలోకగ్రామణి = ష. త, (3) కౌతుకభర వ్యగ్రాంతరంగుండు = బహుప్రీ; (4) భక్తినిబద్ధము; (5) భక్తి...బంధురము = తృ. త. లు.

ఛందస్సు:- చూ. రాజసూయము- 8వ పద్య వ్యాఖ్య. పుట 15.

ప. 30. అనుటయున్ = ప్రవరుండిట్లడుగంగా; (సిద్ధుండు) రసలింగమున్ = రసముతోం జేసిన గుళికను; ఇడు తన వట్రువ ప్రేంప సజ్జన్ = ఉంచునట్టి గుండ్ర

మైన తన ప్రేపబుట్టలోని; దంతపు బరణిన్ = దంతపు సరాటమునందు; నినిచిన యొక పసరు = నిండించిన యొక విధమయిన యాకు రసమును; ఇది యదియని చెప్పక = పేరుచెప్పక; తత్పదాంబుజ యుగళిన్ = ఆ ప్రవరుని కమలములవంటి యడుగుల జంటయందు; పూసెన్ = రాచెను.

తాత్ప :- అని, ప్రవరుఁడు వేడగా, సిద్ధుఁడు తన బరిణెలో దాఁచియుంచిన పసరొకటి, పేరుచెప్పక, యాతని పాదములకు పూసి తన త్రోవను దాఁబోయెను.

వ్యా. వి :- దంతము + బరణి = దంతపు బరణి = కర్మధారయంబులందు ము వర్ణకంబునకు పు,ంపులగు.—. (2) పద + అంబుజము = (అ + అ = ఆ) సవర్ణ దీర్ఘసంధి.

సమాసములు :-

రసలింగము = తృ. త; ప్రేఁపసజ్జ, దంతపు బరణి = కర్మ; తన వస్త్రువ ప్రేఁప సజ్జ = ష.త; పదాంబుజము = రూపక;

వ్యు :- అంబుజము = నీటియందు పుట్టినది. (పద్మము)

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 31. ఆ మందు + ఇడి = ఆ పసరును పూసి; అతఁడు = ఆ సిద్ధుఁడు; అరిగినన్ = పోఁగా; భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడు – ప్రవరుఁడు; తుహిన భూధర = మంచు కొండ యొక్క; శృంగ = శిఖరముల యందలి; శ్యామల = పసరుమించిన నలుపు వన్నెగల; కోమల = లేఁతమైన; కానన = అడవుల యొక్కయు; హేమాఢ్య = బంగారుతో నిండిన- సువర్ణమయములైన యనుట; దరీ = గుహల యొక్కయు; ఝరీ = సెలయేళ్ల యొక్కయు; నిరీక్ష + అపేక్షన్ = చూచుట యందలి కోరికచేత; అరిగెన్ = పోయెను.

తాత్ప :- సిద్ధుఁడు పసరు పూసిపోఁగాఁ బ్రవరుఁడు హిమాలయ పర్వత మందలి విచిత్రములఁ జూడఁబోయినాఁడు.

వ్యా. వి:- (1) హేమాఢ్య = హేమ + ఆఢ్య = (అ + ఆ = ఆ) } స. దీ.
(2) నిరీక్ష + అపేక్ష = నిరీక్షాపేక్ష (అ + అ = ఆ) } సంధులు

విశేషార్థము :-

హిమాలయౌన్నత్యము "భూమీసుర, తుహిన భూధర" అను సమాసముల లోని గీటుంచిన పదములవలన వ్యక్తము. ఈ దీర్ఘ సమాసము ప్రవరుని యాత్రోత్సాహ సూచకము. 'భూధర' అనుచోట కొండ నెక్కుట, శ్యామల, కోమల, కానన... అను చోట్ల ప్రవర విహారము, దరీ, ఝరీ, నిరీ అనుచోట్ల కొండ దిగు

టయు శబ్దప్రయోగ నైపుణిచే కవితా పితామహుఁడు తెలుపుచు, కావ్యార్థ సూచన చేయుచున్నాఁ డనఁదగును.

సమాసములు :—

(1) భూమీసురుఁడు = స. త. (2) తుహిన భూధరము = ష. త. (3) తుహిన .... శిఖరము = ష. త. (4) భూధర...కాననము = స. త; (5) శ్యామల కోమల కాననము = కర్మ; (6) హేమాఢ్యము = తృ. త; (7) నిరీక్షాపేక్ష = స. త.

విశేషము :-

దరీ శబ్దమునకు కొందరు లోయ యని యర్థము చెప్పెదరు.

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 32:– (Most Imp.) భూమిసురుఁడు = బ్రాహ్మణుఁడు- ప్రవరుఁడు; చని = పోయి- ముందుచెప్పిన చొప్పున హిమవత్పర్వతమునకుఁ బోయి యనుట; అటన్ = అక్కడ; అంబర...జాలమున్- అంబర = ఆకాశమును; చుంబి = ఒరయుచున్న; శిరః = శిఖరములందుండి; సరత్ = ప్రవహించుచున్న; ఝరీపటల = సెలయేళ్ల సమూహమునందు; ముహుర్ముహుః = మాటిమాటికి; లుఠత్ = పొరలుచున్న; అభంగ = ఎడతెగని; తరంగ = అల లనెడి; మృదంగ = మద్దెలల యొక్క; నిస్వన = ధ్వనులచేత; స్ఫుట = స్పష్ట (ప్రకటన) మగుచున్న; నటన = నాట్యమునకు; అనుకూల = తగినట్టుగా; పరిఫుల్ల = బాగుగా విప్పఁబడిన; కలాప = పురుగులు గల; కలాపిజాలమున్ = నెమిళ్ల సమూహములు గల దానిని; కటక.... సాలమున్- కటక = కొండ నడిమి ప్రదేశములందు; చరత్ = తిరుగుచున్న; కరేణు = ఆఁడు యేనుఁగుల యొక్క; కర = తొండములచేత; కంపిత = వడఁకింపఁ బడిన- కదలింపఁబడిన; సాలమున్ = వృక్షములు గల దానిని; శీతశైలమున్ = హిమవత్పర్వతమును; కాంచెన్ = చూచెను.

తాత్ప:— ప్రవరుఁడట్లు పోయినచోట నాకాశము నంటిన శిఖరములయందుండి దిగువకుఁ బాఱుచున్న సెలయేళ్ల యలల చప్పుడు మద్దెలల మ్రోఁతవలె వినఁబడఁగా నందులకుఁదగినట్లు పురులు విప్పి యాడుచున్న నెమిళ్ల గుంపులు కలదియు, కొండ నడిమి నేలలయందలి వృక్షములను దొండములతోఁ బట్టి యాడించుచున్న యేనుఁగులు గలదియునైన మంచుకొండను జూచెను.

కవితా విశేషము:-

హిమాలయపర్వత శృంగముల యౌన్నత్యము నిందలి దీర్ఘ సమాసము తెల్పుచున్నది. శృంగ, తరంగ, మృదంగాదులగు పదముల ప్రయోగముచేత

నా హిమాద్రి యందలి సెలయేళ్ల తరంగముల ధ్వనులు స్ఫురించుచున్నవి. అట్లే "నిస్వన స్ఫుట నటనానుకూల" మను పదముల కూర్పుచేత నెమిళ్ళనాట్యమును స్ఫురితమగుచున్నది. ఈ రీతిగ నర్థముచేతనే గాక (శబ్దతః) శబ్దముచేతఁ గూడ ప్రవరుఁడే హిమాద్రినిఁ జూచెనో దానిని చదువరులకును నాంధ్రకవితాపితా మహుఁడు మహోదారశిల్పియై చూపుచున్నాఁడు. ఇది కవి రచనాశిల్పమునకు తార్కాణ.

అలం:-

రూపకము; అనుప్రాసమును.

ఛందస్సు:- చూ. రాజసూయము. 9వ పద్య వ్యాఖ్య. పుట 16.

గమనిక:-

ఇది ప్రతిపదార్థమునకు ముఖ్యమైనవానిలోనికెల్ల ముఖ్యమైన పద్యము.

వ. 33. కాంచి=చూచి; అంతరంగంబునన్=మనస్సునందు; తరంగితంబు=అలలుగొట్టునది- ఎడతెగక పైపయి నుప్పొంగునది; అగు హర్షోత్కర్షంబునన్=అయిన సంతోషాతిశయముచేత.

తాత్ప:- సులభము.

వ్యా. వి:- అంతరంగఁబునన్+తరంగితము=ద్రుతకార్యము. హర్ష+ఉత్కర్షము=గుణసంధి.

సమాసము:-

హర్షోత్కర్షము=ష. త.

అలంకారము:-

అనుప్రాసము.

ప. 34. ధరణీసురుండు=బ్రాహ్మణుఁడైన ప్రవరుఁడు; నర....సరణిన్-నరనారాయణ=నరుఁడు, నారాయణుఁడునని విష్ణువువంశమున జనించిన ఋషుల యొక్క; చరణాంబురుహద్వయ=పాదపద్మముల జంటయొక్క; భద్ర=శుభకరములైన; చిహ్న=హల కులిశాది రేఖలయొక్క గుఱుతులచేత; ముద్రిత=ముద్రింపఁబడిన- గుఱుతిడఁబడిన; (ఇది సరణికి విశేషణము.) బదరీతరు=రేఁగుఁ మ్రాఁకులయొక్క; షండ=సమూహము యొక్క; మండల=ఆవరణ రూపమైన ప్రదేశము యొక్క; అంతర=మధ్యభాగము నందలి; సరణిన్=త్రోవను;

చనఁజనన్ = పోఁగాఁబోఁగా- చాలదూరము పోఁగాననుట; ఎదుటన్ = ముందట. తరువాతి పద్యముతో నన్వయము.

తాత్ప:- అట్లు హిమవత్పర్వతమును జూచి, సంతోషించిన ప్రవరుఁడు పూర్వకాలమునందు విష్ణుదేవునంశమున నవతరించిన నరనారాయణులను మహా మునులు తపస్సుచేసిన బదరీవనముఁ జొచ్చి, దానినడుమ నొక త్రోవను గని, యా త్రోవను చాలదూరము పోవునపు డెదుటిభాగమునందు,

వ్యా. వి :- (1) చరణ+అంబురుహము; (2) మండల+అంతరము = స. దీ. సంధులు.

సమాసములు:-

(1) చరణాంబురుహము=కర్మధారయ; (2) చరణాంబురుహద్వయము= ష. త; (3) ధరణీశుఁడు = స. త.

అలంకారము:-

చరణాంబురుహము = పాదమనెడి పద్మము. రూపకము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 35. ఉల్లలత్....ధ్వనులు- ఉల్లలత్ = గట్లమీఁది కెగయుచున్న; అలకా = అలకయనెడి యేటియందలి; జలకణ = నీటిబిందువులచేత; పల్లవిత = చిగిరించిన; కదంబకుసుమ = కడిమి పూలయొక్క; పరిమళ = మంచి వాసనల యొక్క; లహరీ హల్లోహల = ప్రవాహ ధారయందలి; మదబంభరమల్ల = మత్తు గొన్న తుమ్మెద మిన్నలయొక్క; ధ్వనులు = ఝుంకారపు మ్రోఁతలు; ఎసఁగన్ = అతిశయించునట్లుగా; మరుదంకురముల్ = గాలిమొలకలు-తిన్నని చల్లగాలి; విసరెన్ = వీచెను- అనగా అలకానదిమీఁదుగాఁ గడిమిపువ్వుల వాసనలతోఁ గూడి వచ్చిన తిన్నని చల్లగాలి, యా వాసనలకు వచ్చిన దుమ్మెదల ఝుంకారధ్వను లతిశ యింపఁగా వీఁచెను.

తాత్ప:- అలకానది నీటిచేఁ బెరిగినవి కడిమిచెట్లు. వాని పూలవాసనకుఁ జేరినవి తుమ్మెదలు. వాని రొదతోఁగూడి పిల్లగాలులు వీఁచినవి.

విశేషము:-

తరువాతి కవులకీ పద్యము ఒరవడియైనది. అర్థముచేతనేగాక శబ్దముచేత గూడ పెద్దన గట్లమీఁది కెగయు నలల యొక్కయు తుమ్మెదలయొక్కయు ధ్వని నిందు మనకు వినిపించుచున్నాఁడు.

వ్యా. వి :- లహరి + ఈహాత్ = లహరీహాత్ (స. దీ. సంధి); ఈహాత్ + లహరి = ఈహాల్లహరి- లకారము పరమైనప్పుడు తకారము లకారము.

సమాసము :-

ఉల్లలత్ ...ధ్వనులు = ష. త. సమాసము.

అలంకారము:-

అనుప్రాసము.

ఛందస్సు :- చూ. రాజసూయము, 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 36. తొండముల్ చాఁచి = తొండములను చాఁగించి; అందుగుఁ జిగుళ్లకున్ = అందుగు చెట్లయొక్క చిగురులకొఱకు; నిక్కి = ముని కాళ్లతోనిలుచునట్టి; కరుల = ఏనుఁగులయొక్క; దంతచ్ఛాయ = దంతముల కాంతి; కడలుకొనఁగన్ = వ్యాపింపఁగాను; సెలవులన్ = పెదవుల మూలలయందు; వనదంశములు = అడవి యీఁగలు; ముసఁగి = ముసరి; నెఱెవెట్టన్ = సందులేర్పడఁ దొలుచుచుండఁగా; క్రోల్పులుల్ = పెద్దపులులు; పొదరిండ్లన్ = తీఁగలు లోనగునవి యల్లుకొనుటచే నిండ్లవలె నుండెడి పొదలయందు; గుఱకలిడఁగన్ = గుఱుపెట్టి నిద్రింపఁగాను; సెలయేటి యిసుక లంకలన్ = కొండ యేళ్లలోని యిసుకదిబ్బలయందు; వరాహంబులు = పందులు; మొత్తంబులై = గుంపులు గుంపులుగాఁగూడి; త్రవ్వి = ముట్టెలతోఁ ద్రవ్వి; ముస్తలు = తుంగగడ్డలు; ఎత్తన్ = పైకెత్తఁగాను; అడ్డంబు = వీఁపుమీఁది పలుపును; నిడుపును = నిడివియు (గల); ఆపడ్డలగతిన్ = ఆవు పెయ్యల వలె; మనుఁబిళ్లు = పెంటిమన్నులు; డొంకలనుండి = నడచుటచేతఁ బల్లముగా నేర్పడిన పెద్ద త్రోవలనుండి; క్రేళ్లుదాఁటన్ = గంతులువేయుచుండఁగాను; (మనుబిళ్లు అనుట... ఆఁడుమన్నులే యందుఁ ద్రుళ్లుచుండఁగా నిఁక మనుఁబోతులు దుముకులాడుట చెప్పవలసినదే లేదని భావము.) ప్రబల...ఆతపమున్- ప్రబల = మిక్కిలి బలముకలిగిన; భల్లుక = ఎలుఁగుగొడ్డుయొక్క; నఖభల్ల = బల్లెములవంటి గోళ్లచేనైన; భయద = భయమును బుట్టించునట్టి; మథన = త్రచ్చుటలచేత- కోరాడుటలచేత; శిథిల = చెదరిన; మధుకోశ = తేనె పెరలయొక్క; విసర = సమూహాము నుండి; విశీర్ణ = రేఁగిన; మక్షికా = తేనె యీఁగలయొక్క; అంతరాంతర = నడుమనడుమఁగల సందులనుండి; దంతురిత = వ్యాపించినదైన; ఆతపమున్ = ఎండచేత; భూమి = నేల; తిలతండుల న్యాయమునన్ = నువ్వులు, బియ్యము కలిసిన న్యాయమువంటి న్యాయముతో- నువ్వులు, బియ్యము కలిసినట్లు; వెలుంగన్ = ప్రకాశింపఁగాను. దీనికి తరువాతి పద్యమునందలి 'పరికించుచున్' అను క్రియతో నన్వయము.

తాత్ప :- ఏనుఁగు లందుగుఁజిగుళ్లకై నిక్కి, తొండములు చాఁచునప్పుడు వాని దంతముల కాంతు లతిశయించుచుండెననియు, పెద్దపులులు నిద్రపోవు

చుండఁగా వాని పెదవులమూలలనుండి కారెడి జొల్లునకు నడవి యీఁగలు ముసరు కొనుచుండెననియు, పందులు సెలయేళ్లలోని యిసుకదిబ్బలు త్రవ్వి, తుంగగడ్డలు పెల్లగించి తినుచుండె ననియు, ఋశ్యమృగములు బలసిన యావుపెయ్యలవలె డొంకలయందు దుముకులాడు చుండెననియు, ఎలుఁగుగొడ్లు తేనె పెరలను గోళ్లతోఁ గోరాడఁగా నందున్న తేనెయీఁగలు రేఁగి యాడుచుండె ననియు, వాని నీడలు నల్లగాను, వాని నడుమ నడుమ వ్యాపించునట్టి యెండ పొడలు తెల్లగాను గనఁబడుటచే నవి రెండును భూమిమీఁద నువ్వులు, బియ్యము వెద చల్లినట్లుండెననియుఁ దాత్పర్యము.

**విశేషము :-**

ఎలుఁగుగొడ్లు గోళ్ళతో తేనె తుట్టలను తట్టుచున్నవి. అందుచే చెల్లాచెద రైన తేనెటీఁగలు బయల నెగురుచుండెను. వాని వాని సందులనుండి యెండ నేలపైఁబడుచున్నది. ఈఁగలున్న చోట నీడలును, అవి లేనిచోట నెండ పొడలును వ్యాపించెను. అప్పుడు నువ్వులు, బియ్యము కలిపి చల్లినట్లు భూమి యొప్పిన దని పెద్దనార్యుని భావన. ఇది యాతని ప్రకృతి పరిశీలనా సామర్థ్యము.

వ్యా. వి :- సెలవి (ఏక) పెదవిమూల; సెలవులు = (బహు) పెదవుల మూలలు. సెలవి + లు = ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు = సెలవులు. (బా. వ్యా. తత్సమ. సూ. 45)

**సమాసములు:-**

(1)దంతచ్ఛాయ = ష. త. (2)భల్లుకనఖము = ష. త; (3) నఖభల్లము = కర్మధారయ.

**అలంకారములు :-**

స్వభావోక్తి - రూపకములు.

**గమనిక:-**

"పుడమి తిలతండుల న్యాయమున వెలుంగ-" ఈ పాదము సందర్భ సహిత వివరణమునకు చాలముఖ్యము.

ఛందస్సు :- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 37. పరికించుచున్ = చూచుచును; భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడైన ప్రవరుఁడు; డెందంబునన్ = మనసునందు; పురికొను = అతిశయించుచున్న;

కౌతుకముతోడన్ = కుతూహలముతో; అగ్గిరి.... ....మతియై- అగ్గిరి = ఆ మంచు కొండయొక్క; కటక = మధ్యప్రదేశమందును; తట = చఱులయందును; నిరంతర = దట్టమైన; తరు = వృక్షములుగల; గహన = అడవులయందును; గుహా = గుహలయందును; విహార = వినోదముగాఁ దిరుగుటయందు; తత్పరమతియై = ఆసక్తమయిన బుద్ధిగలవాఁడై.

తాత్ప :- చూచి, సంతోషించుచుఁ బ్రవరుఁడా కొండపైఁగల యడవుల లోను, కొండ గుహలలోను విహరింపఁగోరి,-

వ్యా. వి :- డెందంబునన్ + పురికొను = ద్రుతకార్యముచే "డెందంబునఁ బురికొను"-అగును.

సమాసములు :-

(1) గిరి కటకము = ష. త; (2) గిరికటక.... ....మతి = బహుబ్రీహి.

అలంకారము :-

అనుప్రాసమను శబ్దాలంకారము.

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట. 6.

ప. 38. ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁడను పేరు గలవాఁడు (ఇది కర్త); సగరు మున్మనుమండు = సగర చక్రవర్తి మనుమని కొమారుఁడు- భగీరథుఁడు; నిడుద పెన్నెఱిగుంపు = నిడుపైన పెద్ద తల వెంట్రుకల సమూహము; జడగట్టన్ = జడవలెఁ బెనఁచుకొనునట్లుగా; తపము = తపస్సును; కైకొనిన చోటు = పూనిన ప్రదేశమును; మిన్నేఱు = ఆకాశ గంగానది; జరఠ.... ....వెన్ను- జరఠ = ముదిసిన; కచ్ఛపకులేశ్వరు = తాఁబేటికులమునకు రాజైన యాది కూర్మము యొక్క; వెన్ను = వీఁపుఁజిప్ప; కానరాన్ = కనఁబడునట్లుగా - అంతలోఁతునకు భూమి తెగునట్లనుట; జగతికిన్ = భూమిమీఁదికి; దిగినచోటు = అవతరించిన ప్రదేశమును; గిరికన్య = పార్వతీదేవి; పుచ్చుడీ కతనంబు = సిగ్గరి తనమును; పోఁబెట్టి = విడిచిపెట్టి; పతిన్ = పెనిమిటిని; కొల్వన్ = సేవింప; ఆయాసపడినచోటు = శ్రమపడిన ప్రదేశమును - తపస్సుచేసిన ప్రదేశమనుట; వలరాచ రాచవారు = మన్మథుఁడనెడి క్షత్రియుఁడు; అలికాతు కను వెట్టన్ = నొసటఁగన్నుఁగల శివుని యొక్క నేత్రాగ్నిచేత; కరఁగిన = నీఱైన- కాలి, భస్మమైన; అల = ప్రసిద్ధమయిన; కనికరపుఁజోటు = జాలిఁ బుట్టించునట్టి ప్రదేశమును; (ఆ చోటు చూచువారు "అయ్యో! యీ చోటనా మన్మథుఁడు కాలిపోయె" నని జాలిఁ బొందుదురని భావము.) మున్ను = మునుపు; తపసి....., చెలువంబు = సప్త మహామునుల భార్యల యొక్క అందమును; తలఁచి తలఁచి =

పలుమాఱు తలఁచుకొని; ముచ్చిచ్చును = మూఁడగ్నులును; (గార్హపత్యము, ఆహవనీయము. దక్షిణాగ్ని.) పిరాల గొన్నచోటు = మోహమునొందిన ప్రదేశమును; కనుపపులు = జెల్లుగడ్డి; వేల్పుఁ బవవాలున్ = దేవ సేనాధిపతియైన కుమారస్వామిని; కన్నచోటు = ప్రసవించిన ప్రదేశమును- కుమారస్వామికి జన్మస్థానమైన జెల్లు గంటసనుట; హర్షమునన్ = సంతోషముతో; చూచి; ఆత్మలోనన్ = తన మనసునందు. తరువాతి పద్యముతో నన్వయము.

తాత్ప :- భగీరథుఁడు తపమొనర్చి నట్టియు, పార్వతి తపమొనర్చినట్టియు, మన్మథుఁడు దగ్ధమైనట్టియు, మున్నగు ప్రదేశములను ప్రవరుఁడు చూచి,-

వ్యా. వి:-(1) మూఁడు + చిచ్చులు = ముచ్చిచ్చు. (చూ. బా. వ్యా. సమాస-సూ. 17, 18.) మూఁడులో డు లోపము, మూకుహ్రస్వము = ము + చిచ్చులు- చికారమునకు ద్విత్వము = ముచ్చిచ్చు. (2) కనుము + పులు = కనుపపులు. కొండొకచో సమాసంబులందు నామ్వాదికనుమ్వాదుల మువర్ణంబులు పవ్వవర్ణంబులగు (బా. వ్యా. సమాస. 19 సూ.)

విశేషము :-

మునీశ్వరుల భార్యలను జూచి యగ్నిహోత్రునంతటివాఁడు ముదుసలి యయ్యు నిచ్చటనే మోహమునకు లోనైనాఁడు. ఇఁక ముందు రానున్న మరున్నారీ శిరోరత్నమైన వరూథినిని జూచి మన తిరుణాగ్నిహోత్రి (ప్రవరుఁడు) యేమి కానున్నవాఁడో యీ కొండమీద! అని పెద్దన మన యుత్సుకతను పెంపొందింపఁజూచుచున్నాఁడు. ఇది యొక విధమైన కావ్య వస్తుధ్వని.

అలంకారము:-

ఉల్లేఖము.

ఛందస్సు:-చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 39. విలయ...వేఁడిమిన్- విలయ = ప్రళయకాలమునందలి; కృశాను కీలముల = నిప్పు మంటలయొక్క; వేఁడిమిన్ = తాపముచేత; పోఁడిమి మాలి = బాగుచెడి; వెల్మిడిన్ = భస్మముతో; కలసి; భూతధాత్రి = కలసిపోయిన భూమి; మఱి; క్రమ్మఱన్ = మరల; రూపయి = స్వరూపమేర్పడి; నిల్చి = ఎప్పటివలె నిలిచి; ఓషధుల్ = మూలికలు- వృక్షలతాదులు; మొలవఁగఁజేయునట్టి = మొలిపించునట్టి; నయమున్ = నేర్పును; ప్రతికల్పమున్ = ఒక్కొక్క బ్రహ్మదినమునందును- ఒక్కొక్క సృష్ట్యారంభ సమయము నందును; ఈ చలిమలవల్లన్ = ఈ హిమవత్పర్వతమువలన; ఉల్లసిలు చల్లఁదనంబునున్ = ఒప్పునట్టి శైత్యమును; ఊనకుండినన్ = అవలంబింపకున్నచో- పొందకున్నచో; ఎట్లు; కాంచున్ = పొందును?

తాత్ప :- ప్రళయకాలమునందుఁ గాలి, భస్మమయిపోయిన భూమి యీ హిమవత్పర్వతము యొక్క చల్లఁదనమును దాల్చకున్న యెడల మరలఁ దనయందు వృక్షలతాదులు మొలచునట్టి నేర్పును పొంది యుండనేరదు.

వ్యా. వి :- 'వలన' అనుటకు 'వల్లన్'-(చలిమల వల్లన్) పండితలోక వ్యవహారము నందుండుటచేఁ ప్రయోగింపఁబడినది. దీనివలన ననుప్రాసమను శబ్దాలంకారము కుదురుకొనుటచే మఱియు క్షంతవ్యము.

సమాసములు:-

(1) విలయ కృశానుఁడు (ప్రళయమందలి సూర్యుఁడు) స. త. (2) కృశాను కీలములు =(అగ్ని యొక్క మంటలు) ష. త.

గమనిక:—

'ఈ చలిమల వల్ల........నూనకుండినన్'—ఇది సందర్భ సహిత వ్యాఖ్యకుఁ బ్రధానము.

అలంకారములు :-

(1) కావ్యలింగము. (హేతువుతోఁ గూడిన వాక్యరచనముండుట కావ్యలింగాలంకారము.) (2) అనుప్రాసము.

గమనిక:-

ప్రతిపదార్థమునకు ముఖ్యము.

ఛందస్సు:- చూ. రాజసూయము- 8వ పద్య వ్యాఖ్య. పుట 15.

ప. 40. ఈ తుహినాద్రికతనన్ = ఈ మంచుఁగొండ యొక్క కారణముచేత; పసుపు నిగ్గులు = పసుపు యొక్క కాంతులు; తేఱు = తేటగాఁదోఁచుచున్న; (పా. పసుపునిగ్గులు మీఱు = పసుపు కాంతు లతిశయించు.) పాఁపజన్నిదము = సర్ప (యజ్ఞోపవీతము; ఒప్పన్ = ఒప్పుచుండఁగా- బ్రహ్మచర్యమునందు వర్తించుచున్న అనుట; ప్రమథాధిపతి = ప్రమథగణములకు నధిపతియైన శివుఁడు; ఇంటిపట్టు = గృహస్థ ధర్మమును; ఎఱింగెన్- అనఁగా హిమవంతుఁడు తన పుత్రికనియ్యఁగా శివుఁడు గృహస్థుఁడయ్యె ననుట. సురరాజు = దేవేంద్రుఁడు; శచికిన్ = శచీదేవికి; ఈఁతన్ కఱపుచున్ = నీళ్లయం దీదులాడుటను నేర్పుచు; చదలేటన్ = ఆకాశ గంగానదియందు; జలకేళిన్ = జలక్రీడను; సవరించు చెలువు = చేయునట్టి విధమును; ఎఱింగెన్- అనఁగా హిమవంతుఁడు గంగను ధరించుటచేతనే యింద్రుని కా నదియందుఁ గ్రీడింప ననువుపడియె ననుట— మన్మోదవు = గోవురూపము ధరించిన భూదేవి; అదనుతోన్ = సమయ మతిక్రమింపకుండునట్టుగా; చేఁపి = పాలు పొదుఁగు

లోనికి దింపి; చన్ను (ఇది జాత్యేకవచనము.) అవిసి = మొనవిరిసి- మొన విరియఁగా ననుట; కొండలకెల్లన్; ఓషధులన్ = తృణ గుల్మ తరు లతాదులను; పిదుకనెఱిఁగెన్ - అనఁగా హిమవంతుఁడు దూడ కాఁగా, భూమి యావై, యోషధిరూపమైన పాలను గొండలకై పిదికె ననుట. మేన = మేనక యనెడి యప్సరస; వేల్పుటింతుల లోనన్ = దేవతా స్త్రీలలోపల; విఱ్ఱవీఁగుచున్ = మిక్కిలి నిక్కుచు; నవరత్న...రవణము- నవ = తొమ్మిది విధములైన (వజ్రము; వైడూర్యము; నీలము; గోమేధికము; మరకతము; మాణిక్యము; పుష్యరాగము; మౌక్తికము; ప్రవాళము అను) (లేక) క్రొత్తయైన; రత్న = మణుల యొక్క; రచనల = చెక్కడపుఁబనులు గల; రవణము = ఆభరణమును; ఎఱిఁగెన్-అనఁగా- హిమవంతుఁడు మేనకు భర్త యగుటచేతను, హిమవంతునందు రత్నముల గనులు మెండుగా నుండుటచేతను మేనక రత్నాభరణములు దాల్చి దేవతా స్త్రీలలోపల మిక్కిలి గర్వించుచుండె ననుట. నిఖిల నిలింప సభయున్ = సమస్త దేవతాసమూహమును; పరిపరి...సంపదన్-పరిపరి విధంపు = బహు విధములయిన; జన్నంపు = యజ్ఞముల యొక్క; పరికరంపు = ఉపకరణముల యొక్క; సొంపుసంపదన్ = సౌష్ఠవము యొక్క కలిమిచేత; అప్పటప్పటికిన్; జిహ్వాగ్రతుప్పు = నాలుకయందలి యరుచి; డుల్లన్ = పోవునట్లుగా - మానునట్లుగా; (పా. జిహ్వాతుప్పటిల్లన్ = నాలుక యరుచి చెడఁగా); ఆమెతలు = విందులను; ఎఱింగెన్- అనఁగా ననేకులు రాజులు మొదలగువారు యజ్ఞములు చేయుటకు నీ మంచుకొండ చోటగుటం బట్టి యెడప దడప దేవతలకు హవిర్భాగము లారగింప ననుకూలించుననుట.

తాత్ప:- ఈ హిమాద్రివలననే శివుఁడు మఱల నింకొక యింటివాఁడై నాఁడు; ఇంద్రుఁడు జలక్రీడలు నేర్చినాఁడు (గంగలో); భూదేవి గోవురూపమును దాల్చి కొండలకుఁగాను (పాలను) పిదుకనెఱిఁగినది; మేనాదేవి రత్నాభరణభూషితయై దివ్యాంగనలతోఁ దులఁదూగినది; అప్పుడప్పుడు దేవతలకు హవిస్సుల విందులు సమకూరినవి.

వ్యా. వి:- (1) పాము + జన్నిదము = కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల 'ము' వర్ణంబులు పఞ్చవర్ణంబులగు = పాపజన్నిదము. (బా. వ్యా. సమా. 19 సూ.) (2) వేల్పు + ఇంతులు = కర్మధారయంబులందుత్తున కచ్చుపరంబగునపుడు 'టు'గా గమంబగు. (బా. వ్యా. సం. సూ 28) = వేల్పుటింతులు. (3) అప్పటికిని + అప్పటికిని = ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తి లోపంబు బహుళంబుగానగు. (బా. వ్యా. సం. సూ. 41.)

**అలంకారములు:-**

రూపకము, ఉదాత్తమును.

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 41. నగమహత్త్వంబు = ఈ పర్వతముయొక్క మహిమను; ఎన్నన్; బ్రహ్మకునైనన్ = బ్రహ్మదేవునికైనను; తలమే = తరమా?- శక్యము కాదనుట. ఇయ్యెడన్; కల చోద్యంబులు = ఉన్న వింతలు, నేను; రేపు; కన్గొనియెదం గాకేమి = చూడనే చూచెదను. నేఁడు; ఏఁగెదన్ = పోయెదను; నలినీ...పరంపరల్ - నలినీ బాంధవ = సూర్యునియొక్క; భాను = కిరణములచేత; తప్త = కాలిన; రవికాంత = సూర్యకాంతపు రాళ్లమీఁద; స్యంది = కాఱుచున్న; నీహార కందళ = మంచునీటి బొట్లవలననైన; చూత్కార పరంపరల్ = చుంయి చుంయి మనెడు ధ్వనుల సమూహములు; పయిపయిన్ = మీఁద మీఁద- క్రమ క్రమముగా; మధ్యాహ్నమున్ = పట్టపగలగుటను; తెల్పెడిన్ = తెలియఁజేయుచున్నవి.

తాత్ప:- ఈ హిమవత్పర్వత మహిమము నెంచ బ్రహ్మకు సయితము శక్యముకాదు. ఇప్పుడు సూర్యకిరణములచేత వేఁడిమినొందిన సూర్యకాంతపు రాళ్లమీఁదఁ బడునట్టి మంచుచినుకుల చుంయి చుంయి మను శబ్దములు మండు టెండగల మధ్యాహ్నకాలమయ్యె ననుటను స్పష్టముగాఁ దెలుపుచున్నవి. కాఁబట్టి నేఁటికి బోయి, రేపు వచ్చి చూచెదను.

వ్యా. వి:- (1) కాకేమి = అవ్యయము (కాక + ఏమి) మఱియొకదాని లేమిని దెలుపును; ఏవకారార్థము. కన్గొనియెదన్ + కాకేమి = తప్పక చూచెదను; చూడనే చూచెదను. తలమే = తరమా? (తరము కాదనుట) 'ర' కారమునకు 'ల' కారము వచ్చుచుండును.

సమాసములు:-

నళినీ...పరంపరల్ = షష్ఠీ తత్పురుషము.

గమనిక:-

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

అలంకారము :-

స్వభావోక్తి.

ఛందస్సు:- చూ. రాజసూయము. 8వ పద్య వ్యాఖ్య. పుట 15.

ప. 42. అనుచున్ = ఇట్లని తనలో ననుకొనుచు; క్రమ్మఱువేళన్ = వెనుకకుఁ దిరుగునప్పుడు; నీహారవారిన్ = మంచునీటితో; పెరసి = కూడుకొని; తత్పాద లేపంబు = అతని యడుగుల పసరుపూఁత; కరఁగి పోయెన్ = ద్రవమై యంటు లేక పోయెను. కరఁగిపోవుట = అట్లు కరఁగిపోవుటను; అద్ధరణిసురుఁడు = ఆ బ్రాహ్మణుఁడు- ప్రవరుఁడు; ఎఱుఁగఁడు. ఇలన్ = భూమియందు; దైవకృతమునకున్ =

దైవయత్నమునకు; అసాధ్యంబు = సాధ్యముకానిది; కలదె = ఉన్నదా?- లేదు. అనఁగా నే పనియయినను దైవము తలఁచినట్లే యగును గాని మఱియొక విధముగాఁ గానేరదనుట.

తాత్ప:- అనుచు నింటికి మఱలునప్పుడు మంచువలన పాదలేపము కరఁగి పోవుట, ప్రవరుఁడు గ్రహింపలేకపోయెను. ఆ కరఁగుట కేవలము దైవికము. దైవము చేయలేనిదని యొకపని యున్నదా?

వ్యా. వి:- అనుచున్ + క్రమ్మఱువేళ = ద్రుతకార్యము.

సమాసములు:-

(1) నీహారవారి = ష. త; (2) దైవకృతము = ష. త; (3) అసాధ్యము = నఞ్ తత్పురుషము.

అలంకారము:-

అర్థాంతరన్యాసము.

గమనిక:-

"దైవకృతమున కిల నసాధ్యములు కలవె?"-ఈ వాక్యము సందర్భ సహిత వ్యాఖ్యకు ముఖ్యము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 43. అతఁడు = ఆ ప్రవరుఁడు; అట్లు = ఆ విధముగా; ఔషధహీనుఁడై = అడుగులకుఁ బూసిన పసరుచేతఁ దక్కువైనవాఁడై - పసరుపోయినవాఁడై; నిజ.... ఉద్ధతిన్ - నిజపురీ = తన పట్టణమును గూర్చిన; యాత్రా = ప్రయాణము చేయుట యందు; మిళత్ = కూడిన-పొందిన; కౌతుక = కుతూహలము యొక్క; ఉద్ధతిన్ = ఎగవుచేత; పోవన్ = ఎగిరిపోవుటకు; చరణద్వంద్వంబు = రెండు కాళ్లును; రాకుండినన్ = లేచి రాకయుండఁగా; సపదిస్ఫుటార్తిన్ = అప్పుడే స్పష్టమగు చున్న దుఃఖముచేత; (పా. సపరిస్ఫుటార్తిన్ = చక్కఁగాఁ దోఁచుచున్న దుఃఖముతోఁ గూడుకొనుటచేత.) మతిన్ = బుద్ధియందు; చింతించుచున్ = విచారపడుచు; అవ్విధంబు = ఆ పాదలేపము పోయినవిధము; ఎఱిఁగి = తెలిసికొని; హా! = అయ్యో!; దైవంబ! = దైవమా!; నన్ను; ఇట్లు = ఈ విధముగా; సిద్ధాపదేశంబునన్ = సిద్ధుని నెపముచేత; ఈ దూర వన ప్రదేశమునకున్ = దూరమైన యీ యడవి భూమికి; తెచ్చితె = తీసికొనివచ్చితివా?; తరువాతి పద్యముతో నన్వయము.

తాత్ప:- ప్రవరుఁడట్లు పాదలేపము లేకపోఁగాఁ దన పట్టణమునుగూర్చి యెగిరిపోవుటకుఁ గాళ్లు రాలేకపోవుటచేతఁ బాదలేపము పోయినదని తెలిసికొని,

వెంటనే కలిగిన విచారముతో 'దైవమా? సిద్ధునియొక్క ఉపదేశమున నన్ని దూర ముగా నున్న యడవికిఁ దెచ్చి చేర్చితివా?' యని దుఃఖించెను.

వ్యా. వి:-(1) కౌతుక + ఉద్ధతిన్ = కౌతుకోద్ధతిన్ = గుణసంధి; (2) సిద్ధ + అపదేశంబునన్ = సిద్ధాపదేశంబునన్ – సవర్ణ దీర్ఘసంధి.

సమాసములు:-

(1) ఔషధహీనుఁడు = తృ. త; (2) నిజపురీ......... కౌతుకోద్ధతి = షష్ఠీ తత్పురుషము.

అలంకారము:—

కావ్యలింగము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 8వ పద్య వ్యాఖ్యా. పుట 15.

ప. 44. ఎక్కడి యరుణాస్పదపురము = అరుణాస్పదపుర మెక్కడనున్నది! ఎక్కడి తుహినాద్రి = ఈ మంచుఁగొండ యెక్కడ నున్నది? (దీనికి దానికి నెంతో దూరము కలదనుట.) క్రొవ్వి = మదించి; ఏన్ = నేను; రాఁదగునే = వచ్చుట తగునా ?; అక్కటా ! = అయ్యో !; మును = మునుపు; చనుదెంచిన దిక్కు = ఇక్కడికి వచ్చిన దిశ; ఇది = ఇట్టిది; అని యెఱుఁగన్ = అని నేను గుర్తెఱుఁగను. వెడలు తెఱఁగు = బయలు వెడలు విధము; ఎయ్యదియో ? = ఏదోగదా?

తాత్ప :-ఇంతదూరము నేను రాఁదగునా ? వచ్చిన దారిని గుర్తించి యింటికిఁ దిరిగి పోవుట యెట్లో కదా !

వ్యా. వి :- (1) మును + చనుదెంచిన = ప్రథమము మీఁది పరుషములకు గ, స, డ, ద, వ, లగు. (2) తుహిన + అద్రి, (3) అరుణ + ఆస్పదము = స. దీ. సంధులు.

శీలము:-

ఇందుఁ బ్రవరుని పశ్చాత్తాపము విదితము.

అలంకారము :—

విషమాలంకారము.

ఛందస్సు:- చూ. రాజసూయము-1వ పద్య వ్యాఖ్యా. పుట 6.

ప. 45. **M. Imp.** నేన్ = నేను; అకలంక.........సత్త్వమున్- అకలంక = నిర్దోషమయిన; ఔషధ = మందుయొక్క; సత్త్వమున్ = బలమును-

ప్రభావమును; తెలియన్ = తెలిసికొనుటకు; మాయా.....ప్రయాగములు = మాయానగరము (హరిద్వారము), ద్వారవతీ పట్టణము, ఉజ్జయినీపట్టణము, కాశీపట్టణము, కురుక్షేత్రము, గయాక్షేత్రము, ప్రయాగక్షేత్రము; (వీనిని) సేవింపక = చూడఁబోవక; ఉద్దండ...వ్యాఘ్రము- ఉద్దండ = మిక్కిలి క్రూరము లైన; గండక = గండకములనెడి మృగములు; వేదండ = ఏనుఁగులు; వరాహ = అడవి పందులు; వాహరిపు = కారుదున్నపోతులు; ఖడ్గ = ఖడ్గమృగములు; ('గండకే ఖడ్గ ఖడ్గినౌ' అని నామలింగానుశాసనమునందు గండక, ఖడ్గశబ్దములు పర్యాయములుగాఁ జెప్పఁబడియున్నవి. ఇందు భిన్నములుగాఁ గానఁబడుచున్నవి. ఇందులకుఁ బ్రమాణమేమో తెలియలేదు.) వ్యాఘ్రము = పెద్దపులులు గలదైన; ఇమ్మంచుఁ గొండకున్ = ఈ హిమవత్పర్వతమునకు; రాన్ = వచ్చుట; చెల్లునే = నాకుఁ దగునా ?; శ్రోత్రియుల్ = వేదము చదివి వైదికనిష్ఠ గలవారు—ఛాందసు లనుట; బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా ! = బుద్ధిమాంద్యమువలనఁ బుట్టిన చిత్తవిభ్రమము గలవారుకదా !- చిత్తవిభ్రమము కలవారే యనుట.

తాత్ప :- నేను సిద్ధుఁడిచ్చిన మందు మహిమ తెలియవలెనన్న మాయ, ద్వారక, యవంతి, కాశి, కురుక్షేత్రము, గయ, ప్రయాగము మొదలయిన పుణ్యక్షేత్రములకుఁబోయి, వానిని సేవింపక- గండకము, లేనుఁగు, లడవి పందులు, కారు దున్నలు, పెద్దపులులు మొదలుగాఁగల క్రూరమృగములు విశేషముగా నుండెడి యీ మంచుఁగొండకు రావచ్చునా ? కేవల వైదికులయిన నావంటివారు బుద్ధిమాంద్యమువలని చిత్తవిభ్రమము గలవారై యుందురు. కాఁబట్టి నేను నట్టి చిత్తభ్రమముచేత నీ రారాని చోటికి వచ్చితిని.

వ్యా. వి:- (1) అకలంక + ఔషధసత్త్వము = వృద్ధిసంధి; (2) ఈ + మంచుకొండ = ఇమ్మంచుకొండ (త్రికసంధి). (3) కాశి + కురుక్షేత్రము = కాశీకురుక్షేత్రము, లేదా, కాశి కురుక్షేత్రము.

సమాసములు:-

(1) ఔషధ సత్త్వము = ష. త. (2) అకలంకౌషధము = కర్మధారయము.

గమనిక:-

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము. లేదా, "బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్"—సందర్భ సమన్వయమునకు, తప్పదు—.

అలంకారము :—

అర్థాంతరన్యాసము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 8వ పద్య వ్యాఖ్య. పుట 15.

ప. 46. నన్నున్ = నన్ను; నిముసంబు = నిమిషకాలము; కానక యున్నన్ = చూడకున్నయెడ; ఊరెల్ల = గ్రామమంతయు; అరయు మజ్జనకుఁడు = వెదకునట్టి మా తండ్రి; ఎంతడలునొక్కొ = ఎంత దుఃఖపడునో?; (నన్ను) ఎపుడున్ = ఎల్లప్పుడును; సంధ్యలయందున్ = సంధ్యా కాలములయందు; ఇలువెళ్లనీక = ఇల్లువెడలి బయటఁ బోనీయక; ఓమెడు తల్లి = కాపాడునట్టి మాయమ్మ; ఎంతొ అలునొక్కొ = ఎంత విలపించునో; అనుకూలగతి = అనుకూల ప్రవర్తనము గలదై; నాదు మనసులోన్ = నా తలఁపు ననుసరించి; వర్తించు కులకాంత = నడుచుకొనునట్టి యిల్లాలు- నా భార్య; మదిన్ = మనస్సునందు; ఎంత కుందునొక్కొ = ఎంతగా శోకించునో; గెడన్ = దగ్గఱ; తోడు నీడలై = సహాయులై; క్రీడించు సచ్ఛాత్రులు = విహరించునట్టి మంచి శిష్యులు; ఇంతకున్ = ఇప్పటికి; ఎంత చింతింతురొక్కొ = ఎంతగా విచారపడుచుందురో; అతిథి సంతర్పణంబులు = అన్నార్థులై యింటికి వచ్చిన పెద్దల యారాధనములు; ఏమయ్యెనొక్కొ = ఏమి యాయెనో; అగ్నులు = గార్హపత్యాదులయిన యగ్నులు; ఏమయ్యెనొక్కొ = ఏమియాయెనో; దైవంబ = ఓ దేవుఁడా!' కినుకన్ = కోపముతో; నిత్యంబులైన = ప్రతిదినము తప్పక నడపఁదగినట్టి; కృత్యములన్ = వ్యాపారముల నుండి; పాపి = ఎడఁబాపి; మిన్నేఱుపడ్డచోటఁ = గంగానది పుట్టిన తావునందు- మిక్కిలి దూరమైన యూర్ధ్వభాగమునందు; పాఱవైచితె = విసరి వైచితివా!- అనఁగా మిక్కిలి దూరమునందుఁ జేర్చితివా యనుట.

తాత్ప:-నా కొఱకై తలిదండ్రులును, భార్యా శిష్యులు నెంత చింతింతురో కదా! నిత్యకృత్యము లేమయ్యెనోగదా దైవమా!

వ్యా. వి:-(1) మత్ + జనకుఁడు (మజ్జనకుఁడు) (2) సత్ + ఛాత్రులు (సచ్ఛాత్రులు) శ్చుత్వసంధులు. (3) గెడ(ఁ) = జత; సమీపము. ఇచ్చట "గెడఁ దోడు నీడలై" అనఁగా జతగా తోడు నీడలైయని యర్థము. కావ్య సుధా లహరి, పుట 159 లో 'కెడన్' అనుట (వెనుకనున్న కళను చూడని) పొరపాటు. ("కెడ" అను పదము లేదని కాదు)

సమాసములు :-

(1) మజ్జనకుఁడు = ష. త; (2) అతిథి సంతర్పణంబు = ష. త; (3) సచ్ఛాత్రులు = కర్మధారయము.

నుడికారము:-

పాఱవైచితె-మిన్నులు పడ్డచోట. ("మిన్నేఱు" అను పాఠము నుడికారముకాదు.)

విశేషము :—

ఇందు, పరిదీనుఁడై యున్న ప్రవరుని పరిస్థితి చక్కగ వర్ణింపఁబడి జాలి గొల్పుచున్నది. ఆ యవస్థలోనున్నవాని కట్టి తలఁపులు సహజము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 47. నన్నున్ = నన్ను; ఇలు సేరు నుపాయంబు = ఇంటికిఁబోయి చేరునట్టి యుపాయమును; ఒనరింపఁగన్ = చేయుటకు; చాలు సుకృతి = తగినట్టి పుణ్యాత్ముఁడు; ఒకఁడు = ఎవఁడేనొకఁడు; ఒదవఁడొకో = కలుగఁడా; అనుచున్ = అనుకొనుచు; చింతాసాగరమునన్ = విచారమనెడి సముద్రమునందు; మునిఁగి = మునిఁగినవాఁడై; భయంబు = వెఱపు; కదురన్ = కలుగఁగా; పోవుచున్ = ఏదో యొక దారిఁబట్టి పోవుచు; ఎదురన్ = ఎదుటి భాగమునందు- తరువాతి పద్యముతో నన్వయము.

తాత్ప:- నే నిల్లుచేరు నుపాయము దెలుపు పుణ్యాత్ములు దొరుకుదురా? యని చింతించుచు పోఁగా నెట్టయెదుట,—

సమాసము :—

చింతాసాగరము = (రూపక సమాసము) కర్మధారయము.

అలంకారము :—

రూపకము (చింతయనెడి సాగరము లేక, సముద్రము)

ఛందస్సు:- చూ. రాజసూయము, 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 48. కులిశ......పొలుపునన్ - కులిశ = వజ్రాయుధము యొక్క; ధారా = వాయిచేనైన; హతి = దెబ్బయొక్క; పొలుపునన్ = విధమున- ఇంద్రుఁడు వజ్రాయుధముతో నఱికిన నఱకుడో యనునట్లు; పైనుండి = మీఁది తట్టునుండి; అడుగు మోవఁగన్ = దిగువ తట్టానునట్లు; జేగురైన = ఎఱ్ఱనివైన; తటులన్ = దరులతో; కనుపట్టు లోయన్ = అగపడుచున్న కొండ చీలికయందు; (పా. కనుపట్టి లోనన్ = కనఁబడి లోపలిభాగమునందు.) గంగా నిర్ఝరము = గంగానది; పాఱన్ = ప్రవహించుచుండఁగా; చలువయా = చల్లఁదనము గలదైన; అయ్యేటి కెలఁకులందున్ = ఆ గంగానదియొక్క రెండుప్రక్కలందును; ఇసుక వెట్టిన నేలన్ = ఇసుకక్రమ్మిన నేలయందు; ఏచి = పెరిఁగి; అర్కాంశులన్ = సూర్య కిరణములను; చొరనీక = ప్రవేశింపనియ్యక; దట్టమై = తఱుచై; ఇరులు గవియు......వీథిన్ - ఇరులుగవియు = చీఁకటి క్రమ్ముచున్న; క్రముక = పోఁక; పున్నాగ = పొన్న; నారంగ = నారింజ; రంభా = అఁటి; నారికేళ = టెంకాయ; ఆది = మొదలుగాఁగల; విటపి = వృక్షములయొక్క; కాంతార వీథిన్ = వన

పంక్తియందు; కరలు......ధ్వనిన్-కెరలు = కూయుచున్న; పిక = కోయిలల యొక్కయు; శారికా = గోరువంకల యొక్కయు; కీర = చిలుకల యొక్కయు; కేకి = నెమిళ్ల యొక్కయు; భృంగ = తుమ్మెదల యొక్కయు; సారస = బెగ్గురు పక్షుల యొక్కయు; ధ్వనిన్ = ధ్వనిచేత; తనలోని......దరులు = తన లోపలి వైన నెలరాల యొక్క గుహలు; ప్రతిశబ్దము = మాఱుమ్రోఁతను; ఈనన్ = పుట్టింపఁగా; గంధర్వ......ఘూర్ణితమగు- గంధర్వ = గంధర్వుల యొక్కయు; యక్ష = జక్కుల యొక్కయు; గాన = సంగీత ధ్వనులచేత; ఘూర్ణితమగు = మ్రోగుచున్నట్టి; ఒక్కకోనన్ = ఒక కొండసందు గొందిని; కనియెన్ = చూచెను.

తాత్ప:- ఇంద్రుఁడు వజ్రాయుధముచే నఱకఁగా నేర్పడిన గాయపుఁబగులో యన్నట్లు చివరనుండి యడుగువఱకు నెఱ్ఱగా నగపడుచున్న యిరుపార్శ్వములు గల కొండచీలికయందుఁ బ్రవహించుచున్న గంగయొక్క యిరుదరులందు నిసుక పామైనయెడల మిన్నంటఁ బెరిఁగి దట్టముగాఁ గదిసి, యెండ చొరనీని మ్రాఁకుల తోఁపులందుఁ గలకల కూయుచున్న కోయిలలు, చిలుకలు మొదలైనవాని ధ్వనుల చేతను,ఆ ధ్వనులకుఁ బ్రతిధ్వను లిచ్చుచున్న గుహలచేతను,అచట విహరించుచున్న యక్ష, గంధర్వుల సంగీత ధ్వనులచేతను నొప్పుచున్న యొక కొండసందు గొందిని ప్రవరుఁడు చూచెను.

వ్యా. వి :- (1) కెలను + లు = కెలకులు = కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు; బహువచనము పరంబగునపుడు నిత్యముగనగు (చూ. బా. వ్యా. అచ్చి. సూ 18) (2) అర్క + అంశులు; (3) నారికేళ + ఆది = సవర్ణ దీర్ఘ సంధులు. (4) అయ్యేరు = త్రికసంధి.

సమాసములు :-

(1) అర్క + అంశులు (అర్కాంశులు) (2) విటపికాంతారము = ష. త. (3) గంధర్వ యక్ష గాన ఘూర్ణితము = తృ. త.

అలంకారము :-

స్వభావోక్తి.

ఛందస్సు :- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 49. కనుఁగొని = (ఆ కోనను) జూచి; ఇది = ఈ కానవచ్చునది; ముని యాశ్రమము = మునులు తపస్సుచేయు చోటు; అను తహతహ = అనునట్టి తమ కము - అనియెడి భ్రాంతి; పొడమన్ = పుట్టఁగా; ఇచటికిన్ అరిగినన్ = ఈ చోటికి పోయినచో; నాకు; ఒక తెఱువు = ఒక్క యుపాయము; కననగున్ = కాన వచ్చును -.కలుగును; అని = అనుకొని; మనమునన్ = మనస్సునందు; కల

దిగులు = కలిగిన యధైర్యము; కొంత = కొంచెము; మట్టుపడంగన్ = తగ్గఁగా;- తరువాతి పద్యముతో నన్వయము.

తాత్ప :- చూచి, యిది యాశ్రమమేమో యను నాశగల్గి, యిచ్చటి కేగిన నా కొక త్రోవదొరకునని యనుకొని, దిగులు నశింపఁగా,—

వ్యా. వి :- తహ తహ + పొడమి = తహతహ వొడమి (గసడదవా దేశ సంధి)

**విశేషము :—**

తాపము తగ్గి నెమ్మది చేకూరిన భావము పద్యము నడకచేతఁగూడ పెద్ద నార్యుఁడు తెలుపుడు చేయుచున్నాఁడు.

ఛందస్సు:— చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 50. ధరణీసురుఁడు = బ్రాహ్మణుఁడు – ప్రవరుఁడు; నికట...ధారన్- నికట = సమీపమునందలి; మహీధర=కొండ యొక్క; అగ్ర = చివరయందుఁగల; తట = ప్రదేశమునుండి; నిర్గత = వెడలిన; నిర్ఝర ధారన్ = సెలయేటి ధారను; పాసి = విడిచి - దానినుండి చీలి యనుట; లోయకున్ = కోనతట్టునకు; తలక్రిందుగా = పై భాగము క్రిందికి వాలునట్లుగా; మలఁకలై = వంపువంపుగాఁ దిరిగినవై; దిగు కాలువ వెంటన్ = దిగువకుఁ బాఱుచున్న కాలువవెంబడిని; పూచు మల్లికలు = పుష్పించినట్టి మల్లె తీఁగలు; అవలంబనంబుగన్ = చేతిపట్టు కాఁగా; అలి ప్రకరధ్వని = తుమ్మెద గుంపుల మ్రోఁత; చిమ్మిరేఁగన్ = మిక్కిలి యతిశయింపఁగా; మణిపట్టభంగసరణిన్ = రత్నముల మెట్లదారిని; లోనికిన్ = ఆ కోనలోపలికి; ఏఁగి = పోయి; చెంగటన్ = సమీపమునందు. తరువాతి పద్యముతో నన్వయము.

తాత్ప :- ప్రవరుఁడు తానున్న తావునకు దాపునఁ గొండకొమ్మునుండి లోయలోనికి వంపులు దిరిగి దలక్రిందుగాఁ బ్రవహించుచున్న సెలయేటి కాలువ యిరుదరులందును మొలచి, పూచి,పరిమళించుచున్న మల్లెతీఁగలను బట్టుకొని, వాని యందు మూఁగిన తుమ్మెదలు రేఁగి ఝుంకారము చేయుచుండఁగా, నచ్చటఁ గట్టఁబడియున్న రతనపు మెట్లమార్గమునఁ గోనలోనికి దిగి, యా సమీపమునందు-

వ్యా. వి :- మహీధర + అగ్రము = స.దీ. సంధి.

**విశేషము:-**

ఇందలి ప్రవరుని మార్గవర్ణనము చిత్రకారుల చిత్ర రచనల కొరవడి యైనది. ఇది కవితాపితామహత్వము సార్థకమగు విశదవర్ణన ఫణితి.

సమాసములు :-

(1) మహీధరాగ్రతటము; (2) మహీధరాగ్ర.... ధార = షష్ఠీ తత్పురుష ములు; (3) ధరణీసురుఁడు = స౦త; (4) అళిప్రకరము; (5) అళిప్రకర ధ్వని = ష. త. లు.

ఛందస్సు :- చూ. రాజసూయము. 9వ పద్య వ్యాఖ్య. పుట 16.

గమనిక:-

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

ప. 51. క్రేవలన్ = పార్శ్వము లందు; తావుల్ = పరిమళములను; చల్లు = ప్రసరింపఁ జేయునట్టి; చెంగలువ = చెంగల్వ పూవులుగల; కేదారంబు = వరి మడియొక్క; తీరంబునన్ = చేరువను; మావుల్ = మామిడి మ్రాఁకులును; క్రోవులు = ఎఱ్ఱపువ్వుల గోరఁట చెట్లును; అల్లి విల్లిగొను కాంతారంబునందున్ = ఒకటితో నొకటి పెనఁగొన్న వనమునందు; ఐందవ .... గుళుచ్ఛంబులన్ — ఐందవ గ్రావా = చంద్రకాంతపు రాలచేత - ఆ ఱాలతోఁ జేయఁబడిన కంబములు మొదలైనవానిచేతననుట; ఆకల్పిత = చక్కఁగా రచింపఁబడిన; కాయమాన = పందిటి యందు; జటిల = దట్టముగా నల్లుకొన్న; ద్రాక్షా గుళుచ్ఛంబులన్ = ద్రాక్షపండ్ల గుత్తులచేతను; పూవుందీవెలన్ = పుష్పించిన తీఁగెల చేతను; ఒప్పు నొక్క భవనంబున్ = ఒప్పునట్టి యొక యింటిని; గారుడోత్కీర్ణమున్ = గరుడ పచ్చలచేఁ బొదుగఁబడినదానిని (దీనికిఁ గ్రియ తర్వాతి పద్యములోని 'కాంచి' అనునది.)

తాత్ప :- చెంగలువల పరిమళములు చుట్టుపట్లఁ బ్రసరింపఁ జేయుచున్న వరిమడి వెంబడి, మామిళ్లు, గోరంటలు నొకటితో నొకటి పెనఁగొన్న యొక వనము నడుమఁ, జంద్రకాంతపు ఱాలచే రచింపఁబడిన పందిటియందు ద్రాక్షతీఁగలును, బువ్వుదీఁగలును నల్లుకొని, ద్రాక్షపండ్ల గుత్తులును, పూగుత్తులును వ్రేలఁబడి, పరిమళించుచుండఁగా నొప్పునట్టిదియు, గరుడపచ్చలు దాఁపినట్టిదియు నగు నొక యింటిని ప్రవరుఁడు చూచెను.

వ్యా. వి:- (1) చెన్ను + కలువ = [సమాసంబునం బ్రాఁతాదుల తొలి యచ్చు మీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు] చె + కలువ. (2) లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు = చె + ను + కలువ. (3) పిమ్మట ద్రుతకార్యము. "చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు." [బా. వ్యా. సంధి. సూ 37 వివరణము] కేవలము చిన్నయసూరి చెప్పినట్లు శోణార్థమే యైనచో 'చెంగావులు' మున్నగువానికి బాధకము. కావున రమ్యార్థమునందు నగువని గ్రాహ్యము.

(1) ఐందవ గ్రావ + ఆకల్పితము = ఐందవ గ్రావా కల్పితము (స. దీ. సంధి) (2) గారుడ + ఉత్కీర్ణము = గారుడోత్కీర్ణము. (గుణ సంధి)

గమనిక :-

ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

ఛందస్సు :- చూ. అంబరీషోపాఖ్యానము. 1వ పద్య వ్యాఖ్య. పుట 86.

ప. 52. కాంచి = (అట్టి దివ్య భవనమును) చూచి; తదీయ...గరిమకున్- తదీయ = దానిదైన; విచిత్ర = వింతయైన; ఉదంచిత = మిక్కిలి యొప్పిదమైన; సౌభాగ్య గరిమకున్ = చక్కఁదనము యొక్క గొప్పతనమునకు - అతిశయిత్వము నకు; అచ్చెరువడి = ఆశ్చర్యపడి; అకాంచన గర్భాన్వయమణి = బ్రాహ్మణ వంశ శ్రేష్ఠుఁడైన యా ప్రవరుఁడు; ఇంచుక = కొంచెము; తఱియంగన్ = దగ్గఱగా; అచటికిన్ = ఆ తావునకు; ఏఁగెడు వేళన్ = పోవునప్పుడు. క్రింది పద్యముతో నన్వయము.

తాత్ప :- చూచి చూచి, దాని శోభ కాశ్చర్యపడి, ప్రవరుఁడు దానిని సమీపింపఁబోవు వేళకు,—

వ్యా. వి :- (1) విచిత్ర + ఉదంచితము = విచిత్రోదంచితము (గుణ సంధి) (2) అకాంచన గర్భుఁడు = త్రిక సంధి.

సమాసములు :-

(1) విచిత్రోదంచితము = తృ.త; (2) సౌభాగ్య గరిమ = ష. త; (3) అకాంచన...మణి = ష. త.

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

వ. 53. మృగమద....పరిమళమై; మృగమద = కస్తూరి యొక్క; సౌరభ = పరిమళము యొక్క; విభవ = వైభవముచే; ద్విగుణిత = రెండింతలుగాఁ జేయఁ బడిన; ఘనసార = పచ్చ కర్పూరముచేత; సాంద్ర = దట్టమయిన- వీటీ = తాంబూలము యొక్క; గంధ = పరిమళముచేత; స్థగిత = కప్పఁబడిన - అణఁచివేయఁబడిన; ఇతర పరిమళమై = అన్యములయిన పువ్వులు మొదలైనవాని వాసనలు గలదై; మగువ పొలుపున్ = స్త్రీ యొక్క జాడను; తెలుపు నొక్క మారుతము = తెలియఁ జేయునట్టి యొక గాలి; ఒలసెన్ = వీచెను.

తాత్ప :- అప్పుడు కస్తూరి, పచ్చకర్పూరము మొదలయిన పరిమళ ద్రవ్యములతో విడెముచేసిన వాసన తక్కిన వాసనలనెల్ల నణఁచివేయఁగా, నట్టి వాసన చేత స్త్రీ యొకతె యిచ్చట నున్నదను జాడను దెలుపునట్టి గాలి మెల్లఁగా వీచెను.

విశేషము :—

ఈ పద్యము నడక వీచిన గాలి తిరిగిన మెలికలను దలపించుచుఁ బ్రవేశింపనున్న మరున్నారీ శిరోరత్నము ప్రదర్శింపఁబోవు కులుకులను సూచించుచున్నది. లాక్షణికులు చెప్పినట్లుగ నిందు వర్ణింపఁబడిన గాలికి మాంద్యము, సౌగంధ్యము, శీతలత్వమును సూచింపఁబడినవి.

వ్యా॰ వి :- స్థగిత + ఇతరము = స్థగితేతరము (గుణ సంధి.)

సమాసములు :-

(1) మృగమద ... పరిమళము = కర్మధారయము, (2) మగువ పొలుపు = ష. త.

అలంకారము :-

కావ్యలింగము. (హేతువు వాక్యగతముగాఁ గాని, పదముగాఁగాని నిబద్ధింపబడినచో కావ్యలింగము)

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్యా॰ పుట 6.

గమనిక :-

"మగువ పొలుపుఁ దెలుపు నొక్కమారుత మొలసెన్"-సందర్భ వ్యాఖ్యకు ముఖ్యము.

---

## 1. కవి కాలాదికము

అల్లసాని పెద్దన స్వారోచిష మను సంభవమునకు కర్త. దీనికి మనుచరిత్ర మనియు నామాంతరము. అలసాని పెద్దన ఆశ్వలాయన సూత్రుఁడు; ఋక్శాఖాధ్యాయి; వసిష్ఠసగోత్రుఁడు; నందవరీక నియోగి బ్రాహ్మణుఁడు; చొక్కనామాత్యుని కుమారుఁడు; శఠకోపయతికి శిష్యుఁడు; వైష్ణవము స్వీకరించినను, మత సహనముగల అద్వైతి. శివస్తుతి విముఖుఁడుగాని వైష్ణవ భక్తుఁడు. కావ్యారంభమున విష్ణువుతోఁబాటు బ్రహ్మను, శివునికూడ స్మరించెను.

ఈ కవివరేణ్యుని యభిజనము (జన్మభూమి) నేఁటి బళ్ళారి మండలము నందలి "దొరాలయము", లేక- "దోరాల" యను గ్రామమని ప్రతీతి.

పెద్దనార్యుఁడు శ్రీ కృష్ణదేవరాయల ఆస్థానియందుఁగల కవులలో నగ్రేసరుఁడు. ఒక్క మనుచరిత్రమునే గాక, హరికథాసారమను గ్రంథమును,

(సీసపద్య శతకమును, రామ స్తవరాజము, అద్వైత సిద్ధాంతమునను) మఱి కొన్ని కృతులనుగూడ చెప్పినట్లు జనశ్రుతి; అవి నేడుపలభ్యములు గావు. హరి కథా సారమునందలి పద్యముల నుదాహరించినట్లే కొందఱు లాక్షణికులు 'సత్యావధూ ప్రీణనా'ది సంస్కృత గ్రంథములను, "ఆముక్త మాల్యద" యను నాంధ్ర ప్రబంధమును గూడ పెద్దనార్యుఁడే నిర్మించెనన్నట్లు ఊహచేసి యుదాహరించిరి. కొందఱు వ్యాఖ్యాతలును నిట్టి యూహలను పెంచిరి. కాని యీపై రెండును శ్రీ రాయల రచనలేయని నేఁడు నిర్ధరింపఁబడినవి.

సంస్కృతాంధ్ర భాషలలోఁ బెద్దనార్యుఁడు మహావిద్వాంసుఁడు; కర్ణాటక భాషా పరిజ్ఞానమును గలవాఁడు, చతురవచోనిధి. అతులపురాణేతిహాస కథార్థ స్మృతి యుతుఁడు; చతుర్విధ కవితా ధురీణుఁడు; సాహితీ సమరాంగణ చక్రవర్తి యైన రాయలను తన ఆశుకవితా ధాటిచే మెప్పించి గండపెండేరమును పాదమునకు తొడిగించుకొనిన సాటిలేని మేటికవి పెద్దనామాత్యుఁడు. తన యాస్థాని కవులైన యష్టదిగ్గజములలో నెల్ల నీతనికి "ఆంధ్ర కవితా పితామహుఁ" డను బిరుదమునిచ్చి శ్రీ రాయలు సత్కరించినాఁడు. ఇతనికి పూర్వమొకరికిని, ఇతని పిమ్మట నింకొకరికినిగూడ నీ బిరుదమున్నది. కాని, యది యొక్క పెద్దనామాత్యుని యందే సార్థకమయ్యెను.

పెద్దనార్యునకు రాయలు "కోకట గ్రామాద్యనేకాగ్రహారము" లిడినట్లు తెలియుచున్నది. శ్రీనాథునివలెనే పెద్దనయు నాజన్మభోగి. తన్ను పోషించిన వారిని తుది ఘడియవఱకు మఱవఁజాలని కృతజ్ఞత యందుఁగూడ నీతఁడాతనినిఁ బోలును. కాని యాతనివలె వార్ధకమున నీతఁడు దారిద్ర్య పీడితుఁడైనట్లు వినము; పైపెచ్చు నెఱదాత యైనట్లు నిదర్శనములున్నవి. రాజులవలనఁ బెక్కురు కవు లగ్రహారములు గొనిరి. కాని వానిని దేవబ్రాహ్మణుల వినియోగమునకై దానముచేసిన కవి పెద్దనార్యుఁడొక్కఁడే!

రాయలనుండి పెద్దనార్యుఁడు, కఠివాచి సీమ (దక్షిణార్కాడు జిల్లా) నాయంకరమును సైతము పొందినట్లు శాసనాధారము లున్నవి. అందుచే పెద్దనార్యుఁడు కవిమాత్రుఁడే కాదు; నాయంకరమున కధిపతి; రాజకార్య నిర్వహణ దక్షుఁడు.

సాహిత్య సమరాంగణ సార్వభౌముఁడైన రాయలచే మన్ననలుగొన్న పెద్దనార్యుఁడు తాను ఆయనకంటె సుమారు పది పదునైదేండ్లు పెద్దయై యుండవచ్చును. ప్రామాణికములైన చరిత్రాధారములను బట్టి మనుచరిత్రము క్రీ. శ. 1519వ సంవత్సరము ప్రాంతములో రచింపఁబడి యుండవచ్చునని నిర్ధారితము. అప్పటికి పెద్దనామాత్యునకు కనీసము ఏబది యేండ్లైన నుండవలెను. కావున నాతని జననము రమారమి క్రీ. శ. 1470 కావచ్చునని యూహ. శ్రీ

కృష్ణరాయలు స్వర్గస్థుఁడైనది సుమారు క్రీ. శ. 1530వ సంవత్సరము. అతనితో దివి కేగలేక బ్రతికియున్నందులకు తన్నుఁదా జీవచ్ఛవమ ననుకొన్న పెద్దనార్యుఁడు క్రీ. శ. 1535వ సంవత్సరము వఱకైన జీవించి యుండనోపును. ఆ యూహేతువులను బురస్కరించుకొని ఆంధ్ర కవితా పితామహుఁడు క్రీ. శ. 1470-1535 వఱకును జీవించి యుండె ననవచ్చును.

## 2. మనుచరిత్రము : దాని మూలగ్రంథము

పదునాఱవ శతాబ్దికి పూర్వ మాంధ్రకవు లందఱు నన్నయ మార్గావలంబులే. అనఁగా, నే సంస్కృత పురాణమునో, కావ్య నాటకాదులనో చేపట్టి ఆంధ్రీకరించుచుఁ దమ సారస్వతాభివృద్ధికిఁ బాటుపడినవారు. స్వతంత్ర రచనలు చేయఁదలఁపనివారు. శ్రీనాథునంతటివాఁడు కూడఁ గొంతవరకిట్లే యనువాద సాహిత్యాభివృద్ధిఁ గావించినాఁడు. ఇట్టి తరుణమునఁ బదునాఱవ శతాబ్ద్యారంభమున పెద్దనామాత్యుఁడు మనుచరిత్రకృతి కల్పించి ప్రబంధ కవిత్వమునకు మార్గము చూపెను. ఈ మను చరిత్ర కథ మార్కండేయ పురాణమునుండి కైకొనఁబడినది. ఆ మార్కండేయ పురాణము సుమారు క్రీ. శ. 1330 వ సంవత్సరమున తిక్కనార్యుని శిష్యుఁడైన మారనచే సంస్కృతమునుండి యనువదింపఁబడెను. సంస్కృతాంధ్ర మార్కండేయ పురాణముల రెంటిని పెద్దనార్యుఁడు చూచినను, మారన రచననే విశేషించి యనుసరించినాఁడు. ఆ పురాణకథకు నీ ప్రబంధ కథకు నొకటి రెండు తావులందు స్వల్ప భేదమున్నది. అదియైనను ఔచిత్య పోషణమునకుఁగాను, రస సంపాదనమునకుఁగాను కల్పింపఁబడిన భేదము. పురాణముకంటె ప్రబంధము రసప్రధానమైనది. అందుచే వరూథినీ ప్రవర సంవాదము, స్వరోచి వేఁట మొదలుగఁ జేయఁబడిన నొకటి రెండు మార్పులుగూడ ప్రబంధమునకు గుణమునే యాపాదించినవి.

స్వారోచిషుఁడను రెండవ మనువు జన్మవృత్తాంత మిందలి కథావిషయము. మూలములో నీ కథ స్వారోచిషుని తండ్రియగు స్వరోచి యొక్క పుట్టువునకు మూలకందమగు వరూథినీ ప్రవరుల వృత్తాంతముతో ప్రారంభించి, స్వారోచిషునకు మనుష్యత్వము కల్గుటతో ముగిసినది. పెద్దనార్యుఁడుగూడ నీకథ నిట్లే లిఖించినాఁడు. ఇట్లు మూఁడు తరముల కథను చిత్రించుటవలననే విమర్శకులు కొందఱిందు వస్త్వైక్యము లోపించినదని వాదించుటకు వీలైనది. కథలో ఐక్యము లోపించుటయన్నది నిజముకాదు. స్వారోచిషమనువు పుట్టుటకు పూర్వాపూర్వ కారణ కలాపములుగా నేయే కథాంశము లావశ్యకములో, కవి వానినే మనుచరిత్రయందు సూత్రించినాఁడు. నిర్వహణమున ప్రతి ఘట్టమును ఉపసంహార ప్రవణముగనే యున్నది. అందుచే, నొకే సూత్రమున పోహళించిన ముత్యముల వలెనే యిందలి కథాంశము లున్నవి.

పురాణకథను స్వీకరించినను పెద్దనామాత్యుఁ డిందు అలంకారికులు చెప్పిన రీతిగ పదునెనిమిది వర్ణనలను సందర్భోచితముగ చొప్పించి రసవత్తర మొనర్చి తన ప్రబంధమును మూలముకంటె నాలుగింతలు పెంపొందించెను. ఇందలి వర్ణనలు కల్పితములు. ఇది యనువాద గ్రంథము కాదు. ఇందలి యితివృత్తము పురాణ ప్రసిద్ధము; ప్రధానరసము శృంగారమని కొందఱు; శాంతమని మఱి కొంద అందురు. రసమునకు పాఠకులే కుదురు. (రసము సామాజిక నిష్ఠము). కావున వరూథినీ ప్రవరుల కథలో, నెన్నియో అడ్డంకులను దాఁటి మంచి శీలమును నిల బెట్టుకొన్న ప్రవరుని చరిత్రకే ప్రాధాన్య మేర్పడి శాంతరసమే ప్రతిపాదింపఁబడు చున్నది. విశేషించి మన పాఠ్యభాగమున కథ ప్రవరుని చరిత్రతోడనే ఉపక్రమించి యాతని సచ్ఛీలమునే యుగ్గడించుచు సాగెను. అందుచే మన మనుభవించు రసము శాంతమే యనక తీరదు.

పాత్రపోషణ, రసపోషణ మున్నగు పెక్కు సుగుణములచే మనుచరిత్ర మాంధ్రభాషలో పేరెన్నికఁగన్న ప్రబంధము; ఆంధ్ర పంచకావ్యములలో నగ్ర గణ్యమైనది. ఇట్టి వనేక కారణములచేతనే దీనికి రూపాంతరములు భాషాంతరీ కరణములును వెలువడినవి. శ్రీ పూఁడ్ల వేంకటరమణయ్యగారు దీనిని ద్విపదగా గూర్చిరి. శ్రీ సాధుపల్లి చంద్రశేఖర శాస్త్రిగారు దీనిని కన్నడములోని కనువదిం చిరి. కొంత భాగము హిందీలోనికి పరివర్తనమునైనది.

## 3. ప్రస్తుత కథా సంగ్రహము

ఆర్యావర్తమున వరణానదీ తటమున నరుణాస్పద మను పురమొండు గలదు. అందుఁ బ్రవరుఁడను విప్రకుమారుఁడు తన తల్లిదండ్రులతోడను, భార్య తోడను, శిష్యవర్గముతోడను నివసించుచుండెను. అతఁడు యజనాది షట్కర్మ నిరతుఁడై యతిథిపూజా ధురంధరుఁడై విలసిల్లుచుండెను. అతనిభార్య యన్న యన్నపూర్ణాదేవియుంబోలె నిత్యము నభ్యాగతుల కన్నదానముఁ జేయు శీలవతి. ఇట్లుండ మంత్రౌషధసిద్ధుఁడొకఁ డొకనాఁడా ప్రవరుని యింటికి వచ్చెను.

ప్రవరుఁడు నతని నతిథి సత్కారంబులఁ దనిపి; యాతం డద్దానం దృప్తినొంది సుఖాసీనుఁడై యున్నతఱి, నతనిం జేరఁబోయి; "స్వామీ! మీ రేయే దేశములఁ జూచినా" రని ప్రశ్నచేయఁగా నాసిద్ధుఁ "డో వత్సా! ఈ యా దేశమని చెప్పుటకు వీలులేదు. నేను సమస్త ప్రపంచమును జుట్టివచ్చితి" నని చెప్పగాఁ బ్రవరుఁ డచ్చెరు వంది "యో మునిలోక గ్రామణీ! మీరు రూపమునందుఁ దరుణవయస్కులై యున్నట్లగపడుచున్నారు. ఇట్టి చిఱుతప్రాయములోన నెట్లు భూ ప్రదక్షిణముం జేయ సమకూరె నెఱింగింపుఁ" డనవుడు, నాసిద్ధుఁ "డో భూసుర వతంసా! మా సంచారమునకు నాధారము రహస్యమైన సంగతియైనను నీయందు నాకుఁ గల యనురాగముచేత దాఁచక చెప్పెదను. ఈశ్వర ప్రసాదమునఁ బాదలేపమను

దివ్యౌషధ మొకటి మాకు లభించెను. ఆ రసమును పాదములకుఁ బూసికొని, తన్మాహాత్మ్యమున నెచ్చటికిఁబోవ నిచ్చవొడమ నచ్చటి కేఁగుచుండెద" మని చెప్పెను.

దానికి నివ్వెఱపడి ప్రవరుఁ, 'డో యతిసత్తమా! దివ్యక్షేత్ర సందర్శనాభిలాష నా మనసు నెంతకాలమునుండియో బాధించుచున్నది. మీరు నన్ను శిష్యునిఁగా భావించి, నాయం దాదరణ గలవారయి నన్నుఁ దీర్థయాత్రవలన ధన్యునిఁగాఁ జేయుఁ" డని పలువిధములఁ బ్రార్థింప, నా సిద్ధుండొక పసరు నిది యది యని చెప్పక యా ప్రవరుని కాలికిం బూసి, తన మార్గమునంబోఁగా, దివ్యక్షేత్ర సందర్శనాభిలాషియగు నా విప్రకుమారుఁడు హిమవత్పర్వత నిరీక్షాపేక్షచే నచటికిఁ బోయెను.

ఇట్లువోయి, నరనారాయణాశ్రమమగు బదరీవన మార్గమునఁ జని, యపరిమిత జంతు సంతానాంచితంబులును, నానావిధ తరులతా శోభితంబులు నగు నరణ్యంబులఁ గడచి చని, మున్ను భగీరథుఁడు తప మాచరించిన ప్రదేశము, గంగానది భూమికి దిగినచోటు, పార్వతి యీశ్వర సేవా పరతచేఁ జొక్కిన చోటు,మన్మథుఁడు ఫాలలోచనుని కంటిమంటవలనఁ గాలి బూడిదయైన చోటు, మునిపత్నులయందనురాగముచే మున్నగ్నిహోత్రుఁడు విరహవేదనఁ బడినచోటు, కుమారస్వామి పుట్టినచోటు మొదలగు పుణ్యస్థలములఁ గాంచి, యందందుఁగల విశేషముల నెల్లఁ దిలకించుచు, నా నగమహత్త్వంబును వేనోళ్లఁ బొగడుచుండ మధ్యాహ్నము ప్రాపించెను.

ఇఁకఁ దడవుగ మసలినఁ దన నిత్యకర్మానుష్ఠానములకు భంగము కలుగునని భావించి, నాఁటి కింటికిఁ జని, మఱునాఁడు మరల వచ్చి, తక్కిన విశేషంబులఁజూడ నిశ్చయించి, పోవను గమనింపఁగా, నతని పాదములకుఁ బూయఁబడిన లేపము మంచువలనఁ గరఁగిపోయి, కదలుటకు వీలు కాకపోయెను. దాన మిగులఁ బరితాపము నొంది, మార్గాన్వేషియై తిరుగుచుండఁగా, నొక్కెడ నతనికి దివ్యభవన మొకటి కాన్పించెను. అందు నివసించువారు తపసులై యుందురని భావించి, వారి నడిగి దారి తెలిసికొని పోవ నమకట్టి ప్రవరుఁ డచ్చోటికిఁ బోయెను.

## 4. ప్రశ్నోత్తరములు

(1) పెద్దన కవితా ప్రాశస్త్యము (కవిత్వశైలి) వర్ణింపుఁడు.

లేదా

"తిక్కన తెలుఁగుతేటయు, శ్రీనాథుని సమానఘాటియుఁగూడి పెద్దన కవిత్వమైనది"-నిరూపింపుము.

లేదా

'అల్లసానివాని అల్లిక జిగిబిగి'—ఈ నుడి సమర్థించునది.

లేదా

ఆంధ్రకవితా పితామహుని "శిరీషకుసుమ పేశల సుధామయోక్తు"ల నుగ్గడింపుము.

లేదా

మీ పాఠ్యభాగమునుబట్టి పెద్దనార్యునకు "ఆంధ్రకవితా పితామహ" త్వమును స్థిరీకరింపుఁడు.

మనుచరిత్రము జననకాలమును బట్టియు, సుగుణ గణమును బట్టియు, నాంధ్ర ప్రబంధములలో శ్రేష్ఠమైనది. ఈ గ్రంథమున కగ్రస్థానము నొసఁగిన గుణములలో శైలీసౌభాగ్యము మొట్టమొదటిది. గ్రంథమునకు జీవాతువని చెప్పఁదగిన ప్రవర వరూథినీ వృత్తాంతము నందలి శిల్పము రెండవది.

శైలీ విషయమున నాంధ్ర ప్రబంధములలో దీనినిఁ ద్రోసిరాజనఁగలది యింతవఱకును పుట్టలేదు. శబ్దాడంబరములేని నాదగాంభీర్యము, సౌమ్యగుణముగల ప్రౌఢవము, ఉద్వేగములేని శీఘ్రగమనము, పేలవత్వమునరాని స్వాభావికసరళతయు, పరియలు పరియలుగాక పుష్కలమై పటిష్ఠతతో తొళికిసలాడు పదముల కూర్పును, పెద్దనార్యుని శైలికి విలక్షణము లనఁదగియున్నవి. ఇన్ని గుణముల ప్రోఁగయి యున్న తొల్లిఁటి తెలుఁగు ప్రబంధ మగుట వలనఁ దరువాతి ప్రబంధకారులెల్లరు దీని ననుకరింపక తీరలేదు. వారి యీ యనుకరణమే పెద్దనామాత్యునకు ప్రబంధకవులలో నగ్రతాంబూల మిప్పింపఁగల్గినది. 'అల్లసానివాని యల్లిక జిగిబిగి' మనుచరిత్రమున పరాకాష్ఠనొంది, యాతనికి ఉత్తమ ప్రబంధకర్త యన్నకీర్తి నార్జించి పెట్టెనన్నఁ జాలును.

ఇందలి రెండవ గుణము శిల్పచమత్కృతి. ఇది ప్రధానముగ పాత్రపోషణ సంబంధిగనున్నది. అతిమానుషములైన యన్ని పాత్రల నడుమ మానవత్వ ముట్టిపడునది యొక్క ప్రవరుని పాత్రయందే యనుట నిజము. శమదమాదులచే ప్రశాంత చిత్తుఁడైన ప్రవరుని పాత్రకు మెఱుఁగులు దిద్దుటకై, వరూథినీ వృత్తాంతము ప్రతియోగపద్ధతిచే, నెంతయు తోడ్పడుచున్నది. ప్రవరుఁడు శాంతరసమున కాలంబన విభావమనఁదగిన పాత్రమైనచో, వరూథిని దానికి విరుద్ధమని చెప్పఁబడెడి శృంగారరసమున కాలంబమగుపాత్ర. ఈ రెండు పాత్రల నాధారముగఁ జేసికొని సంవాద పోషణమునందు, పాత్ర పోషణ రసపోషణము లందును పెద్దనార్యుఁడు వెలార్చిన శిల్పాధ్యాయిత న భూతో న భవిష్యతి.

ఈ రెండు పాత్రలను బురస్కరించుకొని ఆ పెనకువను చిత్రించుటలో నాంధ్రకవితా పితామహుఁడు నిర్వహించిన నాటకీయ తాటస్థ్యము (Dramatic Objectivity), శ్రవ్య కావ్యమును చెప్పు కవులెల్లరకు కుదురునదికాదు. అట్లు వరూథినీ ప్రవరు లిర్వురిలో తా నేవైపునకుగాని మొగ్గినట్లు ములుసూపక, శాంత శృంగార రస స్రవంతులను సమగాంభీర్యముతోఁ బెద్దన బ్రవాహింపఁ జేసినాఁడు. కావుటచేఁ బాఠకులు సైతము నీ పాత్ర లిరువురి దెస సమానాదరాభిమానములనే ప్రకటింతురు. జితేంద్రియత్వమునకు అటు శుకుఁడే శుకుఁడు; ఇటు ఆంధ్రుల ప్రవరుఁడే ప్రవరుఁడు. ఈ విషయమున నాంధ్రు లీతని దృష్టాంతమునే చెప్పుకొనుచున్నారు. తిక్కనార్యునకుఁ బిమ్మట నింతగా నిత్యజీవిత సన్నిహితములైన పాత్రలను సృష్టించినవాఁడు పెద్దనార్యుఁడే గాన, నాంధ్రకవితా పితామహత్వ బిరుద మాతనికి బాగుగ కుదురుకొని సార్థకమగుచున్నది.

ఈ కావ్య సౌందర్యమునకు కారణభూతమైన యింకొక మనోహరాంశము, ఇందలి దృశ్యవర్ణనా సౌభాగ్యము. మన పాఠ్య భాగము నందలి హిమాలయ దరీ ఝరీ సానువుల వర్ణనము మున్నగునవి చిత్రలేఖనమునకు మేలుబంతి గాఁదగినవి. ఇట్టి వర్ణనలును, నరుణాస్పద పురవర్ణనమును గూడ కథా సందర్భోచితీ విలసితములేగాక, కథాకార్యమునకు నావశ్యకములును నగుచున్నవి. ఈ వర్ణన లీకావ్యలక్ష్మి ప్రయోగించు నాటకమునకు రంగాలంకారములై వెలయుచు రసభావాదుల నుద్దీపింపఁ జేయుచున్నవనుట, సత్యసమ్మతము. ఇదియుఁగాక, ఈ వర్ణింపఁబడిన దృశ్యముయొక్క స్వభావమునుబట్టి పదముల కూర్పుకూడ నొకయెడ సరళముగను, మఱియొకయెడ నుదాత్తముగను, నింకొకయెడ గంభీరముగను, వేఱొకయెడ సంశ్లిష్టముగను రూపరేఖల దిద్దుకొనుచు వచ్చినది. శబ్ద సరణి యెన్నెన్ని రూపముల నొందినను, పెద్దనామాత్యుని వాక్కునకు సైజమైన ప్రసన్నతా గుణమిందుఁ బ్రస్ఫుటించుచునే యుండును. అదియుఁగాక, అర్థమున కనుగుణమగు నాద గాంభీర్యమును శబ్దమునందు కుంభింపఁజేయుటలో పెద్దనార్యుని కంటెఁ బెద్దలేఁడు.

అల్లిక జిగిబిగియు శిరీష కుసుమపేశల సుధామయోక్తులునుగల శైలీ విశిష్టత వలనను, సర్వతోముఖ శిల్ప సంపాదనము వలనను, పాత్ర పోషణము, రస నిర్వహణము, వర్ణనాసామర్థ్యము మున్నగువాని వలనను, పెద్దనార్యునకు ఆంధ్ర కవితా పితామహుఁడను బిరుదము అన్వర్థమగుచున్నది.

(2) "అల్లసాని పెద్దన తవ కాలములోని భావములకు ప్రతినిధి". - చర్చింపుము.

లేదా

'మనుచరిత్ర' యందు తాత్కాలిక సాంఘిక పరిస్థితు లెంతవరకు ప్రతిబింబించినవి ?

కావ్య మొక యద్దము. అందనేక విషయములు ప్రతిఫలింపఁగలవు. సమకాలీన భావములు సాంఘిక పరిస్థితులునుగూడ కావ్యదర్పణమునందుఁ బ్రతిబింబించుచుండును. పెద్దనార్యుని మనుచరిత్రమునందు అట్లు జరిగినది. అతఁడు స్వతంత్రుఁడు కావున, సమకాలీన భావములు గ్రంథమునందే గాక; కావ్యవస్తువునందును, రచనా పద్ధతి యందును, భావప్రకటనా విధానమునందును గూడఁ బ్రతిబింబించినవి.

కృష్ణరాయల కాలమొక సువర్ణయుగము. విజయనగర సామ్రాజ్యమాతనికాలమున ఉచ్చదశనందినది. దేశ శాంతి భద్రతలకును దేశీయ కళాభివృద్ధికిని నవినాభావ సంబంధము కలదని ప్రపంచ చరిత్ర చెప్పుచున్నది. ఆనాఁడు ఆంధ్రుల సారస్వతము క్రొంగ్రొత్త తేజముతోఁ బ్రకాశించెను. ఒకవంక మహమ్మదీయ సంస్కృతియు, వేఱొకవంక నాంధ్రసంస్కృతియు, స్పర్థతో డీకొనినవి. భిన్న భిన్న నాగరకతల సంఘర్షణమప్పుడు మన యభివృద్ధికిఁ గారణమయ్యెను. ఆంధ్రుల కళావిలాసము అనుకొనకయే వేగముగఁ బరివర్తన నందఁజొచ్చినది.

సంఘములో నొక పక్షము, స్వాతంత్ర్య ప్రీతియు,ఁ బూర్వాచారముల యెడ విముఖతయు గలది. రెండవ పక్షము, సంప్రదాయములయందుఁ బక్షపాతము గలది. ఈ యిరు పక్షములును మనుచరిత్రమునఁ బ్రతిబింబించినవి. కావుట చేతనే, యిందలి ముఖ్యపాత్రలు రెండు. పూర్వాచార పరాయణుఁడును, కఠినమైన నీతినేగాని దయనెఱుఁగని వాఁడునునగు ప్రవరుఁడొక ప్రధాన పాత్ర. విజయనగర సామ్రాజ్య మందలి భోగములకు మూర్తిభవమును కోమల హృదయయు ననఁదగు వరూథిని రెండవ పాత్రము. ఈ రెండు విరుద్ధ ప్రకృతులను సృజించి పెద్దనార్యుఁడు తన భావమున కనుగుణముగా వారినిఁ బోషించెను. అతఁడు నైష్ఠికుఁడు; అయ్యును భోగి. కాన నతఁడు నాఁటి సంఘ స్వభావమునకుఁ బ్రతిబింబము.

సంఘములోని పరస్పర భిన్నమైన రెండు పక్షములకు నీతనిఁ బ్రధాన పాత్రలు ప్రతినిధులైనవి. ఆ రెండు పక్షముల సంఘర్షణమే, ఈ రెండు పాత్రల సృష్టికిని హేతువు.

పూర్వాచారములకు మూర్తిభవముగా బ్రవరుని జిత్రించినను బెద్దనార్యుఁడాతని యందుఁగంటె వరూథిని యందే సానుభూతిఁ గలవాఁడని విమర్శకులు కొందఱూహించిరి. కాని, భోగ నైష్ఠికతలకు నడుమ సంధి చేయుటకే పెద్దన ప్రయత్నించెననుట యాతని పెద్దరికమును నిలఁబెట్టుట.

**(i)** ప్రవరుఁడు లోకజ్ఞాన శూన్యుఁడు. అమాయికుఁడు. తానజ్ఞానినని తనకుఁ దెలియదు. ప్రవరుని యందుఁగల గుణము బుద్ధి జాడ్య జనితోన్మాదము.

**(ii)** నిరుపమానమగు వరూథిని సౌందర్యమును గాంచియు ప్రవరుఁడెట్టి మనోవికారమును పొందలేదు. అనఁగా, సచేతనముగాని పాషాణ ప్రకృతిగా చిత్రింపఁబడెను.

**(iii)** పెద్దన సహజముగ శృంగార ప్రియుఁడు. రాజాశ్రితుఁడు గదా! మఱి, కాని, పూర్వాచార పరాయణులైన పండితుల మెచ్చును పూర్తిగ కోల్పోవనులేఁడు. అందుచే వారికై ప్రవరుని, తన సంతుష్టికై వరూథినిని సృష్టించుచు, ప్రతిఫలాపేక్ష కలది కాదనియు, ఆమె యాతనికై ఆత్మహత్యఁ గావింపఁ దలఁచె ననియుఁ గూడఁ దెల్పెను.

**(iv)** సంఘములోననుడు, లేదా కవి తలఁపులోననుడు, కల్గిన భావ సంఘర్షణకు ఫలితముగ నైష్ఠికుఁడగు ప్రవరునకు, భోగలాలస యగు వరూథినికి, సంగమము కుదురుటలేదు. కాని, వారిరువురి సంగమము దెసకే కవి మనసు మొగ్గెను. నైష్ఠికుఁడగు ప్రవరుని యుద్ధరించినఁగాని సాంఘికుల మెప్పురాదు. వరూథినిని నిష్కారణముగ వెతపెట్టుట తన కిష్టములేదు. కావున, మాయా ప్రవరుఁడు సృష్టింపఁబడెను. అయ్యును, వరూథిని యందుఁగల యభిమానముచే నతఁడు వరూథినికి మాయాప్రవరుఁడని దెలియనీయక కొంత రహస్యముగ తృప్తినిఁ గల్గించెను. ఇది యాతనికి నామెపైఁగల సానుభూతినిఁ దెలుపుచున్న దని కొందఱ వాదము.

**(v)** సూర్యాస్తమయమును వర్ణించుచు, ప్రవరుని పాషాణహృదయము నకు సూర్యభగవానుఁడు రోషించెనో యనునట్లుగా నెఱ్ఱని కాంతిఁ దాల్చెననుట, కవికి వరూథినిపైఁగల యభిమానము వెల్లడియగుచున్నదని కొందఱు విమర్శకు లందురు.

**(vi)** వరూథినీ ప్రవరుల సంవాదములో ధర్మాధర్మములు. కామశాస్త్ర విషయములు చర్చింపఁబడును. అందు వరూథినికి వాదములోఁగల నైపుణ్యమును, పాండిత్యమును వెల్లడియగుచున్నది. ప్రవరుని పలుకులు నీరసముగ నుండుటయే గాక, యామె నిపుణతను ప్రశంసించుచుఁగూడ నున్నవి.

ఈ హేతువులఁ జూపి, వరూథినిపై పెద్దన కభిమానము గలదని కొందఱు నిర్ణయించుచు, నామె నాఁటి సంఘమున మెరసిన సనాతనాధునాతన భావ సంఘర్షణకు మూర్తిభవమనియు, విజయనగర సామ్రాజ్యము నందలి భోగము లకు పొడవొందిన రూపమనియుఁజెప్పిరి.

(౭) సిద్ధ ప్రవర సంవాదము నభివర్ణింపుము.

[లేదా - ప్రవరుఁడు 'భాషావరశేషభోగి' యని నిరూపించునది.] లేదా - [సిద్ధుని వృత్తాంత ప్రాముఖ్యము, నుగ్గడింపుఁడు.]

తమయూరు తీర్థ సంవాసు లేతెంచిరని వినినంతనే పోయి, వారిని సేవించి తనకుఁగల తీర్థ సందర్శనాభిలాషమును వెల్లడించుట ప్రవరునకు పరిపాటి. అభ్యాగత సేవాపరతంత్ర సకల జీవనుఁడై యిట్లు జీవితము గడపుచుండఁగా, నొకనాఁడొక సిద్ధుఁడాతని యూరుజేరెను.

ప్రవరాఖ్యుఁడు తన యాచారముచొప్పున నెదురేగి యా యోగీంద్రు నింటికిఁదెచ్చి యిష్టాన్నముచే సంతుష్టునిఁజేసి యీ రీతిగా నతనితో విన్నవించు కొనినాఁడు.

"అయ్యా ! తమ రెచ్చటినుండి యెచ్చటకుఁబోవుచు నిచ్చటి కేతెంచిరి ? విద్వాంసులచే నమస్కృతులుగొను మీరాకచే నేఁడుగదా మా యిల్లు పావన మైనది ! నేఁడు గదా నేను ధన్యుఁడనైతిని !

మీరు మాటాడు మాటలే మంత్రములు. మీ రడుగు పెట్టినచోటే ప్రయాగ క్షేత్రము. మీ పాదములకు సోకుటచేత పవిత్రములైన నిర్మల జలములే యాకాశ గంగాజలములు.

మిమ్ముఁబోలు యోగీశ్వరు లెవరియింట భేదభావములేక స్నానాన్న పానాది విధులచే సంతోషించి పోవుచుందురో, యట్టి వారిదే భాగ్యము. వారిదే పుణ్యము. వారిదే జీవనము. వారిదే జన్మము.

ఓ మునీశ్వరా ! సంసారమనెడి రొంపియందు కూరుకొనిపోయిన మావంటి కుటుంబులను లేవనెత్తుటకు మీ పాదముల ధూళి యనెడి యౌషధమేగదా, యారొంపి నిగురింపఁజేయఁ గలదు !"

అని భాష యందాదిశేషుఁడనఁదగిన ప్రవరుఁడు విన్నవింపఁగా నా ముని నాథుఁడిట్లనెను. "వత్సా ! వినుము. మా వంటి తీర్థయాత్రాపరు లందఱకును మీవంటి గృహస్థులు సుఖముగ జీవితము గడపుచుండిననేగదా, తీర్థసేవయు సాగఁగలదు !

గృహస్థుఁడనఁగా చెవిటి, గ్రుడ్డి, కుంటివారివంటి దిక్కులేని పెక్కుమందికి తంగేటి చెట్టునకు పట్టిన తేనెపట్టువలె చేతి కందువాఁడు; తొడపై ఖీడుకొన్న రూకలి పెట్టెతో సమానమైనవాఁడు; ఇంటి వెనుక దొడ్డియందు పండిన కల్ప వృక్షమును బోలువాఁడు; పసువుల దొడ్డియందు కట్టివేసి యుంచిన కామధేను

వుతో తుల్యమైనవాఁడు; అంతులేని యమృతము ఊరునట్టి దిగుడుబావితో సాటియైనవాఁడు; సమీపమునందేయున్న బంగరుకొండకు ఉపమానమైనవాఁడు; నీటిచుక్కయేని లేని యెడారి ప్రదేశమునందలి మార్గమధ్యమున నుండెడి చలి పందిరితో సాటువ చెప్పఁదగినవాఁడు; ఆకలి యొదవిన వేళకు బాగుగ నుపయోగపడునట్టి పైరువలె నక్కఱకు వచ్చువాఁడు. కావున నో భూసురోత్తమ! గృహస్థాశ్రమమును మించిన దింకొకటి కలదా ?"

అన విని, వాఙ్మైపుణ్యముగల ప్రరుఁడిట్లు వినయసంపత్తి ప్రకటించుచు, సమాధానించినాఁడు. "దేవరవారు, ఇలపైఁగల సమస్త తీర్థములును సేవించుచుందురు. అందుచేత నేర్పఱచి యడుగఁగోరి - యడుగుచున్నాను.

మహాత్మా! మీరేయే దేశములందు చరించితిరి ? ఏయే పర్వతములను చూచినారు ? ఏయే తీర్థములందు క్రుంకులిడితిరి ? ఏయే సముద్రములను సమీపించితిరి ? ఆయా చోటులయందుఁ గల్గు వింతలు నాకెఱిఁగింపరా ?

పుణ్యతీర్థములకు పోయి సేవింపలేకున్నను, వాని మహిమ వినుట సైతము సమస్త పాపహరము. కావున మిమ్మిట్లు వేడుచున్నాను."

ఇది విన్న మునివరుఁ, డాదరముతోఁగూడిన చిత్తము గలవాఁడై, ప్రవరునకిట్లు వివరించి చెప్పినాఁడు.

"నాలుగు మోములుగల వేలుపైనట్టి బ్రహ్మయొక్క వంశమనెడి పాలసముద్రమున కానందముగూర్చు నిండు చంద్రుఁడవైన యో ప్రవరుఁడా! నేనును నాల్గు దిశలయందుఁగల నాల్గుపర్వతములను కనుగొంటిని. తీర్థయాత్రలు చేయుటయందు సమర్థుఁడనై నానాదేశములను, పుణ్యనదీనదములను సేవించినాను. మలయ పర్వతము, నస్త పర్వతము, హిమవత్పర్వతము, నుదయ పర్వతమునను నీ నాల్గు పర్వతములలో నక్కడక్కడ నున్నట్టి వింతలనుగూడ కనుగొంటిని.

కేదారేశ్వరుఁడనెడి శివమూర్తిని సేవించితిని. హింగుళ యనెడి మహాదేవి యొక్క పాదకమలములయందు తలచేర్చి నమస్కరించినాను. ప్రయాగలోని మాధవస్వామిని కొల్చు భాగ్యమబ్బినది. బదరికాశ్రమమునందలి నారాయణదేవుని కనుగొంటిని. ఈ దేశము నా దేశము ననుటయేమి ? ఎల్లదిక్కుల నడిమి ప్రదేశములను చూచి వచ్చితిని. అవి యన్నియు నిట్లున్నవి.

ఉదయాద్రి యందుఁగల విశేషములు, శేషఫణికినైన లెక్కింప శక్యముగానివి. మలయ పర్వతమునందలి చలువకు విలువ గట్టగలమా ? అస్తపర్వతమునందున్న మాణిక్యములపై విశ్రమించుటను తలఁచుకొన్నచో, నిప్పుడే గగుర్పాటు గల్గుచున్నది. వెండికొండ యందలి రహస్య ప్రదేశములలో శివుని విహార

ఘూములను జూచిన యెడల, సంసార దుఃఖములన్నియుఁ దొలఁగి పోవునుగదా! మేరు పర్వతపు కొమ్ముల యందమును కనుఁగొనుట పూర్వపుణ్యమునఁగాక యెట్లు సిద్ధింపఁగలదు? నేను పినినెల్ల నీశ్వరానుగ్రహమున, నల్పకాలములో చూడఁగల్గితిని" అని సిద్ధుఁడు పలుకఁగా, సెలవులువార చిరునవ్వు నవ్వుచు, పలుకు పసందునకు పేరువడిన ప్రవరుఁడిట్లు పలికినాఁడు.

"అయ్యా, వెఱపులేక మిమ్మొక విషయము నడిగెదను. ఎంత ఎఱకలు గట్టుకొని పోయివచ్చినను, మీరు చెప్పిన విశేషములు చూచుటకు ఏండ్లును పూండ్లును బట్టు ననిపించు చున్నది. ఇఁక, నడచి పోయి రావలయునన్న వేఱుగఁ జెప్పవలెనా? మఱియు మీరు చాల చిన్నవారని మీ మొగమే చెప్పక చెప్పు చున్నది. ఇంత చిన్నతనములో వానినెల్ల నెట్లు చూడఁ జాలితిరోగదా! మీ మహి మలు మీకే తెలియవలెను."

అని నేర్పుమై ప్రవరుఁడనఁగా సిద్ధుఁడిట్లు చెప్పినాఁడు. "అయ్యా! సందేహ మున్నచో నడుగుట తప్పుగాదు. మేము ఔషధసిద్ధి కలవారము. కావున ముసలి తనముగాని, వ్యాధిగాని మమ్ము ముట్టదు.

మఱియు నాకు నింతటి మహిమ గల్పించిన విషయమొక్కటి, మిక్కిలి రహస్యము. అయినను, దానిని దాఁపక చెప్పెదను. పాదలేపము అనెడి పేరుగల దివ్యౌషధరస మొకటి నాకు నీశ్వరానుగ్రహమువలన దొరికినది. దాని మూల మున వాయువుకన్నను మనస్సు కన్నను హెచ్చయిన వేగముతో నెల్లదేశముల యందు దిరుగఁగలను. ఆకసమున సూర్యుని గుఱ్ఱములు దప్పిలేక యెట్లో, అట్లే మేమును సిద్ధులము, ఆయాసమునులేక త్వరగమనమున సంచరింపఁగలము."

ఇది విని, భక్తియు కుతూహలమును వేగిరింపఁగా భాషా ప్రగల్భతకు ప్రసిద్ధిగల ప్రవరుఁడు, "స్వామీ! మీ మహిమ లెఱుఁగక వ్యర్థముగ నే నేమేమో పల్కితిని. వానిని సైరించి నన్నుఁగూడ తీర్థసేవలచే ధన్యాత్మునిఁగా నొన రింపరా?" అని వేడికొనెను. ఈతని మాట నేర్పునకు సిద్ధుఁడు సంతసించి, తన ప్రేప బుట్టలోని దంతపు బరిణియందలి రసము నొకదానిని యిదియదియని చెప్పక ప్రవరుని పాదములకు పూసి వెడలిపోయెను. వాక్చాతుర్యముచే రసము సంపాదించిన ప్రవరుఁడును హిమాద్రిని చూడబోయినాఁడు.

సిద్ధుని వృత్తాంతమే లేనిచో, ప్రవరుఁడు హిమాద్రికిఁ బోవుట యుండదు. అప్పుడు వరూథినీ వృత్తాంతముతో కథ మెలికపడదు. అదియే లేనిచో, మను సంభవమే జరుగదు. కావున, పూసలను గుదిగూర్చు కొలికివలె, నీ సిద్ధుని వృత్తాంత మీ కథలో లీనమగుచున్నది. మనుచరిత్రలోని కథలన్నియు, మాలా పరం పరితములనుట కీవృత్తాంతము సజీవోదాహరణము.

(4) హిమాద్రి వర్ణనము : ఆ వర్ణన ప్రయోజనము నుట్టంకింపుము.
[లేదా — ప్రవరుని యాత్రయు, దాని ఫలమును నెన్నునది.]

వినయపూర్వకమైన ప్రవరుని ప్రార్థనమునుబట్టి సిద్ధుఁడాతనికి హిమాద్రి యందలి వింతల నిట్లు వర్ణించి చెప్పెను.

**తూర్పుకొండ :-** "సూర్యుని రథాశ్వముల కలంకారముగ నమర్పఁ బడి యున్న వింజామరల సముదాయము (సీవిరుల గుదుల) ను జూచి, మోరలు మీఁది కెత్తుకొని, తమజాతి మృగములే యందున్నవనుకొని, భ్రమనొందుచున్న సవర మృగములుగల ఉదయాద్రి యందలి వింతలు లెక్కకు మిక్కుటమైనవి.

**దక్షిణపు కొండ:-** తమ భర్తయైన వాసుకి, శివునకు మెడయందు ఆభరణమై యుండుటవలన నాతని విరహతాపముచే సర్పస్త్రీలు వేదననొందు చుందురు. అట్టి ఆఁడు పాములచేత చుట్టుకొనఁబడిన గంధపుచెట్లు, ఏలకి తీఁగెల యల్లిక వలన మిక్కుటమైన చల్లఁదనము నిచ్చును. ఈ రీతిగ నొప్పునట్టి మలయపర్వతము నందలి చల్లఁదనమునకు నింతయంత యని వెలకట్ట తరముకాదు.

**పడమటి కొండ :-** అస్త పర్వత శిఖరాగ్రముల యందలి ముందు చూరు లలో గువ్వలగూండ్లను బోలునట్టి సందులయందు శరత్కాల చంద్రబింబమునుండి యమృతపుఁ జినుకులు జాఱుచుండును. ఆ అమృతపుఁ జినుకుల చెమ్మచేత అందుగు చెట్లు పెరుగును. వాని చిగుళ్లను తొండముచేత నొడిసిపట్టి తినునట్టి అంజన మనెడి దిగ్గజ మా పడమటికొండ యందు సంచరించు చుండును. అట్టి ప్రదేశ ములయందుఁ గల రత్నపు శిలలపైన పవళించినవారికి, అప్పటి ఆ సుఖమును దలఁచుకున్నపుడెల్ల, దేహమునందు గగుర్పాటు చిగురొత్తక మానదు.

**ఉత్తరపు కొండ :-** కుబేరుని భార్యలు తాము పెంచిన వృక్షములకు దోహదక్రియలు చేయుచు హిమాలయమునందు విహరింతురు. అప్పుడు మ్రోఁగు చున్న వారి యందెలల మ్రోఁతలు విని రాజహంసలు వారినిఁ జేరవచ్చుచుండును. అట్టి హంసలకు నివాస భూములైన మహా శివుని విహార ప్రదేశము లాహిమాద్రి యందధికము. ఆ యా ప్రదేశములఁ జూచి యానందించుచు నుండువారికి, సంసా రమువలని దుఃఖములు దూరమగును.

**మేరు పర్వతము :-** ఇంద్రుని తెల్లయేనుఁగైరావతము. అది తన దంత ములచేతఁ బొడిచి పెల్లగించి కురువింద రత్నములను మేరువుపై వెదజల్లు చుండును. వానినిఁ జూచి ఆ యైరావతము భార్యయైన అభ్రము వనెడి యాఁడేనుఁగు కొఱవులని భ్రమసి తొలఁగి పోవుటయుఁ గలదు. ఇట్టి ప్రదేశములు గల మేరుపర్వత శిఖరములను జూచునంతటి భాగ్యము పెక్కు జన్మలయందు జేసి కొనిన పుణ్యముచేతనే గాని, వేఱువిధముచే లభింపదు.

**హిమాద్రి యాత్ర — దాని ఫలము :-** ఇట్టి మహైశ్చర్యముల నెల్ల నీశ్వరానుగ్రహము వలన సిద్ధుఁ డల్పకాలముననే చూడఁగలిగినాఁడు. వీనినిఁ గూర్చి వినుటవలననే ప్రవరునకు యాత్రా కౌతుక ముద్భవించినది. అందుచే నుత్తరోత్తర కథ సాగుటయు జరిగెను. సిద్ధ సంవాదముతో నీ హిమాలయ వర్ణనమును, పిమ్మటి యాత్రావిషయమును గొలుసుఁ గొనియున్న యంశములు. ప్రవరుని యాత్రా కౌతూహలమును సిద్ధింపఁజేయుచున్న యీ వర్ణనము, చాల నుచితమై యున్నది. మున్ముందు రానున్న కథాకార్యమునకు తోడ్పడుచు, నీ హిమాద్రి వర్ణనమును, ప్రవరుని యాత్రయు మాలా పరంపరితములై యున్నవి.

## 5. సిద్ధుని రాక : దాని ప్రయోజనము

ఆర్యావర్తదేశము నందరుణాస్పదమను పురమున్నది. అందలేఖ్యాతనూ విలాసుఁడును నభ్యాగత సేవా పరతంత్రుఁడును నగు ప్రవరుఁడు సుఖముగ నివసించుచుండును.

ఒకనాఁడతని యింటి నొక యౌషధ సిద్ధుఁడు సమీపించెను. ప్రవరుఁడు భక్తియుక్తుఁడై యెదురేఁగి నమస్కరించి పూజలొసఁగి తన యింటికిఁదెచ్చి యాతిథ్యముచే నాతనిని సంతుష్టు నొనర్చినాఁడు.

పిమ్మట నెందుండి రాకయో, యెచ్చటకుఁ బోవుచున్నారో, కుశల ప్రశ్న పూర్వకముగ యోగీశ్వరు నడిగి తెలిసికొని ప్రవరుఁడాతని యాగమనముచేఁ దన యిల్లు పవిత్రమైనట్లు భావించును; తాను మాన్యుఁడ నైతిననియుఁ జెప్పును. పిదప నట్టి యోగి జనము నతిథులఁగా బడయుట భాగ్యవైభవ మనియు, పుణ్య విశేషమనియు నగ్గించినాఁడు. కుటుంబ భారమను రొంపి నిగుర్పఁగలది వాని పాదధూళియే యని వక్కాణించినాఁడు.

దానికి సిద్ధుఁడు గృహస్థాశ్రమము ఘనతనుగూర్చి యుపన్యసించుచు చెవిటి, కుంటి, గ్రుడ్డి మొదలగు దిక్కులేని వారికి గృహస్థులు చేయు సాహాయ్యమే సాహాయ్యమని సమాధానించును.'

అది విని ప్రవరుఁడు, 'దేవా ! తమరీ భూమిపైఁగల సమస్త తీర్థములను సేవింతురు. కావున నేర్పఱచి యడుగవలెనని కోర్కె కలిగి యడుగుచున్నాను. మీ రేయే దేశములను, పర్వతములను, తీర్థములను, ద్వీపములను, పుణ్యావనములను, సముద్రములను సేవించితిరి ? ఆయా చోటుల యందుగల వింతలను నాకెఱిఁగింపరా ? మీ వలె పోయి సేవింపలేకున్నను పుణ్యతీర్థముల మహిమ వినుట సైతము సమస్త పాపహరముకదా !' అని వేడికొనెను. ఈ ప్రార్థనము విని సిద్ధుఁడాదరముతో ప్రవరునకు తన యాత్రల యందలి విశేషముల నిట్లు వర్ణించి చెప్పును.

"ఓ చతుర్ముఖ బ్రహ్మ వంశమునందలి బ్రాహ్మణోత్తముఁడా! నేను చతుర్దిశలయందునుగల పర్వతములలోని చోద్యములను గనుఁగొంటిని. కేదారమును, ప్రయాగయు, బదరికా తీర్థమును, నీ యా తీర్థమని యెట్లుచెప్పఁగలను? — అన్నిటిని సేవించినాఁడను. ఉదయాద్రి విశేషములు గాని, మలయమునందలి చలువగాని, అస్తపర్వతము నందలి విశ్రాంతిని తలఁచినఁ గలుగు పులకాంకురములు గాని, రజతగిరి పవిత్రతను గాని, మేరువునందలి సోయగములుగాని వర్ణింపనలవిగావు. నాకు వీనినిఁ జూచునట్టి భాగ్యము కల్గుట కీశ్వరానుగ్రహము కారణము."

ఇంతయు వినిన ప్రవరున, కాచిరుప్రాయముగల సిద్ధున కట్టి మహాభాగ్యమెట్లు కలిగెనోయని సందేహముఁ దోచినది. అప్పుడు సిద్ధుఁడు తనకు లభించిన పాదలేపము వలన నిన్నిటి నింత యల్పకాలములో జూడఁగలిగితినని చెప్పెను. 'మీ శిష్యుఁడనైన నన్నుఁగూడ తీర్థయాత్రలచే ధన్యాత్మునొనర్పరా?' యని ప్రవరుఁడౌషధ సిద్ధుని బ్రార్థించినాఁడు. అప్పుడాతఁ డీతని పాదములకా పసరు పూసి వెడలిపోయెను. ప్రవరుఁడును హిమాద్రినిఁ జూచు వేడ్క నరగినాఁడు.

**సిద్ధాగమన ప్రయోజనము :-** ప్రవరుని హిమాచల యాత్ర సిద్ధుని రాకచే నేర్పడినది. అది కార్యము; నిది కారణమునై యున్నవి. ఇది లేనిచో నది లేదు. కాన, "ప్రవరుని హిమాలయ యాత్ర" యను మన పాఠ్యమునకు సిద్ధుని రాక బీజము. ఈ రెంటి యందు నొక యంశముతో నింకొకటి గొలుసు గొని యున్నది. సిద్ధునిరాక యనెడి కొలికికి తగిలియున్న గొలుసువలె ప్రవరుని యాత్ర యొప్పుచు, కథా కార్యమునకుఁగల కారణ సంబంధమును నిరూపించుచున్నది.

## 6. శీలములు

### ప్రవరుని శీలము :

**ఉపోద్ఘాతము:–** 'ప్రవరుని హిమాలయయాత్ర' యను నీ పాఠ్యమునందు యాత్రాఫల మనుభవించిన ప్రవరుఁడు నాయకుఁడు. వరూథినిపైనెట్లో, ప్రవరునిపైనను నట్లే పెద్దనార్యుఁడొక కన్ను నిలిపియే యున్నాఁడు. సమస్త సద్గుణ నిలయుఁడును, తననాఁటి నిష్ఠాగరిష్ఠతకు నెలవునునైన ప్రవరుని యెడనే పెద్దనామాత్యున కొకించుక పక్షపాతమనిన విమర్శకులు నున్నారు.

**(i) మనోజ్ఞమూర్తి:–** ఇతఁడు (మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి) మన్మథుని కంటెను చంద్రుని కంటెను సుందరుఁడు. అలేఖ్య తనూ విలాసుఁడైనను, వైరాగ్యము మూలమున, నీతని చక్కఁదనము కాంక్షించు కామినులకు ననుభవింప నలవి కానిదయ్యెను.

(ii) భాషాపరశేషభోగి:– వినయోచిత పరిభాషా వైదుష్యము నందాది శేషుఁడీతఁడని సిద్ధునితోడి సంవాదము చెప్పకయే చెప్పుచున్నది. సిద్ధుని రాకచే తమ యిల్లు నాఁటికి పవిత్రమైనదని యీతని పలుకు. సిద్ధునివంటి యతిథుల రాకచే పవిత్రమగు గృహస్థుని గృహమే గృహమఁట! ప్రవరుఁడు తన్నుతాను కుటుంబ జంబాల పటలమగ్నుఁడ ననుకొనును. సిద్ధుని పాదరజ మారొంపి నిగురింపఁజేయు నది యనుటలో ప్రవరుని వాజ్నైపుణి యున్నది. సిద్ధుని నానాదేశముల వింత లడుగుట, పుణ్యతీర్థ మహిమ కల్మషహరమైన దనుట; వెఱవక విన్నవించుచున్నా ననుట; పాదలేపమునుగూర్చి విని కౌతుకభరముచేత వ్యగ్రాంతరంగుఁడు, భక్తి చేత నిబద్ధాంజలి బంధురుఁడును నగుట, తనవి ప్రల్లదములనుట, తన్ను తీర్థయాత్ర వలన ధన్యాత్మునిగాఁ జేయమనుటయు, మొదలైనవి, అతని వినయోద్వేలమగు వచస్సామర్థ్యము నుగ్గడించుచున్నవి.

(iii) ధర్మకర్మ పరతంత్రుఁడు:- వరణాతరంగిణి మున్నగు పద్యము లలో ప్రవరుని నిత్యదైనిక జీవితము వర్ణింపఁబడెను. అట్లే అభ్యాగత సేవా పర తంత్రతయు వర్ణితము. ఆయా సందర్భములలో నాతని ధర్మకర్మ దీక్ష సువ్యక్తము. మఱియు, "నగ్ను లేమయ్యె నొక్కొ!" అని విలపించు సందర్భమునందుఁగూడ యౌవనమునందే యజ్వయైన ప్రవరుఁడు ధర్మకర్మ దీక్షా పరతంత్రుఁడని వెల్లడి యగుచున్నది. "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా! శ్రోత్రియుల్" అని తన్నుఁదా నిందించుకొన్నపుడు గూడ, నాతని ధర్మబద్ధబుద్ధి తెలియుచున్నది.

(iv) అధ్యాపన తత్పరుఁడు:- అనారతమును శిష్యులచే వేదములు చదివించుట యందాసక్తిగలవాఁడు ప్రవరుఁడు. వరణా తరంగిణినుండి తన శిష్యులగు బ్రహ్మచారులు నిత్యము వెంటరాగా, నితఁడింటికి తిరిగి వచ్చెడివాఁడు. పెద్దల యాజ్ఞలను శిరసావహించువాఁడే, పిన్నలకు నుత్తరువులుగూడ నీయఁగలడు. అట్లే, పెద్దల గౌరవించువాఁడే పిన్నల ప్రేమింపఁగలఁడు. 'నను మీ శిష్యునిఁ దీర్థయాత్ర వలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే!' అని సిదునిఁ బ్రార్థింపఁగలిగిన కారణముచేతనే, ప్రవరుఁడు 'గెడ తోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు లింతకు నెంత చింతింతు రొక్కొ!' యని ప్రేమతో వారికొఱకై విలపింపఁగలిగినాఁడు.

(v) ధనాఢ్యుఁడు:- ఇతని పాత్రత నెఱిఁగి యే భూపాలుఁడు గాని యీయ వచ్చినను స్మార్త బ్రాహ్మణ ధర్మమును పురస్కరించుకొని యీతఁడు దోషము లేని సాలగ్రామదానమును సైతము పట్టఁడు. తరతరములనాఁటి మాన్య క్షేత్రము లితనివి పెక్కు చందాలుగ పండుచుండును. ఇతనికి నింటిలోఁ బాడియుఁ బంటయు నొకప్పుడును తరుగదు.

(vi) కూర్మి (గల) భర్త:- ఈడుజోడు చూచి తనకు పెండ్లిచేసిన కూరిమి సోమిదమ్మ సౌఖ్యము గలిగించునదై యీతనిని సేవించుచుండును. తలిదండ్రులు

సజీవులై పార్వతీ పరమేశ్వరులవలెనుండి యిలుదీర్చుకొని పోవుచుండఁగా, నీతనికి కాపురి మొప్పుచున్నది. ఇతని గృహిణి అన్నపూర్ణకు ఉద్దీ. అతిథులురాగా నడికి రేయైనను పెట్టును. వేవురు వచ్చినను వండుటకు నలయదు. అంతటి యనుకూల సతి గావుననే, 'నాదు మనస్సులో వర్తించు కులకాంత మది నెంత కుందునొక్కొ!' యని, ప్రవరుఁడు విచారించినాఁడు.

(vii) సంయమి:- ప్రవరుఁడు శమము దమమును లేత ప్రాయముననే కుదుర్చుకొనిన శీల సంపన్నుఁడు. యౌవనమునందే యజ్వయైనాఁడు. కుటుంబ మను జంబాల పటలమునుండి యితఁడుద్ధరింపఁబడఁ గోరు గృహమేధి.

(viii) తీర్థ దర్శనాభిలాషి :- ప్రవరుఁడు తీర్థ సంవాసులనెల్ల దర్శించి యాదరించి తెచ్చి పూజించు చుండెడివాఁడు. ఇతఁడు, తీర్థ సందర్శనాభిలాష మాత్మయం దుప్పొంగుచుండెడి నట్టి తరుణాగ్నిహోత్రి. కావుననే తీర్థాటనమును గూర్చి విభజించి యడిగి, యది పాపహరమని చెప్పి, తన్ను అట్టిదానివలన ధన్యాత్మునిఁగాఁ జేయుఁడని సిద్ధుని వేడుకొనినాఁడు.

(ix) అభ్యాగత సేవా జీవనుఁడు :— తైర్థికులనెల్ల నింటికిఁ దెచ్చుట, తెచ్చి వారి కాతిథ్య మిచ్చుట, తీర్థసందర్శనాభిలాష మాత్మ నుప్పొంగ, వారిని సేవించి 'తీర్థములఁ జూడఁబోవలయు'నని యనుదినమును ఊర్పుల నిగుడ్చుట, భక్తి ప్రపత్తులతో నొక సిద్ధుని గొల్చి, వానివలన పాదలేపము సంపాదించి హిమాద్రికిఁ బోవుట మున్నగునవి యాతని యభ్యాగత సేవా పరతంత్ర జీవనమును నిరూపించు చున్నవి.

(x) వినయ సంపన్నుఁడు :- ఇతఁడు భాషాపరశేషభోగి. అందుచే నీతని పసగల పలుకులలో వినయముద్ర హత్తుకొని యుండును. మీ మాటలే మంత్రము లనుట; మీ కాతిథ్య మొసఁగిన వాని జన్మమే జన్మమనుట; సిద్ధుని పాదరజమును పొగడుట; "మహాత్మా! ఆయా దేశములయు, పర్వతములయు, తీర్థములయు, ద్వీపములయు వింతలు నాకెఱిఁగింపరే" యనుట; "వెఱవక మీ కొనర్తు నొక విన్నప"మనుట; "మాకెఱుఁగఁదరంబె మీ మహిమ" అనుటయుఁ బ్రవరుని వినయ సంపన్నతను గూర్చి చెప్పుచున్నవి. ఇవియే యాతని వచో మాధుర్యమును గూర్చియు సాక్ష్యమిచ్చుచున్నవి.

(xi) కౌతుకాంతరంగుఁడు :- ప్రవరునియందు ఉత్కంఠ మెండు. 'తీర్థ సంవాసు లేతెంచినారని విన్న యెదురుగా నేఁగు దవ్వెంతయైన, నేగి తత్పదముల కెఱఁగి' యన్న పద్యములోని ముక్తపదగ్రస్తాలంకార మీ విషయమును చెప్పకయే చెప్పుచున్నది. తీర్థ సందర్శన కౌతుకభరముచే నేకాగ్రమైన దీతని మనస్సు. ఈతఁడు సిద్ధుని "ఆయా చోటుల గల్గు వింతలను" గూర్చి గ్రుచ్చి గ్రుచ్చి యడుగు ప్రశ్నలే, యిష్టవస్తు ప్రాప్తియం దీతనికిఁగల త్వరను వెల్లడి చేయఁగలవు. హిమా

ద్రిని పరికించునపుడు భూసీసురుని కౌతుకము పురికొనుట వలననే. గుహలను, కోనను, గరుడపచ్చల భవనమును చూచుట కల్గినది. ఇదియే ముందుకథకు సాధక మయ్యెను.

(xii) ఆశ్చర్య చకితుఁడు:- ఇతఁడు హిమాద్రిని జూచి 'తలమే బ్రహ్మకు నైన నీనగ మహత్త్వం బెన్న' అనుకొనినాఁడు. ఒక కోనను, దానిలో నొక గారు డోత్కీర్ణమైన భవనమును గాంచి, యచ్చెరువు పడెను. ఈ యీ యుదాహరణ ములను బట్టి సహజ సుందర ప్రకృతి యీతని ముగ్ధుని, మూఢునిఁగూడఁ జేయఁ గలదనుట లెస్స.

(xiii) అమాయికుఁడు :- ఇంటిదారి తెలియక "దైవకృతమున కిల నసాధ్యములు గలవె" యనియు, "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా! శ్రోత్రియుల్" అనియు, "పాఱవైచితె మిన్నులు పడ్డచోట" ననియు, భయనిందా పశ్చాత్తాపములను వెల్లడించిన ప్రవరుఁడు కేవలము నమాయికుఁడు.

ఉపసంహారము :- మన పాఠ్యమునుబట్టి ప్రవరుని మనోజ్ఞమూర్తి, భాషాపరశేషభోగి, ధర్మ కర్మ పరతంత్రుఁడు, అధ్యాపన తత్పరుఁడు, ధనాఢ్యుఁడు, కూర్మిభర్త, సంయమి, తీర్థ సందర్శనాభిలాషి, అభ్యాగత సేవా పర తంత్ర సకల జీవనుఁడు, వినయ సంపన్నుఁడు, కౌతుకాంతరంగుఁడు, ఆశ్చర్య చకితుఁడు, నమాయికుఁడు ననుట యుచితము.

## 7. సందర్భ సమన్వయ వ్యాఖ్యలు

ఈ దిగువవానిని సందర్భ సమన్వయ పూర్వకముగ వ్యాఖ్యానింపుఁడు:-

(1) "అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁ జేవ" (ప. 2.)

సందర్భము:-

అరుణాస్పదపుర ప్రాశస్త్యము నుగ్గడించు సందర్భములో, చాతుర్వర్ణ్యాదికమును వర్ణించి వర్ణించి తనివితీరక పెద్దనార్యుఁ డెట్టకేలకు పలికిన దీ పలుకు.

అర్థము :- ఆ యరుణాస్పదమునందుఁ బుట్టినట్టి చిగురుతోడి లేఁతకొమ్మకుఁ గూడ చేవయుండు ననఁగా, నితరమును వర్ణింపనేల ?

వ్యాఖ్య :- సాధారణముగ చిగురునకు చేవ యేర్పడదు. కాని యది యరుణాస్పద పురములో బుట్టినచో చేవ నొందఁగలదఁట! ఆ యూరఁ బుట్టిన వన్నియు సారవంతము లనుట, యా యూరి గొప్పఁదనమును చెప్పుటకని గ్రాహ్యము.

ఇచట, 'చిగురు కొమ్మైనఁ జేవ'యని పఠించి కొందఱు విమర్శకులు, పెద్ద నార్యుని బళ్ళారి మండలము, "చిగురు చెట్ల"ను నొకరకము చెట్లకు నేటికినిఁ బ్రసిద్ధి గలదనియు, నవి యించుకయుఁ బటుత్వము లేనివనియు, వానిని దృష్టిలో నుంచుకొనియే యరుణాస్పదమును వర్ణించుచు నంత పెళుసుచెట్లు కూడ నందు చేవఁగలిగినవని కవి చెప్పెననియుఁ దలఁచు చున్నారు.

దీనివలన పెద్దనార్యుని నివాసభూమి తెలియుట యొక ప్రయోజనము కావచ్చును. కాని, గంగానదికి 'వరణ' యుపనది. దాని సారవంతమైన పరిసరము లలో చిగురు చెట్లవంటివి పుట్టుట చింత్యము. పైఁగా, కవి తాను వర్ణించు దేశ కాల పరిస్థితులలో నిల్లు గట్టుకొనలేక పోవుట యొక దోషమగును.

మొత్తముమీఁద, నీ వాక్యమొక లోకోక్తియైనది. పద సారస్యముచే నర్థసౌభాగ్యగరిమ కీ వాక్యము పేరువడుట రూఢము. ఇందలి యలంకారము అతిశయోక్తి.

(2) "భోగ బాహ్యమయ్యెఁ బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె" (ప. 4)

సందర్భము:-

జారకాంత లెంత కాంక్షచేసినను ప్రవరుఁడు వైరాగ్యము గలవాఁడగుట వలన నతని చక్కదనము వారికి యనుభవింప రాని దగుచున్నదని పెద్దనామా త్యుఁడు తానై వర్ణించు ఘట్టములోనిది యీ వాక్యము.

అర్థము:- వికసించిన సంపెంగ పూవుయొక్క పరిమళము, ఆఁడు తుమ్మె దలకు ఎట్లో, అట్లు (జార కామినులకు) అనుభవింప రానిదయ్యెను.

వ్యాఖ్య:- ప్రవరుని సౌందర్యమును జారస్త్రీలు వలచి వత్తురు. కాని యితఁడు విరక్తుఁడు. అందుచే నతని సౌందర్య మా కామినుల కనుభవింప నలవి కాని దగుచున్నది.

ఈ భావమును సుస్పష్టము చేయుటకు పెద్దనార్యుఁడొక యుపమానమును చేపట్టెను. ఆ యుపమానమొక సుప్రసిద్ధమైన ప్రకృతి పరిశీలనమును బురస్క రించుకొని యున్నది. అది తుమ్మెదలకును సంపెఁగకును నడుమగల లోకవిదిత మైన విరోధము. కావున, నిందలి యలంకారము, ఉపమ.

ఈ యుపమాలంకారము వలన కవి నిరూపింపఁ దలఁచికొన్నది ప్రవరుని శీలసంపత్తి. ఇట్లు ప్రవరుఁడు నిశ్చలచిత్తుఁడని చెప్పివేయఁబడుటవలన, మున్ముం దాతని ప్రవర్తనాదికమును గూర్చి పాఠకుల కుత్కంఠ క్షీణించు చున్నదని

యొక విమర్శకలదు. ఒక పాత్ర కవిచేత దత్తగుణ సంపన్నుఁడగుట కంటె, కవిచేత నాయా సన్నివేశములలో ప్రవేశ పెట్టఁబడి, తన ప్రవర్తనాదికముచేత పాఠకులకు తన గుణశీలములనుఁ దోఁప చేయవలయుననుట, యధికౌత్సుక్య సంపాదక మనక తీరదు. అందుచేఁ బ్రవరుఁడు మిక్కిలి సజీవ పాత్రయుఁ గాఁగలడు.

పాత్ర సజీవతా నిర్జీవత లట్లుండెను. ఇఁక నీ యుపమానము నందలి యౌచితియు కొందఱకు ప్రష్టవ్య [ప్రశ్నార్హ] మని తోఁచినది. తుమ్మెదకును సంపెఁగకును విరోధము జగద్విదితమైనను, తుమ్మెదయే సంపెఁగను చేరదని తెలియఁగలదు; సంపెఁగ తుమ్మెదను రానీయక పోవుట యని లేదు; అని యీ రీతిగ వారూహాపెంచిరి.

కాని, పూచిన సంపెఁగ తన వాసనచే నేరీతిగ తుమ్మెదలను జేరనీయదో, ప్రవరుఁడును విరక్తి కారణముచే కామినులను చేరనీయఁడని చెప్పుకొనుట కవి హృదయము నెఱుఁగుట.

విరక్తిగల్గిన వాఁడగుటచేత ప్రవరుఁడెట్లచ్చట కారణమో, పరిమళము గల్గినదగుటచేత పూచిన సంపెఁగయు నిచ్చట కారణమే !

(1) ప్రవరుఁడు = పూచిన సంపెఁగ పువ్వు.

(2) వాని చక్కఁదనము = సంపెఁగ సువాసన.

(3) జార కామినులు = ఆఁడు తుమ్మెదలు.

(4) భోగబాహ్యమగుట, అనఁగా అనుభవమున కనుకూలింపక పోవుట, రెండింటి యందును సమాన గుణము.

పోఁగా, పురుషుఁడు పుష్పమగుటగాని, ఆఁడువారు తుమ్మెదలగుట గాని, కవి సమయానుకూలమా? యన్న ప్రశ్నకు, జార కామినులుగాన, పెద్దనామాత్యుఁడు ఆఁడు తుమ్మెదలే యనెనని చెప్పుకొనవలెను. అంతదూరము పోయినచో, (పూవు) 'పుష్ప'ము మున్నగు శబ్దములను నపుంసకములు గూడనని యధిక్షేపింపవచ్చును. కాని, యది సహృదయత్వము కాదు. కవి యుద్దేశించినది, యనుభవమునకు అనుకూలింపక పోవుట యను సమానగుణమును మాత్రమే యనియు, నిందువలన నుపమాలంకారౌచిత్యమునకు భంగము వాటిల్లదనియు గ్రహింపఁదగును.

(8) పుడమి తిలతండుల న్యాయమున వెలుంగ. (ప. 36.)

సందర్భము :-

హిమవత్పర్వతమును జూచి సంతసించిన ప్రవరుఁడు బదరీవనమునుఁ జూచిఁ, దాని నడుమ నొక త్రోవనుగని. యాత్రోవను చాలదూరము పోవునప్పు డెదుటి భాగమునందుఁ జూచిన దృశ్యమును మనుచరిత్రలో పెద్దన తానై వర్ణించు చున్నాఁడు.

అర్థము :- నువ్వులు, బియ్యము వెదచల్లినట్లు భూమిమీఁద (నెండపొడలు) నుండెను.

వ్యాఖ్య :- ఒకచోట నెలుఁగుగొడ్లు తేనె పెరలను గోళ్లతో గోరాడు చున్నవి. అప్పు డందున్న తేనెయీఁగలు రేగి యాడుచుండెను. వాని నీడలు నల్లగను, వాని నడుమనడుమ వ్యాపించినట్టి యెండపొడలు తెల్లగను గనఁబడు చున్నవి. అందుచే నా నీడలును, నా యెండపొడలును బరిశీలింపఁగా గ్రుచ్చెత్తి భూమియందు వెదచల్లఁబడిన నువ్వులు బియ్యముగల భూమివలె నా ప్రదేశ ముండును.

దీనివలన పెద్దనార్యుని భౌతిక ప్రకృతి పరిశీలనా నిశితత్వమును, భావనా శక్తియు విదితము.

ఇందలి యలంకారము స్వభావోక్తి.

శ్రోత్రియుఁడైన ప్రవరునకు తిలతండులముల కలయఁబోఁత నిత్య దృగ్వి షయ మగుటచేత నీ యలంకారము, సముచితము.

తిల తండులన్యాయము = నువ్వులును, బియ్యమును గలిపినఁ గలియును, విడఁదీసిన విడును అనురీతి.

(4) "పుచ్చడీకతనంబు పోఁబెట్టి గిరికన్య

పతిఁ గొల్వ నాయాస పడినచోటు. [ప. 38-పాదము. 3.]

సందర్భము :-

ప్రవరుఁడు మంచుకొండ మధ్య ప్రదేశమునందును, చఱులయందును, నడ వులు గుహలు మున్నగువాని యందును, విహరించుచు, చూచిన దృశ్యముల నాంధ్రకవితాపితామహుఁ డల్లసాని పెద్దనామాత్యుఁడు వర్ణించుచున్నాఁడు.

అర్థము :- పార్వతీదేవి సిగ్గరితనమును విడిచిపెట్టి పెనిమిటిని (శివుని) సేవింప శ్రమపడిన ప్రదేశము. (హిమాలయములో పార్వతి తపస్సుచేసిన ప్రదేశ మును ప్రవరుఁడు చూచినాఁడనుట.)

వ్యాఖ్య :— చలన చిత్రమునందువలె పెద్దన, ప్రవరుఁడు చూచిన నానా దృశ్యములను పాఠకులకుఁ దన భావనాశక్తిచే గన్నులకుఁగట్టఁ జూచుచున్నాఁడు.

పార్వతి సిగ్గరితనము వీడినట్లు మున్ముందు వరూథినియు వీడును. పతినిఁ గొల్చుటకు పార్వతి యెచ్చట నాయాసపడినదో, వరూథినియు నా సమీపముననే యిఁకముం దాయాసపడఁగలదు. 'ఆయాస పడిన' అను పద ప్రయోగమే యామె శ్రమయొక్క ఫలమునుగూడ నించుక విశదపఱచుచున్నది. ఇది చక్కని కావ్యార్థ సూచన.

ఇట్టి రచనా వైచిత్రియు. నిందలి ప్రౌఢియు రసోద్వేలముగ నున్నవి. కవి ప్రతిభా కల్పితమైన యిట్టి భావనాత్మక ప్రపంచమే లోకోత్తర చమత్కారకారి యైన కావ్యసృష్టియని లాక్షణికుల పలుకు. రసాత్మకమైన యీ వాక్య మొక్కటియేయయ్యు కావ్య గౌరవము కలది.

(5) "వలరాచ రాచవా రలికాక్షు కనువెట్టఁ
గరఁగిన యల కనికరపుఁజోటు." (ప. 38. పాద. 4.)

సందర్భము:-

ప్రవరాఖ్యుఁడు హిమాద్రియొక్క మధ్య ప్రదేశమును, తరువులుగల యరణ్యములను, గుహలనుఁజూడ నాసక్తిఁగలవాఁడై విహరించుచున్న ఘట్టములో నాంధ్రకవితాపితామహుఁ డల్లసాని పెద్దనార్యుఁడా హిమాద్రిని వర్ణించుచున్నాఁడు.

అర్థము :- మన్మథుఁడనెడి క్షత్త్రియుఁడు నొసటఁ గన్నుగల శివునియొక్క కంటి మంటచేత కాలి భస్మమై జాలి గొల్పునట్టి యా ప్రసిద్ధ ప్రదేశము. (హిమాచలములో మదనుఁడు దహింపఁబడిన ప్రదేశము చాల ప్రసిద్ధిఁగన్నది. దానిని ప్రవరుఁడు దర్శించినాఁడనుట.)

వ్యాఖ్య :— చలనచిత్ర ప్రదర్శనమునందువలె నాంధ్రకవితాపితామహుఁడు, ప్రవరుఁడు దర్శించిన వివిధ దృశ్యములను పాఠకుల మనోనేత్రములముందు నిల్చునట్లుఁ దన భావనా పటిమచేఁ జేయుచున్నాఁడు.

"రాచవాఁడు" అను పాఠముకంటె, "వలరాచ రాచవారు" అను పాఠమే సాధువు.

వెట్ట = వేడిమి. అలికాక్షుఁడు = శివుఁడు.

వ్యా. వి :- కనికరపుఁజోటు = కనికరము + చోటు. కర్మధారయమున 'ము' వర్ణమునకు 'పు', 'ంపు' లగు. పిదప ద్రుతకార్యము....

"అల కనికరపుఁజోటు"— అనుటచే, జాలిఁ బుట్టించు నా చోటు, ప్రసిద్ధిఁ గలదని సారస్యము. ఆ చోటు చూచువారు, 'అయ్యో! యీ చోటనా, మన్మథుఁడు కాలిపోయె' నని జాలిఁబొందుదు రనునది వాచ్యము. మునుముందు వరూథిని పొందనున్న వైయ్యర్థ్య (వ్యర్థత్వ) మిందువలన సూచ్యము. అదికూడ కనికరము గొల్పు విషయమే. వలపు నిలుపుట యామె జాతి ధర్మమేకాని, దూష్యము కాదుకదా! కావున, శోక స్థాయియైన యా ఘట్టము కరుణ రసస్ఫోరకమని సూచన.

రసవాచ్యత దోషమందురేని, యిది సూచన మాత్రమేయని, సమాధానము.

కవి ప్రతిభా కల్పిత ప్రౌఢోక్తిగల్గి లోకోత్తర చమత్కృతికి నిలయమైన యిట్టి వాక్య మొక్కటియే యైనను నిది మహాకావ్య మనఁదగునని యాలంకారికుల సూక్తి.

వస్తు వేదియైననుఁ గవి హృదయ ప్రపంచములోఁ జొచ్చెనేని, యది యందలి యనన్యాదృశ శోభావిలసనములలో మునుకలిడి, కడకు అపూర్వ మనోజ్ఞముగ శబ్దబ్రహ్మ స్వరూపమును దాల్చి ప్రకాశింపఁగలదనుట కిది యుజ్జ్వలోదాహరణము. ఈ పద్యముననే, 'జగతికి మిన్నేరు దిగుట' వర్ణితము. మానవుని దివ్యాంగన వరించుట, యిందలి ధ్వని. ఇట్లే, సందర్భమంతయు వ్యంగ్య వాసనా విలసితమన్నను దప్పురాదు.

(6) "శచి కీఁతఁ గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలువెఱింగె." (ప. 40.)

సందర్భము:-

హిమాద్రియందలి భిన్న భిన్న దృశ్యములను జూచుచు వానినిఁబట్టి యా పర్వతము యొక్క మహనీయతను ప్రవరుఁడిట్లు భావించుచున్నాఁడు.

అర్థము :- దేవేంద్రుఁడు తన భార్యయగు శచీదేవికి నీళ్ల యందీఁదులాడుట నేర్పుచు, నాకాశ గంగానది యందు జలక్రీడ లాడు విధమును గూడ (నీ పర్వతము వలననే) నేర్చుకొనెను.

వ్యాఖ్య :- హిమవంతుఁడు గంగను ధరించుటచేతనే యింద్రున కానది యందుఁ గ్రీడింప వీలుగల్గినదనుట.

"జలకేళి సవరించుట" యనునది, యొక జాతీయము.

హిమాద్రియందలి వింతలను జూచిన కొలఁదియు, ప్రవరుని భావనా పటిమ పరాకాష్ఠ నొందుచున్నది.

రసోద్దీపనమువలనఁ దనంతఁ దొరిఁగి, ప్రతిభావికాసమువలనఁ బైపై మురువుగాఁ బెరిఁగి, భావనాశక్తి వైలక్షణ్యముచే వింతలగు వన్నెలు చిన్నెలు చూపుచు నిర్గమించు నాంధ్రకవితా పితామహుఁడగు పెద్దనార్యుని కవితాధార, సరళమై స్వభావమధురమై చిత్రమై మకరంద ఝరివలె నిందు జాలుగొనుచున్నది.

(7) "ఆమెత లెఱింగె నీ తుహినాద్రికతన" (ప. 40)

సందర్భము :-

ప్రవరుఁడు హిమాచలములోని యొక్కొక్క మనోజ్ఞదృశ్యమును సందర్శించుచు, దానివలన హిమాద్రి మహిమను సంభావించుచున్న ప్రకరణములోని దీ వాక్యము.

అర్థము :- ఈ మంచుఁగొండయొక్క కారణముచేత [సమస్త దేవతా సమూహమును] విందుల నారగించుట యనునది కల్గెను.

వ్యాఖ్య :- అనేకులు రాజులు మొదలగువారు యజ్ఞములు చేయుటకు నీ మంచుకొండ నెలవగుటవలన, నెడప దడప దేవతలకు హవిర్భాగము లారగింప ననుకూలముగా నున్నదనుట.

అలంకారము :- ఉదాత్తము.

హిమాచలమును నందలి విచిత్రములను గనుఁగొనిన కొలఁదియుఁ బ్రవరునకు దాని మహత్త్వము మనమున హత్తుకొని భావగరిమ పరసీమ నంటుచున్న దనవచ్చును.

పెద్దనార్యుని ద్రాఘిమయః ప్రతిభకిట్టి భావవిలక్షణత్వము తార్కాణ.

(8) "దైవ కృతమున కిల నసాధ్యంబు గలదె?" (ప. 42.)

సందర్భము :-

హిమాద్రి యందలి చోద్యములకు తన్మయుఁడై యచ్చెరువు పాటొందుచుండెనేగాని తన పాదలేపము కరఁగిపోవుట ప్రవరుఁ డెఱుఁగఁడాయె నన్న సందర్భములో నీ వాక్యమును పెద్దనార్యుఁడు పలుకుచున్నాఁడు.

అర్థము :- ఈ భూమిపై దైవముయొక్క ప్రయత్నమునకు సాధ్యము కానిది యని యున్నదా ?

వ్యాఖ్య :- ఏ పనియైనను దైవము తలఁచినట్లే యగును. కాని మఱి యొక విధముగాఁ గానేరదు.

ఈ వాక్యము పెద్దనార్యునియు, నాఁటి వారలయు ఆస్తిక్యబుద్ధికి నుదాహరణము.

పాదలేపము కఱఁగిపోవుట దైవ వశమున జరిగెననియు, నది మానుష దోషమునఁ గాదనియు కవి యిందుమూలమునఁ జెప్పును.

ఇందలి యలంకారము అర్థాంతరన్యాసము.

(9) "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా! శ్రోత్రియుల్" (ప. 45)

సందర్భము :-

ఔషధహీనుఁడైన ప్రవరుఁడు దూర వన ప్రదేశములలో జిక్కుకొనెను. ఇలుసేరు నుపాయము నెఱుఁగ రాకున్నది. పుణ్య ప్రదేశములకైనఁ బోవక యీ భయంకర ప్రదేశమున కేల వచ్చితినా యని యాతఁడు పశ్చాత్తాప పడుచుఁ దనలో దన్నుఁదా నిందించుకొనుచున్నప్పటి దీ వాక్యము.

అర్థము :- వేదములు చదివి వైదికనిష్ఠఁగలవారు [ఛాందసులనుట] బుద్ధి మాంద్యమువలనఁ బుట్టిన చిత్తభ్రమము గలవారు గదా!

వ్యాఖ్య :- కేవలము వైదికులైన నా వంటివారు బుద్ధియొక్క జడత్వము వలన చిత్తమునందు భ్రాంతినిఁ బొందుచుందురు. కావున నేను నట్టి చిత్తచాంచల్యమునకు లోనై, యీ రాకూడని చోటికి వచ్చితినని ప్రవరాఖ్యుఁ డాత్మనింద నొనరిచు కొనుచున్నాఁడు.

'వేదాభ్యాస జడః' అను నార్యోక్తిని బట్టి, సంతతము నధ్యయనము నధ్యాపనము మాత్రమే శీలముగా గలవారికిఁ బ్రపంచ [లౌకిక] జ్ఞానము కొఱవడుననుటయుఁ బ్రసిద్ధము.

ప్రయాగాది ప్రసిద్ధ పుణ్యక్షేత్రములకుఁ బోయియుండినచోఁ బ్రవరున కీ పశ్చాత్తాప కారణము పుట్టెడిదికాదు. భయంకరారణ్య ప్రదేశములు గల హిమాద్రిని జూడవలెనని గోరిక గలుగుట యాతని దృష్టిలో బుద్ధిజాడ్యమే. ఇది యాతని పశ్చాత్తాప శీలమును వెల్లడించుచున్నది.

ఇందలి యలంకారము అర్థాంతరన్యాసము.

(10) "పాఱవైచితె మిన్నులు పడ్డచోట." (ప. 46)

సందర్భము :-

క్రూర మృగ సంకులమగుటచే భయంకరమై రారానిదైన హిమాద్రికి బుద్ధి జాడ్యముచే వచ్చినందులకుఁ బ్రవరుఁడు పశ్చాత్తప్తుఁ డగుచున్నాఁడు. తనకు నిజ గృహ వాతావరణము తలఁపునఁ బారఁగా దైవోపహతుఁడనని విచారించునప్పు డాతఁడీ వాక్యము పలికెను.

అర్థము :- (ఓ! దైవమా!) నన్నీరీతిగా విసరివైచినట్లు దూరమునఁ బార వైచితివా ?

వ్యాఖ్య :- 'మిన్నేఁ బడ్డ చోట'నని పాఠాంతరము. అప్పుడు 'గంగానది పుట్టిన తావు' నందు పారవేసితివా? యని యర్థము వచ్చును. గంగానదికి జన్మ స్థానము హిమాచలము. అది పవిత్రతకు, నెత్తునకు నుదాహరింపఁబడుట రూఢము.

ఇచ్చట, గిరవాటు వేసినట్లు పారవేసితివా, యని దైవిక కోపమును శంకించు ప్రవరుఁడు, ప్రధానముగ చింతించునది, దూరమున కని గ్రహింపవలెను.

"ఎక్కటి యరుణాస్పద పుర మెక్కటి తుహినాద్రి?" యని, యింతకు ముందే యతఁడు వగచెను.

ఉన్నతికిఁ బవిత్రతకు పేర్వడ్డ హిమాలయ మిచ్చట ప్రసక్తము కాదు. అప్పు డతఁడు హిమాద్రిలో నుండుట, మనకు నాతనికినిఁ దెలియనిది కాదు.

మిన్నులు పడ్డచోట ననఁగా, దూరదూర ప్రదేశమని యర్థము.

ఒక పదము సాధారణమైనదే యైనను, దానిని హవణించిన విన్నాణము చేతఁ బద సందర్భమునకును, నర్థ సంపదకును నది సొంపులు గూర్పఁ గలదు. ఆ పదమును విడదీసి మఱి యే పర్యాయపదము నుంచినను, నా సారస్యము గుదు రదు. అట్టిచో నా పదమును నర్థమును నవినాభావ సంబంధముచేత రెండు నొక్కటియై యర్థసౌభాగ్య గరిమకుఁ గారణ భూతము కాగలవనుటకు, నిట్టి యుదాహరణములఁ జూపవచ్చును. "అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁ జేవ" యనునదియు, నిట్టి దానికే దృష్టాంతము.

"భాషా పరశేషభోగి" యైన ప్రవరుని సూక్తి నైపుణి కిది సాక్ష్యము.

మిన్నులుపడ్డ చోటు = భూమియు నాకాశమును గలియు నట్లగపడు ప్రదేశము. చూచువారికి దూరమున భూమియు నాకసమును గలియు నట్లగ పడును. అది నిజముగాదు. కాని, దూరమున నటుల జరుగుచున్నదని భ్రాంతి మాత్రము గల్గును. ఆంధ్రభాషలో 'మిన్నులుపడ్డ చోటు' అనునది 'చాలదూరము నందు' అనెడి యర్థము నిచ్చుచున్నది.

ఈ క్రింది వానినిఁగూడ పైరీతిగ మూఁడు ఘట్టములుగా, విభజించి, సందర్భపూర్వకముగ వ్యాఖ్యానించునది.

1. కాసెకొంగున వారించి కడవఁగలరు. (ప.—2)
2. వచ్చునింటికిఁ బ్రజ తన్ను మెచ్చి చూడ. (ప.—6)
3. అన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి (ప.—8)
4. నేఁడుగదా, మన్మందిరము పవిత్రమయ్యె, మాన్యుఁడ నైతిన్. (ప.—13)
5. భూసురోత్తమ! గార్హస్థ్యమునకు సరియె. (ప.—18)
6. ఆయాచోటులఁ గల్గు వింతలు మహాత్మా! నా కెఱింగింపరే. (ప.—20)
7. ఈ యాదేశంబరనేల? చూచితి సమస్తాశావకాశంబులన్ (ప.—23)
8. ఎలుకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టు. (ప.—25)
9. మా కెఱుఁగఁదరంబె? మీ మహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్. (ప.—25)
10. చెనకంగా వెఱచు మమ్ము సిద్ధుల మగుటన్. (ప.—26)
11. చరియింతుం బవమాన మానస తిరస్కారిత్వరాహంకృతిన్. (ప.—27)
12. తవతవ లేకరుగుదుము హుటాహుటి నడలన్. (ప.—28)
13. నను మీ శిష్యునిఁ దీర్ఘయాత్రవలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే! (ప.—29)
14. ఇది యది యని చెప్పక పూసెఁ దత్పదాంబుజ యుగళిన్. (ప.—30)
15. మద బంభరమల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్. (ప.—35)
16. నిడుద పెన్నెఱిగుంపు జడగట్ట సగర ముమ్మనుమండు తపముఁ గైకొనినచోటు. (ప.—38)
17. జరఠ కచ్ఛప కులేశ్వరు లెన్నుగాన రా, జగతికి మిన్నేఱు దిగిన చోటు (ప.—38)
18. మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్నచోటు. (ప.—38)
19. ఈ చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదనంబును నూనకుండినన్ (ప.—39)

20. పసుపు నిగ్గులు దేఱు పాఁప జన్నిద మొప్పఁ బ్రమథాధిపతి యింటి పట్టెలింగె. (ప.—40)

21. అదనుతోఁ జేపి చన్నవిసి యోషధుల మన్నొదవు కొండలకెల్లఁ బిదుక నెలిఁగె. (ప.—40)

22. వేల్పుటింతులలోన విఙ్ఞఫీగుచు మేన నవరత్నరచనల రవణమెఱఁగె. (ప.—40)

23. నీహార కందళ చూత్కార పరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్. (ప.—41)

24. అనుకూలవతి నాదు మనసులో వర్తించు కులకాంత మది నెంత కుందునొకో! (ప.—46)

25. లోనికి మణిపట్టభంగ సరణిన్ ధరణీ సురుఁడేఁగి చెంగటన్. (ప.—50)

26. మగువ పొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్. (ప.—53)

ప్రతిపదార్థమునకు ముఖ్యమైన పద్యములు:—

ఈ దిగువ నీయఁబడినవి, పాఠ్యగ్రంథములోని పద్యసంఖ్యలు. వీనికి సమాధానము లాయా పద్యములకు నొసఁగిన ప్రతిపదార్థముల యందుఁ జూడఁదగును.

అతిముఖ్యములు:—

1. అట చని కాంచె (పుట 32—పద్యము 32)
2. అకలంకౌషధ సత్త్వమున్ (పు. 34—ప. 45)

ముఖ్యములు:—

1. వరణా ద్వీపవతీ...................(పు. 25—ప. 1)
2. ఓ చతురాస్య.........................(పు. 29—ప. 22)
3. విలయ కృశాను కీలముల ..............(పు. 33—ప. 39)
4. తలమే బ్రహ్మకునైన......................(పు. 34—ప. 41)
5. నికట మహీధరాగ్ర .........................(పు. 36—ప. 50)
6. తావుల్ క్రేవల..............................(పు. 36—ప. 51)

# ద్విపద భారతము

## కిరాతార్జునీయము

## (ఆరణ్య పర్వము : ద్వితీయాశ్వాసము)

(బట్టేపాటి తిమ్మనార్యుఁడు)

## కవి కాలాదికము

అటు, మధురలో నాంధ్ర సారస్వత పోషణము జరుగుచున్న కాలమునకే రమారమిగ నిటు, పుదుక్కోటలోఁగూడ కొంతవఱకు నాంధ్ర వాఙ్మయము వర్ధిల్లుచుండెను. తంజాపురము యక్షగానములకును, మధుర వచనములకును బ్రసిద్ధిఁగన్నచో పుదుక్కోట, కావ్యములు, వచనములు, ద్విపదలు, నిఘంటువులు (ఆంధ్ర భాషార్ణవము) మున్నగు పెక్కు సాహిత్య ప్రక్రియలకుఁ బ్రసిద్ధిఁగన్నది. కావున, ద్విపద భారతకర్తలలోఁ బ్రథముఁడు తిమ్మనార్యుఁడుకూడ దక్షిణాంధ్రయుగమునకుఁ [1704-1734] జెందినవాఁడేయని యొక వాదము.

ఈ బట్టేపాటి తిమ్మయ క్రీ. శ. 1550-1600 ప్రాంతమున నున్నవాఁడని యాధునికుల వాదము మఱియొకటి. వీరినిబట్టి యీతని యింటిపేరే యీతని గ్రామనామము. ఈ బట్టేపాడు నెల్లూరు మండలములోనిది. ఇది తిమ్మనార్యుని జన్మభూమి. ఇతని తండ్రి వల్లభసూరి; కాశ్యపస గోత్రుఁడు.

కవిత్రయ మాంధ్రమహాభారతము ననువదించినట్లే యీ ద్విపదభారతమును మువ్వు రనువదించిరి. వీరి కాధారమ్ముగూడ కవిత్రయము వారి యాంధ్ర మహాభారతమే! వీరిలో జ్యేష్ఠుఁడేగాక శ్రేష్ఠుఁడును బట్టేపాటి తిమ్మనార్యుఁడే. ఇతఁ డాదిపర్వము, నారణ్యమునుండి ద్రోణ పర్వమువఱకునుగల పర్వముల నాఱిఁటిని మొత్తము రచించెను. సభాపర్వము బాల సరస్వతీశ్వరుఁడను నీతని మిత్త్రుని రచనము. కర్ణ పర్వమునుండి స్వర్గారోహణము వఱకునుగల కడమ పదు నొకఁడు పర్వములును, సోమనయ్యను వేఱొక మిత్త్రుఁడు చెప్పినవి. ఈ భారత ద్విపదనుగూడ మువ్వురు కవులు కలిసి నిబంధించుటయు నీశ్వరేచ్ఛ గానోపును.

ప్రకృత పాఠ్యకర్త తిమ్మనార్యుఁడు తన ఆదిపర్వమును చౌడామాత్యునకును, విరాటమును జంగాల మమ్మయ్యకును, తక్కఁగల నాలుగు పర్వములను శ్రీరామచంద్రునకును నంకితమ్ము చేసినాఁడు. ఇతఁడు శివభక్తుఁడు.

ఆంధ్ర సాహిత్యము మొదటినుండియు రెండు వేణికలుగా ప్రవహించుచున్నది. మహాకవు లవతరించి వానికి సంగమస్థానమగు చుండిరి. కాని వారి యనంతర మవి మఱల రెండు పాయలుగా ప్రవహించుట పరిపాటి గాఁజొచ్చినది. ప్రథానముగ నందొకటి భాషాపరమైన విభజనము. అప్పుడు వానికి దేశి, మార్గ శాఖలన్న పేరు రూఢమయ్యెను. అట్లే మతపరముగ విభజింపఁ జూచినయెడల మన వాఙ్మయము శైవ, వైష్ణవ విభాగములకును లొంగును.

భాషాపరమైన మార్గ దేశి భేదములలో మార్గ, ప్రధానముగ సంస్కృత భాషా ప్రభావము కలది; దేశి యట్లే యనాదినుండి మన దేశమున నెలకొనియున్న భాషా సంప్రదాయముల ప్రభావము కలది.

ఈ దేశి శాఖలో వెలసిన కవిత్వమునందు ద్విపద కాదర మధికము. తొలుదొల్త ఆంధ్రసారస్వతములో నీ ద్విపద పాల్కురికి సోమనాథునితో నుద్భవించినది. అతఁడు దీనిని శైవమత ప్రచారమునకై ముందు వినియోగించినాఁడు. కాని యీ ద్విపద సాహిత్యము పోను పోను, ( మార్గపద్ధతిలో నడచిన ) పురాణేతిహాస విపుల కావ్యాది రూపములతోఁగూడ సుసంపన్నమై, మార్గ కవితారీతులతో స్పర్ధించునంతటిదై విలసిల్లెను. మార్గకవితా పద్ధతిలోఁ జెప్పఁబడిన కవిత్రయము వారి ఆంధ్ర మహాభారతము (చంపువు) నందలి పరమార్థమును మహాజనమున కందిచ్చు నిమిత్తమై, సరళసుందరము సులభగ్రాహ్యము నగు శైలిలో, నీ ద్విపద మహాభారత ముద్భవించెను.

## తిమ్మనార్యుని కవిత్వము

సంస్కృతమునందు మహాభారత మితిహాసము. అట్టి దానిని, కావ్యమున కుచితమగు రీతిగ నౌచిత్యమునుబట్టి మార్చియు కూర్చియు విపుల కావ్యముగ నాంధ్రములో కవిత్రయము తీర్చిదిద్దెను. ఈ ద్విపద భారత కర్తలు మువ్వురును, ఆంధ్ర మహాభారతమును తమ విధానమున కనుకూలించునట్లుగ మార్పులు చేర్పులతో ప్రబంధముగ సంగ్రహపఱచిరి. సంస్కృతమునఁ గల వ్యాసభారతమునకు నాంధ్రమునఁగల కవిత్రయ భారత మెంత స్వతంత్రానువాదమో, ఆ యాంధ్ర మహాభారతమున కిదియు ద్విపద రూపమున నంత స్వతంత్రానుసరణము. ఆ కవిత్రయ మెట్లు తన యుగాభిరుచుల కనుగుణమైన కూర్పులు కుదింపులు నెఱపెనో, యీ ద్విపద కవిత్రయమువారును నట్లే యుగధర్మము నభిరుచులను నెఱిఁగి కూర్పులు కుదింపులు నెఱపిరి.

ఛందో వ్యాకరణ విషయముల యందును, శబ్దస్వరూప నిర్ణయాదికమునందును, శైవకవుల యంతటి విశృంఖలులు గాకపోయినను ద్విపద కవులు, అందును ఈ తిమ్మనాదులు స్వతంత్రులు కారనలేము. తిమ్మనదైన ఈ పార్వ్యమున,

"దృష్టించు"ట మున్నగు శబ్ద ప్రయోగములును, "ఖలదైత్య మృగ వేఁట కాఁడు" వంటి వైరి సమాసములును నిందుల కుదాహరింపఁ దగినవి.

ఆంధ్ర మహాభారతము ననుసరించుటలోఁగూడ తన మిత్త్రులగు నిరువురి కంటె తిమ్మనార్యుఁడే యెక్కువ స్వాతంత్ర్యము ప్రకటించినాఁడు :-

"ఎడపక వృష్టి గ్రహించు పర్వతము
వడువున మచ్ఛరావళి వీఁడుగొనియె"—

( పుట 45 - పం - 15, 16 )

"అదియు సుభాషితం బవివేకి యెదుటఁ
జదివిన యట్లైనఁ జలనంబులేక" —

( పుట 46 - పం - 9, 10 )

మున్నగు భావములు నలంకారములును, నన్నపార్యునియందీ కవికిఁ గల భక్తికి తార్కాణలు.

ఇది యిట్లుండ, కవిత్వ కలానైపుణ్యమునందు, సాటి మిత్త్రులైన బాల సరస్వతి కంటెను సోమన కంటెనుగూడ, ఈ తిమ్మనార్యుఁడే యధికుఁడనుట నిర్వివాదాంశము.

కథా నిర్వహణము, రూప చిత్రణ, పాత్ర చిత్రణ, శీల చిత్రణముల విషయము, వర్ణనాసామర్థ్యము, ఔచిత్య రసపోషణాదికములగు వానిలో తిమ్మనది తోడివారికంటె పై చేయి.

## కథా సంగ్రహము

పాండవులు ద్వైతవనమున బ్రాహ్మణశ్రేష్ఠులతోఁగూడి వేద శాస్త్ర పురాణ విమల ప్రసంగముల నానందపరవశులై కాలము గడపుచుండ, నుదయించు సూర్యునితో సమానమగు తేజస్సు కలవాఁడును, కృష్ణాజినముల ధరించినవాఁడును, దయాపరుఁడు పూజ్యుఁడునగు వేద వ్యాసమహర్షి యచటి కేతెంచెను. ధర్మరాజు సంతోషముతో నాదరించి పూజింప, వ్యాసుఁడు కృపాదృష్టి రాజిల్లఁజూచి, "ధర్మరాజ! యీ మహారణ్యముల శర్మలీలల మీరు చరించుచుంటిరి. బ్రాహ్మణులు వెంటరా తీర్థము లప్రయాసమున నాడఁగలరు. కాని మీరు శత్రువులను జయించుట కాలోచింపవలయును. కౌరవులకు మీకును యుద్ధము జరుగఁగలదు. వారెరుంగని వాడి బాణము లర్జునునకుఁ గొన్ని కావలయును. నేను "ప్రతిస్మృతి" యను మహావిద్య నీకొసంగెదను. ఆ విద్యను క్రీడి కెఱిఁగించి వానిని తపమాచరింపఁ బంపుము. ఇంద్రాది దేవత లతనికి సమస్త శస్త్రముల నొసఁగెదరు. పూర్వము దేవతలు వృత్రాసురు భీతిచే తమ శస్త్రముల నింద్రునింట దాచియుం

చిరి. ఏదో యుపాయమున నింద్రుఁడా యాయుధములన్నియుఁ దన కుమారున కొసఁగును" అని చెప్పి, "ప్రతిస్మృతి" విద్య నొసఁగి, "మహారాజా! మీ రిచ్చట నుండవలదు. హోమకాష్ఠములు, ఫలములు, మంచినీరు గల మఱియొకచోటికిఁ బొండ"ని యచ్చోటువాసి చనెను.

అంత ధర్మరాజు సోదరులతోఁగూడి కామ్యక వనమున కరిగి సరస్వతీ నది పొంత విడిసి యొకనాఁ డర్జునుఁజూచి, "శత్రువులను మన మేవిధముగ జయింపఁ గలము. కర్ణ భీష్మ ద్రోణాదు లజేయులు కదా! వ్యాసోపదిష్టమైన "ప్రతిస్మృతి" అను మహా విద్య నీకుపదేశించెదను. దాని ననుష్ఠించినచో నభవుని దయచే నీకు పాశుపతాస్త్రము లభింపఁగలదు. అంతట దివిజులు మెచ్చి నీకు దివ్యాస్త్రముల నీయఁగలర"ని చెప్పి విద్య నొసఁగెను. ఆ ప్రభావమున నర్జునుఁ డమిత తేజో విరాజమానుఁడై అగ్రజునకు మ్రొక్కి పాదచారియై యీశాన్యవీథిఁ బోవుచుండఁగా నింద్రుఁడు వృద్ధ బ్రాహ్మణ రూపమున వచ్చి యర్జునుఁ బరీక్షించి, నిజరూపముతో ప్రత్యక్షమై "పంచబ్రహ్మ శైవ మంత్రము" నుపదేశించి, "అర్జునా! యీ మంత్రయోగబలమున నీశ్వరుఁడు ప్రత్యక్షమగును. అంతలో నేను దేవతలఁ గూడి వచ్చి నీకోర్కెలనెల్ల తీర్తు"నని చెప్పి దేవేంద్రుఁ డరిగెను.

అంత నర్జునుఁ డింద్రకీల పర్వతమున నొక రమ్య ప్రదేశముననుండి ఘోర తప మాచరించుచుండ, నచ్చటి మునులు శివుని దర్శించి, "అర్జునుఁడు ఘోర తప మాచరించుచున్నవాఁడు; అది తపమన్న తపముగాదు. నీవు ప్రత్యక్షము కాకున్న నాతపము జంతు సంతతిని గాల్చు"ననిరి.

అంత శివుఁ డర్జును పరీక్షింపఁదలఁచి, తాను కిరాత రూపమును ధరించెను. పార్వతి చెంచెతయై చెంత నిలిచెను. ప్రమథులు కాంతాసమేతులై శబరులైరి. మూకాసురుఁడు భయంకర సూకరాకారమును దాల్చెను. ఇట్లు మహేశ్వరుఁ డింద్రకీల పర్వతమును జేరి, యింద్రసూను పౌరుషం బరయ వేడుక నా సూకరమును క్రీడికడ కంపెను. అర్జునుఁడు ధనుర్బాణములను గొని, సాయకము సంధించి, వలదని మునులు వారించుచున్నను వినక నా క్రోడంబు నెఱి నాట నేసెను. అదే సమయమున శివుఁడును దానిని బాణముతోఁ గొట్టెను. "నా శరంబునఁ జచ్చె నీ పంది" అనిన, "నా శరంబునఁ జచ్చె నీ పంది" అనుచు, శివార్జును లిరువురును నా పందికడ కరుదెంచిరి. వారి వాక్కలహము క్రమముగా సంకుల సమరముగ మారెను. అంత శివుఁ డర్జునుని యక్షయతూణీరముల యందొక యంబకమైనను లేకుండఁ జేసెను. అందు కర్జునుఁడు విస్మయమంది భయపడక ధనుస్సు నెత్తి జటాజూటుని శిరముపై గొట్టెను. అంత నిరువురును ముష్టియుద్ధమునకు కడఁగిరి. పరమేశ్వరుఁడు, సవ్యసాచి బలపరాక్రమములకు మెచ్చి నిజరూపముతోఁ బ్రత్యక్షమై, వరము వేఁడుకొమ్మనెను.

అర్జునుఁ డానందాబ్ధి మునిఁగి పరవశుఁడై సాగిలి మ్రొక్కి తన యజ్ఞానమును సైఁపుమని శివుని వేనోళ్ల కొనియాడెను.

## ఛందస్సు - ద్విపద

ద్విపదయనఁగా రెండు పాదములుగల పద్యము. ప్రతిపాదమునందును వరుసగా మూఁడింద్రగణములు, ఒక సూర్యగణము, మొత్తము నాలుగు గణములుండవలయును. ప్రతి పాదమునందును పాదము యొక్క మొదటి యక్షరమునకు నా పాదములోని మూఁడవగణము యొక్క మొదటి యక్షరమునకు యతి నిలుపవలయును. ప్రాస నియమము గలదు. ప్రాసయతి వాడకూడదు. మన పాఠ్యభాగమునందలి ద్విపద లక్షణమిది.

ద్విపదలో ప్రాసనియమమును విడిచి, ప్రాసయతి వాడినచో నది "మంజరీ ద్విపద" యగును. ఈ మంజరీ ద్విపద ఈ పాఠ్యమున వాడఁబడలేదు.

ద్విపద: గణ ప్రస్తారము

| త | నల | త | న | |
|---|---|---|---|---|
| U U I<br>ఆ రీ తి | I I I I<br>నృపులు ద్వై | U U I<br>తారణ్య | I I I<br>మునను | గమనిక:- పాదముల రెండవ యక్షరములు (రీ, రు) ప్రాసస్థానము లందున్నవి. |
| ధా రు ణీ<br>U I U<br>ర | సురులు ను<br>I I I I<br>నల | దామునం<br>U I U<br>ర | తంత<br>UI<br>గల (హ) | పాదముల మొదటియక్షరములు, యతి స్థానములు. మూఁడవ గణముల మొదటి యక్షరములు, యతి మైత్రి స్థానములు. వాని వానికి గీతలుంచఁబడినవి. |

## వే ద వ్యా సా గ మ న ము

వ్యాఖ్యానము :

పుట. 37.

ఆ రీతి = ఆ విధముగా-నృపులు (వ్యు) = నరులను పాలించువారు- రాజులు (ధర్మరాజాదులు); ద్వైత + అరణ్యమునను = ద్వైతమను పేరుగల అడవియందు (సవర్ణ దీర్ఘ సంధి) సూ:- అ-ఇ-ఉ-ఋ లకు అ-ఇ-ఉ-ఋ లు పరమైనచో పూర్వపరాచ్చులు రెంటికిని దీర్ఘము వచ్చును. ధారుణీసురులు (వ్యు) భూమిపై దేవతలవంటివారు (బ్రాహ్మణులు). వేదములు నాలుగు. (1) ఋగ్వేదము- (2) యజుర్వేదము- (3) సామవేదము (4) అథర్వణ వేదము. పురాణములు పదు

నెనిమిది (అష్టాపదము). మోదిత హృదయులై = ఆనంద మొందిన మనస్సు గల [illegible] ఉదయ + అర్క + తేజుఁడు = ఉదయించిన సూర్యునితో సమానమగు తేజస్సు కలవాఁడు. ఉదయ + అర్క = (సవర్ణ దీర్ఘ సంధి). ఉన్నత + అజిన వాసుఁడు = కృష్ణాజినమును ధరించినవాఁడు-నల్లయిఱ్ఱి చర్మము వస్త్రముగా గల వాఁడు (బహు వ్రీహి). ఉరు కృపాధనుఁడు = గొప్ప దయయే ధనముగా గల వాఁడు. అనఘుఁడు = పాప రహితుఁడు. మన మలరంగ = మనస్సు ఆనందమందు నట్లు, పూజితుఁడై = పూజింపఁ బడినవాఁడై, రాజపూజితుఁడు = రాజులచే పూజింపఁ బడినవాడు. ధర్మజుఁడు = (వ్యు) యమధర్మరాజునకు కుమారుఁడు (ధర్మరాజు). మహోదారుణాటవులు = మిక్కిలి భయంకరమైన అరణ్యములు. అటవి (ప్రకృతి) అడవి (వికృతి). విప్రులు = బ్రాహ్మణులు.

రాజిల్లన్ + చూచి = సూ:- ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళంబులగు. రాజిల్లన్ + జూచి. సూ:- ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు. (సంశ్లేష మనఁగా, మీఁది హల్లుతోఁ గూడికొనుట.) రాజిల్లఁజూచి (ఖండ బిందు రూపము.)

శర్మలీలల = సంతోష విలాసములు. వైరిజయ + అర్థంబు = శత్రువులను జయించుట కొరకు, చింత = ఆలోచన, కయ్యము = యుద్ధము, వాడి బాణములు = తీక్ష్ణమైన బాణములు, గాండీవి (వ్యు) గాండీవమను ఆయుధమును ధరించువాఁడు (అర్జునుఁడు). అరయన్ = ఆలోచింపఁగా, విద్య (ప్రకృతి) విద్దె (వికృతి). నరనాథ + ఇచ్చెద = సూ :- సంధి లేనిచోట స్వరంబుకంటెఁ బరంబయిన స్వరంబునకు యడాగమంబగు- నరనాథ యిచ్చెద. నరనాథుఁడు (వ్యు) మానవులకు ప్రభువు- రాజు.

పుట 38.

క్రీడి (వ్యు) యుద్ధములందు బాగుగా విహరించువాఁడు (అర్జునుఁడు). నిర్వర్తింప + పనుపు = చేయుటకై పంపుము (ద్రుత సంధి). శతమఖుఁడు (వ్యు) నూరు యజ్ఞములు చేసినవాఁడు (ఇంద్రుఁడు). దివిజులు (వ్యు) స్వర్గమున జన్మించినవారు (దేవతలు). అఖిల శస్త్రములు = సను సమైన ఆయుధములు - శస్త్రములు దేహబలముతో నుపయోగించునవి (ఖడ్గము గద మొదలగునవి.) అమరులు (వ్యు) చావు లేనివారు (దేవతలు). తొల్లి = పూర్వము. వృత్రాసురుఁడు = వృత్రుఁడను పేరుగల రాక్షసుఁడు. సుత్రాముని యింట = ఇంద్రుని యింటిలో, నిల్లడ చేసిరి = దాచియుంచిరి.

మనుజ + ఇంద్ర = (గుణ సంధి) సూ:- అత్వమునకు ఇ-ఉ-ఋత్వములు పరమైనచో ఏ-ఓ-అర్ ఆదేశమై వచ్చును.

ఉదా : అ + ఇ = ఏ—మనుజ + ఇంద్ర = మనుజేంద్ర.
అ + ఉ = ఓ
అ + ఋ = అర్.

సంస్కృతమున ఏ-ఓ-అర్ = అను వానికి "గుణము" అను సంజ్ఞ కలదు. కావున, నీ సంధికి "గుణసంధి" అను పేరు వచ్చినది. మసలకుండు = సంచరింప కుండు, హోమ కాష్ఠములు = హోమము చేయుటకు పుల్లలు (సమిధలు), పసం గల్గన్ = అధికముగా నుండ. మౌని + పోయిన. సూ:- ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు = మౌని వోయిన. కామ్యకవనభూమి = కామ్యక మను పేరుగల వనము. పొంత = సమీపము. విడిసి = నిలిచి. నృపతి (వ్యు) నరులకు భర్త = రాజు, నెమ్మి = ప్రేమ - నెమ్మి (నానా) నెమిలి, ఆసక్తి, ప్రేమ. రిపులు = శత్రువులు. నిర్జితుము = జయించెదము. అభేద్య కవచుఁడు = భేదింప శక్యముగాని కవచము కలవాఁడు. ఘనుఁడు-(నానా) గొప్పవాఁడు, మేఘుఁడు, భీష్ముఁడు (వ్యు) వివాహమాడనని గొప్ప ప్రతిజ్ఞ గావించినవాఁడు. (దేవవ్రతుఁడు) [భీష్ముని మొదటి నామము దేవవ్రతుఁడు]. వసుధ (వ్యు) బంగారమును వహించి యుండునది (భూమి). గురుఁడు (నానా) గురువు, పెద్ద, బృహస్పతి. శరము (నానా) బాణము, రెల్లు. ఆహవము = యుద్ధము. ద్రౌణి = (వ్యు) ద్రోణుని కుమారుఁడు- అశ్వత్థామ (అపత్యార్థకము).

పుట 39.

వ్యాస + ఉపదిష్టమై (అ + ఉ = ఓ- గుణసంధి)- వ్యాస మహర్షి చే నుపదేశింపఁబడినదై, సవ్యసాచి = (వ్యు) కుడి యెడమల రెండు చేతులతో బాణములను బ్రయోగించువాఁడు (అర్జునుఁడు), అనుష్ఠించు = అనుష్ఠానము చేయుము. అభవుఁడు (వ్యు) పుట్టుక లేనివాఁడు (ఈశ్వరుఁడు) పాశుపతము = ఈశ్వరుఁ డధిష్ఠాన దేవతగాగల యస్త్రము. తూపు = బాణము. విమత సంభవము = శత్రువులవలన గలిగినది. వెఱపు = భయము. ఆ + అస్త్రము (యడాగమము) ఆ యస్త్రము + ఒబ్బినన్ = ఆ యస్త్రము లభించినచో (ఉత్వ సంధి) సూ:- ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధి నిత్యముగా నగును. ఆ యస్త్ర మబ్బిన. దివిజులు = దేవతలు, అర్ది నీగలరు = కోరికతో నిత్తురు.

## అర్జున తపశ్చర్య

ప్రభావము = సామర్థ్యము. ఘనకాంతి = గొప్ప కాంతి. గాండీవ ధరుఁడు = గాండీవమను ఆయుధమును ధరించువాఁడు- అర్జునుఁడు. యమ సూతి = (వ్యు) యమధర్మరాజు కుమారుఁడు (ధర్మరాజు), అనుమతి = అంగీకారము. అనుమతి + వడసి. (గసడదవా దేశసంధి), చిత్రభానుఁడు (వ్యు) చిత్రమైన

కిరణములు కలవాఁడు (సూర్యుఁడు), శివుఁడు (వ్యు) శుభముల నొసఁగువాఁడు- (ఈశ్వరుఁడు), అగ్రజుఁడు = (వ్యు) మొదట పుట్టినవాఁడు- (అన్న), మ్రొక్కి = నమస్కరించి, అతివ = స్త్రీ (ద్రౌపది). యుగ్ర కార్ముక తూణ యుగళముతో = భయంకరమైన ధనుస్సు బాణముల జంటతో, ఇల = భూమి, పాదచారియై = కాలి నడక గలవాఁడై, ఈశాన్య వీధి = ఈశాన్య దిక్కు. తులలేని = సాటిలేని, మంచు కొండ = హిమవత్పర్వతము. గంధమాదనగిరి = గంధమాదనమను పేరుగల పర్వతము. అంచితగతి = గొప్ప వేగముతో, అటు పోవఁబోవ = ఆ వైపునకు పోఁగా పోఁగా, మ్రోసె = మ్రోగెను. నింగివాక్యము = ఆకాశవాణి. పులకితుఁడై = గగుర్పాటు కలిగినవాఁడై, పోక నిలిచి = కదలక నిలఁబడి, ఆ + పార్థుఁడు = ఆ యర్జునుఁడు. పార్థుఁడు (వ్యు) పృథ యొక్క కుమారుఁడు- అర్జునుఁడు. (కుంతీ దేవికి పృథ యను నామాంతరము కలదు), ఆ + పార్థుఁడు (త్రిక సంధి) ఆ-ఈ-ఏ- అనువానికి త్రికమని పేరు. సూ: త్రికంబుమీది యసంయుక్త హల్లునకు ద్విత్వంబును, పూర్వమందుఁడు దీర్ఘంబునకు హ్రస్వంబునగు (ఈ కార్యము ఊష్మరేఫంబులకు గలుగదు.) ఉదా :- అప్పార్థుఁడు. విస్మితుఁడై = ఆశ్చర్య పడినవాఁడై, సుప్రసన్నతన్ = మిక్కిలి దయతో, విప్రుఁడు = బ్రాహ్మణుఁడు.

పుట 40.

ఘోర + అస్త్రములు = భయంకరమైన బాణములు (సవర్ణ దీర్ఘ సంధి). క్రుమ్మరఁదగునె = తిరుగు టుచితమా ?, జంకించుట = భయపెట్టుట, బుద్ధి చలనము = మనస్సు చలించుట. అంకురింపమి (వ్యా) సూ:- వ్యతిరేకక్త్వార్థంబున మిఁజియగు: కలుగకపోవుటచే అని యర్థము. పొడ సూపి = కనుపించి (గసడద వాదేశ సంధి). ఇంద్రియ + అర్థితము = (సవర్ణ దీర్ఘ సంధి). ముదమంది = సంతోషించి. వైరి = శత్రువు. గౌరి + ఈశుఁడు = (సవర్ణ దీర్ఘ సంధి) = పార్వతీదేవి భర్త. తరుణీ సమేతుఁడై = భార్యతోఁ గూడినవాఁడై, ఉరుతర + అటవులందు = మిక్కిలి ఘోరమైన అరణ్యములయందు, యమ తనూభవుఁడు = యమధర్మరాజు కుమారుఁడు - తనూభవుఁడు (వ్యు) దేహమునుండి పుట్టినవాఁడు (కుమారుఁడు), నన్ను + అనిచె = నన్ను పంపెను (ఉత్వ సంధి). ఏ + అనువున = ఏ విధముగ, తూపులు = బాణములు, సరవి = ఆసక్తితో, కరమర్థిన్ = మిక్కిలి కోరికతో, ఎలమి = ఆసక్తి, ధూర్జటి (వ్యు) జడల భారము కలవాఁడు- (శివుడు). ప్రత్యక్ష మగును = దర్శన మిచ్చును.

పుట 41.

అమరులు = (వ్యు) చావులేనివారు (దేవతలు), చింతిత + అర్థము = ఆలోచించు కోరికలు; దేవ + ఇంద్రుఁడు = (గుణసంధి). క్రీడి (వ్యు) యుద్ధములందు బాగుగా విహరించువాఁడు (అర్జునుఁడు), ఇంద్రకీల + అచలము = ఇంద్రకీలమను పేరుగల పర్వతము. (ఇది సంభావనాపూర్వపద కర్మధారయ సమాసము).

అచలము = (వ్యు) కదలనిది (పర్వతము), తాల = తాటిచెట్టు, తమాల = చీకటి మ్రాను, హింతాల = గిర (అ)క తాడిచెట్టు, తక్కోల = కోలకపు (తక్కోలకపు) చెట్టు, సాల = మద్దిచెట్టు, రసాలము = తియ్యమామిడిచెట్టు. నెఱ + తావి. సూ:- సమాసంబునం బ్రాంతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగానగు. నె + తావి. సూ:- అన్యంబులకు సహిత మికార్యంబు కొండొకచోఁ గానంబడియెడి. ఉదా:- నెత్తావి. (బా. వ్యా. సంధి. 39 సూ) అనయము = ఎల్లప్పుడు, సురదుందుభులు = దేవదుందుభులు, శ్రుతులలోఁ దూర = చెవులయందు ప్రవేశింపఁగా, పద్మాసనము = పద్మాకారము గల యొక ఆసన విశేషము. హృదయ పద్మము = హృదయ మనెడు పద్మము (రూపకము). ఈశున్ = లోకములకు ప్రభువైనవానిని. పశుపతి = ప్రమథ గణమున కధిపతి. తన్మయత = వానిలో లీనమగుట. త్రిరాత్ర + ఉపవాసములు (గుణసంధి). ద్విగుణము = రెండు రెట్లు, మూఁడు + నెలలు = మూణ్ణెలలు = ఆంధ్ర భాషానుసంధి- సూ:- 61; పక్ష + ఉపవాసములు (గుణ సంధి) = పక్షమునైదురోజు లుపవసించుట; వాయు భుక్తి = గాలి మాత్రము భుజించుట. వెండియు = మఱల. ఊర్ధ్వబాహుఁడు = చేతులు పైకెత్తినవాఁడు. వసుధ = (వ్యు) బంగారమును ధరించియుండునది (భూమి), వేలు + మోపి = వేలు నానించి. (ఘోరపుఁ దపము) ఘోరము + తపము = (1) సూ:- కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు. ఉదా- ఘోరపు + తపము. (2) సూ :- సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుషసరళములు పరంబులగునపుడు నుగాగమం బగు. ఉదా:- ఘోరపు + ను + తపము- పిదప ద్రుతకార్యములు - ఖండబిందు రూపము- ఘోరపుఁ దపము; తపసులు + ఈశ్వరు (ఉత్వ సంధి); శర్వ = (వ్యు) = ప్రళయమందు భూతములను హింసించువాఁడు, సర్వ + ఈశ = సమస్తమైనవానికి నీశుఁడు (గుణ సంధి); దయ + చేయవే (గసడదవాదేశసంధి) దయసేయవే !, తపమన్నఁ దపమె = సామాన్యమైన తపముగాదు; ఉద్ధతిన్ = ఎగయుటచే, భీమ ధూమ = భయంకరమైన, పొగ యనెడి; కపట = కృత్రిమపు, హాలాహల + ఆక్రాంత = హాలాహలముచే నాక్రమింపఁబడిన, విష్టపము = లోకము గలది.

పుట 42.

జంతు సంతతి = జంతు సమూహము. ఆ + తపము (త్రిక సంధి), భక్తి- ప్రకృతి, బత్తి - వికృతి. కమలసూతి = (వ్యు) పద్మమునుండి జన్మించినవాఁడు (బ్రహ్మ), రవిరశ్మి = సూర్య కిరణము, రవము = శబ్దము, పక్షి- ప్రకృతి. పక్కి- వికృతి. వనము (నానా) నీరు, అడవి. యోగ నిరూఢి = యోగాధిక్యముచే; దనుజులు = దను సంతతివారు రాక్షసులు. నిర్జరులు = (వ్యు) ముసలితనము లేనివారు (దేవతలు), మక్కువ = ప్రేమ, వేగ + వేగ = వేవేగ- వ్యా. వి:- ఆంధ్ర భాషానుశాసనము సంధి- సూ. 42; ఆ + వేలుపు = ఆ దేవత - త్రిక సంధి

# శివుఁడు మాయాకిరాతుఁడై అర్జునునొద్దకు వచ్చుట

వీడ్కొలిపి = పంపి, పాయక = విడువక, ఉమ = పార్వతి (వ్యు) పార్వతి శివునిగూర్చి తపమాచరింపఁబోవ మేనకవచ్చి, ఉ = ఓసి అమ్మాయి, మ = తపస్సు చేయవద్దు, అని నిరోధించిన దనియు, అప్పటినుండి పార్వతికి "ఉమ" అను పేరు సార్థకమైనదనియు ప్రతీతికలదు.

ప్రమథులు = ప్రమథ గణము (శివుని సేవకులగు వీరులు). జొత్తార్చు కనులు = (జొత్తు + ఆర్చు) ఎఱ్ఱ రఁగునే చలింపఁజేయు కన్నులు. జుంజురు = చిక్కుపడిన. కాటుక కొండ = కాటుకవలె నల్లనైన కొండయో యన (ఉత్ప్రేక్ష), జడిగొన్న = అతిశయించిన, పికిలి పుంజముల దండయును = పికిలి పిట్టల తూలికలతోఁ జేసిన కుంచెయు, చొ(చు)ళ్లెమున = చుట్టిన జడ చుట్టలో, చిగురాకు చీర = చిగురాకుల వస్త్రము, గవులు కంపు = చెడు వాసన, చెంచు + ఐ = బోయవాఁడై, ఖలదైత్య మృగ వేఁటకారుండు = దుర్మార్గులగు రాక్షసులనెడు మృగములను వేఁటాడువాఁడు- (వైరి సమాసము). గౌరి (వ్యు) గౌరవర్ణము కలది (పార్వతి)· చెంచెత = చెంచు భార్య ( వ్యా· వి :- చూ· బా· వ్యా· తద్ధిత-సూ· 19, 20.)

పుట 43.

తమ తమ కాంతలు = వారి వారి భార్యలు; తారున్ = వారును; ప్రమథులు = ప్రమథ గణము. శబరులై = కిరాతులై, బలిసి = అతిశయించి, (బలసి అనుట పొరపాటు), ఆ + విభుని = ఆ ప్రభువును (త్రిక సంధి), గాఢము- ప్రకృతి; గాటము - వికృతి; ఆకాశము - ప్రకృతి; ఆకసము - వికృతి; నెపము = మిష, హరిసూనుఁడు (వ్యు) ఇంద్రుని కుమారుఁడు(అర్జునుడు), పౌరుషం బరయ = పరాక్రమమును చూచుటకు, వేడుక = కోరిక, సూకర + ఆకృతి = పందియాకారము (సవర్ణ దీర్ఘసంధి), ఇంద్ర సుతుఁడు = ఇంద్రుని కుమారుఁడు, తాకుము = ఎదుర్కొనుము· మూక + అసురుఁడు = (సవర్ణదీర్ఘసంధి). మోదించి = సంతసించి; తొంటి వరాహము = ఆదివరాహము; తొడరెనో = దగ్గఱిల్లెనో, ఎదిరించెనో; గెంటక = చెడక, ధరకు డిగ్గిన మేఘము = భూమిమీఁదికి దిగిన మేఘము, నడతెంచు = నడచివచ్చు. అంజననగ శృంగమనఁగన్ = కాటుకకొండ శిఖరమను నట్లుగా; కెడయన్ = తెగునట్లుగా (లేక-కూలునటులుగా), దిశ-ప్రకృతి; దెస-వికృతి; నక్షత్రముల్ తొరుఁగన్ = నక్షత్రములు రాలఁగా; అనలము = అగ్ని, ఒడిసి, రొప్పిన మ్రోతలు = వ్యాపిం(చి)ప, గా, రొప్పిన ధ్వని; గొరిజ = డెక్క; మహాకుధరంబులు = గొప్ప గొప్ప పర్వతములు- కు + ధరము = (వ్యు) భూమిని ధరించునది = పర్వతము; బిరుసైన నడపు = కఠినమైన నడక; పృథివి = భూమి; ఘుర్ఘుర + అఖిలరవములు = ఘుర ఘురమను భయంకరమైన అరపులు; లోక

భైరవములై చెలఁగ = లోకమునకు భయమును కలిగించునవై వ్యాపింపఁగా; భువనభాండము = భూమిని; డమ్ములుచెడి = కాంతిహీనములై; కొత్తడమ్ములు= కోటబురుజులు; అద్రిభేది కుమారుఁడు = పర్వతములను తన వజ్రముచే భేదించిన యింద్రుని కుమారుఁడు—అర్జునుఁడు; అణపంగ = అణఁగద్రొక్కుటకు; అద్రు లెల్లను = పర్వతములన్నియు; పోత్రి = పంది.

పుట 44

ఏసిన శరలీలన్ = ప్రయోగించిన బాణమువలె వేగముతో, ఏతేరన్ = రాగా, సవ్యసాచి = (వ్యు) కుడియెడమల రెండు చేతులతో బాణములను ప్రయోగించువాఁడు (అర్జునుఁడు). సాయకము = బాణము, సంధించి = కూర్చి, క్రోడంబు= పంది, నెఱినాటనేయ = గాఢముగా నాటుకొనునట్లు వేయఁగా, హరుఁడు = శివుఁడు, మున్ను + ఏసిన = ముందుగా బాణమువేసిన, అలుగు = బాణము, మృగము = పంది, మృగము-ప్రకృతి; మెకము- వికృతి; మృగము (నానా) లేడి, మృగసామాన్యము: తటఁ శేషగిరి వోలె = శృఙ్గములతోఁ గూడిన పర్వతమువలె, ధారుణిఁద్రెళ్లి = భూమిపైఁబడి; ఆ మేను చాలించి = ఆ దేహమును విడిచి, అసురయై = రాక్షసుఁడై, అసుర = వ్యా. వి:- చూ. బా. వ్యా తత్స. సూ. 60., అదృశ్యమై = కనఁబడక.

## వరాహమునకై పరమేశ్వరార్జునులు కలహించుట

శరము = (నానా) బాణము, ఱల్లు. ఈశానుఁడు = శివుఁడు. ఇంతి + లు = సూ॥ ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు = ఇంతులు- అను రూపము సిద్ధించును. స్త్రీ- ప్రకృతి, ఇంతి- వికృతి. గాండీవి = (వ్యు) గాండీవ మను ఆయుధమును ధరించువాఁడు (అర్జునుఁడు.)

పాయుము = తొలఁగుము. ఇలయీనినట్లు = భూమి యీనినట్లు, సందడి = గోల. దూరానఁ దొలఁగుము = దూరముగాఁ బొమ్ము; దూరము + న = 'న' పరముకాఁగా, ము—లోపము, తత్పూర్వస్వర దీర్ఘము విభాషనగు. [బా. వ్యా. తత్స. సూ. 43], నందివాహనుఁడు = (వ్యు) నంది వాహనముగాఁగలవాఁడు (శివుఁడు), నీవొక విలుకాఁడవు = నీవొక్కడవే విల్లును ధరించి యుద్ధము చేయువాఁడవా?, విశ్వము = ప్రపంచము, ఎఱుఁగనివారు = తెలియనివారు. ఏసెద నంటి = కొట్టెదనంటివి. [మధ్య వకారలోపము ]నన్నేయుమా చూతము = నన్ను కొట్టుము చూతము. (ఎట్లు కొట్టెదవో చూచెదను.) ఈసటలు = ఈ కపటములు.

పుట 45

కోలాధిపతికినై = ఘనమైన పందికై, కోలకై = బాణమునకై, అలము = యుద్ధము, ఉత్తమము = శ్రేష్ఠము, శైలకార్ముకుఁడు = (వ్యు) పర్వతము ధనుస్సు

గాఁగలవాఁడు (శివుఁడు), అమ్ము = బాణము, సంధించి = కూర్చి, మనుజ + ఇంద్రసుతుఁడు = మానవాధిపతియగు రాజకుమారుఁడు (అర్జునుఁడు) (గుణసంధి), లెక్కఁగొనక = లెక్క సేయక. అభవుఁడు = (వ్యు) పుట్టుక లేనివాఁడు (శివుఁడు), బాణధార + అభిషేకమున = బాణప్రవాహముచే తడుపుటచే, త్రిభువనంబులు = ముల్లోకములు, దేవేంద్ర + సుతుఁడు = దేవేంద్రుని కుమారుఁడు (అర్జునుఁడు), సముద్రము-ప్రకృతి, సంద్రము-వికృతి; శంభునం దణఁగె = ఈశ్వరుని యందణఁగెను, హరుని తూపులు = శివుని బాణములు. ఆత్మన్ = మనస్సునందు, ఆశ్చర్యము - ప్రకృతి; అచ్చెరవు- వికృతి; విబుధ విశేషంబు = దేవతా శ్రేష్ఠుఁడు, ఎడపక = మానక; వడువున = రీతిగా ('వడవు'- కాదు.) (ఉపమాలంకారము) మత్ + శరావళి = నా బాణముల సమూహము; మచ్చర + ఆవళి = (ఛత్వము, శ్చుత్వము) = సం. దీ. సంధి. నొచ్చితి = బాధపడితిని. రోచులు = కాంతులు. పర్వన్ = వ్యాపింపఁగా, దివ్యబాణములు = దేవతాసంబంధమగు గొప్ప బాణములు. శశధరుఁడు = (వ్యు) చంద్రుని ధరించువాఁడు (శివుఁడు), వార్ధి (వ్యు) నీటికి నిధి (సముద్రము); కవ + దొనలు = జంట అమ్ములపొదులు. శంకించు = సందేహించును. అక్షయ తూణీర యుగము = ఎన్ని తీసినను తరుగని యమ్ముల పొదుల జంట. కల్లగాదు = అసత్యముకాదు. అనలుఁడు = అగ్నిహోత్రుఁడు, శూన్యములయ్యెన్ = అమ్ములు లేకుండ పోయినవి. ఎఱుకు = బోయ; వృథాయుద్ధము = అనవసరపు పోరాటము (అక్కఱ మాలిన కయ్యము.)

పుట 46

తెరువులు దప్పె = గుఱి తప్పెను; తరువులు = వృక్షములు, గిరులు = పర్వతములు; పాండుతనయుండు = పాండురాజు కుమారుఁడు-అర్జునుఁడు; అర నెల = అర్థ చంద్రుడు; మ్రింగుకరణన్ = మ్రింగిన విధానమున, కాలకంధరుఁడు = (వ్యు) విషముచే నల్లనైన కంఠముకలవాఁడు (శివుఁడు) = [బహువ్రీహి సమాసము.] నరుఁడు = అర్జునుఁడు, కరవాలము = కత్తి, శూలి = (వ్యు) శూలమను ఆయుధము ను ధరించువాఁడు (ఈశ్వరుఁడు), మైప్రేసెన్ = దేహముపై వేసెను. సుభాషితంబు = మంచిమాట. అవివేకి = అజ్ఞాని. శిలలు = రాళ్లు, మ్రాఁకులు = చెట్లు (బాల. వ్యా. అచ్చి. సూ. 18), రువ్వి = విసిరి; నిలువరింపంగలేక = ఆపఁజాలక, నిజశక్తిన్ = తన గొప్ప బలముతో, ముక్కంటి = (వ్యు) మూఁడు కన్నులుకలవాఁడు (శివుఁడు), తలఁపడి = కలియఁబడి; ముష్టి యుద్ధము = పిడికిళ్లతో కొట్టుకొను ద్వంద్వ యుద్ధము, తాటించు = కొట్టి, ఆర్వన్ = అరచినంతనే, ఇలన్ = భూమియందు, చలమరి = [చలము + అరి = అరి మత్వర్థీయము] = పట్టుదల కలవాఁడు; శంభుఁడు = [వ్యు. శుభమును కలిగించువాఁడు] శివుఁడు, మూర్ఛపుచ్చి = మూర్ఛపోవునట్లు చేసి.

# పాశుపత ప్రదానము

తెలియుచో = మూర్ఛ తెలిసినంతనె. ముక్కన్ను = మూఁడు కన్నులు (ద్విగువు), తెగగల = పొడవుగల, జట- ప్రకృతి; జడ- వికృతి; రాకాసిబొమ్మ పెండెమ్ము = రక్కసి యొక్క బొమ్మ కాలియందెకాగా; పాఁపతొడవు = పాము లలంకారములు, [పాము + తొడవు = బా. వ్యా. సమా. సూ. 19] ఢక్క = వాద్య విశేషము. పునుఁ జన్నిదము = పుట్టిలజందెము. ముమ్మొనకైదువు = (మూఁడు + మొన) మూఁడు అంచులుగల శూలము (త్రిశూలము), ముదిత + సామేను = సగదేహము స్త్రీ రూపము- సాము + మేను = ప్రౌ. వ్యా. సమా. సూ. ౩౬- (అర్ధనారీశ్వరుఁడు); ఎమ్ముల పేరులు = ఎముకల దండలు.

పుట 47

తోలు పచ్చడము = తోలు వస్త్రము. ఎకిరింత = వాహనము, ఔదల యేఱు = శిరస్సునందు గంగ. బూడిత పూఁత = దేహమంతయు బూడిత పూసికొనియుండి, చెలువార = రమ్యముగా, సన్నిధి + చేసి = ప్రత్యక్షమై, ఘనాగ్రము = పరాక్రమము, ప్రీతచిత్తుఁడనైతి = సంతోషించిన మనస్సుగలవాఁడనైతిని. పృథ్వీ + ఈశతనయ = భూమికి భర్తయగు రాజకుమార, తడయక = ఆలస్యముచేయక, త్రైలోక్యమైనన్ = ముల్లోకములైనను, [అచ్చు తప్పు దిద్దుకొనునది], అరసిచూచితిన్ = పరీక్షించి చూచితిని, సురకార్యపరుఁడు = దేవకార్యమునందాసక్తికలవాఁడు. క్షోణిపై = భూమిమీఁద, చూచెదు = వ్యా. వి:- బా. వ్యా. క్రియా. సూ. 24. చాఁగిలి మ్రొక్కి = సాష్టాంగపడి నమస్కరించి, అ + కాలకంఠుఁడు = (త్రిక సంధి) [వ్యు. నల్లనికంఠముకలవాఁడు] శివుఁడు, శర్వ = ఈశ్వరా!, సర్వ + ఈశ్వర = అన్నిలోకములకు ప్రభువైనవాఁడ (గుణసంధి). శాంకరీరమణ = పార్వతీ ప్రియా!, గీర్వాణసేవిత = దేవతలచే సేవింపఁబడువాఁడా!, గిరిరాజచాప = శ్రేష్ఠమగు పర్వతము చాపముగాఁగలవాఁడ!, కైలాస నిజవాస = కైలాసపర్వతము నివాసము గాఁగలవాఁడ! కరిచర్మవాస = ఏనుఁగు చర్మము వస్త్రముగాఁగలవాఁడ!, ఫాలలోచన = నొసటియందు కన్నుగలవాఁడ. పశుపతి = ఈశ్వరా, శూలపాణి = శూలమను ఆయుధము చేతియందు కలవాఁడ. సామగానామోద = సామవేద గానముచే నానందించువాఁడ. సహజప్రసాద = స్వభావసిద్ధముగా దయకలవాఁడ. కామసంహార = మన్మథుని సంహరించినవాఁడ. చంద్రఖండావతంస = చంద్రకళ శిరోభూషణముగ గలవాఁడ.

పుట 48

పంచాక్షరీప్రాణ = పంచాక్షరికి (నమః శివాయ) ప్రాణమువంటివాఁడ. పరమ కల్యాణ = మంగళప్రదమైనవాఁడ. పంచ వక్త్ర విలాస = ఐదు మోములచేత విలసిల్లువాఁడా; పటుజయ + ఉల్లాస = గొప్పజయముచే నానందించువాఁడా (గుణ

సంధి). భక్త పరాధీన = భక్తులకు వశమైనవాఁడ; భక్త నిధాన = భక్తులకు నిధివంటి వాఁడ, భక్తి సాధ్య = భక్తిచే సాధింపఁబడువాఁడ; పావనచరిత = పవిత్రమైన చరిత్రకలవాఁడ; ఆనందరూప = ఆనందమయమైన రూపముకలవాఁడ, కృత్తి వాస = చర్మము వస్త్రముగాఁగలవాఁడ. భవానీ ప్రాణనాథ = పార్వతీ భర్త, పరిచారకుఁడ = సేవకుఁడను, భక్తి పసలేనివాఁడ = భక్తి బాగుగా తెలియనివాఁడను. మునిప్రియ = మునులకిష్టమైనవాఁడ (ఛందస్సు - ప్రి- తేల్చి పలుకవలెను. ని- గురువు కారాదు) హంకారమునన్ = అహంకారముతో (గర్వముతో, ఆహవము = యుద్ధము, కమల సంభవుఁడు — (వ్యు) పద్మమునుండి పుట్టినవాఁడు (బ్రహ్మ), విమలాత్మ = నిర్మలమైన మనస్సు కలవాఁడ. విఖ్యాతి = ప్రసిద్ధి. హిత దివ్యతనువు = ఇష్టమైనదియు, దివ్యమైనదియునగు నీ దేహము. గాసిగా = బాధ కలుగునట్లుగా. ప్రచ్చితి = చీల్చితివి, అపరాధము + ఓర్వుము = నాతప్పును సహింపుము; అజ్ఞానిని = తెలివిలేనివాఁడను; చపలుఁడ = చంచల స్వభావము కలవాఁడను, లోకరక్షావిహార = లోకమును రక్షించుటకు విహరించువాఁడ, రాక్షస రాజ సంహార = రాక్షసరాజులను చంపువాఁడ.

పుట 49

అభవ = పుట్టుకలేనివాఁడా!, నమః + తే = నీకు నమస్కారము. వివేక ప్రసంగ = విజ్ఞానముతోఁ గూడిన ప్రసంగము కలవాఁడ!, గిరిశ = కైలాసపర్వతము శయ్యగాఁ గలవాఁడ; వికీర్ణ + భస్మ + అంగ = బూడిదపూసుకొనిన దేహముగల వాఁడ. కౌరవులు [(వ్యు) కురువంశమున బుట్టినవారు, దుర్యోధనాదులు], అదయులై = దయలేనివారై, కౌంతేయులు = [(వ్యు) కుంతికుమారులు] పాండవులు, ఘోర + అటవులు = భయంకరమైన అడవులు (సవర్ణదీర్ఘసంధి), కు + తలము = భూమి ప్రదేశము, మహా + ఉగ్రము + ఐ = మిక్కిలి భయంకరమై, అరుదైన = గొప్పదైన, సహస్రము = వెయ్యి (సంఖ్య), గద- ప్రకృతి; గుదియ- వికృతి. శరభ + ఆదులు = శరభ మృగము మొదలైనవి. సంధానవేళ = కూర్చు సమయమున, దనుజులు [(వ్యు) 'దను' సంతతివారు.] రాక్షసులు; దైతేయులు = (వ్యు) దితిసంతతివారు, యక్ష + ఆది = యక్షులు మొదలైన. (యక్షులు దేవతలలో నొకజాతివారు.) యక్షులు- ప్ర, జక్కులు — వి; నిర్జింతు = జయింతును; రుద్రుఁడు (వ్యు) రౌద్రరూపముకలవాఁడు (శివుఁడు), ఆనతి యిచ్చి = ఆజ్ఞాపించి, గణ + ఆలి = ప్రమథగణముల సమూహము. శూలి = (వ్యు) శూలమును ధరించువాఁడు (శివుఁడు), చోద్యము = ఆశ్చర్యము, ఇంద్రజుఁడు = [ఇంద్రుని కుమారుఁడు] అర్జునుఁడు, శరము (నానా) బాణము, రెల్లు; సాంద్ర + దీధితి = దట్టమైన, కాంతులతో; వసుధ = [(వ్యు) బంగారమును ధరించినది] భూమి; చాలించె = కంపించెను. లవణ + అబ్ధి = ఉప్పు సముద్రము, కలఁగె = కలఁతఁజెందెను. శైలంబులు = [(వ్యు) రాళ్లతోఁగూడినవి] పర్వతములు; ఊటాడె = ఊఁగెను.

తివిరి = ఇష్టపడి (ఒప్పుకొని) బ్రహ్మాండము = ప్రపంచము, దిర్దిరఁదిరిగె = గిరగిర తిరిగెను.

పుట 50

హరు మేను సోకిన = ఈశ్వరుని దేహమును తాకినట్టి, ఆ ప్రభావమున = ఆ గొప్పదనముతో, నరు మేను = అర్జునుని దేహము, దివ్యగంధము = మంచి పరిమళము. పవిత్రము = పావనము. శుభకాంతియుము = మంచి శుభ్రమైన కాంతితోఁగూడినది. సురకళ = దేవతలశోభ. త్రిభువన దీప్తము = ముల్లోకములఁ బ్రకాశించునదై, దృష్టింపఁగలిగె = చూడనొప్పెను. (దృష్టించు = వ్యా. వి:- నామధాతువువంటి యిట్టి ప్రయోగములు, ద్విపద కవులకు పరిపాటియే. దర్శించు, శపించు ముస్నగువానికి గౌరన దృష్టించు, శాపించు- అని ప్రయోగించినాఁడు.)

## దివ్యాస్త్ర లాభము

వహ్ని = అగ్ని; యముఁడు-ప్రకృతి; జముఁడు-వికృతి; దైత్య + ఇంద్ర = (గుణసంధి): అప్ + పతి [(వ్యు.) జలమునకు అధిపతి] వరుణుఁడు; పవనుఁడు = గాలి; యక్షవల్లభుఁడు = [(వ్యు) యక్షుల కధిపతి] కుబేరుఁడు;సురలు = దేవతలు; తమ కార్యము + అగు = తాము చేయవలసినదగు; వసుధా + భారహరణము = భూభారమును తగ్గించుట; అమర + ఇంద్రసుతుఁడు = దేవతలరాజగు, నింద్రుని కుమారుఁడు (అర్జునుఁడు). పార్థుఁడు [(వ్యు) పృథకుమారుఁడు] అర్జునుఁడు; [కుంతికి పృథయను నామాంతరము కలదు] అక్కజము = ఆశ్చర్యము; మృడుని = శివుని; పాశుపత + ఆశుగము = పాశుపతమను అస్త్రము; [ఆశుగము = (వ్యు) వేగముగా పోవునది (బాణము)] అనిమిష + అధిపులు = దేవతల కధిపతులు; అనిమిషులు = [(వ్యు) ఱెప్పపాటు లేనివారు] దేవతలు; కార్యము-ప్రకృతి; కర్జము-వికృతి; మోదించి = సంతసించి; అలయిక = ఆయాసమును జెందక; అనేక + అయుత + వర్షములు = పెక్కు పదివేల సంవత్సరములు. [అయుతము = పదివేలు, పదివేల సంఖ్యగలది.] అనఘ = పూజ్యుఁడ!, కదియునే = కలియునా?, అంబికా ప్రాణవిభుఁడు = పార్వతీదేవి భర్త (ఈశ్వరుఁడు);

పుట. 51.

పెనఁగి = పోరాడి; దివ్యాంగుండవై = దివ్యమైన దేహముకలవాఁడవై తివి. విభవము = వైభవము. అవనీ, మహాభార, హరణంబు = భూమియొక్క, గొప్ప బరువును, తగ్గించుట: అశేష, సామర్థ్యంబులైన = గొప్ప, శక్తి కలిగిన; భీకర + అస్త్రములు = భయంకరమైన ఆయుధములు; ఘోర + ఆహవము = భయంకరమైన యుద్ధము. పోరామి = ఆఁది. అతుల, మార్తాండ, ఘనకాంతి, మండలాఖండ, దండంబు = సాటిలేని, సూర్యుని యొక్క, గొప్ప కాంతి, సమూహముతో, గూడిన దండము (యమదండము), పాశము = త్రాడు (ఆయుధము),

తోయధిరాజు = జలాధిపతి [వరుణుఁడు]. కౌబేరాస్త్రము = కుబేరుఁ డధిదేవతగాఁ గల యస్త్రము. అర్థపుఁడు = [(వ్యు) ధనాధిపతి] కుబేరుఁడు; శాత్రవకోటి = శత్రుసమూహము; వీఁడు + ఓపు = వీఁడు సమర్థుఁడు. జిష్ణుఁడు = [(వ్యు) జయించు శీలము కలవాఁడు] ఇంద్రుఁడు. మై + నిమిరి = దేహమును, చేతితో నంటి; మాతలి = ఇంద్రుని రథసారథి; పుత్తెంతు = పంపెదను. రథము-(ప్ర); అరదము-(వి); ఎల్లి = రేపు; భబీత్సుఁడు = [యుద్ధమునందు శత్రువుల బీభత్సమొనర్చువాఁడు] అర్జునుఁడు, కాయంబుతోడ = దేహముతో; సాయకంబులు = బాణములు.

పుట. 52.

సురలతో = దేవతలతో; వాసవుఁడు = ఇంద్రుఁడు; అరిగె = వెడలెను.

## ప్రశ్నోత్తరములు

ప్ర. 1 :- వ్యాసమహాముని ద్వైతారణ్యమున నున్న ధర్మరాజు కడకువచ్చి యేమనెను ?

ఉ :- "ధర్మరాజ ! ఈ మహారణ్యమున శర్మశీలల మీరు చరియించు టరుదు. బ్రాహ్మణులు వెంటరా తీర్థము లనయాసమున నాడఁగఁగలరు. కాని, మీరు శత్రువుల జయించుట కాలోచింపవలసియున్నది. కౌరవులకును మీకును యుద్ధము జరుగఁగలదు. వారలెఱుఁగని వాఁడి బాణము లర్జునునకుఁ గొన్ని కావలయును. నేను "ప్రతిస్మృతి" యను మహావిద్య నీ కొసఁగెదను. ఆ విద్యను క్రీడి కెఱిఁగించి వానిఁదపమాచరింపఁ బంపుము. ఇంద్రాది దేవత లతనికి సమస్త శస్త్రముల నొసఁగెదరు. పూర్వము దేవతలు వృత్రాసురుని వలని భీతిచేఁ దమ శస్త్రముల నింద్రునింట దాఁచియుంచిరి. ఏదో యుపాయమున నింద్రుఁడా యాయుధము లన్నియుఁ దన కుమారున కొసఁగును" అని చెప్పి, "ప్రతిస్మృతి" నొసఁగి, "మహారాజ ! మీ రిచ్చట నుండవలదు; హోమ కాష్ఠములు, ఫలములు, మంచి నీరుగల మఱియొకచోటికిఁ బొం"డని యచ్చోటు వాసి చనెను.

ప్ర. 2 :- కామ్యకవనమును బ్రవేశించిన తరువాత నొక్కనాఁడు ధర్మరా జర్జునునితో నేమని చెప్పెను ?

ఉ :- "అర్జునా! మనము శత్రువుల నేవిధముగా జయింపఁగలము? కర్ణుఁ డభేద్య కవచుఁడు, మహాబలశాలి. ఆలోచింప భీష్ముఁ డీ వసుధకే గురువు. ద్రోణుని జయించు శరములు లేవు. యుద్ధమునఁ గృపుఁడు చావెఱుఁగఁడు. అశ్వత్థామకుఁ గల శరములు నీకు లేవు. గదాయుద్ధమున దుర్యోధనుని నేర్పు వర్ణింపనలవి కాదు. వ్యాసోపదిష్టమైవచ్చిన "ప్రతిస్మృతి" యను విద్య నీ కొసఁగెదను. దాని నను ష్ఠింపుము. నీ కభవుని గరుణచేఁ బాశుపతాస్త్రము లభించును. శత్రువుల నడప

నాయస్త్రమే తగియున్నది. తరువాత దేవత లాయుధముల నీ కొసఁగెదరు"– అని చెప్పి "ప్రతిస్మృతి" విద్య నొసఁగెను.

ప్ర. 3:–తపమాచరింపఁబోవు అర్జునునకు మార్గమధ్యమున జరిగిన సంఘటన యెట్టిది ?

ఉ :–అర్జునుఁడు ప్రతిస్మృతి ప్రభావమున ఘనకాంతిచే నుప్పొంగి, యగ్రజులకు మ్రొక్కి యుగ్రకార్ముక తూణయుగళము గొని పాదచారియై యీశాన్య దిశగాఁ బోవుచుండ, "నిలు. పోకు" మను శబ్దము వినిపించెను.పుష్ప వర్షంబులు గురిసెను. పులకితుఁడై పోక నిలిచి, యప్పార్థుఁడు వృద్ధబ్రాహ్మణు నొక్కని వీక్షించి విస్మితుఁడై యుండ, నా విప్రుఁడు, "ఓ రాజ ! విను, మౌనులున్న యీ యడవిలో ఘోరాస్త్రములు పూని తిరుగరాదు. నీ వెవ్వఁడవు ? నీ కోర్కె యేమి ? నీ కోర్కులన్నియు నిచ్చుటనే గలవు. నిన్ను నేఁబోనీను. మలయుచు నింకఁ బొమ్మాచూతము," అని బంకించెను. భయపడక నిలిచిన యర్జునునకు, నిజ రూపమున నింద్రుఁడు ప్రత్యక్షమై వరము వేడుమనెను. "శత్రువులను జయించుటకు బాణములు గౌరీశుచే ననుగ్రహింపఁ జేయుమని పార్థుఁడు ప్రార్థింప, నా యింద్రుఁ డతనిని దయాదృష్టితోఁ జూచి, "పంచబ్రహ్మ శైవ మంత్రము" నుపదేశించి, "కుమారా! ఈ మంత్రయోగ బలమున ధూర్జటి ప్రత్యక్షమై పాశుపత మొసఁగును. అంతలో, దేవతలఁగూడి నేను వచ్చెదను. నీ కోరికలెల్ల సిద్ధించు," నని చెప్పి దేవేంద్రుఁ డరిగెను.

ప్ర. 4:–అర్జును తపశ్చర్యను వర్ణింపుఁడు.

ఉ:– అర్జునుఁ డింద్రకీలాచలంబున, తాల, తమాల, రసాలాది వృక్షములతోఁ గూడిన యొక్క యాశ్రమ ప్రదేశమునఁ బద్మాసనంబున గూర్చుండి, హృదయ పద్మములో పశుపతి నునిచి మదికి నానంద తన్మయత నిచ్చుచు నొక్క నెల త్రిరాత్రోపవాసములను, తగ రెండు నెల లంతట తద్విగుణముగను, మూఁడు నెలలు పక్షోపవాసములతోడను, నాలుగు నెలలు కేవలము వాయు భుక్తి తోడను గడపి తరువాత నూర్ధ్వబాహుఁడై భూమిపై వ్రేల్మోపి ఘోరతరతప మాచరించెను.

ప్ర. 5:– అర్జునుని ఘోరతపమునుగాంచి మునులు శివునికడ కేగి యేమని ప్రార్థించిరి ?

ఉ :– "శర్వ! సర్వేశ! దయసేయవే! అర్జునుఁడు తపమాచరించు చున్న వాఁడు. అది తపమన్నఁ దపము కాదు. విష్టపము దాని యుద్ధతిచే భీమ ధూప కపట హాలాహలాక్రాంతమైనది. ఇంతట నీవు ప్రత్యక్షము గాకున్నచో నత్తపము జంతుసంతతినిఁ గాల్చును. నిమిషమాత్రములో వాఁడు నిలిపిన భక్తి బ్రహ్మకు పెద్దఘాలంబు వట్టును. సూర్యరశ్మి సోకదు. పక్షి వనంబు పై రాదు. నదులు ప్రవ

హించుటలేదు. భూత, భేతాళ, దనుజ, నిర్జరు లాతనిఁ జూడఁజాలరు. వేవేగ వచ్చి వరముల నొసఁగుము" అని మునులు ప్రార్థించిరి.

ప్ర. 6 :- ఈశ్వరుని కిరాతవేషము వర్ణింపుఁడు.

ఉ :- ఈశ్వరుఁడు, పార్వతియుఁ బ్రమథులును జూచుచుండఁగా, జొత్తార్చు కనులు, జుంజురు వెంట్రుకలు, కాటుకకొండవంటి దేహము, పికిలి పుంజముల దండయు, గవులుకంపు కొట్టుచుఁ గెంపుగదురు మీసములు, చిగురాకుల వస్త్రము, విఁడ్లు, అమ్ములు, ధరించి కిరాతుఁడై నిలిచెను.

ప్ర. 7 :- మూకాసురుని సూకరాకారమును వర్ణింపుఁడు.

ఉ :- ఆదివరాహము కదలివచ్చెనా? యనునట్లుగను, భూమికి దిగివచ్చిన మేఘమువలెను, నడచివచ్చు కాటుక పర్వతశిఖరము వలెను, నీశ్వరుఁడు గ్రక్కిన విషమా? యనిపించునట్లును, జూచిన దిశలెల్లఁ జుఱచురమండఁగ, నక్షత్రములు రాలగ, అడుగు వెట్టినచోట నగ్ని మొలవగ, రొప్పిన మ్రోత లురుములై తోఁప, డెక్కలతాకున గొప్ప గొప్ప పర్వతములు కదల, నడకచే భూమి కంపింప రోమములవలన పర్వత వృక్ష సమూహములు చాల కోలాహలమగునట్లుగా, ఘుర్ఘురమను భయంకరమైన అరపులు లోకభీకరములై వ్యాపింప, భువనభాండము మ్రింగఁబోవు చందముననుండి, కొమ్ములు దివికోటకొమ్మలు దాఁకి కొత్తడములు కూలిపోవ, పర్వతములను భేదించిన దేవేంద్రుని కుమారుఁడగు నర్జును నణఁగ ద్రొక్కుటకునై, పర్వతములన్నియు సూకరమై వచ్చెనా యనఁగ మూకాసురుఁడు, సూకరాకారమును ధరించి వచ్చెను.

ప్ర. 8:- వరాహమునకై యీశ్వరార్జునులు గావించిన కలహమును వర్ణింపుఁడు.

ఉ:- శివార్జును లిరువురు నా సూకరము నొక్కసమయముననే గొట్టిరి. అంత నాశరంబునఁ జచ్చె నా పందియనుచు, నీశానుఁ డచ్చోటికి నింతులతో వచ్చెను. గాండీవి వారినిఁ జూచి, "శబర! నీ బాణమేది? నీకు పందెక్కడిది? నీ వేపందినిఁ గొట్టితివో? ఇది నా శరము. ఇది నా పంది. నేల యీనినట్లు సందడిగా నీ సతులతో నిచ్చటికి రానేల? దూరముగాఁ బొమ్ము. పోకున్న ఘోరాస్త్రముల నిన్ను గూలుతు" ననెను. అంత, నందివాహనుఁడు నగుచు నర్జును జూచి, "నీవే గొప్ప పరాక్రమవంతుఁడవా? నీ వొక్కఁడవే యీ విశ్వమున విలుకాఁడవా? ఈపలి వారంత యెఱుఁగనివారు కాఁబోలు! వేసెవనఁటివి. నన్నేయుమా చూతము! నీకున్న నేర్పు, పరాక్రమము మాకు లేవనుకొంటివేమో!" అని శైలకార్ముకుఁ డమ్ము సంధించి, యర్జునుఁ డేయు వానిని లెక్క సేయక, బాణధారాభిషేకమున దేవేంద్ర సుతుఁడు శివుని ముంచెను. కాని, యవియన్నియు నభవు నంటక వ్యర్థము

లయ్యెను. అంత, నర్జునుఁ డాత్మ నచ్చెరువంది, "యితఁడు సామాన్యుఁడుగాడు. శబర వేషంబునఁ జరియించుచున్న దేవతయైయుండును. నా బాణములు వీని దెస చులకనై పోయినవి. వాని శరముల నేను నొచ్చితిని" అని విజృంభించి దివ్యాస్త్రములతో నా శబరునేయ నెంచి చూచునంతఁ గవదొనలు శూన్యములైన శంకించి, జంకక ధనువుఁ ద్రిప్పుచుఁ బాండుతనయుఁడు శివుని జటాజూటముపైఁ గొట్టెను. అంత, కాలకంధరుఁడు మేఘ మరనెల మ్రింగునట్లు నరుని కరమొడిసిపట్టెను. అర్జునుఁడు కరవాలమున శివునేయ నదియు వ్యర్థమయ్యెను. తరువాత నిరువురును ముష్టి యుద్ధమునకుఁ బూనిరి. అర్జునుఁడు మునులకుఁ బట్టరాని ముక్కంటిఁబట్టి పెనఁగి పడఁద్రోయలేక వక్షంబున మోమున తలపైన ముష్టిప్రహారంబులు గావించి యార్చెను. అంత శంకరుఁడు భూమిపై నింత చలమరినిఁ గాన ననుచుఁ దల దన్ని యర్జునుని మూర్ఛపుచ్చెను. ఈ విధముగ శివార్జునులు వరాహమునకై కలహంబుఁ గావించిరి.

ప్ర. 9 :- శివుఁ డర్జునునకుఁ బ్రత్యక్షమైన విధమేది?

ఉ:- మూఁడు కన్నులు, మిక్కుటమగు జడలు, పులితోలు, శిరమున చంద్ర వంక, పాము లాభరణములు, బుడిబుడి మను ఢక్క, పుఱ్ఱెల జన్నిదము, త్రిశూలము, సగదేహమున పార్వతి, ఎముకల పేరులు, గజచర్మము వస్త్రము, శిరమున గంగ, కరమున జింక, దేహమున బూడిదపూఁత, కలిగి పరమేశ్వరుఁ డర్జునునకు బ్రత్యక్షమయ్యెను.

ప్ర. 10:- అర్జునునకుఁ బాశుపతాది దివ్యాస్త్రములు లభించిన విధమును వివరింపుడు.

ఉ:- అర్జునుఁడు శివునిఁగూర్చి ఘోరతపము చేయుచుండెను. ఈశ్వరుఁడు క్రీడి బలపరాక్రమములఁ బరీక్షింపఁదలఁచి, కిరాత రూపమున వచ్చెను. సూకర విషయమున నిరువురకు పోరాటము జరిగెను. అర్జును పరాక్రమమునకు మెచ్చి యీశ్వరుఁడు నిజరూపముతో బ్రత్యక్షమై వరమును గోరుకొమ్మనెను. అర్జునుఁడు, "కౌరవులతో యుద్ధము రానున్నది; పాశుపతాస్త్రమును వరముగా నిమ్ము" అని ప్రార్థించెను. రుద్రుఁ డందుల కంగీకరించి పాశుపతాస్త్రము హోమ మంత్రములతో నిచ్చి, "నీకెదు రిక లేదు. నీచులమీఁద నీ యమ్ము తొడుగకు" మని చెప్పి యంతర్ధాన మయ్యెను.

హరు మేను సోకిన ప్రభావముచేత నర్జునుని దేహము దివ్యగంధము, బవిత్రము, శుభ కాంతియుతమునై యొప్పెను. అంత నింద్రుఁడు వహ్ని యమ వరుణ కుబేరాదులగు ముప్పదిమూఁడు కోటుల దేవతలతో విమానమున నేగుదెంచి, తమ కార్యమగు వసుధాభారహరణమును జేయుమని యర్జునునకు వజ్రాయుధము నొసఁగెను. యముఁడు సూర్యకాంతితో వెలుఁగొందు దండము

నొసఁగెను. అంత వరుణుఁడు వారుణాస్త్రమును, కుబేరుఁడు దైత్యమాయలనెల్ల మ్రింగు కౌబేరాస్త్రమును నొసఁగిరి. అర్జునుఁడు వారలకు నమస్కరించెను. వారు దీవించి దివికేగిరి. ఈ విధముగా నర్జునునకు పాశుపతాది దివ్యాస్త్రములు లభించెను.

## సందర్భ సమన్వయ వ్యాఖ్యలు

ఈ క్రిందివానిని సందర్భపూర్వకముగా వ్యాఖ్యానింపుఁడు :-

(1) "...... ఆ యీ యుపాయమున
నల్లన కొడుకున కవి యిచ్చు నతఁడు"

(పుట 38. పంక్తులు. 7, 8)

సందర్భము :-

'వేదవ్యాసాగమనము'ను పాఠములో ధర్మజునకు వ్యాసుఁడు ప్రత్యక్షమై యర్జునుని తపము నిర్వర్తింపఁ బంపుమనియుఁ, దన్మూలమున నింద్రుఁ డర్జునునకు దివ్యాస్త్రము లిచ్చుననియుఁ జెప్పు ప్రకరణములోని దీ వాక్యము.

అర్థము :- ఈ రెండుపాయములచేతను నింద్రుఁడు తేలికగా నర్జునునకు దివ్యాస్త్రముల నీయఁగలఁడు.

వ్యాఖ్య :- ప్రతిస్మృతియను మహావిద్యను ధర్మజుఁ డర్జునున కెఱిఁగించి తపమునకు బంపవలెనని వ్యాస భగవానుని ఆజ్ఞ. అందువలన దేవతలు మెచ్చి యర్జునున కఖిల శస్త్రములు నిత్తురు. ఇది యొక యుపాయము.

దీనికిఁ దోడింకొక రహస్యము వేదవ్యాసుఁడు ధర్మజునకుఁ జెప్పినాఁడు.

వృత్రాసురుని వలని భీతిచే దేవతలు తొల్లి తమ శస్త్ర బలమెల్ల నింద్రుని యింట నిల్లడచేసిరి. ఇప్పు డర్జునుఁడు తన తపస్సుచే దేవతలను మెప్పించినచో, దానినిఁ బురస్కరించుకొని యింద్రుఁడు ప్రత్యక్షమై, దేవతల శస్త్ర బలమెల్ల నాతని కీయవచ్చును.

ఇది వ్యాసునకు ధర్మమునందు గల పక్షపాతమును వెల్లడించుచున్నది.

అల్లన = సులభముగ.

(2) తపమన్నఁ దపమె! యుద్ధతి భీమ ధూమ
కపట హాలాహలాక్రాంత విష్టపము.

(పుట 41-పం. 25, 26)

సందర్భము :-

ఇంద్రకీలాచలము నందొక రమ్యప్రదేశమున నర్జునుఁడు ఘోరతపముఁ గైకొని యున్నాఁడని యచ్చోటి మునీశ్వరులు పోయి శివునకు నీ వాక్యముచే విన్నవించుచున్నారు.

అర్థము :- క్రీడి తపమున్న వాఁడనఁగా, నది సాధారణమైన తపముగాదు. పై కెగయుటవలన భయంకరమైన పొగ యనెడి యపూర్వపు హాలాహలముచే వ్యాపింపఁబడిన లోకము గలది.

వ్యాఖ్య :- భయంకరమైన ధూమ మర్జునుని తపమువలని యగ్నినుండి వెడలెనని చెప్పవచ్చును. ఆ పొగ యనెడి కృత్రిమపు హాలాహలముచే లోకమెల్ల నాక్రమింపఁబడినది.

విశేషము :- తాపసు లీశ్వరునితో జయవెట్టి క్రీడి తపమునుగూర్చి చెప్పుచున్నారు. అతని తపోగ్నివలన నేర్పడిన పొగయే రెండవ హాలాహలముగా నున్న దనుటచే హాలాహలము మెడయందుఁ దాల్చిన శివున కా యర్జునునిఁ జూడ వేగిర పాటు గలుగును.

హాలాహలము, హాలహలము, హాలాహలము (రూపాంతరములు).

అలంకారము :- రూపకము; 'తపమన్నఁ దపమె'- చక్కని నుడికారము.

(3) నిమిషమాత్రము వాఁడు నిలిపిన భక్తి
కమలసూతికిఁ బెద్దకాలంబు పట్టు.

(పు 42, పం-3, 4)

సందర్భము :-

'కిరాతార్జునీయము' నందు, తాను అర్జునునకుఁ బ్రత్యక్షముగానిచో, నాతని తపము జంతుసంతతినిఁ గాల్చుట నిజమని శివునితో తపస్వులు చెప్పుచున్న ఘట్టము లోని దీ వాక్యము.

అర్థము :- అర్జునుఁడు నిమేషకాలములోఁ బ్రకటించు భక్తి, బ్రహ్మకుఁ గూడఁ జాలకాలము పటఁగలదు.

వ్యాఖ్య :- బ్రహ్మ దేవతలకెల్ల జ్యేష్ఠుఁడు. అతఁడు తపోనిష్ఠాగరిష్ఠతకుఁ బెట్టినది పేరు. అట్టి బ్రహ్మనే ధిక్కరింపఁ గలిగియున్నది యర్జునుని తపస్సు. అందుచే తపస్వు లర్జునుని ఏకాగ్రతను పొగడుచు, త్వరలో లోకహితమునకుఁ గాను శివునిఁ బ్రత్యక్షముకమ్మని ప్రార్థించుచున్నారు.

నిమిషము = కనురెప్పపాటు కాలము.

కమలసూతి = పద్మమునందు జన్మించినవాఁడు-బ్రహ్మ.

పెద్దకాలము = చాల కాలము.

(4) మక్కువ నా పార్థు మనసులోఁ గాక
యిక్కడ మఱి యెంత యాశ! నీ యునికి ?

(పుట 42-పం. 9, 10)

సందర్భము :-

అర్జునుని యోగ నిరూఢినిగూర్చి చెప్పి, శివుని వెంటనే ప్రత్యక్షము గమ్మని మునీశ్వరులు లోకహితార్థమై యర్థించు సందర్భములో, 'కిరాతార్జునీయము' నందలి వాక్యమిది.

అర్థము :- "ఓ, శివా ! నీవు ప్రీతితో నర్జునుని మనస్సునం దుంటివే, ఆ యుండుటయే ఉండుటగాని, నామమాత్రముగ నిచ్చట నుండుట యొక యుండుటయా ?"

వ్యాఖ్య :— పార్థుని మనస్సునందే శివుఁడు యథార్థముగ నున్నాఁడనుటచే, నటు అర్జునుని గాఢభక్తియు, నిటు శివుని భక్తపరాయణతయు విదితము. మాచే వేడుకొనునట్లు చేయుటయే గాని, నీ వెట్లును బ్రత్యక్షము కావలెనని యుల్లాసపడనే పడుచున్నావని మునుల భావము.

పృథయొక్క పుత్రసంతానము గావున నర్జునునకు పార్థుఁడని పేరు. 'పృథ' కుంతికి నింకొక పేరు.

(5) ........యుగంబుల నాఁటి
ఖల దైత్య మృగ వేఁటకారుండు నిలిచె.

(పుట 42. పం-22, 23)

అర్జునుకుఁ బ్రత్యక్షము కమ్మని తన్నుఁ బ్రార్థించిన మునుల విజ్ఞాపనకు శివుఁడు, మాయాకిరాతుఁడై యర్జునునికడకు చెంచై వచ్చి నిలిచినాఁడని 'కిరాతార్జునీయము' నందు కవి చెప్పుచున్నాఁడు.

అర్థము :— దుర్మార్గులైన రాక్షసులనెడి మృగములకు వేఁటకాఁడని ప్రసిద్ధిఁ గన్న పురాణ పూరుషుఁడగు శివుఁడు (చెంచై) నిల్చెను.

వ్యాఖ్య :- యుగయుగములనుండియు శివునకు రాక్షసాంతకుఁడని ప్రసిద్ధి కలదు. రక్కసులనెడి మృగముల కీతఁడు వేఁటకాఁడు. ఆ వేష మాతనికి

గ్రొత్తదిగాదు. నేఁడుగూడ నదే వేష మర్జునునితోఁ బోరాడనెంచి ధరించి వచ్చినాఁడనుట.

ఖలదైత్య మృగము లనఁగా దుర్మార్గులైన రాక్షసులనెడి క్రూరజంతువులు. ఇందునే, అలంకారము- రూపకము.

వ్యా వి :- ఖలదైత్య మృగ వేఁటకారుండు. ఇది వైరి సమాసము. ముందు సంస్కృత పదములుండి తుదిలో "వేఁటకారుండు" అను తెలుఁగు పదమున్నది. ఇట్టివి ద్వివదకర్తలు, నందును శివకవులు చేసిన ప్రయోగములు పెక్కులున్నవి.

వేఁటకాఁడు-(రూ) వేఁటకారుఁడు.

(6) తొంటి వరాహంబు తొడరెనో యనఁగఁ,
గెంటక ధరకు డిగ్గిన మేఘ మనఁగ—

( పుట 43 - పం. 9, 10

సందర్భము:-

అర్జునుని పరాక్రమమును బరీక్షింపవలయు ననెడి వేడుకతో శివుఁ డింద్రకీలాచలమునకుఁ గదలివచ్చి సూకరాకృతితో నర్జునునిఁ దాఁకు మనుచు మూకాసురునిఁ బంపిన సందర్భములో 'కిరాతార్జునీయ' కర్త బట్టేపాటి తిమ్మనార్యుఁడీ వాక్యము చెప్పుచున్నాఁడు.

అర్థము :- ఆదివరాహము సమీపించెనో యనునట్లును, భగ్నము గాక భూమికిఁ దిగివచ్చిన మేఘమో యనునట్లును (సూకరాకారుఁడైన మూకాసురుడేతెంచినాఁడు.)

వ్యాఖ్య :- తొల్లిటి వరాహమనఁగా సుప్రసిద్ధమైన యాదివరాహము విష్ణుని యవతారము. అది యెదిరింప వచ్చుచున్నదో యనుట, జవసత్త్వములనదెలుపుటకు.

గెంటక యనఁగా చలింపక యనికాని, సంకోచింపక యనిగాని చెప్పవచ్చును. కాని మేఘము భూమికి భగ్నము కాకుండ దిగివచ్చుట కష్టము. రూపుచెడి నీరై భూమికి వచ్చుటయే గాని భగ్నపడక రాజాలదు. అందుచే గెంటక వచ్చిన మేఘమన్నప్పుడు, ఉన్నది ఉన్న రూపములో హఠాత్తుగ వచ్చినట్లని చెప్పకొనుట యుచితము.

ఇందు మూకాసురుని జవసత్త్వములును, నిస్సంకోచత్వ తీవ్రత్వములును సూచింపఁ బడినవి.

అలంకారము—ఉత్ప్రేక్ష.

(7) అద్రిభేది కుమారు నణఁపంగ వలసి
యద్రులెల్లను బోత్రియై వచ్చెననఁగ.

( పుట 43 - పం. 25, 26 )

సందర్భము :-

అర్జునుని బలపరాక్రమములను బరీక్షింపవలయు ననెడి వేడుకతో శివుఁ డింద్రకీల పర్వతమునకుఁ గదలివచ్చి సూకరాకారముతో నర్జునునిఁ దాఁకుమని మూకాసురునిఁ బంపిన సందర్భమునందుఁ 'గిరాతార్జునీయ' కర్త తిమ్మనార్యుఁడీ వాక్యము పలుకుచున్నాఁడు.

అర్థము :- అర్జును నోడింపఁ గోరి కొండలన్నియు నేకమై వరాహరూపము దాల్చి వచ్చెనో యనునట్లు- (మూకుఁడు వచ్చినాఁడనుట.)

వ్యాఖ్య :- ఇంద్రుఁ డొకప్పుడు కొండల ఱెక్కలను గూల్చెను. అవి పగ గొని యున్నవి. ఆ యింద్రుని కొమరుఁ డర్జునుఁడు. కాన, తండ్రిపైఁగొన్న పగ కుమారునిపైఁ దీర్చుకొననెంచి కొండలన్నియుఁ గూడి కుట్రచేసినట్లు చేసి వరాహ రూపము నొందినవా యన్నట్లుగ నున్నది మూకాసురుని భయంకర రూపమని కవి చమత్కరించుచున్నాఁడు. ఇందువలన నిందుత్ప్రేక్షాలంకారము కుదురు కొన్నది.

అర్జునుఁ డనుటకు నద్రిభేది కుమారుఁడు (కొండలఁ గూల్చిన యింద్రుని కొడుకు) అనుటవలన పై భావము స్ఫురించుచున్నది.

కావున 'నద్రిభేది కుమారుఁడ'న్నది సాభిప్రాయము. ఎక్కడ సాభిప్రాయ విశేష ముండునో యది పరికరము.

అందుచే నిందలి యలంకారము- పరికరము.

పోత్రి = (పంది) సూకరము.

మూకుఁడను రక్కసుని జవసత్త్వములును, భయంకరత్వమును దలఁపించుటయే కవి యుద్దేశము.

ఇందలి యలంకారములు: ఉత్ప్రేక్ష, పరికరము.

గమనిక :-

పంక్తి 26లో, 'నద్రులెల్లను' అని మీ పాఠ్యమున నుండుట అచ్చుపొరపాటు. 'యద్రు లెల్లను' అని యుండుట సాధువు.

(8) ......నదులు సముద్రంబు చొచ్చు
చంచున నది వోయి శంభునందణఁగె.

(పుట 45 - పం. 7, 8)

సందర్భము :-

వరాహమునకై పరమేశ్వరార్జునులు (ద్విపద భారతము-కిరాతార్జునీయములో) కలహించు సందర్భములో కవిచెప్పిన దీవాక్యము. శివుని బాణము లెక్కఁగొనక యర్జునుఁడు తన బాణధారాభిషేకముచే నతనిని ముంచివేయఁగా నేమి జరిగినదియు నిందు వర్ణితము.

అర్థము:- నదులు పోయిపోయి సముద్రమునందు లీనమగురీతిగా, నర్జునుని బాణధార శివునియందు లీనమయ్యెను.

వ్యాఖ్య:- దేవేంద్రసుతుఁడైన యర్జునుఁడు, శివుని తన బాణధారాభిషేకమునందు ముంచివేసినాఁడు. కాని యవి యెల్ల నభవునిలో లీనమైపోయినవి. ఆ లీనమగుట, నదులు సముద్రములో లీనమగుటవలె నున్నదని యిందుఁ జెప్పఁబడినది.

చంచున = రీతిగా (ఈ యర్థము సందర్భమునుబట్టి చెప్పుకొనఁబడినది. ఇట్టి శబ్దము (చంచు)నకుఁగాని, యిట్టి యర్థమునకుఁ గాని ప్రామాణికములైన ప్రయోగేతరములు మృగ్యము.)— ఇందలి యలంకారము—ఉపమ.

(9) ......ఎడపక వృష్టిగ్రహించు పర్వతము
వడవున మచ్ఛరావళి పీఁడుగొనియె.

(పుట 45 - పం. 15, 16)

సందర్భము:-

హరుని తూపులువచ్చి తన వక్షము నుచ్చిపోవునంత, నర్జునుఁ డాశ్చర్యము నొంది, యా శబరుఁడు సాధారణ శబరుఁడు గాఁడనియు దేవతా శ్రేష్ఠుఁడనియుఁ దలఁచుచున్నట్లు ద్విపద భారతమునందుఁ జెప్పఁబడినది.

అర్థము:- తొలఁగక పర్వతము వాన నేరీతిగ గ్రహించునో యారీతిగ నీతఁడు (ఈశ్వరుఁడు—లేక—శబరుఁడు) నా బాణ సమూహమును గ్రహించెను.

వ్యాఖ్య:- అర్జునుని బాణములు వర్షమువలె శివునిపైఁగురిసినవన్నమాట. ఐనను శివుఁడు పర్వతమువలె నచంచలుఁడై నిల్చుట ధీరత్వము. ఇందు శివుఁడు కొండతోడను, నర్జునుని బాణములు వానతోడను బోల్పఁబడినవి.

'వడువున' అని యుండవలెను. 'వడవున' అనుట తప్పు. వడువున అనఁగా వలె నని యర్థము.

మత్ + శరము = మచ్ఛరము (ఛత్వము-శ్చుత్వము). మచ్ఛర + ఆవళి = స. దీ. సంధి. కవియొక్క ప్రకృతి పరిశీలన మిందువలన వ్యక్తము.

ఈ పాదము '....పార్థుఁడు దారుణ బాణవర్ష మున్నతి నతివీరుఁడై కురిసినం బరముండు మహాంబువృష్టిఁ బర్వతము గ్రహించునట్లు, బలవంతుఁడు దాని గ్రహించి"-యనిన నన్నపార్యుని (అరణ్య- ప్రథ-ప. 311) పద్యమును స్ఫురణకుఁ దెచ్చుచు, మన కవి తిమ్మనార్యునకు, నన్నపార్యుని యెడఁగల, గురుభావమును వ్యక్తపఱచుచున్న దనవచ్చును.

ఇందలి యలంకారము-ఉపమ.

(10) కాల శోషిత వార్ధిగతిఁ గవదొనలు
చాల శూన్యములైన శంకించు మఱియు.

(పుట 45. పం. 21, 22)

సందర్భము :-

శివుని బాణములకు తాను నొచ్చియు, యుద్ధము మానరాదని నిశ్చయించుకొని, యర్జునుఁడు లక్షసంఖ్యల బాణములేసి యమ్ములపొదులు శూన్యమగుటకు సందేహము నొందుచున్నాఁ డన్న ఘట్టములో 'కిరాతార్జునీయ' కర్త పలికిన వాక్య మిది.

అర్థము :- ప్రళయకాలమునం దింకిపోయిన సముద్రమువలె తన యమ్ముల పొదులు శూన్యములు కాగా, (నర్జునుఁడు) శబరునిఁగూర్చి శంకించుచు,....

వ్యాఖ్య :- ప్రలయమువేళ సముద్రము లింకునని వర్ణించుటయు కవి సమయము. ఇచ్చట నక్షయ తూణీరములజంట కలవాఁడైన యర్జునుఁడు తన బాణములు క్షీణించుట కాశ్చర్యపడుచున్నాఁడు. దీనిచేత నితని నెదిర్చి పోరువాఁడు కేవలము శబరుఁడు కాఁడనియు, విబుధ విశేషమనియు సూచన.

దొన = అమ్ముల పొది. (ప్రకృతి-తూణము)

కవదొనలు = జంట యమ్ములపొదులు.

గతి = వలె.

అమ్ముల పొదులు అక్షయము లగునట్లు తొల్లి అర్జునునకు అగ్నిదేవుఁడు వరమిచ్చెను. అవి క్షీణింపవు. కావుననే యింకిపోని సముద్రముతో పోలిక చెప్పఁబడినది.

ఇందలి యలంకారము :- ఉపమ.

(11) అదియు సుభాషితం బవివేకి యెదుటఁ
జదివిన యట్లైన,

(పుట 46-పం-9, 10.)

సందర్భము :-

ద్విపద భారతము, కిరాతార్జునీయమున, వరాహమునకై పరమేశ్వరార్జునులు కలహించుచున్నపుడు, అర్జునుఁడు కోపించి తన కరవాలమును శూలిపైకి విసరఁగా, నది వ్యర్థమైనదని తిమ్మనార్యుఁడు చెప్పు సందర్భములోని దీ వాక్యభాగము.

అర్థము:-అర్జునుఁడా కిరాతుని (శివుని) పై రువ్విన కరవాలము, మూర్ఖునెదుట పఠింపఁబడిన నీతి వాక్యమువలె, వ్యర్థము కాగా,—

వ్యాఖ్య:—మూర్ఖునకు నీతి బోధించిన నెట్లు వ్యర్థమగునో, అట్లే యర్జునుని కరవాలపు రువ్వును గూడ వ్యర్థమైనదనుట.

ఇందు కవి చెప్పఁదలఁచిన యంశము అర్జునుని వ్యర్థప్రయత్నము మాత్రమే.

(మీ పాఠ్యమునందు, 'జదివిన యట్లయిన'- అనుటకు బదులు, 'జదివిన యట్లైన' అని యుండుటచే, ఛందో భంగము రాదు.)

"అవివేకి యందుఁ బ్రయుక్తంబులయిన సుభాషితంబులుం బోలె" నని నన్నపార్యుఁడు, (అరణ్య-ఆ1-వచనము 313) నిష్ఫలత్వమును బోధింపఁజెప్పినాఁడు. ఆ యుపమానమే ఈ కవియు స్వీకరించెను. ఇది కేవలము ఈ తిమ్మన నన్నయ్యయెడఁ జూపినట్టి ఆదర భావమును జెప్పుచున్నది.

సుభాషితము = నీతివాక్యము; అవివేకి = మూర్ఖుఁడు.

అలంకారము:—ఉపమ.

(12) "లవణాబ్ధి కలఁగె, శైలంబు లూటాడెఁ
దివిటి బ్రహ్మాండంబుఁ దిర్దిరఁ దిరిగె"—

(పుట 49. పం. 25, 26)

సందర్భము:—

శివుఁడొసఁగిన శర మర్జునుని చేతియందుఁ బ్రకాశించుచుండఁగా, ప్రకృతిలోఁ గల్గిన మార్పులను ద్విపద భారతకర్త బట్టేపాటి తిమ్మనార్యుఁడు వర్ణించుచున్నాఁడు.

అర్థము :- ఉప్పునీటి సముద్రము క్షోభపడెను (చలించెను). పర్వతము లూఁగాడినవి (వడకినవి). ఇష్టపడి (కావలెనని కోరి) బ్రహ్మాండమెల్ల దిర్ధిరమని తిరిగెను.

వ్యాఖ్య:-శూలి యింద్రజుఁడైన యర్జునకు శరమిచ్చెను. దానినుండి దట్టమైన కాంతులు వెల్వడినవి. ఆ కాంతి పుంజము ప్రకృతిపై తన ప్రభావము నిట్లు చూపుచున్నదని యీ వర్ణననుబట్టి గ్రాహ్యము.

సప్త సముద్రములలో లవణ సముద్రమొకటి. ఇది చలించుట యొక వింత. ఏదో మహావిశేషము లేని దిట్లు జరుగదు. పూర్ణ చంద్రకాంతికిఁ బొంగినట్టుగ నీ శరకాంతికిని సముద్ర ముప్పొంగెను.

సప్త కులపర్వతములు మున్నైనవి వణకినవి. పర్వతము లచంచలములు. అట్టివికూడ చలించెను. ఇంద్రుని వజ్రాయుధపు కాంతుల తరువాత, పర్వతములకు భీతియు వింతయుఁ గొలిపిన కాంతి యిది తప్ప మఱి వేఱులేదన్నమాట.

ప్రపంచమే దిరదిరఁ దిరుగుట, మహా విచిత్రమును సూచించును.

అర్జునుని బాణముల కాంతి (వాడిమి) యింతటిదిగావున భావికార్య సాధన సులభమని సూచ్యము.

అలంకారము:-అతిశయోక్తి.

(13) ఇది నేఁటి తపముగా దీతపంబునకుఁ
గదియునే నిను నంబికా ప్రాణవిభుఁడు.

(పుట 50. పం. 23, 24)

సందర్భము :-

శివుఁడు పాశుపత దివ్యాస్త్రము నిచ్చి వెడలిన పిమ్మట నర్జుననకు ముప్పది మూఁడు కోటుల దేవతలును బ్రత్యక్షమైరి. తన తపస్సు ఫలించెనని యతఁడు వారిని స్తుతించి, యేదైన యాజ్ఞ యిమ్మని వేడుకొన్న సందర్భములో, వారు సంతోషించి యీ రీతిగ నర్జునుని ధన్యతను మెచ్చుకొను చున్నారు.

అర్థము:-శివుని దర్శనము నొందఁగలిగిన పుణ్యము, కేవల మీ జన్మలోఁ జేసిన తపః ఫలముగాదు. ఈ యొక జన్మలోని తపస్సు మాత్రమునకే ప్రత్యక్షమగువాఁడు కాఁడు శివుఁడు.

వ్యాఖ్య:-అర్జునునితో తలపడి శివుఁడు పోరుట యనఁగా, నది బహుజన్మల తపఃఫలము. అంబికా ప్రాణవిభుఁడు శివుఁడు. అట్టివాఁ డామెను వీడి, యర్జునునితో సాధారణ పుణ్యమునకు కలియుట యరుదు. అందుచేత నర్జునునిది యసాధారణ పుణ్యమని దేవతల స్తుతి వాక్యము.

అలయక పెక్కు పదివేల సంవత్సరములు తొల్లి తపమొనర్చిన (నరుఁడను) మహాముని యర్జునుఁడని వ్యక్తము.

కవియుట = కలియుట, ఎదిరించుట, డీకొనుట.

ఇట్లే యీ దిగువ నీయఁబడిన వానిని గూడ మూఁడు ఘట్టములుగా విభజించి, సందర్భోచితముగ వ్యాఖ్యానించునది:—

(1) వారలెఱుంగని వాడి బాణములు
వారక యొక కొన్ని వలయు గాండివికి.

(పుట 37. పం 17, 18)

(2) మేల్గీడుఁ దెలియునే మెంౘైన యీడ!

(పుట 38. పం. 12)

(3) ఒండుచోటికిఁ బొందు హోమకాష్ఠములుఁ
బండ్లుఁ దీయనినీరుఁ బసఁ గల్గఁ జూచి.

(పుట 38. పం. 13, 14)

(4) నీకును లేవు ద్రౌణికిఁగల శరము
లాకారవుని నేర్పు లట్టివి గదను.

(పుట 38. పం. 25, 26)

(5) ఆ యస్త్రనుబ్బిన నటమీఁద దివిజు
లాయుధంబులు నీకు నర్థి నీగలరు.

(పుట 39. పం. 7, 8)

(6) 'నిలు, పోకు' మని మ్రోసె నింగి వాక్యంబు;
జలజల పుష్ప వర్షంబులుఁ గురిసె.

(పుట 39. పం. 21, 22)

(7) ఓ రాజ! విను మౌనులున్న యీ యడవి
ఘోరాస్త్రములు పూని క్రుమ్మరఁదగునె?

(పుట 40. పం. 1, 2)

(8) జంకించుటయు, బుద్ధిచలన మా నృపున
కంకురింపమి చూచి యాతండు మెచ్చి.

(పుట 40. పం. 7, 8)

(9) చాల రోమములఁ బర్వత వృతసమితి
కోలాహలంబుగా, ఘుర్ఘురాభీల
రవములు లోకభైరవములై చెలఁగ.

(పుట 43. పం. 19, 20, 21

(10) ఈ వొక విలుకాఁడ వీవిశ్వమునకు !
నీవలి వారంత యెఱుఁగని వారు !

(పుట 44. పం. 21, 22)

(11) దివ్యబాణము లెల్లఁ దెరువులు దప్పె
దివ్యచేష్టితమిది తెలియుచుండుదము.

(పుట 46. పం. 1, 2)

(12) ........ మేఘ మరనెల మ్రింగు
కరణి విల్లు గ్రహించి కాలకంధరుఁడు,........

(పుట 46. పం. 5, 6)

(13) వగవకు వింటికి వాడి తూపులకు
మగుడింత నాయందు మగ్నంబులయ్యె.

(పుట 47. పం. 11, 12)

ప్రతిపదార్థమునకు ముఖ్యమైన ద్విపదలు :-

"తొంటి వరాహంబు తొడరెనోయనఁగ........
........................................................
...................................... ఘుర్ఘురాభీల
రవములు లోకభైరవములై చెలఁగ—"

(పుట 43. పం. 9 నుండి 21 వఱకు)

# బుద్ధ చరిత్రము

## "యుక్తి"

### (చతుర్థాశ్వాసము)

(తిరుపతి వేంకటకవులు)

## కవి కాల కావ్యాదికము

కీర్తిశేషులు దివాకర్ల తిరుపతి శాస్త్రియు, చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రియు జంటగా తిరుపతి వేంకటకవులని వ్యవహరింపఁబడుదురు. వీరీ శతాబ్దిలో అవధానాశుకవిత్వములకు తిరిగి ప్రాణము పోసినవారు.

దివాకర్ల తిరుపతిశాస్త్రిగారి జననము ప్రజోత్పత్తి ఫాల్గుణ శుద్ధ దశమీ బుధవారము. వీరి జీవితకాలము 1871 నుండి 1919 వఱకు. వీరి తండ్రిగారి పేరు వేంకటావధాని; తల్లి శేషమ్మ. వీరి జన్మస్థానము పశ్చిమగోదావరి జిల్లా, ఉల్లిసీమలో ఎండగండి గ్రామము. వెలనాటి వైదికులు, హరితసగోత్రులు వీరు. వీరిది శిష్టాచార సంపన్నమైన పండితవంశము. వీరి తండ్రితాతలు సాంగ వేదాధ్యేతలు.

చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు తిరుపతిశాస్త్రిగారికంటె నొకయేఁడు పెద్ద; వీరి జననము ప్రమోదూత శ్రావణ శుద్ధ ద్వాదశీ సోమవారము వీరి జీవితకాలము, 1870 నుండి క్రీ. శ. 1950 వఱకు; ఎనుబదియేండ్లు. ఇది పూర్ణ పురుషాయుషమే కలియుగాన ననవచ్చును. వీరి తండ్రి కామయ్య; తల్లి చంద్రమ్మ. తూర్పుగోదావరి జిల్లాలోని 'కడియము' అను గ్రామము వీరి జన్మభూమి. (కంకణగ్రామ మని కడియమునకు వీరి సంస్కృతీకరణము.) ఇది రాజమహేంద్రవరమునకు సమీపమున నున్నది.

వీరు ఆరామద్రావిడ శాఖీయులు; భారద్వాజసగోత్రులు. వీరిది కవివంశము. తిక్కనదికూడ కవి వంశము కావుననే యాతనిని బోలిన కవి యాంధ్రమునలేఁడని తిరుపతిశాస్త్రిగారితో సైత మనుట కిందువలననే వీరు జంకెడివారు కాదు. కవి వంశములోని వారికే యా కవితాంశము మెచ్చు శక్తి ముమ్మరముగా నుండును. వేంకటశాస్త్రిగారి పినముత్తాత నరసకవిగారు; 'యామినీ పూర్ణతిలకా విలాసము', 'వేంకటేశ్వర విలాసము' మున్నగు కావ్యరత్నములు నరసకవిగారివి.

ఈ తిరుపతి వేంకటకవు లిర్వురకును కాశీపండిత, షట్ఛాస్త్రవేత్త శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రివర్యులు గురువులు. ఈ జంటకవులు భాష్యాంత వ్యాకరణ పండితులు.

నాయకరాజుల తరువాత మూఁడుశతాబ్దులు ద్వ్యర్థి, శ్లేష కవిత్వములతో నాంధ్రశారద కాలక్షేపము చేసినది. పందొమ్మిదవ శతాబ్ది చివరిలో రాజుల యాస్థానములయందు సంస్కృతమును, నగరములలో నాంగ్లమును భాసించెడివి. తెనుఁగున కందు స్థానములేదు. స్వర్గీయ దాసు శ్రీరామ్ములుగారు చెప్పినట్లు రామాలయముల మోసలలో పెద్దపెద్ద కరణములు రచ్చలుదీర్చి భారత భాగవతాదులు చదువును లోకవార్తలు చెప్పుచు, 'తెనుఁగు చాల మంచిభాష' అని చెప్పుకొనుట మాత్రమే కలదు. అట్టి దుష్కాలములో వీరు మనకు స్వస్థాన వేష భాషల యందభిమానమును కల్పించి, "భవదాశ్చర్యకరావధాన కవితా సంపత్తి" యనియు, "మీఁదై క్రిందైనారు కాకవు" లనియు, "మా గురు చెళ్లపిళ్లకుల మండను" ననియు, "స్తుతులు పరశ్శతమ్ములు, నుతుల్ వితతంబుగ" గొని, అష్టావధాన, శతావధానాశుకవిత్వములలో ననేక సంస్థానములయందు బిరుదులు పొందిరి. బాలకలానిధులు, బాలసరస్వతులు, కింకవీంద్ర ఘంటాపంచాననులు, శతావధానులు ననునవి వీరికి బిరుదములు.

19–20 ఏండ్ల వయస్సులో వీరొనర్చిన యశ్యద్భుతావధానమునకు కాకినాడ పౌరులు తొలుదొల్త వీరికి బ్రహ్మరథము పట్టిరి. తరువాత వీరి కీర్తి నలుమూలల గుబాళించినది. వీరు మెట్టిన చోటెల్ల సారస్వత తీర్థమయ్యెను. నానారాజ సందర్శనములు సాగినవి. జయపత్రికల నొందిరి. అన్నిటను శ్రీనాథాదులతో సామ్యము వీరికి కుదిరినది. "ఏనుఁగు నెక్కినారు, ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినారు; సన్మానము నొందినారు; బహుమానములన్ గ్రహించినారు". రాజులను భట్టురాజులవలె పొగడక విద్యాపోషణచే శాశ్వతకీర్తి గడింపుఁడని శ్రీనాథుని వలె నాశీర్వదించినారు; దుష్టరాజులను "ఇమ్మనుజేశ్వరాధముల" నన్న పోతరాజువలె శపించినారు.

వీరి కవితాశయములు కొన్ని వీరి సూక్తులను బట్టియే గ్రహింపఁదగును.

(1) "కవితా లతాంగికిన్ ధనము ప్రధానమా? రసికతాధికతా సుఖతల్ ప్రధానమా?"

(2) "కవుల మున్నటి రూల్సుకు కట్టుపడము,
ఘనులు పండితరాయాది కవులు చూపు
త్రోవలంబట్టి పోదుము దేవునైన లక్ష్యపెట్టము"

(3) "కాలముఁబట్టి దేశమును గాంచి......అన్యదేశాలను వాడుచుంటిమిక ........"

పై యుదాహరణలచే వీరిది స్వతంత్రతయు, ధీరతయు, నుట్టిపడు పలుకు అనక తీరదు. ఇటు చాటువులు, నటు ఛలోక్తులును నాఁటి సంస్కృతాంగ్ల పండితులను తెనుఁగునందుఁగూడ అభిమానపూరితులగునట్లు చేసినవి. క్రీ. శ. 1809-1903 వఱకు వీరు దీర్ఘసారస్వతసత్త్రము నిర్వహించిరి. అది యొక మరపురాని ఘట్టము.

తిర్పతికవి పోలవరమువారి యాస్థానిలో 1900 సం॥ నందు నాస్థానకవి. చెళ్లపిళ్లవారు బందరునందలి హిందూ పాఠశాలలో (1902) పండితులు. అప్పటికే వీరు సాగించిన రచన లీ క్రింద పొందు పరపఁ బడుచున్నవి.

i. సంస్కృతములో:—

1. కాశీసహస్రము, 2. ధాతురత్నాకరము, 3. శృంగార శృంగాట కాటాష్టకము;

ii. ఆంధ్రములో (కావ్యములు):—

1. దేవీభాగవతము (అనువాదము) 2. శ్రవణానందము, 3. లక్షణా పరిణయము, 4. ఏలా మాహాత్మ్యము, 5. బుద్ధచరిత్రము.

iii. ఆంధ్రములో నాటకములు (అనువాదములు)

1. మృచ్ఛకటికము, 2. ముద్రారాక్షసము, 3. బాలరామాయణము.

iv. ఆంధ్రమున స్వతంత్ర నాటకములు:—

1. పాండవనాటకములైదు, 2. దంభవామనము, 3. సుకన్యా పరిణయము, 4. పండిత రాయలు, 6. అనర్ఘనారదము మొదలైనవి.

v. ప్రబంధములు:—

1. పాణిగృహీత, 2. పతివ్రత, 3. శివభక్తి, 4. శివపురాణము, 5. సుశీల, 6. గోదాదేవి, మున్నగునవి.

vi. సాహిత్య వివాదములు:—

1. గీరతము, 2. గుంటూరు సీమ. (ఒక రకముగ నివి క్రొత్తలును, వీరరస విశిష్టములును నగు కావ్యములు.)

vii. స్వీయచరిత్ర:—

జాతకచర్య ద్వారమున వీరొక క్రొత్త పద్ధతిలో స్వీయచరిత్ర రచింపఁ బూనిరి.

"మారుమూల పదాలు గుప్పిన ముచ్చటగునే" అని వీరి హేళన. "తెలుఁగునకున్న వ్యాకరణ దీపము చిన్నది,—కావున లక్షణముకంటె లక్ష్యమే ప్రధానమ"న్నది వీరి వాదము. ఇది ఉపాదేయము కాఁగా, శ్రీ గిడుగు వారవలంబించిన వ్యావహారిక ప్రచారమనెఁడు సంస్కారమునకు వీరి ప్రహసనములును, శతకములును, పోద్బలకములు- ఇందువలననే వీరిని "ప్రాత కవితకు భరతవాక్యము పాడి, నవీన కవితకు నాంది పఠించినా" రనుట.

స్వర్గీయ వేంకటశాస్త్రి ప్రసంగనైపుణి, పద్య పఠనా విధానమును, వారి శిష్యులలో నీ దేశమున పెక్కుర కలవడినది. ఇటీవలివఱకును (తిరుపతి శాస్త్రిగారి మరణానంతరము సుమారు నలుబది యేండ్లు) శ్రీ వేంకటశాస్త్రిగారు ఆంధ్ర సాహిత్యము నేలిరి. అవధానమునందైనచో చెరియొక చరణము చెప్పుదురు. కాని, వారు పలికినట్లు, "ఒకరు రచించినం బరగు నొప్పుగ దిర్పతి వేంకటీయమై" అనుట వారి మిత్రధర్మాభిజ్ఞత. అట్టిది వారి సారస్వత మిత్రధర్మము. వేంకటశాస్త్రిగారికి నాంధ్ర విశ్వవిద్యాలయమువారు 'కళాప్రపూర్ణ' బిరుదము నొసఁగి, తమ్ము తాము గౌరవించుకొనిరి. అవిభక్త మదరాసురాష్ట్ర ప్రభుత్వము వారు వీరి కాంధ్రాస్థానకవి పదవి నొసఁగి గౌరవించిరి.

ఎన్నడో నలుబదియేండ్లనాఁడు దివాకరుఁ డస్తమింపఁగా, యిటీవలి వఱకు నిస్సపత్నముగా నలువది యేండ్లు కవితా సామ్రాజ్యము నేలి క్రీ. శ. 1950 మార్చిలో శ్రీ వేంకట శాస్త్రిగారు స్వర్గ మలంకరించిరి.

## ప్రస్తుత కథ : ప్రవేశిక

ఈ పాఠ్యభాగము తిరుపతి వేంకటకవుల 'బుద్ధ చరిత్ర' యందలి చతుర్థాశ్వాసములోనిది. ఈ కృతి పోలవరము జమీందారుఁడగు కొచ్చెర్లకోట కృష్ణారావుగారి కంకితముగ కూర్పఁబడినది. సంస్కృతమునందు ప్రసిద్ధిగన్న యశ్వఘోష మహాకవి చెప్పిన బుద్ధ చరిత్రమునకు, నీ తిరుపతి కవిద్వయము బుద్ధ చరిత్రకును సంబంధము లేదు. ఆంగ్ల భాషయందు సర్. ఎడ్విన్ ఆర్నాల్డ్ పండితుఁడు "Light of Asia" అను పేరిట బుద్ధుని జీవిత చరిత్రను కీర్తించినాఁడు. మన కవుల కాంగ్ల భాషలో పాండిత్యము లేదు. కాని బందరు వాస్తవ్యులు చావలి సూర్యప్రకాశరావుగారు (డి. ఇ. ఒ.) తిర్పతిశాస్త్రిగారి బావమఱది వఱస; వేంకటశాస్త్రిగారికి ప్రాణమిత్రము. వీరిర్వురును చావలి సూర్యప్రకాశరావుగారి సాహాయ్యమున నార్నాల్డు కవితాసంపద నభినందింపఁగల్గి, ఆతని ననుసరించుచు కొంత స్వతంత్రముగ తమ యీ బుద్ధచరిత్ర మను మహాకావ్యమ్మును నిబంధించిరి.

సర్వార్థసిద్ధుఁడు నళసారథమగు సంసారమును పరిత్యజించి, రాజగృహ సమీపమునయందున్న రత్నగిరిలో తప మొనరించుకొనుట యనల్ప కాలమ్మునన్నే,

యాతని ప్రభావమునుఁబట్టి యా వాడయందుగల జనులలోనెల్ల పొక్కినది. ఆ దినములలో ఘటిల్లిన యొక సన్నివేశమే ప్రకృతము మన పాఠ్యభాగమున కూర్పఁబడెను. జీవికి జనన మరణములు సైజమనియు, వానికై ఆక్రోశించుట వ్యర్థమనియు, యుక్తితో బుద్ధుఁడొక వృద్ధవనితకు బోధించుటయే యిందలి ప్రధానాంశము.

## ప్రతిపదార్థ తాత్పర్యములు

ప. 1 :- మంత్రులు = తన మంత్రులు, తిరమ్ముగన్ = స్థైర్యముతో, సుస్థితిన్ + తెల్పుచుండఁగన్ = పరిపాలనా సౌష్ఠవములను వెల్లడించుచుండఁగా, రాజగృహ + అభిధాన + నగరంబునన్ = రాజగృహ మనెడి పేరుగల పట్టణమును, కరంబు = మిక్కిలి; ఎంతేన్ = అధికముగా, కులీనులైన = ఉత్తమ (క్షత్రియ) వంశమునందుఁ బుట్టిన; రారాజులు + మూడిక్కన్ = (ఇతర లేక-పూర్వపు) చక్రవర్తులవలె, లలిన్ = అనురాగముతో (లేక-ఉత్సాహముతో), బింబిసారుఁడు + ఏలుచున్ + ఉండెన్ = బింబిసారుఁడు పరిపాలించుచుండెను.

తాత్పర్యము :- మంత్రులు తన సుస్థిర పరిపాలనా విధానమును బ్రకటించుచుండఁగా, పూర్వచక్రవర్తులను బోలి బింబిసారుఁడను చక్రవర్తి, రాజగృహమనెడి నగరమును రాజధానిగాఁ జేసికొని, ధర్మపరుఁడై ప్రీతితో నొకప్పుడు రాజ్యము పరిపాలించు చుండెను.

వ్యా. వి :- (1) రాజగృహ + అభిధానము = రాజగృహ మనెడి అభిధానము (పేరు) కలది = స. దీ. సంధి; బహువ్రీహి.

(2) రాజగృహాభిధాన నగరంబు = (విగ్రహ వాక్యము) రాజగృహ మను నభిధానముగల నగరము. విశేషణ పూర్వపద కర్మధారయము.

ఛందస్సు :- చూ. రాజసూయము, 15వ పద్య వ్యాఖ్య. పుట 23.

ప. 2 :- రత్నగిరి + కందరము = రత్నగిరియొక్క గుహ; భిక్షుకుని పగిది = బిచ్చగానివలె; అణఁగి యున్నాఁడు = మారు రూపమున నున్నాఁడు (మరుగుపడి యుండెను), మహానుభావుఁడు = గొప్పశక్తులు గలవాఁడు; వదంతి = ఆనోట నానోట చెప్పుకొను (చున్న) మాట.

తాత్ప :- రత్నగిరి యను కొండగుహాలలో నొక క్షత్రియ కుమారుఁడు బిచ్చగానివలె నున్నాడు; అతఁడు సర్వ శక్తులు గలవాఁడు, అనెడి వార్త, రాజగృహమువఱకు బ్రాకెను.

వ్యా. వి :- రత్నగిరి కందరము = ష. త.

ఛందస్సు :- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 3 :—తత్ + నగరమందు = ఆ పట్టణమునందు; అనద + ఒకర్తు = ఒకానొక యనాథస్త్రీ; తనుజుఁడు = పుత్త్రుఁడు; ఉపవనము = (అవ్య) వనమునకు దగ్గఱఁగా, క్రుమ్మరువాఁడు = తిరుగుచుండఁగా, చిల్వకాటు = పాముకాటు. గత + అసుఁడై = ప్రాణములు పోయినవాఁడై; పెను + వంత = మిక్కిలి దుఃఖము; చనినటుల్ = చనిపోయినట్లుగ (చనిపోయినంతనే).

తాత్ప :- రాజగృహమున నొక యనాథకలదు. ఆమె కొక్కఁడే కొడుకు. అతఁ డుద్యాన సమీపమున తిరుగుచు పాముకాటుచే మృతినొందెను. ఈ వార్త నాతనిమిత్త్రు లాతని తల్లికి నొకానొక ప్రొద్దున దెల్పిరి. ఆమె దుఃఖము నాపుకొనలేక,—

వ్యా. వి :- అనద-(వికృతి); అనాథ-(ప్రకృతి). తత్ + నగరము = తన్నగరము (అనునాసికసంధి). తను + జుఁడు = తన తనువునుండి జనించినవాఁడు (కొడుకు). చిలువ (చిలుము + వ) చిలుము = విషమును. వ = (వాయి) నోటి యందు గలది- అనఁగా, పాము. (చిలువ = బహువ్రీహి). గతాసుఁడు = బహువ్రీహి. చిల్వకాటు = ష. త; ఉదయంబు + అ = ఉదయంబ = ఉదయముననే- నిశ్చయార్థమునందు 'అ'కారము. అవ్వనిత = త్రికసంధి.

ఛందస్సు :- చూ. రాజసూయము. 9వ పద్య వ్యాఖ్య. పుట 16.

విశేషము :- ఈ పద్యమందలి నడక, తిక్కనార్యుని 'గౌతమీ లుబ్ధక సర్ప మృత్యుకాల సంవాదము' నందలి పద్యముల నడకను దలపించుచున్నది- (అను- ఆశ్వా 1.)

ప- 4:- పాము కతన = పాము కారణముగా (మూలముగ), ఆ + చోటు = అచ్చోటు, అచ్చొటు; కుల + ఆధారంబ = వంశాంకురమా!

విశేషము:-

ఈ పద్యమునందలి తుదిపాదము నడక కుంటివడియుండుట గమనించునది. ఆమె మనమునఁ బొగిలిన సంగతి; నర్థముచేతనే గాక, శబ్దముల యట్టి నడకచేతను గూడ, తెలుపుట శిల్పము.

వ్యా. వి :- (1) అచ్చొటు = [చూ. బా. వ్యా. సమాస. సూ. 14,15] (i) త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగా నగు. ఆ + చోటు = అచ్చోటు. (ii) కృత హ్రస్వంబగు త్రికంబుమీఁది చోటు శబ్దము నొత్వంబున కత్వ హ్రస్వంబులు విభాషనగు. (2) పోతె-పోతివే-పోతివి + వే = లిడ్లాట్టుల వ కారంబునకు లోపంబు విభాషనగు. (చూడు. బాల. వ్యా. క్రియా. సూ. 24.)

సమాసము :- కులాధారంబు = ష. త; సంధి :- కులాధారంబు = స. దీ. సంధి.

ఛందస్సు :- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ఛందో విశేషము :- ఇందలి వృత్తౌచిత్యము గమనింపఁదగ్గది. చింతాభరముచేత తూలు తల్లి నడక ఛందస్సుచేఁగూడ నిందువలన చూపఁబడెను.

ప. 5 :- వెండియు = తిరిగి, దురంత = అంతులేని, చింతా = దుఃఖము యొక్క, భరంబున్ = భారమును, బరువును; ఆపలేక = మోయఁజాలక; ఆ + పాపని = అప్పాపని = ఆ పసివాని, సబంబు పైఁబడి = శవముమీదఁ బడి.

వ్యా. వి :- దురంతచింత = కర్మధా; దురంత-భరంబు = ష. త;

సంధి :- అప్పాపఁడు = త్రికసంధి.

ప్రకృతి-వికృతులు :- ప్ర-శవము; వి-సబము.

ప. 6 :- నీవు నాకున్ + కల్గుటకు = పుత్త్రుఁడవై జన్మించుటకు; కంటిన్ = (కుమారునిఁగా) పొందితిని; చిటిపొటిమేను = (చిట్టిపొట్టి) సుందరమైన దేహము; కాఁడన్ + కఱచెన్ = కాఁడిపోవు (నాటు, గ్రుచ్చుకొను) నట్లుగా కఱచినది. (కాఁడు స బిందుకము), అక్కటికము = జాలి.

తాత్ప :- అయ్యో మున్ను నేనెన్నడు నొక కష్ట మెఱుఁగను; పెక్కు దైవములఁగొల్చి నిన్నుగఁటిని. పెద్ద భూతమువంటి యీ పాము నీ యందమైన దేహమును గాఢముగా కఱచినది. ఇది యెక్కడి పామోగాని యించుకయు జాలి లేనిది.

అలంకారము :- స్వభావోక్తి. (పుత్త్రిమరణవార్తా శ్రవణ దురంత చింతాక్రాంతయగు తల్లి దుఃఖమిందు సహజ రీతిని వర్ణింపఁబడినది.)

ఛందస్సు:- చూ. రాజసూయము. 9వ పద్య వ్యాఖ్య. పుట 16.

ప. 7 :- పేర్మిన్ = ప్రీతితో; కేళిమై = ఆటలయందాసక్తుఁడవై; నట్టనడి పూలతోఁట = పూఁదోఁట నడిమి భాగమునందు; ఫణా + ధరంబు = (వ్యు: పడగ కలది), తొలి బాము = పూర్వజన్మ పాపమువలనఁ గల్గిన బాధ.

విశేషము :-

ఇందుఁ బుత్త్రిశోకము బహుసహజముగా వర్ణింపఁబడినది.

వ్యా. వి :- నడు + నడు = నట్టనడు = ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులం దొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నడంతంబగు ద్విరుక్తటకారంబగు.

(చూ. బాల. వ్యా. సంధి. సూ. 40). 'నడుము' శబ్దమునకు, వృత్తి (సమాసమున) యందు, 'ము' వర్ణము లోపింపఁగా, మిగిలిన రూపము 'నడు'.

నానా :- బాము = జన్మను; బాధ (దుఃఖము)

కవితా విశేషము :- ఇటు తల్లి యేడ్చుచున్నది; అటు కథ వివరింపఁబడుచున్నది. ఇది కథన శిల్పము.

అలంకారము :- 'పాము గాదది నా తొలి బాముగాని'- ఇందలిది అపహ్నవాలంకారము.

ఛందస్సు:- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

గమనిక :-

'పాముగాదది నా తొలిబాము గాని' — ఇది సందర్భ సహితవ్యాఖ్యకు ముఖ్యము.

ప. 8:- కళేబరము = శవము; వాడజనంబుల్ = వీథి యందలి జనము (స. త.)

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 9 :- మార్జనులన్ + మంత్రించువారు = చీఁపురుకట్టలతో మంత్రించుచున్నవారు. (వేపమండలు మొదలగు వానితో వలెనే, చీఁపురు కట్టలతో గూడ మంత్రించు కొన్ని మంత్రములు, కొందఱు మాంత్రికులును గలరు.) కల్కము = (కలికము) కంటిలోనికి మందు పేరు. వనపత్త్రిములు = అడవి యాకులు నలములు; పుర వైద్యశాల = పట్టణమునందలి వైద్యాలయము; భేషజనీరములు = మందునీళ్ళు. (ద్రవరూపముననున్న యౌషధములు); గళమునన్ + ఒలుకువారు = నోటిలో పోయువారు. (ఒలుకు = ఒలికించు).

విశేషము :—

మరణ సన్నివేశమును, శవమును వచ్చి చూచిపోవు వారి దృశ్యమును సహజముగ నీ పద్యమునందు వర్ణితము-

వ్యా. వి :— ఒలుకు = ఒలికించు (ఒలుకునట్లుచేయు)- ఇచ్చట నిది యంతర్భావిత ప్రేరణము; దుటదుట = పకపకటయందగు కన్నీటి ధ్వని.

అలంకారము :- స్వభావోక్తి.

ఛందస్సు :- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 10 :- విష = విషమును; నివర్తన = పోగొట్టు; ఉపాయమ్ములు = పద్ధతులు; మృతపుత్త్రి = (విగ్రహ) మరణించిన పుత్త్రిని (కొడుకును) గలది- బహువ్రీహి సమాసము-

ప. 11 :- ఈ నగర = ఈ పట్టణమునకు, సమీప = దగ్గఱలోనున్న, అరణ్యానిన్ = పెద్దయడవి యందలి, రత్నగిరి + కందర + అంతరమున = రత్నగిరియను కొండయొక్క, గుహాల, లోపల; అన్యూన + అనుభావుఁడు = (న్యూనము కాని) తక్కువగాని ప్రభావము గలవాఁడు; ఒక్క + యతీనుఁడు = ఒక్కయతీ (మునీ)శ్వరుఁడు, అతండు + అతీంద్రియుఁడు = అతఁడు ఇంద్రియ గోచరము గాని శక్తులు కలవాఁడు.

తాత్ప :- ఈ యూరి నంటుకొనియున్న యడవిలో గల రత్నగిరియను కొండయొక్క గుహలో నొక మహానుభావుఁడు కలఁడు. అతఁడతీంద్రియశక్తి సంపన్నుఁడైన యతీశ్వరుఁడు.

వ్యా. వి :-(1) న + న్యూనము = అన్యూనము. (నఞ్ తత్పురుషము). (2) యతి + ఇనుఁడు = యతీనుఁడు (స. దీ. సంధి); (3) అతి + ఇంద్రియుఁడు. (స. దీ. సంధి); (4) సమీప + అరణ్యానిన్ = స. దీ. సంధి. అరణ్యాని = మహాదరణ్యము, లేక, మహారణ్యము; యతి = ఇంద్రియ నిగ్రహము గలవాఁడు.

సమాసము :- అన్యూనానుభావుఁడు—బహువ్రీహి.

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 12 :- ఈ మృతకాయము = నీ కొడుకు శవము, కళేబరము; కరుణ + ఆభరణుండు = దయయే భూషణముగా గలవాఁడు: కడఁకన్ = పూనికతో.

తాత్ప :- "నీ పుత్త్రుని శవ మాతని యొద్దకుఁగొని పొమ్ము; చాల సమర్థతయు, కరుణయు, గలవాఁడగుటచే, నతఁడీ కుమారుఁడు బ్రతుకు నుపాయము చెప్పును" అని వారు చెప్పఁగా నా తల్లియు, పట్టుదలతో—(తర్వాతి పద్యముతో నన్వయము).

వ్యా. వి :- మృతకాయము = కర్మధారయము.

సంధి:- కరుణాభరణుండు = స. దీ. సంధి.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 13 :- మృత + పుత్త్రి + కళేబరమున్ = చనిపోయిన కొడుకు దేహమును: అక్కజము + ఎదన్ + నించు + వికారమునన్ = ఆశ్చర్యమును గొల్పు మనోవికృతితో; కుజముల నీడలకున్ + చనుచున్ = చెట్ల నీడలయందు నిల్చుచు; కూరినవంతన్ = నిండిన దుఃఖముచే—

తాత్ప :- ఆ ముదుసలి, బరువైన పుత్త్రుని శవమును భుజముపై వైచుకొన్నది; ఆమె దేహము వడకుచుండెను; కన్నులనుండి సంతతధారగా నశ్రువు

లురులుచున్నవి. అచ్చెరువు గొల్పు మనోవికారముచే, కొడుకా ! యని యేడ్చుచున్నది. మిక్కిలి విచారముతో నిండిన గుండెగలదై కాలు కాలకుండ చెట్లనీడల నిల్చుచు పోవుచుండెను.

వ్యా. వి :- బాష్పము + కాల్వలు = (i) కర్మధారయంబులందు ము వర్ణకంబునకుం బు,ంపులగు. అందుచే బాష్పపు + కాల్వలు-(బా వ్యా. సం. సూ. 32.)

(ii) సమాసంబుల నుదంతంబులగు స్త్రీ సమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు. (బా. వ్యా. సం. సూ. 25) దీనిచే, బాష్పపు + ను + గాల్వలు.

(iii) పిమ్మట ద్రుతకార్యములు.

బాష్పపుఁ గాల్వలు (అర్ధబిందు రూపము).

ఛందస్సు :- ఇది కవిరాజ విరాజితమను వృత్తము. దీనిలో- న, జ, జ, జ, జ, జ, జ, వ, గణములుండును. ప్రతిపాదమునను 8, 14 అక్షరములు యతి మైత్రి స్థానములు. ప్రాసముండును.

వ్యుత్పత్తులు :-

కు + జము = భూమినుండి పుట్టినది (చెట్టు)

గమనిక:-

ఈ కవిరాజ విరాజితమునందలి మొదటిపాదము [భుజముపయి న్మతపుత్రి....] ఛందస్సునకు చాలముఖ్యము.

ప. 14 :- కుసుమపేశలమైన = పూవువలె మృదువగు; మూఁపుపైన్ = భుజముమీఁద; బిట్టు + అడలు = మిక్కిలి శోకించు (రోదనముచేయు, ఏడ్చు); ఫణా + ధరము = పాము; ఒఱలు దానిన్ = దొరలు (దొర్లు) నట్టి తల్లిని; సారెన్ + తిట్టు దానిన్ = మాటిమాటికి దేవుని దూఱు దానిని; పుణ్య + ప్ర + చారున్ = పున్నెపు మార్గమునఁ బోవువానిని; నగంబులన్ = చెట్లను (కొండలను కూడ ననవచ్చును); కరణము + ఒలయన్ = జాలి కలుగఁగా.

తాత్ప :- పూవువలె మృదులమైన యా పాపని మోయుచు వాని భుజముపై నాతల్లి కన్నీ రోడ్చుచున్నది: నన్ను విడిపోతివా, కుమారా! యని యేడ్చుచున్నది: నేను చేసికొన్న పాపమే నిన్ను పామై కఱచినదిరా, తండ్రీ ! యని పొరలుచుండెను; దైవమున కేమియు నే నపకారము చేయలేదు; ఆ మాల దైవమేల నన్నిట్లు చేసెనని తిట్టుచున్నధి. ఓ చెట్టులారా ! నా కొడుకును బ్రతి

కించు పుణ్యాత్ముని చెప్పెదరా! యని యడుగుచుండెను. దుఃఖితయైన యిట్టి తల్లిని సిద్ధార్థుఁడు చూచినాఁడు.

వ్యా. వి:- చెప్పన్+కద+రు+అమ్మ = చెప్పఁ గదరమ్మ. (చూ. ప్రౌఢ. వ్యా. క్రియా. సూ. 9); కుసుమపేశలము = ఉపమాన పూర్వపద కర్మధారయము.

ఛందస్సు :- చూ. రాజసూయము-6వ పద్య వ్యాఖ్య-పుట 13.

ప. 15 :- ఏ కతమున = ఏ కారణము వలన, తనయుండు+ఈల్గె = కొడుకు మరణించెను; గహనమునకున్ = ఈ యడవికి, అని+ఆడిన = అని ప్రశ్నింపఁగా, పెల్లుగన్ = మిక్కిలి; దురటిల్లుచున్ = దురపిల్లుచు, లేక-శోకించుచు.

విశేషము :

దురటిల్లు = దురపిల్లు (దుఃఖించు) దురపిల్లు, దురటిల్లు—అను రెండు రూపములును వ్రాఁత ప్రతులలో నున్నవి. ఈ యుభయ విధములగు రూపములలో 'దురపిల్లు' అను రూపమునే పెక్కు నిఘంటువులు స్వీకరించినవి. 'దురటిల్లు'-రూపమునకు నిర్ధారకమైన ప్రామాణిక ప్రయోగము లభింపలేదు.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 16:- కసిమసఁగెన్ = చంపెను; ఒకండు + అ = ఒకండ = ఒకఁడే [ఏవార్థకమునందు అకారము]; నిసువున్(గున్) = పాపని; ఇగ్గిరిన్ (ఈ+గిరిన్) = ఈ కొండయందు.

కవితా విశేషము:- అర్థసంగ్రహత యందును, తడబడు నా తల్లి పల్కులఁ దలపింపఁజేయు కుంటునడక యందును, నీ కందము తిక్కన నోటినుండి యూడిపడినట్లున్నది.

వ్యా. వి :- నిసువు-నిసుఁగు = తెలుగు పదముల తుదియందుఁగల వ, గ, వర్ణములకు గ, వ. వర్ణములును వచ్చును. (ఉ:- వేసవి - వేసఁగి). తపస్వి- (ప్ర)- తపసి; (వి)

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 17:— తత్+అర్థంబు+అ = అందుకొఱకే, నా + వచ్చుట = నేను వచ్చుట, నేను వచ్చితిని; అలందురుచున్ = దుఃఖించుచు, నందన శోకంబునన్ = కొడుకు వలని దుఃఖముచేత; ముందఱ + వ్రాలు = ముందు చాగిలపడు, నాతిన్ = స్త్రీని, భూతదయా+పారీణుఁడు = భూతదయ యందు (తుదముట్టిన వాఁడు) మేటి.

వ్యా. వి:- నందన శోకము = ష.త. సమాసము.

వ. 18:- నేను + అ = నేన = నేనే; మనః + హార + ఆకారున్ = మనస్సున ఆకర్షించు రూపముగలవానిని, భవత్ + కుమారున్ = నీ యొక్క కొడుకును త్రుటికాలమునన్ = క్షణములో, సర్షపములు = ఆవాలు; ఒయ్యనన్ = కొంచెము వేగమే, ఇద్దారుణిన్ + ఉంచుము = ఇచ్చట నేలపై పరుండఁబెట్టుము. ఏను = నేను సవిధమ్మున = సమీపమున (నుండి), నీవయి + కాచుచుండెదన్ = నీ యంతః శ్రద్ధతో కాపాడుచుండెదను.

తాత్ప :- పురజనులు నీకు చెప్పిన ఆ తపసిని నేనే. నీ కుమారుని నిముష ములో బ్రతికింపఁగలను. కాని, మీయూరికేగి యొక కొన్ని ఆవాలు తెమ్ము నీ కొడుకు శవము నిచ్చట నుంచుము. నేను కాపాడుచుండెదను.

విశేషము :-

సర్షపములు, సరిషపములు = ఆవగింజలు (తెల్లావాలని కొందఱు). సర్ష పము యొక్క క్రూసిఫరే కుటుంబములోనిది. దీని పుష్పమునందలి ఆకర్షణ పత్ర ములు క్రాసు గలిగి నాలుగు ఉండును.

వ్యా. వి :- (1) మనస్ + హార = మనోహార = అసంతపదసంధి (2) మనోహార + ఆకారున్ = స. దీ. సం.

ఛందస్సు :- చూ. రాజసూయము. 15వ పద్య వ్యాఖ్యా. పుట 23.

వ. 19:- జననీ = తల్లియు, జనక = తండ్రియు, పతి = భర్తయు, పుత్త్రి = కుమారుఁడును, ఆదుల = మొదలగు వారియొక్క, మరణమ్మునన్ = మృతివలన ఎన్నఁడును = ఎప్పుడును, ఆపన్నులుగాని = విపత్తు నొందని, పౌరుల యింటి కిన్ + చని = పురజనుల యింటికి పోయి, ఆవలు = ఆవాలు, యాచించి = అడిగి తేవలయున్ + చుమీ = తీసికొని రావలెను చుమా!, సర్వార్థ సిద్ధుని వచనంబులు = బుద్ధభగవానుని మాటలు, కు + తల + శాయిన్ + చేసి = భూమి ప్రదేశముపై పరుండునట్లుగా నుంచి; (కు = భూమి), కలతెఱంగు + నొడివినన్ = ఉన్న సంగతి చెప్పఁగా; తనయ = తన పుత్త్రిని, ఉత్ + జీవన = బ్రతికించుకొను విషయము నందు, త్వర + ఆయమాన = త్వరపడుచున్నట్టి, మానస = మనస్సుగలది, అగు + ఆపెకు = అగునట్టి యా తల్లికి.

వ్యా. వి :- తనయోజ్జీవన ... మానస = బహు వ్రీహి; కుతల శాయి = స. తత్పురుషము.

వ. 20:- **(M. Imp.)** జననంబున్ = పుట్టుటయు, మరణంబు = చచ్చు టయు - ననునవి, జంతువులకున్ = ప్రాణులకు (జీవము గలది-జంతువు; పశు పక్షి మనుష్యాది.) నెల్ల, స్వాభావికమ్ము = సహజము (నైజము) లయి యున్నవి

ఏరికిన్ = ఎవ్వరికిఁగాని, ఎల్లి = రేపు అనునది, నిజంబు + కాౌనె = వచ్చునని నమ్మిక యున్నదా ?, సుఖంబులు + ఎక్కడివి + తల్లీ = ఓ యమ్మా, సౌఖ్యము లనునవి యీ లోకమున నుండునా?, ప్రయోజకున్ = చేతి కందినవానిని, సు + జన + మందారంబున్ = మంచివారికి కల్పవృక్షము వంటివానిని, చెట్టు + అంత + వానినిన్ + పుత్త్రిన్ = ఎదిగిన కుమారుని, దిగ్రమింగి = చంపుకొని, ఏఁటికి + యేఁడాదియైననున్ + కాలేదు = తిన్నఁగ నొక యేఁడాదియైనను తిరిగి రాలేదు. ఱాయి కరణిన్ = కటిక పాషాణమువలె, జీవించి + ఇట్లు + ఉండనే! = ఈ రీతిగ బ్రతికియుండలేదా ?

తాత్ప :- చావుంబుట్టుకలు ప్రాణులకెల్ల తప్పవు. తమకు ఱేపు అనునది నిశ్చయమని యెవ్వరును చెప్పలేరు. (బ్రతుకు సంశయమనుట.) ఈలోకమున సుఖంచుటకై పుట్టము. చేతి కక్కఱకువచ్చిన చెట్టంత కొడుకును మ్రింగి ఱాయి వలె చలింపక నేను జీవించుట చూడవా ?

విశేషములు :-

(i) ఏఁటి కేఁడాదియైనను కాలేదు. } చక్కని
(ii) చెట్టంతవానిని } నుడికారములు

ఈ పద్యము కరుణరస స్ఫోరకము. పుత్త్రి శోకోపహతయైన మాతదైన మానసిక వృత్తికి, పలుకుబడికి నీ పద్యము నిధానము.

ఛందస్సు :- చూ. రాజసూయము. 8వ పద్య వ్యాఖ్య. పుట 15.

గమనిక :- ఈ పద్యము ప్రతిపదార్థమునకు ముఖ్యము.

ప. 21:- ఆవలకున్ + ఏమి భాగ్యము = ఆవాలకు కొదవలేదు; కావలసినన్ = కావలెనన్నచో; కుచ + ప్రావారమున్ = పైఁటను; తడుపఁగన్ = తడి చేయఁగా; గృహిణులు = ఇల్లాండ్రు.

విశేషములు :-

(i) కుచ = స్తనముల యొక్క, ప్రావారము = ఉత్తరీయము. (పైట) ష. త., (పైఁట) ప్రవరము, ప్రావారము, ప్రావారకము = (రూపాంత.) ఉత్తరీయము.

(ii) ఆవలకు నేమిభాగ్యము = ఇది చక్కని నుడికారము.

ఛందస్సు :- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 22:- పరమ నిర్భాగ్యురాండ్రు = మిక్కిలి దురదృష్టవంతురాండ్రు; తారుణ్యమందు + అ = యౌవనమునందే, పెద్ద నిద్దుర + పడసినన్ = మృతినొందఁగా;

చూలు = గర్భము; కోల్పోయి = పోగొట్టుకొని, వంతచే = దుఃఖముచేత, చూలెంతరాండ్రు = బాలెంతలు; మారి = మశూచికము, కసిమసంగిన = చంపినట్టి, అడలు = శోకించు; స్వ + తంత్ర + ఆండ్రు = స్వతంత్రురాండ్రు = నిరాధారలు (దిక్కులేని స్త్రీలు); కరణిన్ = రీతిగా; సిద్ధార్థములు = తెల్లావాలు. ఆత్మ = తనయొక్క, శిశు = బిడ్డని, మరణ = చావు వలని, దుఃఖ = శోకమనెడి, వార్ధిన్ = సముద్రమును, శుష్కింపన్ + చేయన్ = శోషింపఁ (ఇంకిపోవునట్లుగా) జేయుటకై.

తాత్ప:- పిల్లలు ముందుపోఁగా బ్రతికియున్న తల్లులును, యౌవనముననే వైధవ్యము నొందినవారును, గర్భముపోయి చింతించువారును, తల్లిదండ్రుల చిన్ననాఁడే కోల్పోయిన దీనురాండ్రును, అగపడిరేకాని శోకమనునది యెఱుఁగని వారొక్కరైన నా నగరమున (ముందునకుకూడ) నగపడరైరి.

విశేషము:-

స్వతంత్రురాండ్రు = నిస్సహాయలు అను నర్థమునఁ బ్రయోగింపఁబడినది.

వ్యా. వి:- దుఃఖవార్ధి = (విగ్రహ) దుఃఖమనెడివార్ధి (శోక సముద్రము) రూపకసమాసము.

ఛందస్సు- చూ. రాజసూయము. 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

ప. 23:- ఆవలన్ = ఆవాలను; వెలంది = స్త్రీ యొక్క; పుత్త్ర + శోక + అగ్ని = కొమరుని మరణమువలని శోకమనెడి నిప్పు; ప్రాక్తన = వృద్ధురాండ్రైన, పౌరీ = పురస్త్రీల (పౌరాంగనల), హృదయ = గుండెలయొక్క, నలక = ఎముకల (శల్యముల)లో, గుప్త = అణఁగిమణఁగియున్నట్టి, ఘన = గొప్పదైన, శోక = దుఃఖమనెడి, హత + చూర్ణమును = నలిగియున్న పొట్టును (గూడ), రగిల్చెను = రగులుకొల్పఁగలిగెను- [లేదా, 'ప్రాక్తన' అను పదమును 'ఘనశోకము' నకు విశేషముగాఁ జేయవచ్చును.]

వ్యా. వి:- (1) పుత్త్రశోకాగ్ని; (2) ప్రాక్తన—....చూర్ణంబునున్ రూపక (తత్పురుష) సమాసములు.

ఛందస్సు:- చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

ప. 24:- తత్ + నగర = ఆ పట్టణమునందలి, నికేతనములకు = గృహములకు, ఆపన్నులు తామెన్నడు గాకున్న = ఎన్నడుగాని విపత్తుల నొందని (శోకమెఱుఁగని), కుటుంబినుల = గృహిణులను.

వ్యా. వి:- కాక + ఉన్న = కాకున్న. [అత్తునకు సంధి బహుళముగానగు. చూ. బా. వ్యా. సం. సూ. 4]

ఛందస్సు :— చూ. రాజసూయము. 1వ పద్య వ్యాఖ్య. పుట 6.

వ. 25:- ఖిన్న + అగుచు = [ఖేదము] దైన్యము నొందినది అగుచు; రాజ పుత్త్రి + అధిష్ఠితంబు + అగు = రాచకొమరుఁడైన సిద్ధార్థునిచే నివసింపఁబడు చున్న (బుద్ధుఁడు నివాసమున్న), గిరి + కందరంబునకున్ = కొండయొక్క గుహకు; కడచిన = జరిగిన, వృత్తాంతము = విషయము, కథ; అల్లనన్ = మెల్లఁగా, నగుచు = నవ్వుచు.

వ్యా, వి:-రాజపుత్త్రాధిష్ఠితము = తృ.త; గిరి కందరము = ష. త; అమ్మ గువ = త్రికసంధి.

వ. 26:- సర్వ + సామాన్యంబు = ఎల్లరకు సాధారణమైనది; నీయంత నీకు గోచరముగాన్ = అనుభవముచే బోధపడుటకై; ఈ యుక్తి + చలిపినాఁడన్ = ఈ పన్నుగడ పన్నినవాఁడను; ఈ + దృశ = ఇట్టి (ఇటువంటి), దారుణ = భయంక రమైన, ఖేదమ్ములకున్ = పుత్త్రిశోకము మొదలగు బాధలకు; గతమ్ము + ఎద్దియో = కారణమేమియో; సాహసము = తెగువ; బోధించి = తేటతెల్లము చేసి, ఆపెన్ + అంపి = ఆమెను పంపివేసి, సానువులయందు = కొండచఱియలలో; రాజసుతుఁడు = (క్షత్త్రియుఁడైన) బుద్ధుఁడు, ప్రాక్ + గతిన్ = పూర్వము (మును పటి)వలెనే; ఒక్క పరి = ఒకసారి; అజ + అవి + పటలి = ఆఁడు మేఁకలయొక్కయు, గొఱ్ఱెల యొక్కయు సముదాయము, గోపకులన్ + కాంచెన్ = గొల్లవాండ్రను చూచెను.

తాత్ప:- "చావనునది యెల్లరకు సాధారణము. దుఃఖమనుదాని నెఱుఁ గని ప్రాణియుండుట అరుదు. ఈ విషయము నిజమని నీయంతట నీకు అనుభవము లోనికి రావలెనని యీ పన్నుగడ పన్నితిని. ఇట్టి ఘోర విచారములకు కారణ మేమో తెలిసికొనఁగోరియే నేనును, త్రిమ్మరుచున్నాను. లోకముయొక్క శోక మునకు హేతువు నరయుటయందు ప్రాణత్యాగమునకు నైన వెనుదీయను." అని యా తల్లికి బోధించి, యామెను నగరమునకుఁబంపి, సిద్ధార్థుఁడు, తాను మును పటివలెనే రత్నగిరియొక్క చఱియలలో నివసించుచు, నొక్కనాఁడు, ఆఁడుమేఁక లను గొఱ్ఱెలను త్రోలుకొనిపోవు గొల్లవానిని గాంచెను.

వ్యా. వి:- యుక్తి + చలుపు = ప్రథమము మీఁది పరుషములకు గసడద వాదేశముచేత, 'యుక్తి సలుపు' అను రూపము సిద్ధించినది. అజ + అవి + పటలి = ష. త; అజావి = స. దీ. సం; దారుణ ఖేదము = కర్మధారయము; గిరిసాను వులు = ష. త; ప్రాక్ + గతి = ప్రాగ్గతి (మునుపటివలెనే) = జశ్త్వ సంధి; ఒక్క + పరి = ఒకసారి (మరి, తూరి, పర్యాయము- రూపాంతరములు). వెన్ + పడిన్ = వెంబడిన్; వెంబడిన్ + చనెడు = వెంబడిఁజనెడు = ద్రుత కార్యములు.

ఛందస్సు:- చూ. రాజసూయము- 6వ పద్య వ్యాఖ్య. పుట 13.

# ప్రశ్నోత్తరములు

I. 'యుక్తి' యనుపేరు మీ పాఠ్యమున కెట్లు తగియున్నది?

లేదా

'యుక్తి' యందలి కథను సంగ్రహింపుఁడు.

లేదా

"సర్వప్రాణులకును సాధారణములైన జననమరణములఁగూర్చి దుఃఖించుట నిరర్థకమ"ని బుద్ధుఁడెట్లు/నిరూపించెను?

లేదా

ఎన్నండును నావన్నులుగాని మానవులుండరని మీ "యుక్తి" యెట్లు ధ్రువపఱచినది?

రాజగృహమును రాజధానీ నగరముగఁ జేసికొని బింబిసారుఁడు తన దేశము నేలుచుండెను. ఆ దినములలో రత్నగిరి గుహాలయందుండి భిక్షాటన మొనర్చుకొనుచున్న సిద్ధార్థుఁడు మహానుభావుఁడని వదంతి యెల్లెడ వ్యాపించినది.

ఆ కాలములోనే యొక యనాథ స్త్రీ రాజగృహమున నివసించుచుండెను. ఆమె కొక్కఁడే కొడుకు. ఆతఁడు పాముకాటువలన మరణించినాఁడు. ఈ వార్త విని పుత్త్రుని శవమున్నచోటికిఁబోయి యా వృద్ధ స్త్రీ యేడ్చియేడ్చి పామును, దైవమును, తన్నునుగూడ దూఱుకొనుచుండెను.

ఆమె నూఱడింపవచ్చిన పౌరు లనేకు లనేక ప్రకారముల సేదదీర్చుచుండఁగా, వారిలో గొందఱా మెకు సిద్ధార్థుని యన్న్యానానుభావమునుగూర్చి చెప్పిరి. యతీనుఁడు, నతీంద్రియుఁడు, కరుణాభరణుఁడు గావున నీ పుత్త్రుని బ్రతికింపఁగలఁడనియుఁగూడ వారు బోధించిరి.

వారి బోధనలనుబట్టి పుత్త్రుని భుజమున మోచుకొనిపోయి యామె సిద్ధార్థుని ముందుంచినది. ఆతఁడు ప్రశ్నింపఁగా నామె యేడ్చుచు యావద్వృత్తాంతమును విన్నవించెను. విన్నవించి, సిద్ధార్థుఁడను మహాత్ము నెఱిఁగింపుమన్నది. దానికి నతఁడు తానే సిద్ధార్థుఁడననియు, నా పాపను బ్రతికించుట యొక కష్టముగాదనియు, నామె జననీ జనక పతి పుత్త్రాదుల మరణమ్మువలన నెన్నఁడు నావన్నులుగాని పౌరుల యింటినుండి యావలు యాచించి తేవలయునేగాని వానిని మంత్రించి యాపాపని బ్రతికింతుననియుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

ఆ తల్లి, పుత్త్రుని శవము సిద్ధార్థునికడ పదిలముగనుంచి, పురికేగి, యింటింట నావలకొఱకై యాచించి చూచినది. సుఖము లెక్కఁడివి తల్లీయని కొందఱును,

చెట్టంతకొడుకును దిగమింగి యేటికేడాదియైనను కాలేదు, ఊయివలె జీవించి యున్నామని మఱి కొందఱును కుమారిలఁ జొచ్చిరి.

ఆ పురియందెచ్చటఁ గనుఁగొన్నను కన్నబిడ్డలనెల్ల గంగపాలొనర్చి బ్రతికిన నిర్భాగ్యురాండ్రును, యౌవనమునందే వైధవ్యముచే కుందు దురదృష్టవంతు రాండ్రును, రాకరాకవచ్చిన చూలు గోల్పోయిన చూలెంతరాండ్రును, పసితనము నందే తలిదండ్రులఁ గోల్పోయిన దీనురాండ్రును నగపడిరేగాని యావాల నిచ్చు వారు కానరాలేదు.

ఆ నగర గృహములలో వెదకివెదకి వేసారి యెన్నడు నాపన్నులు గాని వారినే యా మాత కనుఁగొనఁజాలకపోయెను. ఇట్లు కడచిన వృత్తాంతము నెల్ల సిద్ధార్థున కావనిత విన్నపింపఁగా నతఁడామెతో నిందలి పరమ సత్యము నిట్లు చెప్పెను.

"మృత్యువనునది యెల్లరకును తప్పనిది. దుఃఖమెఱుఁగని వారీలోకములో నుండరు. ఈ సత్యమును నీ కనుభవములోనికిఁ దేవలయుననియే యీ యుక్తి పన్ని యాపన్నులుగాని వారినుండి యావలు తెమ్మంటిని. లోక మనుభవించుచున్న యీ దారుణ దురంత దుఃఖమునకు కారణము నెఱుఁగుటలో నేను తనువునైన త్యజింపనున్నాను."

అనివార్యమైన మృత్యువునకు హేతువును, దాని నివారణోపాయమును తెలిసికొనవలెనేగాని, దానికి దుఃఖించుట నిరర్థకమని యీ యుపాయముచేత సిద్ధార్థుఁడా వనితకు బోధింపఁగలిగినాఁడు. ఇందుచే "యుక్తి" యను శీర్షిక మా పాఠమునకు నార్థకము.

**II.** 'యుక్తి' యను పాఠములోని మాతృ దుఃఖమును వర్ణింపుము. లేదా—"యుక్తి"—కరుణరస స్ఫోరకమని నిర్ధారింపుము.

రాజగృహమను నగరమునందొక యనాథ స్త్రీ యుండెను. ఆమెకొక్కఁడే కొడుకు. వాఁడు పాముకాటువలన మరణించినట్లు విని, యా శవమున్న చోటున కేగి యామె నోరు నెత్తి మోఁదుకొనుచు తన్ను విడనాడి చనిన పుత్త్రుని శవంబుపైఁబడి యిట్లు విలపించినది:

"అయ్యో! నేను చిన్నపుడొక కష్టమునైన నెఱుఁగను. నీకై యనేక దేవతలను సేవించి సేవించి యెట్టకేలకు నా నోములు పండ నిన్ను సుతునిగాఁ బడసితిని. కొడుకా! నీ చిటిపొటి మేను గాఁడఁగఱచిన యీ పెనుభూతము వంటిదిది యెక్కడి కాలసర్పమో!

... తోడి బాలురతోఁగూడి నీవాటలకు పోఁగా నిన్నా పూలతోఁట యొద్ద నీపామేల కఱచినదిరా తండ్రీ!"

ఈ రీతిగ దురపిల్లు తల్లి మొరవిని యా యిరుగుపొరుగు వాడ జనము పరుగున వచ్చి యెవరికిఁదోఁచిన మందులు మాకులు వారు ప్రయోగించి, విష నివర్తనోపాయమ్ములనేక ప్రకారముల నారసియు, వ్యర్థులైరి. పిదప వారామెతో నా నగర సమీపారణ్యానియందు రత్నగిరి కందరములలో నొక యతీశ్వరుఁడున్నాఁడనియు, నాతనికి ప్రాణప్రదానము చేయు నతీంద్రియ శక్తు లున్నవనియుఁ దెలిపిరి.

భుజముపై మృతపుత్త్రి కళేబరము మోచుకొనుచు, మేను గజగజలాడ, కన్నుల నీరు, గాల్వలై ప్రవహింప, హా పుత్త్రా! యని వందురుచు, నెండకు చెట్ల నీడలలో నాగుచు, నామె-యా మునీశ్వరుని డాసినది.

ఆమె తన పుత్త్రిని శవము మోయుచు దాని మూఁపుపై జల జల కన్నీరు జార్చుచుండెను. ఇచ్చట నన్నొంటరిగా విడిచి నీవు పోయితివా తనయా! యని యడలుచున్నది. నా పాపఫలమే ఫణాధరమై నిన్ను గఱచెరా కొడుక! యని పొరలుచుండెను. ఆ మాలదైవమునకు నేనేమి యపకారము చేసితినని దైవమును తిట్టు దూఱుచున్నది. ఓ, వృక్షములారా! నా తనయుని బ్రతికించువారినిఁ జూపరా? యని యడుగుచు కుమారిలుచుండెను.

సిద్ధార్థుఁడీ వృద్ధురాలినిఁ గని, దురపిల్లుచున్న యామెవలన సర్వము నెఱిఁగి తనయోజ్జీవన త్వరాయమాన మానసఁగా నామెను గ్రహించి యందుల కొక యుపాయము చెప్పి పంపినాఁడు.

ఈ విధముగ నా వృద్ధురాలి దుఃఖము, మనకును శోకము దెప్పించి, యామె యెడ జాలి గల్గునట్లుఁ జేయుచున్నది. కావున నీ పాఠ్యభాగమునందలి రసము, శోకస్థాయియైన కరుణ మనక తీరదు.

## సందర్భ సమన్వయ వ్యాఖ్యలు

ఈ దిగువ వానిని సందర్భసమన్వయ పూర్వకముగ వ్యాఖ్యానింపుడు:—

(1) పాము గాదది నా తొలి బాముగాని.

(పుట 54 ప. 7, పంక్తి 4)

సందర్భము:—

'యుక్తి' యను పాఠములో తిరుపతి వేంకట కవులు చిత్రించిన వృద్ధురాలు, పుత్త్రిశోకమున దురపిల్లుచు నిట్లు తన్నుఁదా నిందించుకొనుచున్నది.

అర్థము:—పూర్వజన్మలో నేను చేసికొన్న పాపముల ఫలము (బాధ) గాని, యా నిన్ను గఱచినది పాముగాదురా తండ్రీ!

వ్యాఖ్య:-తాను చిన్ననాఁటి నుండియుఁ గష్టముల నెఱుఁగననియు, నీ కుమారునిఁ బొందుటకే యనేక కష్టములఁ బడితిననియు గతమునెల్ల కష్టదశలో స్మరించుకొను నీ తల్లి దుఃఖము మిక్కిలి సహజముగ చిత్రింపఁబడినది. ఒక వంక నామె వ్యసనమును వర్ణించుచు, నామె శోకము నాధారముగఁగొని కవీశ్వరు లిందు కథనుగూడ సాగించుట కథన శిల్పజ్ఞత.

(2) "అ-న్యూనాను భావుఁ డొక్క య
తీనుం డున్నాఁ డతం డతీంద్రియుఁ డెందున్."-
(పుట 54. ప 11, పం. 2, 3, 4)

సందర్భము :-

"యుక్తి" యను పాఠమునందుఁ బుత్త్రి శోకోపహతయైన వృద్ధమాత ననేకరీతుల నోదార్ప కొందఱు యత్నించుచుండఁగా, మఱి కొందఱు, తమ నగర సమీపారణ్యాని యందలి రత్నగిరి కందరములలో సిద్ధార్థుఁ డుండుటను గూర్చి చెప్పు సందర్భములోనిది యీ వాక్యము.

అర్థము :- తక్కువగాని ప్రభావములుగల యొక యతీశ్వరుఁ డున్నాఁడు. అతఁ డతీంద్రియ శక్తి సంపన్నుఁడు.

వ్యాఖ్య :- కరుణామయుఁడును, మహానుభావుఁడునునై కూడ భిక్షుకుని వలెనున్న సిద్ధార్థుని యింద్రియాతీతములైన శక్తి సామర్థ్యముల నుగ్గడించి, యా పౌరులా వృద్ధమాతను, తన పుత్త్రిని బ్రతికింపవలసినదిగా సిద్ధార్థునిఁ బ్రార్థించునట్లుఁ బ్రోత్సహించుచున్నారు. దీనివలన సిద్ధార్థుని మాహాత్మ్యము సువ్యక్తము.

ఇది కందపద్య పాదము. తిక్కన కందమునకు పెట్టినది పేరు. అవధానాశుకవిత్వములలో సిద్ధహస్తులైన కీ. శే. తిరుపతి వేంకటకవుల కన్ని వృత్తములును వశవర్తనము గలవే యైనను, కందమును నడపు నొడుపునందు వీరు తిక్కయజ్వవలె చేయి తిరిగినవారు.

అర్థసంగ్రహతకై ఆ కుదించుట, అలతి యలతి పదములకై జతుకాష్ఠమును వలె ఆ విరచుట, మున్నగు నేర్పులన్నియు తిక్కనవే వీరికి పట్టుపడినవన్న తప్పు రాదు. "తిక్కనదంతయు కక్కుల కళ్లమే' యన్న నుడికి తార్కాణమైనది, యీ కందమునందలి యక్షరరమ్యత నెఱుఁగని ఆర్థికత.

వ్యా. వి :- న + న్యూనము = అన్యూనము (తక్కువ కానిది = అధికమైనది.) నఞ్ తత్పురుషము.

అన్యూనానుభావుడు; యతి + ఇనుఁడు; అతి + ఇంద్రియుఁడు = స. దీ. సంధులు. యతీనుఁడు = విశేషణోత్తరపద కర్మధారయము. 'ఇన' పదము శ్రేష్ఠ వాచకము,

ఇట్టి నడకగల కందమును చదువునోడుపు కీ. శే. తిరుపతి వేంకటకవులకు వెన్నతోబెట్టిన విద్య.

మఱి కొన్ని యీ దిగువ నీయఁబడిన వాక్యములకుఁ గూడ, పై రీతిని మూఁడు ఘట్టములుగా విభజించి, సందర్భసహిత వ్యాఖ్యలు రచించునది.

(1) అంత యక్కటికము లేకపోయెఁ గొడుకా!
కడ కెక్కడి కాలసర్పమో !

(పుట. 53. పద్యం 6–పంక్తి 4)

(2) పుర వైద్యశాలకు నరిగి భేషజనీర
ములు దెచ్చి గళమున నొలుకువారు.

(పుట 54–ప. 9, పం. 7, 8)

(3) తదర్థంబ నావచ్చుట. (పుట 56, పంక్తి 5)

(4) పౌరులు నీకుఁ జెప్పిన తపస్విని నేన చుమీ. (పుట 56, ప 18, పంక్తి 1)

(5) పుత్త్రి నిద్దారుణి నుంచు మేను సవిధమ్మున నీవయి
కాచుచుండెదన్.

(పుట 56, ప 18, పం. 4)

(6) చెట్టంత వానిని బుత్త్రిం దిగమ్రింగి, ఱాయి కరణిన్
జీవించి యిట్లుండనే!

(పుట 56, ప 20, పం. 4)

(7) ఆవలకు నేమి భాగ్యము. (పుట 56, ప 21, పం 1)

(8) ....(వెలంది) పుత్త్రిశోకాగ్ని రవి
ల్చెను బ్రాక్తన పౌరీ హృద
య నలక గుప్త ఘనశోకహత చూర్ణంబున్

(పుట 57, ప 23, పం, 2, 3, 4 )

(9) మరణంబు సర్వసామాన్యంబు, దుఃఖంబు
గాంచని వారు లోకమున లేరు.

(పుట 57. ప 26, పం. 1, 2)

(10) .... తెలియుటకై ప్రాణ
మైనను విడుచు సాహసము కలదు,

(పుట 58, ప 26, పం. 7, 8)

# కావ్యసుధాలహరి

## పద్యభాగము

## ప్రశ్నపత్రిము

1. ఈ దిగువ పద్యములకుఁ బ్రతిపదార్థ తాత్పర్యముల నిమ్ము:-
   (i) రయ విచలత్...... (పుట 6 - ప - 33.)
   (ii) అట చని కాంచె...... (పుట 32 - ప - 32)

2. శిశుపాల ధర్మరాజుల సంవాదమును గాని, కృష్ణుని సమర్థించిన భీష్ముని చైద్యుఁడుపాలంభించిన విధానమును గాని వర్ణింపుఁడు.

3. భీష్మ శిశుపాలుల శీలములను గాని అంబరీష దుర్వాసో మహామునుల శీలములను గాని ఉట్టంకించునది.

4. ప్రవరుని శీలము, లేదా, సిద్ధాగమనము: దాని ప్రయోజనమును బరామర్శింపుము.

5. మీ "కిరాతార్జునీయము"ను బట్టి యర్జునుఁడు దివ్యాస్త్రముల నొందిన తెఱఁగుఁ గాని, 'మరణంబు సర్వసామాన్యంబ'ని సిద్ధార్థుఁడు నిరూపించిన విధానమును గాని, సంగ్రహింపుఁడు.

6. ఈ దిగువ వానిని సందర్భ పూర్వకముగ వ్యాఖ్యానింపుము :-
   (i) దాశార్హుండు పూజార్హుఁడే! [ఆంధ్రదీపిక - పుట 71.]
   (ii) వృద్ధుల బుద్ధులు సంచలింపవే! [ఆంధ్రదీపిక - పుటలు 71, 72]
   (iii) మహా దారుణమది విషము కంటె దహనము కంటెఁ...... [ఆంధ్రదీపిక - పుటలు 72, 73]
   (iv) కుడువకుంటగాదు, కుడుచుటయునుగాదు, సలిల భక్షణంబు సమ్మతంబు...... [ఆంధ్రదీపిక - పుట 120]
   (v) అదియు వ్యాళంబు వెనుకొను దవానలంబు...... [ఆంధ్రదీపిక-పుటలు 120, 121]
   (vi) మదకుంభి కైవడిఁ వలలకు జిక్కి (ఆంధ్రదీపిక- చూ. అంబరీషోపాఖ్యానము - సందర్భ పూర్వక వ్యాఖ్యలు)

(vii) అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁ జేవ.

(viii) భోగ భాగ్యమయ్యెఁ బూచిన సంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె.

(ix) ఎఱుకలు గట్టుకొన్న మఱి యేండ్లును
బూండ్లును బట్టు.... ....

(x) పుడమి తిలతండుల న్యాయమున వెలుంగ

(xi) దైవకృతమున కిల నసాధ్యంబు గలదె?

(xii) బుద్ధిజాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్.

(xiii) పాఱవై చితె మిన్నులు పడ్డచోట.

చూ. ఆంధ్ర దీపిక- సందర్భ సహిత వ్యాఖ్యలు- మనుచరిత్ర

(xiv) తపమన్నఁ దపమె! యుద్ధతి భీమ ధూమ
కపట హాలాహలాక్రాంత విష్టపము....

(xv) ......యుగంబుల నాఁటి
ఖల దైత్య మృగ వేఁటకారుండు నిలిచె...

(xvi) అద్రిభేది కుమారు నణఁపంగ వలసి
యద్రు లెల్లను బోత్రియై వచ్చె ననఁగ...

(xvii) ...నదులు సముద్రంబు చొచ్చు
చంచున నది వోయి శంభు నందణఁగె...

(xviii) ఎడపక వృష్టి గ్రహించు పర్వతము
వడువున మచ్ఛరావళి పీఁడు గొనియె...

(xix) అదియు సుభాషితం బవివేకి యెదుటఁ
జదివిన యట్లైన.... .... .... .... .... ....

చూ. ఆంధ్ర దీపిక- సందర్భ సహిత వ్యాఖ్యలు- కిరాతార్జునీయము

(xx) పాము గాదది నా తొలి పాము గాని.

(xxi) తదర్థంబ నావచ్చుట........

(xxii) పుత్త్రిని - ద్దారుణుని నుంచు మేను
సవిధమ్మున నీవయి కాచుచుండెదన్

(xxiii) చెట్టంత వా-నిని బుత్త్రిం దిగమ్రింగి
ఱాయికరణిన్ జీవించి యుట్లుండనే!....

(xxiv) అవలకు నేమి భాగ్యము...

(xxv) ............పుత్త్రి శోకాగ్ని రవి
ల్చెను బ్రాక్తన పౌరీ హృద
య నలక గుప్త ఘనశోకహత చూర్ణంబున్

చూ. ఆంధ్ర దీపిక- సందర్భ సహిత వ్యాఖ్యలు- బుద్ధ చరిత్రము

ఈ క్రిందివాని ఛందస్సుల వివరింపుఁడు.

(i) మత్తకోకిలము. (ఆంధ్రదీపిక—పుట. 10. పద్య 4)

(ii) తరలము. (ఆంధ్రదీపిక-పుట 37, పద్యము 35)

(iii) ద్విపద. (చూ. ఆం. దీ. కిరాతార్జునీయ పీఠికలో 'ఛందస్సు-ద్విపద' అను శీర్షిక.)

(iv) కవిరాజ విరాజితము. (ఆం. దీ.-"యుక్తి"లో 13వ పద్య వ్యాఖ్య చూచునది.)

# గద్యభాగము

# 1. పాదుకాపట్టాభిషేకము

## (షష్ఠాంకము)

(కీ. శే. శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు)

[కాలము: 1865–1940;
నివాసము: పిఠాపురం - తూ॥ గో॥ జిల్లా]

కీ॥ శే॥ శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి దాధునికాంధ్ర వాఙ్మయమునందొక విశిష్టస్థానము. వారి "సాక్షి" యుపన్యాసములను బోలిన రచనలు నాటికి నేటికి మఱల రాలేదన్నచో వారి వ్యక్తిత్వమును వేఱుగా వివరింపఁ బని యుండదు. హాస్యము ద్వారా నీతిని మనసునకు నాటఁజెప్పుట వారికి సాధ్యమయినట్లు మఱొకరికి కాలేదనుట సత్యమునకు దగ్గరిమాట. సాక్షి రచయితగాఁ బంతులుగారెట్టి విశిష్టస్థానము నాక్రమింతురో యట్టి విశిష్టస్థానమే నాటక రచయితగా వారు సంపాదించినారనుటలో నతిశయోక్తి లేదు. వారెంతటి సూటిగా విమర్శించు విమర్శకులో అంతటి భక్తులు. ఇందుకు వారి నాటకములు కొన్ని సాక్షి.

పంతులుగారు సాక్షినేగాక రాధాకృష్ణ, సారంగధరచరిత్ర, విప్రనారాయణ చరిత్రము, పాదుకాపట్టాభిషేకము మున్నగు నాటకములను, హాస్య వల్లరి మున్నగు నితర రచనలను గావించిరి. ప్రస్తుత పాఠ్యభాగము వారి పాదుకాపట్టాభిషేకములోని యాఱవయంకము.

పాదుకాపట్టాభిషేకమునకు వారే పట్టభంగ రాఘవమను నామాంతరమును గూడ నుంచిరి. దీనికి మూలము రామాయణము. ఈ నాటకమునందు వారక్కడక్కడ రామాయణమును జదువు వారికిఁగలుగు శంకలకు సమాధానములను గూడ సూచించుచు రచనము సాగించిరి.

దశరథుఁడు శ్రీరామునికి పట్టాభిషేకము చేయవలెనని ముహూర్త నిర్ణయము చేయించినాఁడు. ఆ సమయమున భరతుఁడు శత్రుఘ్నునితోఁగూడ తన మేనమామగారింటికి వెళ్ళియుండెను. శ్రీరాముని పట్టాభిషేకవార్త అందఱకు నానందమును కలిగించెను. ఆ యానందము ననుభవింపక యసూయ చెందిన దొక్క మంథరయే. అది తన యజమానురాలు కైకేయికి దుర్బోధచేసి యామె నెట్లో రామ వనవాసమును భరతపట్టాభిషేకమును దశరథునికడ వరములుగా నడుగుట కంగీక

రింపఁజేసెను. కైక దశరథునకుఁ బూర్వము శంబరాసురుని తోడి యుద్ధమునఁ దాను చేసిన యుపకారమున కాతఁ డొసఁగిన వరద్వయము నిప్పుడిమ్మని కోరి రామ వనవాసమును భరతుని పట్టాభిషేకమును గోరెను. దశరథుఁడు హఠాత్తుగా నీ మాటవిని మిక్కిలి దుఃఖితుఁడయ్యెను. రాముఁడు తానే మాతాజ్ఞ చొప్పున వనమునకు బయలుదేరెను. లక్ష్మణుఁడు సీత ఆతని ననుసరించి వనమునకు వెడలిరి. దశరథుఁడు రామవియోగమును సహింపలేక ప్రాణత్యాగ మొనర్చెను. తరువాత జరిగిన వృత్తాంతమే ప్రస్తుతపాఠ్యమున వర్ణింపఁబడిన విషయము.

ప్రస్తుత పాఠ్యభాగ మొక చక్కని కరుణరసాత్మకమయిన కళాఖండము. పితృమరణమువల్లను, రామవియోగమువల్లను తన పరోక్షమునఁ దనకై రాజ్యమును గోరి యనేకానర్థములకుఁ దనతల్లి కారణమయ్యె నను చింతచేతను భరతుఁ డనుభవించిన దుఃఖ మీ పాఠ్యమున మిక్కిలి రసవంతముగా వర్ణింపఁబడినది.

సంభాషణలు నడపుటలోని పానుగంటివారి నేర్పును, పాత్రపోషణలోని వారి చాతుర్యమును, పద్యములను చిన్నచిన్న పదములతోఁ జక్కగాను రసోచితముగా సంతరించఁగల కవిగారి కవితా ప్రావీణ్యమును బ్రస్తుత భాగమునఁ జక్కఁగా గుర్తింపవచ్చును.

## పాఠ్య సారము

**విష్కంభము:-** దశరథుని మరణవార్త విని దానాదులు లభింపఁగలవను నుద్దేశముతో నయోధ్యకు వచ్చి యేడుదినములు గడచిపోయినను దశరథుని శవమునకు సంస్కారము జరుగకపోవుటచేత విసిగెత్తిన బ్రాహ్మణుఁడు సురుచిరుఁడు మరునాఁడుదయము నిరాశతో ప్రయాణోన్ముఖుఁడయ్యెను. ఆ సమయముననే యక్కడినుండి సరయూ నదికి స్నానమునకుఁ బోవుచున్న భ్రమరకుఁడను మఱియొక బ్రాహ్మణుఁడు సురుచిరునకా మహారాజ శవమును గుమారు లెవ్వరును నూరలేకుంటచే నీ యేడుదినములు తైలద్రోణియందుంచి కాపాడిరనియు నిప్పుడే భరత శత్రుఘ్నులు తిరిగివచ్చుటచేత నానాడిక దశరథ శవమునకు సంస్కారములు జరుగుననియు వచించి భరతుఁడు తల్లిగారి దర్శనమునకై యంతఃపురమునకుఁ బోయెనని తెలిపెను. ఆగంతకుఁడైన బ్రాహ్మణుఁడు ప్రయాణమును మానుకొనెను. భ్రమరకుఁడు స్నానమునకై వెడలిపోయెను.

**అంకకథ:-** కైకేయిని దర్శింప నేగిన భరతున కామె దుఃఖముతో మెల్ల మెల్లగా దశరథుని మరణవార్తను, తరువాత నా మహారాజ శవమును తైలద్రోణి యందుంచుటను, రామ వనవాసమును, భరతునకు జరుగఁబోవు పట్టాభిషేకమును, దెలిపెను. దశరథ మరణము విని దుఃఖించిన భరతుఁడు క్రమక్రమముగా నీ యనర్థముల కన్నింటికిఁ గారణము దన తల్లియేయని గుర్తించి మఱింత శోకించి తల్లిమీఁద గోపించి తనకు రాజ్య మవసరము లేదనియు వనమునకుఁబోయి శ్రీరామచంద్రుని

పాదము ల్నాశ్రయించి యాతని నెట్లయిన మఱల నయోధ్యకుఁ గొనివత్తుననియు వచించెను. కైకేయి భరతున కనేక విధములుగా రాజ్యాధిపత్యము నంగీకరింప వలెనని బోధించెను. కాని యాతఁ డంగీకరింపలేదు. ఇంతలో శత్రుఘ్నుఁ డీ యాపదకంతకును హేతువు కైకదాసి మంథర దుర్బోధమేయని యెఱింగి దానిని జంప నుద్యమింపఁగా నది తన యజమానురాలి దగ్గఱకుఁ బరువెత్తుకొని వచ్చెను. భరతుఁ డాతని నెట్లో శమింపఁజేసి దానిని జంపుటకు శత్రుఘ్నుని, రామ జననియగు కౌసల్య యనుమతిని బడయుమని పంపెను. ఇంతలో వసిష్ఠుఁ డక్కడకు రాఁగా భరతుఁ డాతనిముందు తన నిర్దోషిత్వమును, తన తల్లి గావించిన యపరాధమునకుఁ బశ్చాత్తాపమును వచించి రామానుగ్రహము నెట్లయిన సంపాదింపనిచోఁ దన జీవితము వ్యర్థమని నివేదించి పరిపరి విధములఁ బలవించును. ఇంతలోనే కౌసల్యయు నక్కడికేరాఁగా నామెకుఁ దన ముఖము చూపలేక కైకేయి యక్కడినుండి వెడలి పోవును. కౌసల్య మంథరను మన్నించి విడిపింపఁజేయును. శత్రుఘ్నుఁడు మంథర, నది యట్లు రామపట్టాభిషేకమునకు విఘ్నమాచరించుటకు హేతువు దెలుపుమని యడుగగా నది తనకు మంగళ కార్యములు చూచుట గిట్టదనియు, భరతుని పట్టాభిషేకము నిశ్చితమయినను దానట్లే చేసియుండుననియు సమాధానము చెప్పి వెడలి పోవును.

తరువాత భరతుఁడు దుఃఖముతో కౌసల్యకు నమస్కారము సేయఁగా నామె మనసులోని దుఃఖముచేత దీవెనయను నెపమున భరతుని కటువుగాను నిందాగర్భితముగాను దూషణవాక్యములు పలుకగా భరతుఁడు మఱింత ఖేదపడి తన నిర్దోషిత్వమును మిక్కిలి దయనీయముగా నామెకు నివేదించును. వసిష్ఠుఁడును భరతుని యంతరంగమును గౌసల్యకు నచ్చునట్లు వివరింపఁగా నామె భరతునియెడఁ బ్రసన్నభావము వహించును.

వసిష్ఠుఁడు దశరథునకు సంస్కారము చేయవలసియున్నదనఁగా భరతుఁడు, రాముని కొనివచ్చిన తరువాత నాతఁడే పితృకార్యమును నిర్వహింపఁగలఁడని చెప్పి తన యరణ్య ప్రయాణము నెఱిఁగించును. వసిష్ఠుఁడు, అదివఱకే చాలదినము లగుటచేత నింక దహనాదికముల నాపుట భావ్యముగాదని చెప్పి పైతృకములు నిర్వర్తించిన పిదప భరతుఁడు రామ దర్శనమునకు వెళ్లవచ్చునని చెప్పెను. భరతుఁడు వసిష్ఠు నాజ్ఞను మన్నించి శవదహనాది సంస్కారము గావింప నంగీకరించెను.

## కఠిన పదార్థములు : పద్యతాత్పర్యాదులు

పుట 61

నేపథ్యము = తెఱ; తైలభాండ నిక్షిప్తము = నూనె కడాయిలో నుంచఁబడినది, (తప్పు); కుంభీపాకము = ఒకవిధమగు నరకము - పాపు లిందు కుండల వలెఁ గాల్పఁబడుదురట.

పుట 62

ప్రాతబడి పథ్యమున కక్కురకు వచ్చుటకు = ఇది పరిహాసమునకన్న పలుకు- ఊరుఁగాయ ప్రాతవడినచోఁ బథ్యమున కక్కుఱకువచ్చుట లోకముననున్నది; శ్రాద్ధము-"వ్య": శ్రద్ధతో నొనర్పఁబడునది; ఉషఃకాలము = సూర్యోదయమునకు రెండు గంటల పూర్వపుకాలము.

పుట 63

జీవునకు ఘట విముక్తియైనది = ప్రాణము శరీరమునుండి లేచిపోయినది; ఘటము = శరీరము; నిష్క్రమించు = తెఱలోనికి వెడలిపోవు.

విష్కంభము = నాటకమున దృశ్యమని సూచ్యమని కథ రెండు విధములు- నాటక రంగమునఁ జూపరాక సూచించి విడువఁదగినది సూచ్యము. ఇట్టి దానిని సూచించుట కుపయోగించు నాటక ప్రక్రియలలో విష్కంభమొకటి.

విష్కంభమునందు కొంత జరిగిన కథయు, జరుగుచున్న కథయు, కొంత మునుముందు జరుగఁబోవు కథయు సూచింపఁబడవలెను. అప్రధాన పాత్రలచేత దీనిని నిర్వహింపవలెను.

ప్రస్తుత విష్కంభమున దశరథుని మరణము, ఆతని శవమును తైలభాండమున నుంచుట, భరతాగమనము ననునవి జరిగిన యంశములు. ఆతఁడు మాతృగృహమున కరిగియుండుట వర్తమాన విషయము. దశరథుని కళేబరమున కగ్నిసంస్కారము జరుగనుండుట జరుగఁగల కథాంశము. దీనియందలి పాత్రలిరువురు నప్రధానమయినవారే. వీరిరువురిలో నే యొక్కడును నీచపాత్రము కాకపోవుట చేత నిది శుద్ధవిష్కంభము.

రుగ్మత = రోగము; దీని సరియయిన రూపము "రుగ్ణత.

పుటలు 64, 65

వార్ధకము = ముదుసలితనము; నీరసము = దేహము శక్తిహీనమయి మాంద్యముగా నుండుట; నిర్ + రసము = నీరసము; ప్రారబ్ధము = పూర్వజన్మమునఁ గావించుకొనిన కర్మము; రోగ + ఆరంభము (స॥ దీ॥ సం.); పెద్దలకు రోగమేమిటి తండ్రీ! - ఇది కైకేయి మెల్లమెల్లగాఁ దన కుమారునకు తండ్రి మరణవార్తను దెలుపు విధము. దశరథునకు రోగమేమియు లేకపోయినను హఠాత్తుగా నాతఁడు దేహయాత్ర చాలించుట కాతని వార్ధకమే కారణమను భావమును భరతునకుఁ గలిగించుటకయి కైకేయి. చేయు ప్రయత్నమిందు కానగును.

ఊఱడు = దుఃఖముమాని ప్రసన్నత నందు.

పుట 66

తాతతుల్యుఁడు = తండ్రిగారితో సమానుఁడు (తృతీయా తత్పు)- "జ్యేష్ఠ భ్రాతా పితృ సమః" అని సంప్రదాయ వచనము. పెద్దన్నగారు తండ్రితో సమానుఁడు.

నలుగురము నొక్కచోట: చేసితి + ఏ = చేసితివా?; చేసితి = చేసితివి: భూత కాల క్రియయందు వకారలోపము- సూ॥ లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. ఒక్క పఱి = ఒక్కమాఱుగా; తలపోసికొని = వెనుకటి సంఘటనల జ్ఞాపకము చేసికొని: చనిపోయిన వారిని గుఱించి దుఃఖించునప్పుడు వారిని గుఱించిన పూర్వ స్మృతులు తలంపునకు వచ్చుట సహజము.

1వ పద్య తాత్ప :- సుఖదుఃఖములు రెండును నాత్మీయులతోఁగలసి యను భవింపఁదగినవి. దశరథుని మరణమువలనఁ గలిగిన దుఃఖము ననుభవింపఁదగిన సమాన భాగస్వాములు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నలువురు. అట్లు వారు నలువురును గలిసి యొక్కమాఱు దుఃఖించినచో మనసునకుఁ గొంత యూఱట లభించును. కనుకనే భరతుఁడు లోక సహజమయిన విధముగా "తాను శ్రీరామ చంద్రుని గలసికొని వారితోఁగూడ తాత మరణదుఃఖము ననుభవింతు"నని తల్లి గారితో వచించుచున్నాఁడు.

విశే :- ఇందు భరతుని శ్రీరామ భక్తియును, పితృమరణ దుఃఖమును ఉచితముగా నిర్వహింపఁబడినవి. కౌఁగిళులఁగూడుట, తలలు నేలఁగొట్టుకొనుట, గొంతెత్తి యేడ్చుట, తలపోసికొని యేడ్చుట— యివి లోకాచారము ననుసరించి నవి. దుఃఖాతిశయము నివి సూచించును.

అర్థాదులు :- మహా + అదృష్టవంతులు (స. దీ. సం.), చిరకాలజీవులు = చాలకాలము జీవించినవారు, అనాయాసత్యక్తజీవులు = ఎట్టి యాయాసము లేకుండఁగనే ప్రాణములు వదలినవారు; ఆయాసము లేకుండ మరణించుట సామాన్యముగా జరుగదు. రోగాది బాధ లనుభవించి కాని మనుజులు చనిపోరు. అట్టిది దశరథునికి లేకుండఁగనే మరణము సంభవించెననుట; అననుభూత దైన్య భావులు = (ఎన్నడును) దైన్యభావము ననుభవింపనివారు; ఆయాసము లేకుండ మరణించుటయు, దైన్యము లేకుండ జీవించుటయు నదృష్టవంతులకు మాత్రమే లభించును. అవి దశరథునకు లభించినవనుట.

సంభ్రమపడు = తొందరపడు, తహతహలాడు; సంభ్రమము + పడు (ము వర్ణ లోపము).

పుట 67

ఎందులకీ యుపోద్ఘాతము?: భరతున కిష్టముగాని రాజ్య లాభమును గుఱించియు శ్రీరామ వనవాసమునుగూర్చియు కైకేయి యథాతనికిఁ జెప్పి

యొప్పింపవలయును. అందుకే యామె యింత యుపోద్ఘాతమును జెప్పినది. నిజమునకు హృదయము లిచ్చి మాటాడఁదలఁచిన వారికింత యుపోద్ఘాత మక్కఱ లేదు. అది భరతుఁడు గమనించినాఁడు. అతఁ డిప్పుడు సూటిగాను సంగ్రహముగాను జెప్పు మాటలను వినుటకు తహతహ లాడుచున్నాఁడు. ఆతని యీ మనస్తత్వము నీ వాక్యము చక్కగా సూచించుచున్నది.

కర్మాధికారి = తల్లిదండ్రులకుఁ గర్మలు చేయవలసినవారిలోఁ బ్రధానుఁడు పెద్దకొడుకు.

నా సుతుఁడవగుటచే : దశరథునకు కైకపై ననురాగము మిక్కుటము. ఆమె చిన్నభార్యగదా! అట్టి తన కుమారునియందుఁ దనభర్తకు విశేషానురాగ ముండుట సహజమని కైక భరతుని నమ్మింప నెంచినది.

అవసానకాలవాంఛ = చివరి కోరిక.

పుట 68

అమిత + ఉపవాసక్లేశము = అనేకములగు ను:వా:ములచేతఁ గలిగిన కష్టము; నవయు = బక్కచిక్కిపోవు; అష్టకష్టము:లు = అనే బాధలు; (అష్టకష్టములు: దారిద్ర్యము, దాస్యము, భార్యాహీనత్వము, యాచన, దానరాహిత్యము, ఋణబాధ, ప్రయాణబాధ, తానై కష్టించుట.) కుడిచేయి యెడమచేయి యనక: పిల్లల మల మూత్రాదులను తల్లులు కుడి యెడమచేతులు రెంటను ముట్టి వారిని పరిశుభ్రముగా నుంచుట నిది సూచించును- సంకోచములేక యనుట; అనితర సాధారణము = మఱెవ్వరికిని లభింపనిది; యశస్సాంద్రుఁడు = ఎక్కువ కీర్తి గలవాఁడు; నిరాకరణార్హము = అంగీకరింపరానిది.

అదేదో.........సందేహించుచున్నాను : కైకేయి యుపోద్ఘాతము నేగాని విషయమును జెప్పలేదు. ఇంత దీర్ఘముగా నుపన్యాసములతో విషయముఁ జెప్పక కాలక్షేపము చేయుచుంటచేత భరతుఁ డా కార్యము కరణీయము కానిదయి యుండునని యూహించినాఁడు.

చిరకాలమంత్రి.........భయమేమి? : కైకేయి భరతునకు భంగ్యంతరమున నసలు విషయమును జెప్పుచున్నది- సుమంత్రుని సాయము రాజునకుఁ గావలసినది. ఆతఁడు భరతునికి సహాయపడుట యనఁగా భరతుఁడు రాజు కావలయు నన్న మాట.

పుట 69

సర్వప్రజానయన చకోరచంద్రుఁడు = సమస్తప్రజల నేత్రము లనెడి చకోర పక్షులకు చంద్రుఁడు (రూపక సమా.)

విసర్జించు = విడచు; పంచాననము = సింహము-"వ్యు": వెడల్పగు ముఖము గలది; సర్వజంతు.... ...కుక్కకుఁ గట్టుదురా?: అరణ్యములోని జంతువు లన్నింటి కిని సింహము రాజు. దానికి జంతువుల నేలఁగల సామర్థ్యమున్నది. కావున నది తగినది. దానిని వదలి కుక్కకా పట్టాభిషేకము చేయుట యెట్టిదో రాముని వదలి తన నయోధ్యారాజ్యమునకుఁ బట్టాభిషేకము చేయుట యట్టిదని భరతుని యభి ప్రాయము.

పాదుకలను మోయుట = సేవ యొనర్చుట: దీనిచే పాదుకా పట్టాభిషే కము సూచింపఁబడినది; ఆజానుబాహుఁడు = పిక్కలవఱకు చేతులు కలవాఁడు; ఆకర్ణాంత నేత్రుఁడు = చెవులవఱకు వ్యాపించిన (విశాలములగు) కన్నులు గల వాఁడు; సర్వతంత్ర స్వతంత్రుఁడు = ఏ వ్యవహారమునందైనను దన యిచ్చవచ్చి నట్లు స్వతంత్రముగాఁ బ్రవర్తింపఁ గలిగినవాఁడు.

పుర ప్రవేశమున కుపరోధము: ఉపరోధము = అడ్డు; కైకేయి భరతునితో నింతకు నొక్క వరమునుగూర్చి మాత్రమే చెప్పినది. ఇప్పుడు రెండవ వరమగు రామ వనవాసమును గుఱించి ప్రస్తావన మారంభించి చెప్పుచున్నది. అదియు భంగ్యంతరమునసే. పుర ప్రవేశమున కడ్డున్నదనఁగా నాతఁడు రాజశాసనము చేత రాజ్యత్యాగము చేసినాఁడన్న మాట.

పుట 70

అభ్యంతరము = అడ్డు.

2 వ పద్య. తాత్ప:- రాముఁడు రాజు. ఆతఁడు సర్వస్వతంత్రుఁడు. తలఁ చినచో నాతఁడెవ్వరి నయినను నాజ్ఞాపింపఁగలఁడు. అట్టివాని కితరుల యాజ్ఞతో నేమిపని? అవసరమే లేదనుట. (దీనినే యర్థాంతరముచేత సమర్థించుచున్నాఁడు) కాలము జగమున నన్నింటికి పరిమాణమును గూర్చునది. ఆ కాలమునకింక పరి మాణము మఱియొకటి యుండునా? లేదు అనుట. కాలము నియతిలేనిది, అనంతము. అట్లే రామున కితరుల శాసనముతోఁ బనిలేదనుట.

అలంకారము:–అర్థాంతరన్యాసము.

సపత్నీ కాంతా + అసూయా + ఆవిల చిత్త: సవతుల యందలి యీర్ష్య చేత కలఁతపడిన చిత్తముగలది;

నవనీతతుల్య + అంతఃకరణుఁడు = వెన్నవలె మృదువైన మనసు కల వాఁడు (బాప్రీ); వక్రహృదయ = దుష్ట హృదయముగలది (బాప్రీ).

వయఃప్రాదుర్భావ సంపన్నుఁడు = యువకుఁడు; పూర్వదత్తములగు వర ములు: శంబరాసురునితోడి యుద్ధమునఁ దానుచేసిన యుపకారమునకు బదులుగా

దశరథుఁడొసఁగిన వరములు రెండు. వయః... తీసికొన లేవుగూడనా ?: ఈ యుపన్యాసముచే కైకేయి తాను చేసిన కార్యమును బూర్తిగా భరతునకుఁ జెప్పి దానిని సమర్థించుకొనుటకుఁ బ్రయత్నించుటయేకాక భరతుని పౌరుషమును రెచ్చఁగొట్టి యాతనిని దన కనుకూలునిగాఁ జేసికొన యత్నించినది.

పుట 71

నీచోద్దేశ గంధము: రామునకుఁ జెందవలసిన రాజ్యము తనకు రావలెనను కొనుట నీచోద్దేశము. అది లేదు సరిగదా! దాని వాసనయైనను దన హృదయమున కొంచెముకూడ లేదు.

దాశరథి = రాముఁడు- "వ్యు": దశరథుని కుమారుఁడు;

జ్ఞాన సంపన్నుఁడు: జ్ఞానమనగా భగవద్ జ్ఞానము. దీనివలన ప్రపంచమన్న విరక్తి కలుగును. లోకముపై విరక్తికలవాఁడు రాజ్యపాలనమునకు తగఁడనియు రాముఁడట్టివాఁడు కనుక రాజుగా నుండఁదగఁడనియుఁ గైకవాదము.

పుట 72

శ్రాద్ధక్రియ లే పుత్రుఁడొనర్చునో ?....: పైనఁ గైకేయి చెప్పినమాటను భరతుఁ డంగీకరింపలేదు. కనుక మఱల నింకొక యుక్తిని జూపి యాతని నంగీకరింపఁ జేయుటకామె ప్రయత్నించు చున్నది. "పిండం దత్వా ధనం హరేత్" అని స్మృతివచనము. పిండదాన మొనర్చినవాఁడే మృతుని ధనమున కధికారియని పై ధర్మశాస్త్ర వచనము నభిప్రాయము. భరతుఁడిప్పుడు దశరథునకు శ్రాద్ధాదికములఁ జేయును గావున నాతఁడే రాజ్యాధికారియని కైకేయి వాదము.

తీక్ష్ణస్వభావుఁడు = త్వరగా కోపము వచ్చు స్వభావము గలవాఁడు; సౌమిత్రి = లక్ష్మణుఁడు; లక్ష = లక్ష్యము. భావము :- ఈ వాక్యముచేత లక్ష్మణుని స్వభావమును. భరతుని యూహా శక్తియుఁ జక్కగా సూచితములయినవి.

బోరగిలఁబడు = బోర్లఁబడు; మూఁడు + నాటికి = ముమ్మాటికి; అతఁడు నన్ను...చచ్చుటకు సర్వసిద్ధముగానున్నాను: కైకేయి భరతునిచేత రాజ్యస్వీకారము నంగీకరింపఁజేయుటకిది మఱియొక యెత్తు. తాను అపకీర్తికయిన సిద్ధపడి కౌసల్యమీఁది యసూయచేత నిట్లొనర్చినది. జరిగినదేదో జరిగిపోయినది. ఇప్పుడు భరతుఁడు కుమారుఁడైనందులకు దానిని నిలుపవలెను. పట్టాభిషేకమున కంగీకరింపవలెను. లేదా తాను మరణించును.

పుట 73

శ్రీరామచంద్రుని పాదుకలు నెత్తిపైఁబెట్టుకొని యిటకుఁ దీసికొనివచ్చి సింహాసనముపైఁబెట్టుదును = అతని నెట్లయిన బ్రతిమాలి తీసికొనివచ్చి యాతనికే

యీా పట్టాభిషేకముఁ గావింతు ననుట. ఇందు ధ్వనిగా శ్రీరాముని పాదుకలకే భరతుఁడు పట్టము గట్టఁగలఁడును భావము ఇమిడియున్నది.

అగ్నిప్రవిష్ట = అగ్నిలోఁ బ్రవేశించినది; నేపథ్యము = తెఱ; భయ + ఆక్రాంత = భయముచేత నాక్రమింపఁబడినది (తృతీ-తత్పు); లోక + ఉత్పాత కారిణి = లోకమున కాపద కలిగించునది (గుణసంధి); సహస్రఖండములు = వేయిముక్కలు; తుచ్ఛరాలు = నీచురాలు.

కైక! (తనలో)...: దీనివలనఁ గైకకుఁగల ప్రాణభీతి సూచితమయినది. కైక భరతునితో నింతకుముందు తాను చచ్చెదనన్నమాట కేవలమొక యుక్తియే కాని సత్యముకాదనుట నిది బలపఱచుచున్నది.

పుట 74

పద్య : భైరవ + పతత్ + మహా + ఉపద్రవమునకు = భయంకరమగు నీ గొప్పయాపదకు; ఆదికారణము = మొదటి కారణము- మంథరా దుర్బోధమువలననే యీ యాపద కలిగెననుట; వక్రగాత్రి = వంకరమేను గలది; కావుకావుమను: ఇది కాకముల ధ్వన్యనుకరణము. కాని "కావుమను" నినచోఁ గాపాడుమను నర్థమును గలదు. కావుము + కావుము = కావుకావుము (మువర్ణలోపము) సూ॥ ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమ ముడుబ్జులకు లోపంబు విభాషనగు.

లక్ష్మణ + అనుజా! = శత్రుఘ్నా : ఇది సాభిప్రాయము. స్వభావమున శత్రుఘ్నుఁడు లక్ష్మణునకు నిక్కమయిన తమ్ముఁడన్నమాట. లక్ష్మణుఁడు కోపముతో కైకేయిని జంప నుద్యుక్తుఁడైనాఁడు. రాముఁడు నాఁడు వారించినాఁడు. నేఁడు శత్రుఘ్నుఁడు మంథరను జంపనెంచినాఁడు- భరతుఁడు వారించినాఁడు. రామ భరతు లోకరీతి స్వభావము కలవారు కాఁగా లక్ష్మణ శత్రుఘ్ను లోకవిదమగు స్వభావము కలవారనుట.

తగవు = న్యాయ్యము; అపవారించి = ఇతరులు వినకుండ.

పుట 75

కులట = వ్యభిచార స్వభావముగల స్త్రీ (ఇది యిట తిట్టుగా నుపయోగింపఁ బడినది)

"ఇంత విశ్వాసవతివి": ఇంత + అవిశ్వాసవతివి = ఇంత కృతఘ్నురాలవు- లేదా ఇంత + విశ్వాసవతివి : ఇక్కడ "విశ్వాసవతివి" అను పదము వ్యతిరేకార్థమున వ్యంగ్యముగా నుపయోగింపఁబడినదిగా గ్రహింపవలెను.

భగవానుఁడా! = పూజ్యుఁడా!; భగవానుఁడు = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడు; కనుటచేతనే తల్లియని పిలువఁదగిన: భరతునకు కైకేయి జన్మమిచ్చినందువలన

"దల్లి" యని పిలువఁదగినది. లేకపోయినచో నామె భరతునకు "తల్లి" కాఁదగదనుట.

పద్య॥ తా ౘ:-"నా కన్నతండ్రియగు దశరథ మహారాజును నాకొఱకుఁగా మాయన్న బలవన్మరణము పాలొనర్చియు, మాయన్నగారు శ్రీరామచంద్రుని నరణ్యము పాలొనర్చియుఁ బరిహారములేని యపకీర్తి నొందినది. అందు వలన నామె బ్రతికియుండినను జచ్చినవానితోఁ దుల్యురాలు. అట్టి మాయమ్మ యెదుట నేను మానసికముగా నీ యపకీర్తిని భరింపలేక చచ్చియున్నను బ్రాణములుపోక, పోలేక బ్రతికియున్నాను" అని భరతుఁడు వసిష్ఠునితో తన యావేదనమును నివేదించుకొన్నాఁడు.

పడఁతి = స్త్రీ, సంయమి + ఇంద్ర = మునిశ్రేష్ఠ (స॥దీ॥సం) సంయమి-"వ్యు": ఇంద్రియముల నియమించినవాఁడు.

కాలగతి : ఇది యీ కాలముననిట్లు కావలయునను విధానము.

పుట 76

పద్య॥ తాత్ప:- కైకేయి యొనర్చినది మహాపరాధము; మన్నింపరాని మహాపరాధము. నిజమునకు నాకు దానితో నెట్టి సంబంధమును లేదు. నాకు రాజ్యము కావలెనని నేను కోరలేదు. నా వ్యవహారము గనుక నన్నామె యడుగవలసినది. కాని నాకుఁ దెలియకుండగనే నాపరోక్షమున నన్ను మిషగా నొనర్చి రాము వనవాసమునకును, దశరథుని మరణమునకును నీ కైకేయి కారణమయినది. శ్రీరాముఁడీకారణమున నాకు నిందు భాగస్వామ్యమున్నదని తలంచుట యసంభావ్యము కాదు. అయినను నా విషయమును బాగుగా నెఱిగిన మాయన్న నాయెడ నట్లు భావింపకపోవచ్చును. ఒకవేళ నాయఁడట్లు భావించినచో నిఁక నాకీ ప్రపంచమున జీవింపవలసిన యగత్యముండదు. నాజీవితము వ్యర్థము. కనుక నా ప్రాణముల నిప్పుడే వదలుదును."

"నేనట్లు చనిపోయిన పిదప నా శవమునకు దశరథుని శవముతో పాటుగా శత్రుఘ్నునిచేత నగ్ని సంస్కారము సేయింపవలయును. పిదప మీరు స్వయముగా నరణ్యమునకువెళ్లి రామునకు నా నిరపరాధిత్వమును, నాతనియెడ నాభక్తిని నివేదింపవలెను."

ఈ రెండు పద్యములు కరుణరస భరితములు. భరతుని హృదయ పవిత్రతను, మానసిక సంతాపమును నివి చక్కగాఁ బ్రదర్శించుచున్నవి.

రామ + అనుజుఁడు = రాముని తమ్ముఁడు = భరతుఁడు (స॥దీ॥సం): చిరంజీవి = చిన్నవాఁడు- "వ్యు": చాలకాలము జీవించువాఁడు;

దీనిని జూడకుండ = కౌసల్యను జూడకుండ - లేదా ఇక్కడ జరుగనున్న వ్యవహారమును జూడకుండ.

పుట 77

కైకేయీపుత్రా = భరతుఁడా : ఈ సంబోధనము తరువాతఁ గౌసల్య పలుకు మాటల కనుగుణముగా నున్నది. కౌసల్య యిప్పుడు సహజముగా నామె ప్రశాంతచిత్త యయ్యును మిగులఁ జింతాక్రాంతురాలై యున్నది; దీనికంతకును గైకేయీ భరతులే కారణమను భావముతో నున్నది. కనుకనే యామె నమస్కరించిన భరతుని దీవన యిచ్చుటయను నెపమునఁ గొంత కటువుగా దూషించి తన హృదయములోని సంతాపమును వెడలఁగ్రక్కినది. ఇక్ష్వాకు : వైవస్వత మనువు కొడుకు = శ్రీరాముని వంశమునకు మూలపురుషుఁడు.

నట్టడవి : నడు + అడవి (ద్విరుక్తటకారా దేశసంధి.) యథా + ఇష్ట పరిపాలన : ఇష్టము వచ్చినట్లు కావించు పరిపాలనము- నిరంకుశత్వము : మంచి చెడ్డల విచారించి నియమించువారు లేకుండుట.

దోషగంధశూన్యుఁడను = అపరాధపువాసనయైన నెఱుఁగనివాఁడను; కరములలో = చేతులలో;

పుట 78

పద్య. తాత్ప :-"రాముని వనవాసమును నేను గోరలేదు సరిగదా! వారు దానిని గోరినప్పు డంగీకారమునుగూడ సూచించలేదు. ఒకవేళ నాకు ఆ వ్యవహారముతో సంబంధము ఏమాత్రమయినను నున్నయెడల నేను మాదిగవాఁడనుగా జన్మింపవలయును; గురుద్రోహమొనర్చిన పాతకివలె నిరంతర నరకవాసశిక్ష ననుభవించుచు దుఃఖముచేఁ గుంది నశింపవలయును; తన కుమారుని మాంసము తాను దిను దౌర్భాగ్యము, మహాపాపము కలుగవలయును; నిరంతరము రోగముల పాలైన శరీరముతో భరింపరాని దుఃఖములపాలై, నోటిలోఁ బురుగులువడి, సమస్త నైచ్యముల ననుభవించి కృశించి నశించి పోవలయును. నేనేగాదు ఆ మహాపాప మెవరొనర్చినను వారి కీగతి కలుగవలెను."

ఇది భరతుని నిర్దోషిత్వమును, అతని తీవ్రబాధను వివరించుచున్నది.

అర్థ:- శిరఃప్రకంపనము = తలనూపి యంగీకారము సూచించుట, ఖలుఁడు = దుర్మార్గుఁడు, శాశ్వత + ఆవాసము = స్థిరమయిన వాసము, శిక్షా + ఆర్తి = శిక్షవలనఁగలిగిన దుఃఖము (స॥దీ॥ సం.)

స్వపుత్రమాంస + ఆశి = తన కుమారుని మాంసము దినువాఁడు (స॥దీ॥) ప్రబల తను దీర్ఘరోగ...భరితుఁడు: ప్రబల = అధికమైన, తను = శరీరము యొక్క, దీర్ఘరోగ = ఎన్నినాళ్లకును నయముగాని రోగముచేత, దుర్భర = భరింపరాని

మహా + ఆర్తి = గొప్పదుఃఖముతో, భరితుఁడు = నిండినవాఁడు; హైన్యము = హీనత;

వత్సా = నాయనా (పిల్లవానిని గూర్చిన సంబోధనము); నిర్దోషిత = దోషము లేకుండుట; కోసల + ఆత్మజ = కౌసల్య-"వ్య": కోసలరాజు కూఁతురు;

తాపసులు = మునులు;

చతురంగసేనలు = రథ గజ తురంగ పదాతివర్గములు.

పుట 79

అభ్యంతరము = అడ్డు.

## సందర్భ వాక్యములు

1. "మామిడికాయల నూరుఁగాయఁ బెట్టుకొనుట యెఱుఁగుదుముగాని మనుష్యుల నూరుఁగాయఁ బెట్టుకొనుట యెచ్చటనైన విసియుంటిమా?" (పుట 61)

సమా:- ఈ వాక్యము కీ॥ శే॥ శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిన పాదుకా పట్టాభిషేక నాటకమునందు షష్ఠాంక ప్రారంభమునన్న విష్కంభములోనిది. ఈ విష్కంభమునందు సురుచిరుఁడు భ్రమరకుఁడు నను నిరువురు బ్రాహ్మణుల సంభాషణము గలదు.

కైకేయి పట్టుదలవలన శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యమునకుఁ బోవఁగా శ్రీరామ విరహమును భరింపలేక దశరథుఁడు ప్రాణత్యాగ మొనర్చెను. అతని మృతకళేబరమునకు సంస్కార మొనర్చుటకుఁ గుమారు లెవ్వరును లేకపోవుట చేత మేనమామలయింటనున్న భరత శత్రుఘ్నులు వచ్చువఱకు దశరథుని శవము చెడిపోకుండఁ గాపాడుటకయి దానిని వసిష్ఠాదులు తైలద్రోణియందుఁ బెట్టించిరి.

సురుచిరుఁడు అయోధ్యావాసి కాదు. అతఁడు దశరథ మరణవార్త విని దహనాదికములు జరిగినచోఁ దనకు సంభావన లభించునని యయోధ్యకు వచ్చెను. కాని యేడుదినములవరకును భరత శత్రుఘ్నులు రాకపోవుటచేత నా మహారాజు శవమునకు సంస్కారము జరుగలేదు; సురుచిరునకు సంభావనముగాని దానముగాని దొరుకలేదు. ఎదిరిచూచి చూచి యా బ్రాహ్మణునికి విసుగు కలిగినది. అందుకని యేడవనాడు తెల్లవాఱుజామున వాఁడనుకొన్న వచనమది. దశరథుని శరీరమును తైలద్రోణి యందుంచుట నాతఁ డూరుఁగాయ వేయుటవంటిదని పరిహసించుచున్నాఁడు.

ఆ బ్రాహ్మణునకు దశరథుని మరణమును గూర్చికాని శ్రీరామ వనవాసముఁగూర్చికాని చింతలేదు. వాని చింత వానికి రావలసిన దానాదికములఁ

గూర్చియే. వాఁడయోధ్యలో నుండువాఁడు కాఁడు. ఎక్కడనుండియో వచ్చిన య్యాగంతకుఁడు. భ్రమరకుఁడు వానివంటివాఁడుఁ కాఁడు. అతఁడు దశరథుని పట్ల పూజ్యభావముగలవాఁడు; అయోధ్యావాసి; సదాచార సంపన్నుఁడు.

2. "అక్కడ రాజవాహనము లేచుసరికి నిక్కడ నేను లేవకపోదునా?" (పుట 63)

ఈ వాక్యము పానుగంటివారి పాదుకలో షష్ఠాంక ప్రారంభముననున్న విష్కంభములోనిది.

సురుచిరుఁడు సంభావనకై వచ్చిన పొరుగూరి బ్రాహ్మణుఁడు, భ్రమరకుఁడు సదాచార సంపదగల యయోధ్యానివాసి. అతఁ డుదయముననే సరయూనదికి స్నానమునకుఁ బోవుచు మార్గమున సురుచిరునకు మాటల సందర్భమున దశరథుని మృతదేహమున కానాడు సంస్కారము జరుగఁగలదని చెప్పినాఁడు. ఆ మాట విన్న సురుచిరుఁడు తానంతకు ముందు నిరాశఁ జెంది వెళ్లిపోవుదమనుకొన్న వాఁడు తన ప్రయాణము మానికొని మఱల నిద్రపోవుచు ననుకొన్న మాటలివి.

వీని కుదయమే స్నానముచేసి యనుష్ఠానాదులు తీర్చికొనవలెనను నియమ నిష్ఠలు లేవు. కేవలము దానార్థి వీఁడు. ఆ దానాదులు రాచనగరున దశరథుని మేనునకు దహనసంస్కారము జరిగినప్పుడుగాని లభింపవు. రాచపీనుఁగు త్వరగాఁ గదలునా? దానికిఁ జాల సేపుపట్టును. అంతదనుక నీబ్రాహ్మణున కేమియుఁ బనిలేదు గదా! కావునఁ దాను బండుకొని నిద్రపోయెదనని యనుకొనుచున్నాఁడా బ్రాహ్మణుఁడు.

రాజవాహనము లేచుట యనఁగా రాజుగారి శవమును సంస్కారమునకై తీసికొనివచ్చుట. తాను లేచుట యనఁగా నిద్రనుండి లేచుట.

3. "ఆ విషయమున నన్నదమ్ముల నలుగురి యదృష్టము లొక తీఱుననే యున్నవి." (పుట 65)

ఇది పానుగంటివారి పాదుక నాటకమున షష్ఠాంకమునందు కైకేయి వచనము.

భరతుఁడు వసిష్ఠుని వార్తపై హుటాహుటిగా మేనమామల యింటినుండి శత్రుఘ్నునితోఁగూడ వచ్చినాఁడు. ఆతని కయోధ్యలో జరిగిన వ్యవహారము లేమియుఁ దెలియవు. కైకేయి వేసిన యెత్తులన్నియు దశరథుని మరణముతోఁ దలక్రిందులయినవి. ఆమెకుఁ దన కృత్యములను భరతుఁ డామోదింపఁడని దృఢ ముగాఁ దెలియును. జరిగిన యనర్థముల కన్నింటికిని దానే హేతువగుటచేత వాని నెట్లో నిలుపుకొనవలెనని యామె భావించినది. అందుకని సర్వమును దిగమ్రింగి భరతునకు బహుచతురముగా దశరథుని మరణవార్త నెఱింగించినది. ఇఁక

శ్రీరాముని వనవాస వార్త నెఱింగింప వలసియున్నది. దశరథుని మరణవార్త నెఱింగిన భరతుఁడు తమ నాయనగారి మరణసమయమున నక్కడ లేకపోవుటచేతఁ దానును శత్రుఘ్నుఁడును దురదృష్టవంతులమని పలవించినాఁడు. ఆ వచనము విన్న కైకేయికి సమయము లభించినది. శ్రీరామ వనవాసము నెఱిఁగించుట కుపోద్ఘాతము నారంభించినది.

తండ్రిగారి యవసానకాలమున లేకపోతిమని చింతింప భరతునకుఁ బ్రత్యేకముగా నవసరములేదనియు భరత శత్రుఘ్నులకేగాదు రామ లక్ష్మణులకును నా యదృష్టము లభింపలేదనియు వచించినది.

భరతుఁ డింతదనుక రామలక్ష్మణు లయోధ్యయందే యున్నారని తలంచుచున్నాఁడు. ఆతఁడు తనతల్లి యింత యఘాయిత్య మొనరించి శ్రీరాము నరణ్యమునకుఁ బంపునని యూహింపలేఁ పోయినాఁడు. కనుకనే తరువాత కైకేయి సీతా రామ లక్ష్మణు లరణ్యమునకు వెళ్లిరని యనఁగా నమాయికముగా వారు వేఁటకయి వెళ్లియుందురని తలంచినాఁడు.

4. "సర్వజంతు శాసన పటిష్ఠమగు పంచాననము కలుగ మహారణ్యాధిపత్యమును గుక్కకుఁ గట్టుదురా?" (పుట 69)

ఈ వాక్యము పానుగంటివారి పాదుక నాటకమున షష్ఠాంకమందలిది. భరతుఁడు దీనిని తనతల్లి కైకతోఁ బలికినాఁడు.

కైకేయి యుపోద్ఘాతముతో నారంభించి మెల్లమెల్లగా దశరథుని మరణమును శ్రీరామచంద్రుని వనవాసమును భరతున కెఱిఁగించి దశరథునకుఁ దనపై ననురాగ మధికముగనుక తనకుమారుఁడగుటచేత భరతునియందు నామహారాజునకు శ్రీరామాదుల యందుకంటెఁ గొంచెము పక్షపాత మధికమనియుఁ జెప్పి, యందువలననే యాతఁడు తన యవసానకాలమున భరతునకుఁ బట్టాభిషేకము చేయఁ గాంక్షించెనని సయుక్తికముగా బోధించి భరతునిఁ బట్టాభిషేకమున కంగీకరింపఁ జేయ యత్నించినది.

కైకేయికి భరతుఁడు తన పన్నాగము నంగీకరింపఁడని స్పష్టముగాఁ దెలియును. అతఁడు ధర్మపక్షపాతి, పాపభీతిగలవాఁడు; అన్యాయమును సహింపనివాఁడు. అన్నిఁటికిమించి గురుజనులయెడను, బ్రత్యేకముగా రాముని యెడను మిక్కిలి భక్తికలవాఁడు. కైకేయి స్వభావము నాతనికిఁ దెలియనిదికాదు. అందుకనియే కైక యసలు జరిగిన సంగతిని కప్పిపుచ్చి దశరథుని యవసానకాంక్ష గనుక భరతుఁడు పితృభక్తిచేత పట్టాభిషేకమున కంగీకరింపవలయునని పలికినది.

భరతునకుఁ బట్టాభిషేకమున కంగీకరింపకుండుటయేకాదు–ఆ మాట వినుటకును దుర్భరముగా నున్నది. అందుకనే యాతఁడు చెవులు మూసికొన్నాఁడు. సర్వ

విధములుగాఁ బ్రజలఁ బాలించుట కర్హుఁడు రాముఁ డుండఁగాఁ దనకుఁ బట్టాభిషే కము చేయుట సింహమును విడిచి కుక్క కరణ్యారాజ్య పట్టాభిషేకము చేయుటవం టిదని పలికినాఁడు.

ఈ వాక్యమున భరతుఁడు శ్రీరాముని సింహముగాను తనను కుక్కఁగాను బోల్చుకొనుటచేత నాతనికి శ్రీరామచంద్రునియెడ నెంత భక్తియున్నదో స్పష్ట మయినది.

5. "శ్రాద్ధక్రియ లే పుత్రుఁ డొనర్చునో యాతఁడే తండ్రి సొత్తున కధికారి" (పుట 72)

ఈ వాక్యము పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు రచించిన పాదుకా పట్టాభిషేక నాటకములోని షష్ఠాంకమునందలిది.

భరతునిచేత రాజ్యపట్టాభిషేకమున కంగీకరింపఁజేయుటకుఁ గైక యుక్తు లుగాఁ జూపినవానిలో నిదియొకటి. భరతుఁడు పట్టాభిషేకము చేసికొనుట శాస్త్ర విహితమేయని యామె నమ్మింపఁ జూచుచున్నది.

దశరథుఁడు మరణించినాఁడు. రాముఁ డూరలేఁడు, రాలేఁడు. కావున నున్న వారిలో జ్యేష్ఠుఁడు భరతుఁడు. ఆతఁడే యిప్పుడు దశరథునకు దహనాది పార లౌకిక క్రియలు చేయవలయును. ఉత్తరక్రియలు చేసినవాఁడే యుత్తరాధికారి గనుక నాతనికి రాజ్యాధికారమున కర్హత లభించినదని కైక వాదము.

కాని యిది కేవలము యుక్తి మాత్రమే కాని శాస్త్ర విధికాదు. శాస్త్రము జ్యేష్ఠునకు రాజ్యాధికారము విధించినది. కర్మాధికారము నాతనిదే. అట్టి రాముఁ డిప్పుడు తన మంచితనముచేతను గైక కౌటిల్యముచేతను బలాత్కారముగా నరణ్యమునకుఁ బంపఁబడినాఁడు. అంతమాత్రముచేత నాతనికి రాజ్యాధికారము లేకుండఁబోదు.

ఇంతేగాక "పిండం దత్వా ధనం హరేత్" (పారలౌకిక క్రియ లొనర్చి వాని ద్రవ్యమున కధికారియగును) అన్న ధర్మశాస్త్రము వారసులు లేనివారిని గూర్చినది. కాని పుత్రవంతులను గురించినదికాదు. కనుకనే భరతుఁడు కైక కుయుక్తి నంగీకరింపక నిరాకరించినాఁడు.

6. "నేను చంటిపిల్లవాఁడనై యుండఁగ నీవు కరములలోఁ బెట్టి నన్నా డించినపుడు నేనెంత పాపరహితుఁడనో యిప్పుడుకూడ నంతే" (పుటలు 77-78)

ఇది పానుగంటివారి పాదుక నాటకము ఆరవ యంకమునందు కౌసల్యతో భరతుఁడు పలికిన పలుకు.

కౌసల్య కైకేయివంటి స్వభావము గలదిగాదు. ఆమె తనకుమారునితో పాటు సవతి కొడుకులనుగూడఁ దన చేతులతోనే పెంచినది. ఆ కుమారులకును దమ తల్లులయెడ నట్టి యభేదాభిమానమే. కాని చివరకు మంథరా దుర్బోధకు లోనైన కైక యనేకానర్థములకు మూలమయినది. దీనిలో భరతునకు భాగ స్వామ్యము లేదు. కాని కైక యొనర్చిన పన్నాగమున భరతునికిఁగూడ నా వ్యవ హార దోషమంటినది. అతనికే గదా! యామె పట్టముగట్ట నెంచినది! కనుకనే కౌసల్య, నమస్కరించిన భరతుని దీవనయను మిషతో కటువుగాఁ దన యంతస్తాప మును వెడలఁగ్రక్కినది. పాప మామె కప్పటిదనుక కైకేయీ భరతులకు జరిగిన సంభాషణముగాని, భరతుని యావేదనగాని తెలియదు. తెలిసి యుండుట కవ కాశమును లేదు. కనుకనే యామె యంత కటువుగా భాషించినది.

భరతునకు కౌసల్య యట్లు పలికినందు కామెపై కోపము రాలేదు. కాని యాతని తాపము దానితో నధికమయినది. తన యావేదనను, అంతస్తాపమును నామె కెట్లు తెలుపుటకు నాతనికిఁ దోచలేదు. అయినను నామె తన తల్లిగనుక తన బాల్యమును జ్ఞాపకముచేసి నాటివలె నేఁడును దాను నిర్దోషిగానే యున్నా ననియు వచించినాఁడు.

చంటిపిల్లలకు కౌటిల్యముండదు. వారి హృదయము నిర్మలము. భరతుని యావేదనను నిర్దోషిత్వమును నీ వాక్యము బాగుగా వివరించుచున్నది.

## ప్రశ్నలు - సమాధానములు

ప్ర. 1 :- పానుగంటి లక్ష్మీనరసింహారావుగారిని గురించి పరిచయ వాక్య ములు వ్రాయుఁడు.

స :- సమాధానమునకై పాఠ్య పరిచయమును జూచునది.

ప్ర. 2 :- మీ నాటక పాఠ్యభాగమున జరిగిన కథను సంగ్రహముగా వ్రాయునది.

స :- సమాధానమునకయి పాఠ్యసారమును జూచునది.

ప్ర. 3 :- మీ పాఠ్యభాగము ననుసరించి కైయి శీలమును గురించి వ్యాసము వ్రాయునది.

స :- కైకేయి శీలము :

మంథర దుర్బోధవలన కైకేయి రామవనవాసమును భరత పట్టాభిషేక మును గోరి భర్తృమరణమునకు కారణమయినది. రాజ్యమును గోరినదేకాని తన

యీ కార్యమును భ్రాతృభక్తి పరాయణుఁడును ధర్మాత్ముఁడును నైన తన కుమారుఁ డంగీకరింపఁడని యామె యెఱుఁగును. అందువలననే యామె భరతునకు జరిగిన సంగతుల నన్నింటిని నున్నవాని నున్నట్లు వెంటనే చెప్పివేయక మెల్ల మెల్లగాఁ దెలిపినది. ఈ తెలుపుటలో నామె చూపిన నేర్పు గమనింపఁదగినది. అయినను నందులో నేదో రహస్యము దాగియున్నదని భరతుఁడు గమనింపక పోలేదు.

భరతునిచేత నెట్లయిన రాజ్యాధిపత్యమున కంగీకరింపఁజేసి తన సవతుల యెడఁ దనకున్న యసూయను. పై పెచ్చు దశరథ మరణమువలనఁ దనకు లభించిన యపకీర్తిని బాపుకొనవలయునని కైకేయి భావించినది. అందుకని యామె దశరథుఁడే స్వయముగా నవసానకాలమున భరతునకుఁ బట్టముగట్ట నాజ్ఞాపించి నట్లొక కట్టుకథనల్లి భరతునకుఁ జెప్పినది. రాముఁడు లేకపోవుట చేత మిగిలిన వారిలో భరతుఁడే జ్యేష్ఠుఁడు కనుక ఆతఁడు రాజ్యమును స్వీకరించుట న్యాయ్యమని నమ్మింపఁజూచినది. పితృకర్మల నాచరించినవాఁడే వారసుఁడను ధర్మశాస్త్ర ప్రమాణముఁ జూపి దశరథునికిఁ గర్మలుచేసి భరతుఁడు రాజగుట యన్యాయ్యము కాదని యుక్తిని జూపఁ బ్రయత్నించినది. కాని యామె యీ ప్రయత్నము లేమియు ఫలించలేదు. తుద కామె భరతుని పౌరుషమును రెచ్చగొట్టి తద్ద్వారా అతనిచేత రాజ్య స్వీకరణమున కంగీకరింపఁజేయ వలయునని చూచినది. అదియును కుదురలేదు.

అప్పటి కామెకుఁ దాను చేసినది వ్యర్థప్రయత్నమని యర్థమయినది. లోలోపల జరిగినదానికి కొంతవిచారము కలిగినది. దానికంతకు కారణమయిన మంథర మీఁద నామెకు కోపము కలిగినది. అది తా నెన్నివిధములఁ జెప్పినను వినక తనను గోతిలో దింపినందుకు దానిపై చిరాకు గలిగినది. కనుకనే మంథర తనను శత్రుఘ్నునినుండి కాపాడుమని బ్రతిమాలినప్పుడు కైక దానిని చీదరించి కసరికొట్టినది.

కైకకు తాను చేసినది మంచిపని కాదని తెలియును. ఆమెకు శ్రీరామునిపై ద్వేషము మంథర దుర్బోధవలనఁ గలిగినదే కాని సహజముకాదు. దశరథ మరణము కైకలో నొక నూతన స్థితిని కలిగించినది. చేసినదాని నెట్లయినఁ దుదిదాక నిర్వహించవలెనను భావ మామెలో కలిగినది. కనుకనే చాల నిండుగా సర్వమును దిగమ్రింగి బహుచాతుర్యముతో భరతుని యెదుట నాతని నమ్మింపఁ జూచినది. కాని ఫలము లభింపలేదు. ఆమె హృదయమున మిక్కిలి కించపడియున్న యా సమయముననే యక్కడికిఁ గౌసల్య రానున్నదని యెఱిఁగి యామె ముఖము చూడలేక యక్కడినుండి వెడలిపోయినది.

ఆపోక పోకయే. ఇఁక దిరిగి యామె భరతుని పట్టాభిషేకమునకుఁ బ్రయత్నింపలేదు. ఏ విషయమందును జోక్యము కలిగించుకొనలేదు.

ప్ర. 4 :- మీ చదివిన నాటకభాగము ననుసరించి భరతుని స్వభావము నుల్లేఖించుమది.

శత్రుఘ్నునితోఁగూడఁ దన మేనమామల యింటనున్న భరతుని వెంటనే రావలసినదిగా వసిష్ఠుఁడు వార్త నంపినాడు. భరతుఁడు హుటాహుటిగా బయలుదేరి అయోధ్యకు వచ్చినాఁడు. వచ్చినదే తడవుగా నాతఁడు మాతృదర్శనమునకై యామె యంతఃపురమున కరిగినాఁడు పితృభక్తిపరాయణుఁడైన భరతుఁ డత్యాతురతతోఁ దనతండ్రిగారి సేమమడిగి తల్లివలన నాయన మరణవార్త నెఱిఁగి పలు విధముల దుఃఖించినాఁడు. తన తండ్రిగారి యవసానకాలమునఁ దానతనికడ లేనందుకు తన్ను దాను నిందించుకొన్నాఁడు. రాములక్ష్మణులుకూడ నూరలేరన్న తల్లి మాటవిని యమాయికుఁడై భరతుఁడు వారు వనమునకు వేటకయి యేగి యుందురని భావించినాఁడు. కాని చివరకు రాముఁ డరణ్యావాసమునకు దశరథు నాజ్ఞ ననుసరించి వెళ్లెననియు నాతఁడిప్పుడే రాడనియు విన్నప్పుడు భరతుఁడు మిగుల దుఃఖించి పుత్రవత్సలుఁడయిన దశరథుఁడు రాము నరణ్యమునకుఁ బంపెననుట నమ్మరానిదనియు దానిలోఁ గైకేయి యేదో కుట్ర గావించియుండు ననియు పచించినాఁడు. తరువాత కైక భరతునికి రానున్నరాజ్యము విషయమును దెలిపినది. దానితో భరతునకు జరిగిన సంగతి యంతయు నర్థమయినది. తనతల్లి తన పరోక్షమునఁ దనకై తానెన్నడు నపేక్షింపని రాజ్యమునుగోరి సర్వానర్థములకు మూలమయినదని గ్రహించినాఁడు. తానట్టి తల్లిగర్భమునఁ బుట్టినందుకుఁ దన్నుదాను నిందించుకొని దుఃఖించినాఁడు.

ఆతనికిఁ దనతల్లిపై సానుభూతి నశించినది. ఆమె యెన్నో విధముల రాజ్యాధిపత్యము స్వీకరింపఁజేయ యత్నించినను గురుభక్తి కలవాఁడును, శ్రీరాముని యెడ ననన్యానురాగము కలవాఁడగుటచేతను, మీఁదుమిక్కిలి ధర్మచిత్తము న్యాయపక్షపాతము కలవాఁడగుటచేతను తల్లి యుపదేశములను ద్రుణీకరించినాఁడు. ఆయనకుఁ దనతల్లిని చంపవలయునన్నంత కోపము వచ్చినది. కాని రామునకా కార్య మభిమతము కాదని మానివేసినాఁడు. అంతటి రామభక్తుఁడాతఁడు.

చివరకు వసిష్ఠుఁడు దశరథుని మృతదేహమునకు దహనాదికములఁ జేయుమన్నను భరతుఁడు రామచంద్రుఁడు వచ్చినపిదపనే యాకార్యము జరుగవలెనని తన యరణ్య ప్రయాణమును వారి కెఱింగించెను. కౌసల్యా తన్ను నిందించినను కోపగింపక యామెముందు దన నిర్దోషిత్వమును నివేదించుకొని యామెను బ్రసన్నురాలిం గావించుకొనెను.

చేఁ జిక్కిన రాజ్యమును భ్రాతృ భక్తితోడను, ధర్మాసక్తి తోడను తన యన్నగారి కప్పగించి యాయన పాదుకల నారాధించుచు రాజ కార్యముల

నాయనక్తై నిర్వహించుచుఁ బదు నాలుగు వత్సరములు ముని వ్రత మాచరించిన మహనీయమూర్తి భరతుఁడు.

ప్ర. 5 :– "విష్కంభము" అనఁగా నేమి ? మీ పాఠ్య భాగములో దానిని సమన్వయించి యందలి కథ నుల్లేఖింపుము ?

సమా :– నాటకమునందు కథ కొంత ప్రదర్శింపఁబడును. మఱికొంత ప్రదర్శనమునకు వీలుపడని కథను విష్కంభాదులచేత సూచించి విడతురు.

విష్కంభము శుద్ధ విష్కంభమని, మిశ్రవిష్కంభమని రెండు విధములు. శుద్ధ విష్కంభము నందందఱు మధ్యపాత్రలగుదురు. మిశ్ర విష్కంభమునందు నీచపాత్రలు మధ్యపాత్రలుకూడ నుండవచ్చును. మన పాఠ్యము నందిరువురును బ్రాహ్మణులే కనుక యిది శుద్ధవిష్కంభము.

విష్కంభమునందుఁ గొంత జరిగిపోయిన కథయు మఱికొంత ' అప్పుడు జరుగుచున్న కథయు నింకముందు జరుగుకథ మఱికొంతయు సూచితమగును. మన పాఠ్యములోని విష్కంభమున నిదియంతయుఁ గలదు.

జరిగిన కథ :– శ్రీరాముఁడు సీతాలక్ష్మణులతో నరణ్యమునకుఁ బోగాఁ బుత్రవియోగ వ్యథను సహింపలేక దశరథుఁడు ప్రాణముల విడిచినాఁడు. కుమారు లెవ్వరు నయోధ్యానగరమున లేకపోవుటచేత రాజు మృత కళేబరమునకు సంస్కారము జరుప వీలుకాలేదు. అందుకని రాజపురోహితుఁడైన వసిష్ఠ మహాముని రాజశవమును చెడిపోకుండునట్లుగాఁ దైలద్రోణి యందుంచునట్లు గావించి తత్క్షణమే రావలసినదిగా మేనమామల యింటనున్న భరత శత్రుఘ్నులకు వార్త నంపినాఁడు. భరత శత్రుఘ్నులకు సీతా రామ లక్ష్మణుల వనవాస విషయముగాని దశరథుని మరణవార్తగాని తెలుపఁబడలేదు. ఇట్లు భరత శత్రుఘ్నులు వసిష్ఠుని పిలుపు నందుకొని యయోధ్యా నగరమునకు వచ్చుట కేడు దినములు పట్టినది.

వర్తమాన కథ :–భరత శత్రుఘ్ను లయోధ్యకు వచ్చిన వెంటనే మాతృ దర్శనమున కరిగినారు.

జరుగనున్న కథ :–ఏడు దినములనుండి యెదిరి చూడఁబడుచున్న భరత శత్రుఘ్నులు వచ్చినారు కనుక ఇఁక దశరథుని శవమునకు సంస్కారము జరుగఁ గలదు. మాతృ దర్శనమునకయి వెళ్లిన భరతుఁ డామెతో నేమి మాట్లాడెనో ముందు చూడవలసి యున్నది. వారిద్దరి సంభాషణముమీఁదనే భవిష్యత్కథ యంతయు నాధారపడి యున్నది.

ఈ విధముగా మన పాఠ్యభాగమునందలి విష్కంభము ఇదివఱకు జరిగినట్లు ప్రదర్శితమయిన కథకును ముందు ప్రదర్శింపఁబడనున్న కథకును,నడుమ జరిగినకథను మనకుఁ బరిచయము గావించి నాటకము రసవత్తరమగుటకుఁ దోడ్పడుచున్నది.

# 2. ఈశ్వర దత్త పుస్తకములు

*(కీ॥ శే॥ శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు)*

(నివాసము: రాజమహేంద్రవరం. కాలము: 1848-1919)

ఆధునికాంధ్ర యుగమునకు వీరేశలింగముగారు మూలపురుషు లనఁదగిన వారు. వారు సంఘ సంస్కర్తలుగాను రచయితలుగాను సంపాదించుకొన్న స్థానము అనితరసాధ్యమయినది. వారి కలము నడక నారంభించఁగనే ఆంధ్రమున నదివరకు లేని యనేక నూతన ప్రక్రియ లావిర్భవించినవి. వారు నవలలు వ్రాసినారు. నాటకముల రచించినారు. లిఖితోపన్యాసములఁ గూర్చినారు. ప్రౌఢము లయిన పద్య కావ్యముల సంతరించినారు. ప్రహసనముల వెలయించినారు. వాచకముల రచియించినారు. చరిత్రల నుల్లేఖించినారు. వచన గ్రంథముల రుచి చూపినారు. వీనిలోఁ గొన్నింటికి వారే మార్గదర్శకులు, మఱి కొన్నింటికి వారు రాజమార్గముల వేసినారు.

పంతులుగారు ధైర్య సాహసములతో పాటుగా పట్టుదల ప్రతిభగల మహాపురుషులు. ఎంతటి ఝంఝామారుతములు వచ్చినను నిబ్బరముగా నెదుర్కొని నిలిచి గెలిచిన మహనీయుఁ డాయన. యుక్తి వాద మాయన సొత్తు. "రావు బహదూరు" వారికి ప్రభుత్వమువారు బహూకరించిన బిరుదము.

పంతులుగారి వచన రచన సర్వ సామాన్యముగా సులభము లయిన పదములతో తేలికగా నర్థమగుచు శరన్నదీ ప్రవాహామువలె ప్రసన్నముగా సాగిపోవుచుండును. కాని కొన్ని పట్టుల నది చిన్నయసూరి రచనకు ప్రతిబింబమా యనఁ దగినట్లును నుండఁ గలదు. ఏమయినను సారళ్యమే వారి రచనలోని సాధారణ గుణము.

వీరేశలింగముగారు సంఘ సంస్కర్తలు. దేనిని మూఢముగా నమ్మరాదనుట వారి సిద్ధాన్తము. దేనిని జెప్పినను సోపపత్తికముగాను హేతుబద్ధముగాను సూటిగాఁ జెప్పుట వారి రచనలో మనకుఁ గొట్ట వచ్చినట్లు కనుపట్టుచుండు ముఖ్య గుణము.

ప్రస్తుత పాఠ్యము వారి యుపన్యాసములలో నొక్కటి. ఇందు వారు వేదములు, బైబిలు, ఖురాను మున్నగునవి భగవద్దత్తములను మాట నమ్మరాదనియు, భగవంతుఁ డట్లు చేయఁ డనియు, బుద్ధియే యన్నింటికిని బరమ ప్రమాణ మనియు, పుస్తకములు జ్ఞానోపార్జనకు నుపయోగించు సాధనములనియు వచించుచున్నారు.

# పాఠ్యసారము

1వ పేరా :- అన్ని విషయములందు ప్రమాణమయిన గ్రంథము నొకదానిని భగవంతుఁ డిచ్చియున్నాఁడా? యనునది చర్చనీయాంశము. దైవమే లేదను నాస్తికుల కీ చర్చతో సంబంధము లేదు.

భగవంతుఁడు వేదమును సృష్టించి యిచ్చెననువారు మానవబుద్ధి భ్రమప్రమాదములతోఁ గూడినది గనుక వారు చెడిపోకుండ దయాళువయిన యీశ్వరుఁడు వేదనియమముల నేర్పఱచెనందురు. దానిని కాదనువారు బుద్ధి, లోకానుభవము, వీని రెంటివలననే మానవునకు మంచిచెడ్డలు తెలియనగుననియు, తటస్థుఁడయిన భగవంతుఁడు వేదమును సృష్టించి యిచ్చుట పొసఁగదనియు, వేదమువలనను జనులలో నైకమత్యముండుట లేదనియు నందువలన వేదము భగవద్దత్తమనుట పొసఁగదనియు భావించుచున్నారు.

ఏది భగవద్దత్త వేదము? అని యడిగినచో మహమ్మదీయులు ఖురాను, హిందువులు వేదములు, క్రైస్తవులు బైబిలు నని, కడమవి కల్పితములందురు. అందుకు ప్రమాణము విశ్వాసమే. కొందఱు విమర్శించి చూచినఁ దమదే యుత్కృష్టమయినది గనుక దానిని నమ్మవలెనందురు. అప్పుడు వారును బుద్ధినే ప్రమాణముగా నంగీకరించిరన్న మాటగదా!

భగవంతుఁ డందఱియెడను దయగలవాఁడు. అతఁ డొక్కనికే ప్రత్యేకముగా సృష్టించి వేదము నొసఁగఁడు. కనుకనే యందఱికిని బుద్ధి నిచ్చినాఁడు. అదియే సత్యవేదము. తదితరములు కల్పితములు.

ఎవరో యొకరు కొన్ని మహిమలఁజూపి తాను భగవంతుఁడనని చెప్పి, అసత్యము, హింస, అన్యాయము, జారత్వ చోరత్వాదులు మోక్షహేతువు లన్నచో నేడు మనము నమ్మము. దీనికి కారణము మన బుద్ధియే. కనుక మన యంతరాత్మ బోధనమే సత్యవేదము. కడమ వేదములు దీని ననుసరించి కాలానుగుణముగా రచియింపఁబడినవి.

2వ పేరా :- బుద్ధి ప్రమాణమన్న ననేక మతములు బయలుదేరి యైకమత్యము చెడునన్నచో "వేదము"లవల్లను నైకమత్యము చెడినది. ఒక్కొక్క మతమున కొక్క "వేదము"న్నది. ఒక్క మతమువారి యందైన నైకమత్యము కానరాదు. వారిలో వారికే విభేదములు కలిగి తలలు పగులఁగొట్టుకొన్న ఘట్టము లనేకములను జరిత్ర చెప్పుచున్నది. ఇందువలన లిఖితవేద ప్రామాణ్యము నంగీకరించినను నైకమత్యము నది సాధింపదని తేలినదిగదా!

హిందూ మతముననను వేదములను నమ్మువారిలోనే యనేక మతములు బయలుదేరినవి. రాజుల సాహాయ్యమున నొక మతస్థులు ఇంకొక మతస్థులకు

గావించిన యన్యాయములఁ దలఁచుకొన్నచో దేహము జలదరించును. నేడు మనలోనే ద్వైతా, ద్వైత, విశిష్టాద్వైతములను మూఁడు ముఖ్యభేదములును వానిలో నెన్నెన్నో అవాంతరభేదములును నున్నవి. వీరికి వివాహములు కాదు గదా! పంక్తిభోజనములును, తుదకు దర్శన స్పర్శనములును బనికిరానివయి పరస్పర కలహములు దూషణలు మొదలగు వానివఱకు వెడలినది. ఒకే వేద వాక్యమునకు శంకర రామానుజ మధ్వాచార్యులు భిన్నవిధములుగా నర్థములు వ్రాసి వివాదపడగా ననేక సత్యవేదముల సంగతి వేరుగాఁ జెప్పవలెనా? అట్లయినప్పుడు మధ్యస్థులు దేనిని నమ్మవలెను? వాని గుణాగుణముల విమర్శించుటకు బుద్ధియే గదా ప్రమాణము. కనుక బుద్ధినే ప్రమాణముగా నంగీకరించి పుస్తకములను సాధనములుగా నంగీకరించుట యుక్తము.

వేదము భగవద్దత్త మనుటకుఁ జూపు నాధారములు రెండు విధములుగా నున్నవి. ఒకటి- భగవదంశా సంభూతు లనువారివియు, భగవదావేశము గల వారివియునగు మహిమలు. రెండు- దీర్ఘదర్శు లయినవారు మున్ను చెప్పిన విప్పుడు సత్యము లగుచున్న వనుట. ఒక దానిని నమ్ముటకు దానిలోని సత్యాసత్యములు ముఖ్యములు కాని, చెప్పినవారి మహిమలు కాదు. ఎంతవాఁడు చెప్పినను కాకు లన్నియుఁ దెల్లనివి, కొంగ లన్నియు నల్లనివి కావుగదా! మహిమలు చూచినచో నవి దేవతలకు మాత్రమే కాక రాక్షసులకు నుండినట్లు పురాణములు చెప్పుచున్నవి. ఆ మహిమలు కొన్ని యెప్పుడయినను జరుగునా? యన్నది కూడ సందేహమే. ప్రాచీనులు అజ్ఞానము చేతను విశ్వాసము చేతను నేది చెప్పినను నమ్మువారు. నేటికి నట్టివారున్నారు. ఈ కథలు గోరంతను కొండంతచేసి చెప్పిన వనుట సత్యము విచారించినచోఁ దెలియును. కాని యీనాడు వీని పై నమ్మకము తగ్గినది.

3వ పేరా :- ఈ కాలపు విద్యార్థులకు హిరణ్యాక్షుని కథను జెప్పినచో నా కథలోని యసందర్భములఁ గూర్చి యనేక ప్రశ్నలు వేసి యుపాధ్యాయుని గేలిసేయక మానరు. అట్లే బైబిలులోని కథ "భూమధ్య సముద్రములోని తిమింగిలము మానవుని మింగి మూఁడు దినముల తరువాత ప్రాణములతో విడిచి పెట్టిన" దను దానిని విన్నచో విద్యార్థులా సముద్ర స్వభావమును బట్టి తిమింగిలమందుండదనియు నున్నను మనుష్యుని మింగలేదనియు నిత్యాదులను వచించి యుపాధ్యాయుని నిరుత్తరు నొనరింతురు.

4వ పేరా :- ఇఁక దీర్ఘదర్శులయిన వారి భావికాలజ్ఞతను గూర్చి విచారించినను నిట్లేయుండును. "కలియుగమునం దయిదు వేల యేండ్ల పిదప ధర్మము చెడి వర్ణసాంకర్యము కలుగు" నన్న దానిం జూతము. కృత యుగమునందు ధర్మము నాలుగు పాదముల నడచినదా? చంద్రుఁడు గురు భార్యను హరించెను. దేవత లందరును మఱల నామెను గురున కిప్పించిరి. అప్పుడు చంద్రుఁడును

గురువును బుట్టిన కుమారునకై తగవులాడిరి. దేవతా లాతగవుఁ దీర్చిరి. ఇట్టి వీయుగమున జరుగవు. జరిగినచో రాజులు శిక్షింతురు. ఇట్టి వనేకములు.

5వ పేరా :- అట్లయినను వానిని గుఱించి వ్రాసిన ప్రాచీనులను మనము నిందింపరాదు. అది యా కాలము నందలి పరిస్థితి. కనుక వ్రాసిన వారిని దూషింపక వ్రాఁతలను మాత్రము నమ్మక జాగరూకులమై యుండవలెను.

6వ పేరా :- నిజముగా నీశ్వరుఁడే "వేదములను" హిందువులకే యిచ్చె నన్నచో నవి వారికే యేల యీయవలెనో? యితరుల కాయదృష్టము నేలఁ గూర్పలేదో? కారణ మూహింపరాదు. దేవుఁడు బుద్ధి, లోకానుభవము లాధారముగా మనము జ్ఞానవంతులము కావలయునని భావించినట్లే తోచును. అతఁడు మన మైకమత్యముతో నుండవలెనని భావించిన పక్షమున నిన్ని మతములవారి కిన్ని వేర్వేరు వేదముల నాయా భాషలలో నేలయీయవలెను? విశాలమై యనేక కాలముల దనుక నుండవలసిన యా వేదము నే యొక్కరికో యేల యిచ్చును? ఇట్టి దంతయు వేదములు భగవద్దత్తములు కావనియేగదా! తేల్చుచున్నవి.

7వ పేరా :- ఇట్లనుటచేత జ్ఞానము సంపాదించుటకు పుస్తక సాహాయ్య మవసరము కాదని కాదు. పుస్తకములు మనపూర్వులు మనకిచ్చిన గొప్ప ధనము. వానిద్వారా మనము సత్యమును గ్రహింపవలసినదే. కాని వానిని మూఢముగా నమ్మరాదు. వానిలోని మంచినీ చెడునూ మనబుద్ధితో విచారించి మంచి యెందున్నను గ్రహించవలెను.

8వ పేరా :- భగవంతుఁడు మనకు రెండు వేదముల నిచ్చినాఁడు. ఒకటి ప్రపంచము. దీనిలోని ప్రతివస్తువును బరమేశ్వరుని మహిమను వేనోళ్లఁ జాటుచుండును. రెండవది మన మనస్సు. ఇది నిరంతరము మనకు హితోపదేశము చేయుచుండును. ఈ రెంటి ద్వారా భగవంతుఁడు నిరంతరముగాఁ దన యుపదేశములను మనకు వినిపించుచునేయున్నాఁడు. ఈ రెంటిని నమ్మినవాఁడు చెడిపోఁడు.

9వ పేరా:- మనస్సును నమ్మినచో నవైకమత్యము కలుగునని భయపడుట సరియైనది గదా! ప్రతివారి హృదయములందును గొన్ని ప్రాథమిక సత్యములు స్థిరముగానున్నవి. కనుక దేవుఁడు ధర్మము సత్యము మొదలగు వానిని గుఱించి మనము నమ్ముచున్నాము. పైకి దేవుఁడు లేఁడను వారియందును నీ ప్రాథమిక సత్యములున్నవి. కనుకనే వారుగూడ లోలోపలఁ గొన్ని నియమముల నమ్ముచున్నారు. ఇది యందరకు సామాన్య ధనము.

10వ పేరా:- మన ఆత్మజ్ఞానమునకు దైవజ్ఞానమునకు వేదమే కారణమనుట సరికాదు. వేదమునకు ముందే మనకిది యున్నది. లేనిచో వేదము దైవదత్తమని నమ్ముటకు కుదురదుగదా! సహజజ్ఞానము ననుసరించిన విమర్శవలన మన జ్ఞానము

వృద్ధినొందును. వేదములనే మూఢముగా నమ్మినచో విమర్శ లేదు. అది లేనిచో జ్ఞాన మభివృద్ధి గాదు. అప్పుడు ప్రకృత్యాది శాస్త్రజ్ఞులకును మతమునకును సరిపడక మతము ప్రపంచమునకు దూరమయి పోవును. కనుక సత్యమెక్కడ నున్నను గ్రహించుచు, నసత్యమెక్కడ నున్నను విడిచిపెట్టుటను నేర్చుకొను యభ్యాసము చేయవలెను.

11వ పేరా:- కనుక నెవరైనఁ దాత్కాలికముగా దుర్మత దురాచారములకు లోఁబడినను నాత్మోపదేశము నమ్మి యాచరించినచో దురాచారములు నశించుటయే కాక యెక్కడనో యనక హృదయముననందే భగవంతుని దర్శించి యాత్మానందము నందగలరు. కనుక సత్యమెక్కడ నున్నను గ్రహించి యసత్యమును బరిహరించు బుద్ధిని దయచేయుమని భగవంతుని ప్రార్థింతము.

## కఠినపదార్థములు: వివరణములు

ఐహిక + ఆముష్మికములు = ఈ లోకమునకు బరలోకమునకును సంబంధించినట్టివి (స॥దీ॥సం); అమోఘ ప్రమాణము = తిరుగులేని ప్రమాణము; ఈశ్వరదత్తము = భగవంతునిచేత నీయఁబడినది (తృతీ. తత్పు); ఈశ్వర సద్భావము = ఈశ్వరుఁ డున్నాఁడనుట; కేవల + ఉన్మాదము (గుణ సంధి.): ఉన్మాదము = వెఱ్ఱి; ఆస్తికుఁడు-"వ్యు": భగవంతుఁ డున్నాఁ డున్నాఁడని భావించువాఁడు; ఆస్తికుఁడు కానివాఁడు నాస్తికుఁడు (నఞ్ తత్పురుష సమా.); భ్రమ = ఒకదాని నింకొకటిగా భావించు బుద్ధి; ప్రమాదము = పొరపాటు; సాధనము = సాధించు నుపాయము; సహజజ్ఞానము = తనంతఁ దానుగాఁ గలిగిన జ్ఞానము; ఈశ్వర + ఉపదిష్టము (గుణసంధి); ఉపదిష్టము = ఉపదేశింపఁబడినది; అత్యంత + ఆవశ్యకము (స॥ దీ॥ సంధి): అలౌకికము = లోకము నతిక్రమించి యొప్పునది; యుక్త + అయుక్త వివేకము = ఇది తగినది, ఇది తగనిదియని మంచిచెడ్డల గుర్తించు జ్ఞానము; పరమమయిన సాధనము (కర్మధారయ సమా.): యుక్తి యుక్తము = Logical. యుక్తితో కూడినది (తృతీ. తత్పు.); బుద్ధి + అనుసారము (యణాదేశసంధి); సార + అసారములు (స॥ దీ॥ సంధి. ద్వంద్వ సమాసము); భగవత్ + దత్తము = భగవంతునిచేత నొసంగఁబడినది. (తృతీ. తత్పు): సర్వ + ఉత్కృష్ట ప్రమాణము = అన్నిఁటికన్న గొప్పదయిన ప్రమాణము (గుణ సంధి); అతి + ఆసక్తుఁడు = మిక్కిలి యాసక్తి కలవాఁడు; సత్యవేదము (విశేషణ పూర్వపద కర్మధారయము); ఆధిక్యము = గొప్పదనము; సర్వ + ఉత్తమము (గుణ సంధి); వేద ప్రమాణవాదులు = వేదమే ప్రమాణమని వాదించువారు; గణన + అతీతులు = లెక్కకు మించినవారు: హృదయమనెడి ఫలకము (రూపక సమాసము); జ్ఞాన + ఉపదేశము; తత్ + ఇతరములు = దానికన్న వేరయినవి; నేత్రగోచరుఁడు = కన్నులకు గనపడువాఁడు; జారత్వము = వ్యభి

గాని యీ వాక్యమును బలికినవారు చాల గొప్పవారు కనుక అది అసత్యమయినను, లోకమునఁ బ్రత్యక్షముగాఁ గనుపించు దానికి భిన్నమయినను సత్యమనియే భావింపవలయు ననుట సమంజసము కాదని వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము. దీనినే భంగ్యంతరముగాఁ బై వాక్యముచేత వివరించినారు శ్రీ పంతులుగారు.

శంకర భగవత్పాదులు చాల మహత్త్వము గలవారు. అద్వైత వేదాంతము ద్వారా ప్రపంచమునకు నూతన సిద్ధాంతములఁ బ్రసాదించిన యీ మహనీయుఁడు వచ్చి చెప్పినను సరే సత్యము సత్యమేకాని యసత్యము కాదు. ఆయన యొకవేళ నట్లు చెప్పినను బ్రపంచము దానిని నమ్మదు.

లోకమునఁ గాకు లన్నియు నల్లగాను గొంగ లన్నియుఁ దెల్లగాను నుండుట కనుపించు చున్నది. దీని నెవ్వరయినను నిట్లే చెప్పవలయును. దీనికి విరుద్ధముగా నెవ్వరేది చెప్పినను మన యనుభవమున భిన్నమయినందున దానిని మనము నమ్మము. ఆ చెప్పిన వాఁడెంత గొప్ప వాఁడయినను లోకాభిప్రాయము మాత్రము మారదు. దానికిఁ గారణ మా చెప్పిన విషయమే కాని చెప్పినవాఁడు కాఁడు.

క్రాగుచున్న సీసమును ద్రాగిన మహానుభావుఁడుగాఁ జెప్పఁబడిన వాఁడిక్కడ శంకరాచార్యులు. ఆయన యొకమారు శిష్యులకుఁ దన నిస్సంగత్వమును సనిదర్శనముగాఁ జూపుటకయి యట్టి యద్భుత చర్యను జూపెనని కథ.

2. "భూమండలము నంతను చాపచుట్టవలెఁ జుట్టి మోసిన ఘోర రాక్షసుఁడైన హిరణ్యాక్షుని మహిమ యీ దేవ మహిమను క్రిందుపఱచుచున్నది."

సమా:- ఈ వాక్యము కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగము పంతులుగారి యీశ్వరదత్త పుస్తకములను పాఠమునుండి గ్రహింపఁబడినది.

ఏదయిన నొక విషయమును నమ్ముటకుఁ గాని పరిహరించుటకుఁ గాని దానిలోని మంచి చెడ్డలే కారణము కావలయును గాని యద్దానిఁ జెప్పినవారు మాత్రము కాదు. ఆ చెప్పిన వాని మహత్త్వమును బట్టిగాని యాతఁడు చూపిన యింద్రజాల మహేంద్రజాలములను బట్టి గాని దేనినయినను మంచిదని గాని కాదని గాని నిర్ణయింపరాదు.

వేదము లీశ్వరదత్తములని యెవరో మహాత్ములు చెప్పినంత మాత్రమున దానిని మనము నమ్మవలసిన పనిలేదు. ఒకవేళ వారి మహత్త్వమును బట్టి కొలఁది సేపటి కంగీకరింతమనియే యనుకొందము. ఆ మహత్త్వ మొక్క మంచివారికి మాత్రమే కలదనియుఁ గూడఁ జెప్పఁబడలేదు. పురాణములలో నద్భుత చర్యలు కొన్ని శ్రీకృష్ణుని యందు మాత్రమే కాదు హిరణ్యాక్షుఁడను రాక్షసునియందు నున్నట్లు చెప్పఁబడినది.

శ్రీ కృష్ణుఁడు గోవర్ధన పర్వతమును జిటికెన వ్రేలితో లేపఁగా, హిరణ్యాక్షుఁడు నంతకన్న మిక్కిలి పెద్దదయిన భూమండలమును జాపవలెఁ జుట్ట చుట్టినాఁడట! ఈ యద్భుత చర్యలను బట్టియే సత్యాసత్యములను నిర్ణయింప వలసి వచ్చుచో శ్రీకృష్ణుని వాక్యముల కన్నను హిరణ్యాక్షుని వాక్యములు పరమ ప్రమాణములని యొప్పుకొన వలసి వచ్చును. కనుక అది తగదనుట.

హిరణ్యాక్షుఁడు భూమిని జాపవలెఁ జుట్టఁగా నారాయణుఁ డాదివరాహ మూర్తియయి వానిని జంపి భూమి నుద్ధరించె నని శ్రీమద్భాగవత గాథ.

3 :- "గత కాలము మేలు వచ్చు కాలము కంటెన్"

సమా :- ఇది కీ॥ శే॥ రావుబహదూరు కందుకూరి వీరేశలింగముగారు తమ యీశ్వరదత్త పుస్తకములను వ్యాసమున నుదాహరించిన యార్యోక్తి.

భవిష్యత్తునకు సంబంధించిన దంతయు నయోమయముగాఁ గనుపించుచుండును. దానిని గుఱించి మనకు స్పష్టమయిన పరిజ్ఞానముగాని, శాసింపగల శక్తి కాని యుండదు. కనుక నిరంతర మేది యెట్లు కాఁగలదో యను చింత మనస్సు నంటిపెట్టికొని యుండును.

భూత కాలమునకు సంబంధించిన విషయ మటువంటిది కాదు. అది మన కనుభూత పూర్వము. దానిలోని సంగతు లన్నింటిని గుఱించియు మనకు బాగుగాఁ దెలియును. కనుక వాని స్మరణము వచ్చినప్పుడెల్ల నా కాలమే చాల సుఖముగాఁ గడచినట్లు తోచి యానందము కలుగుచుండును. ఇది మన మనస్తత్వమునకు సంబంధించిన విషయము. అంతేకాని సత్యము కాదు. నిజమునకు భూతభవిష్యత్తులందు రెంటను సుఖదుఃఖము లున్నవి; మంచి చెడ్డలున్నవి. దేనియందును కేవల సుఖము గాని, కేవల దుఃఖముగాని లేనేలేదు.

కొందఱు మన ప్రాచీనుల మహత్త్వమున కుదాహరణముగా వారు చెప్పినట్లు నేడు వర్ణ సాంకర్యము కలిగి ధర్మము నశించుచున్నదను విషయమును జెప్పుచుండురనియుఁ, గాని యథార్థమును నిర్ధారణము చేయుటకయి పురాణ గ్రంథములను జాగ్రత్తగాఁ బరిశీలించినచో నేటి సంఘమున నెవ్వరును నంగీకరించని యధర్మ విషయములు కొన్ని- ధర్మము నాలుగు పాదములతో ప్రవర్తిల్లినదన్న కృత యుగమునాడు జరిగినవని తెలియుననియు చెప్పి, వీరేశలింగముగారు దీని కుదాహరణముగా తారాశశాంక కథను జూపిరి. ఆ సందర్భముననే పై యార్యోక్తి చెప్పఁబడినది.

ఈ యార్యోక్తి సత్యముకాదని వీరేశలింగముగారు హేతుబద్ధముగా వచించినారు. ఆర్యోక్తియనఁగా వృద్ధ పరంపరగా వచ్చుచుండెడి నానుడి.

## ప్రశ్నలు - సమాధానములు

ప్ర. 1:- శ్రీ కందుకూరి వీరేశలింగముగారిని గుఱించి పరిచయ వాక్యములు వ్రాయునది.

స:- సమాధానమునకయి పాఠ్య పరిచయము చూడవలెను.

ప్ర. 2:- "ఈశ్వర దత్త పుస్తకముల"ను పాఠమును సంగ్రహించునది.

స:- సమాధానమునకయి పాఠ్య సారమును చూచునది.

ప్ర. 3:- ఈశ్వర దత్త పుస్తకము లనఁగా నేమి? వానిని గుఱించి వీరేశలింగముగారి యభిప్రాయమేమి? వ్రాయునది.

స:- ఈశ్వర దత్త పుస్తకము లనఁగా నీశ్వరునిచేత నొసంగఁబడిన గ్రంథములు. అనఁగా మానవ కర్తృకములుగాక మానవుల శ్రేయస్సునకయి భగవంతుని చేత నేర్పఱుపఁబడిన నియమముల నుపదేశించు గ్రంథములన్నమాట. మానవులందఱును భగవంతునకు బిడ్డలవంటివారు. కనుక భగవంతుఁడు తన సంతానము చెడు మార్గములఁబడి చెడిపోకుండ చక్కగా నభివృద్ధి గాంచుటకై యేర్పాటు గావించి యొసరించిన యుపదేశములు.

మతమను భవనమునకు దేవుఁడు మూలస్తంభము. మత గ్రంథములగు వేదములు, ఖొరాను, బైబిలు మున్నగునవి యాయా మతముల వారికి భగవంతుఁడొసంగిన గ్రంథములని యాయా మతముల వారి నమ్మకము. వేదములు హిందువులకును, బైబిలు క్రైస్తవులకును, ఖొరాను మహమ్మదీయులకును మత గ్రంథములు. వీనినే భగవంతుఁ డొసంగెనని యా మతములవారి నమ్మకము. అంతేగాదు-పై మతములవారు తమ గ్రంథము మాత్రమే భగవత్కృతమనియు నితరుల గ్రంథము లట్టివి కావనియు భావింతురు. వేదములకును, ఖొరానునకును, బైబిలునకును గర్త లెవరో తెలియదు.

శ్రీ వీరేశలింగముగారు తమ యీశ్వర దత్త పుస్తకములను నుపన్యాస వ్యాసమునందుఁ బై గ్రంథములు భగవద్దత్తము లనుట విశ్వాసార్హము కాదనియు, నవియు నితర గ్రంథములవలెనే మానవ కర్తృకములే యనియు నిరూపించుటకుఁ బ్రయత్నించినారు.

ప్ర. 4:- ఈశ్వర దత్తములయిన పుస్తకములుండుట యసంభావ్యము కాదను వారి వాదమును పాఠ్యోక్త రీతిగా వివరింపుఁడు.

స:- ప్రపంచము నందీశ్వరుని యస్తిత్వమునే యొప్పుకొనని నాస్తికులు కొందఱు. ఈశ్వరుని యస్తిత్వము నంగీకరించు వారిలో కొందఱు వేదాది మత

గ్రంథము లీశ్వరదత్తములని వాదించుచున్నారు. మఱికొందఱు వేదాది గ్రంథములును దదితర గ్రంథములవలెనే యెప్పుడో దీర్ఘదర్శులయిన ప్రాచీన రచయితల రచనలని భావించుచున్నారు.

వేదాది మత గ్రంథము లీశ్వరదత్తములని యంగీకరించువారి వాదమును వీరేశలింగముగారు రీ క్రింది విధముగా వచించినారు.

భగవంతుఁడు పరమదయా స్వభావము గలవాఁడు. ఈ సృష్టియంతయు నాతనికి సంతానమువంటిది. తన సృష్టిలోని వారందఱును సన్మార్గాచరణము గలవారయి యిహమున సుఖముగా జీవించి యంతమున మోక్షము నందవలయుననుట యాశ్వరోద్దేశముగా నుండవలయుననుట యుక్తి యుక్తము. సన్మార్గ ప్రవర్తనమునకు మంచి చెడ్డలను గ్రహించుటయు నట్లు నడుచుకొనుటయు నవసరములు. ఏది మంచియో ఏది చెడ్డయో తెలిసికొనుట చాల కష్టము. ప్రతి విషయమును ననుభవముమీఁదనే గ్రహించుట క్లేశదాయకము; నసాధ్యమును. పోనీ యదిగాక మానవులకు బుద్ధియను నింకొక సాధనమున్నదిగదా! దానివలన మంచి చెడ్డలను గ్రహింపవచ్చుననుకొన్నచో మానవబుద్ధి చాల సామాన్యమయినది. అది భ్రమ ప్రమాదాదులకు లోనయినది. కనుక దానిమీఁద నాధారపడి మంచిచెడ్డల నిర్ణయించుట చాల కష్టము. ఒకపని యొకని బుద్ధికి చాల మంచిదిగాఁ గనుపింపఁగా నా పనియే యింకొకని బుద్ధికి చెడుగాఁ గనుపించును. ఇందెవరి యాలోచనము వారికే మంచిదిగాఁ బొడకట్టును. అందువలన బుద్ధిపై నాధారపడి మంచిచెడ్డలను నిర్ణయించుట కష్టమని తేలినది.

కనుకనే పరమదయా స్వభావముగల భగవంతుఁడు మానవులు చెడిపోకుండ నుండుటకయి వారు ప్రవర్తింపవలసిన విధానమును వేదాదులవలన లోకమునకుఁ బ్రసాదించినాఁడు. భగవత్కృతమగుటవలన వేదములందు భ్రమ ప్రమాదాదులకుఁ దావులేదు. మానవులు వానిని తూచా తప్పక యనుసరించినచో నే కష్టములకును లోనుగాక సద్గతి నందుదురు. వేదము భగవద్దత్తమగుటవలన దాని మంచిచెడ్డలు నిర్ణయించుట మనకు సాధ్యముగాదు.

కొన్ని యెడల మన యల్పబుద్ధికి వేదములలోఁ జెప్పఁబడిన వాన్నిని గుఱించి యనుమానము కలిగినను నది పరమప్రమాణమనుటవలన నెవ్వరును దానిని వ్యతిరేకించుటకుఁ బ్రయత్నింపరు. అప్పు డందఱకును వేదమే ప్రమాణమయి యన్ని విషయములయెడను నేకాభిప్రాయము కలిగి పరస్పర ద్వేషములు లేక యందఱును సద్గతినందుట కవకాశ మేర్పడును. కనుకనే భగవంతుఁడు మనుష్యులెవరికిఁ దోచినట్లు వారిని ప్రవర్తింపనీయక నుండుటకయి వారికి మార్గదర్శకముగా నుండుటకయి వేదము నొసంగినాఁడు.

ఇది వేదవాదుల వాద సారాంశము. శ్రీ వీరేశలింగముగారు తమ వ్యాస మున నీ వాదము సరియయినదికాదని భావించినారు.

భగవద్దత్తములని యంగీకరించినతోడనే వానియందు మూఢ విశ్వాసము కలుగును. అందుఁ జెప్పఁబడినవన్నియు గ్రుడ్డిగా నమ్మఁదగినవగును. అది వీరేశ లింగముగారి కంగీకార్యముగాదు. దేనినయినను సరే దాని మంచి చెడ్డలను విచా రించి కాని నమ్మరాదని వీరేశలింగముగారి యభిప్రాయము. వేదములు భగవత్కర్తృకములన్న వాదమును సైతము హేతుబద్ధముగా నాలోచించి యుక్తి యుక్త ముగా నిలిచినప్పుడు మాత్రమే యంగీకరింపవలయును కాని యూఁతకయే యంగీ కరింపరాదనుట పంతులుగారి మతము.

వేదాది గ్రంథములు భగవద్దత్తములు కావని నిరూపించుచు శ్రీ వీరేశ లింగముగారు భగవంతుని స్వభావమును బట్టి యాతఁడు మనుష్యులకయి యిట్టి గ్రంథముల సృష్టించుననుట నమ్మదగినది కాదనియు, నెవరికి వారు ప్రపంచానుభ వము చేతను, బుద్ధి నుపయోగించి మంచిచెడ్డలను గమనించి ప్రవర్తించుటచేతను నభివృద్ధినందవలయునని భగవంతుని యుద్దేశమయినట్లు కానవచ్చుననియు వచించి నారు. ఒకవేళ సృష్టించునే యనుకొన్నను గొందఱకే యర్థమగు నేదోయొక భాషలోనే యట్టి గ్రంథముల నొసఁగుటయు, నవియు ననేక విధములగు నర్థముల కవకాశము కలుగునట్లు రచితములగుటయు నంతకన్న పొసఁగవనియు వారు వచించినారు. కనుక వేదములు భగవత్కర్తృకములు కావనుట పంతులుగారి వాదసారము.

అట్లని వేదగ్రంథములు పఠింపరాదని యెవ్వరు ననుకొనరాదు. జ్ఞానోపార్జ నకు గ్రంథములే ముఖ్యోపకారకములు. కనుక కడమ గ్రంథము లన్నింటివలెనే వేదములనుగూడఁ దప్పక చదువవలయుననియు నందుఁగల మంచిని గ్రహించి చెడును బరిహరించవలయుననియు నప్పుడే యభివృద్ధికిఁ జక్కని యవకాశము లభింపఁగలదనియు శ్రీ వీరేశలింగముగారి భావము.

ప్ర. 8:- ఈశ్వర దత్త గ్రంథములు లేవనువారి వాదమును మీ పాఠ్యో క్తముగా వ్రాయునది.

శ్రీ వీరేశలింగముగారు "ఈశ్వర దత్త పుస్తకములు" అను తమ యుపన్యా సమునందు వేదాది మత గ్రంథము లీశ్వరదత్తములను వాదము విశ్వాసార్హము కాదని సహేతుకముగా నిరూపించినారు. వారు వేదాదు లీశ్వరదత్తములని వచించువారి వాదమును ముందు నిరూపించి పిదప దానిని ఖండించినారు.

వేదము లీశ్వరదత్తములను వారు భగవంతుఁడు దయా స్వభావముగల వాఁడు కనుక మానవాభ్యుదయమునకయి వేదాదుల సృజించి యిచ్చెనందురు.

వీరేశలింగముగారు భగవంతుఁడు దయా స్వభావముగలవాఁడనుట నంగీకరించి మానవులు మంచిచెడ్డలను గ్రహించి బాగుపడుటకు భగవంతుఁడు వారి కనుగ్రహించినది బుద్ధిని మాత్రమే యనియు నద్దాని ననుసరించియే మానవులు బాగుపడుదురనియు వచింతురు.

బుద్ధిపై నాధారపడినచో ననైకమత్యము కలిగి యంతః కలహములకుఁ గారణమగునన్న వేదవాదుల వాదమును వీరేశలింగముగారు ఖండించుచు నొక్క వేదముననే పలువిధములుగా నర్థములుచెప్పి పలుమతముల స్థాపించిన శంకరాచార్యాదుల విధము వివరించి వేదమువలన నట్టి యైకమత్యము కలుగలేదనుటను నిరూపించి తమ వాదమును నిలిపిరి.

లిఖితమయిన వేదమును బ్రసాదించుట సర్వవ్యవహారము లందును దటస్థుఁడుగా నుండు భగవంతుని స్వభావముననే విరుద్ధమని వక్కాణించిరి.

సర్వ సమర్థుఁడయిన భగవంతుఁడు నిజముగానే యట్టివేదమును బ్రసాదింపఁ దలఁచికొన్న పక్షమున నెవ్వరికో కొలఁదిమందికి మాత్రమే యర్థమగున ట్టేయొక్క భాషలోనో రచించియుండఁడనియు నందరియెడను సమానముగా వాత్సల్యముగల యా భగవంతుఁ డందఱకు నర్థమగునట్లుగా బోధనలను వినిపించి యుండుననుట సమంజసముగా నుండుననియుఁ జెప్పి శ్రీ వీరేశలింగముగారు పై నియమమునకు సరిపడిన దొక్క మనోవేదమే యనియు నది యందఱకును నొకే విధముగా నన్నివేళలందును సహజబోధము కలిగించుచుండుననియు వచించినారు.

నేడు శాస్త్ర మనేక నూతన రహస్యములను గనుఁగొని బయలువఱచుట మనము చూచుచున్నాము. అతి పురాతన కాలమున వెలువడిన లిఖితవేదమే భగవత్కృతమని నమ్మవలసి వచ్చినచో నేడు శాస్త్రముచే ప్రత్యక్షముగా నిరూపితములయిన యనేక విషయములు వేదములందుఁ జెప్పఁబడినవానికి భిన్నములుగా నుండుటచేత మతమునకును శాస్త్రవిజ్ఞానమునకు సంఘర్షణ మేర్పడును. శాస్త్రజ్ఞులకు మతముపైన విశ్వాసము కలుగును. భగవంతునిపై భక్తి తగ్గిపోవును. దానివలన మానవాభివృద్ధి కుంటువడును. అట్లుగాక వేదములును సామాన్య గ్రంథములవలెనే మానవ కర్తృకములన్నచో శాస్త్రజ్ఞు లొక్కొక్క క్రొత్త విషయమును గనుగొన్నప్పుడు అవియన్నియు నంతకుముందు సృష్టి యందున్నవే యగుటచేతను, సృష్టియంతయు భగవన్నిర్మితమను నమ్మకముచేతను భగవంతుని గూర్చిన మన విజ్ఞానము పెంపొందుచున్నట్లయి మతమునందును భగవంతుని యందును విశ్వాసము పెరుగును. శాస్త్రమునకును మతమునకును బరస్పర సామరస్యము కుదిరి మానవజాతి కభ్యుదయము కలుగును.

కావున సృష్టివేద మనోవేదములే భగవద్దత్తములు కాని లిఖితవేదములు భగవత్కృతములు కావనుట పంతులుగారి వాదమునకు సారాంశము.

ప్ర. 4 :- "ఇప్పటి కాలమువారి కిట్టి కథల యందలి నమ్మక మిప్పుడిప్పుడు క్రమముగా తగ్గుచున్నది" అని శ్రీ వీరేశలింగముగా రుదాహరించిన కథలను వ్రాసి వానిని వారు విమర్శించిన విధము నుల్లేఖించునది.

స :- శ్రీ వీరేశలింగముగారు తమ "యీశ్వర దత్త పుస్తకములు" అను నుపన్యాస వ్యాసమునఁ బ్రాచీన కాలమున జరిగినట్లు వ్రాయఁబడిన కథలు కొన్ని కేవలము కల్పితములనియు నవి విమర్శించి చూచినచో సత్యదూరములయినట్లు తేలుననియు వచించి శ్రీమద్రామాయణము నందలి హనూమద్వృత్తాంతమును, పురాణములందు వర్ణితమయిన హిరణ్యాక్షుఁడు భూమిని జాపవలెఁ జుట్టె నన్న కథను, బైబిలునందు వర్ణింపఁబడిన భూమధ్య సముద్రస్థ తిమింగిలము మనుష్యుని మ్రింగి మూఁడుదినముల తరువాత సజీవునిగా విడిచిన వృత్తాంతమును నుదాహరించి విమర్శించిరి.

హనూమద్వృత్తాంతమున నతిశయోక్తి మెండుగాఁ గలదనియు బహుశః ఒకకోతి తాటికాయంత రాయి నెత్తిన యొక సామాన్య సంఘటనమే గోరంతలు కొండంతలయి యొకరినుండి మఱియొకరి ద్వారా హనుమంతుఁడు కొండ నెత్తిన ఘట్టముగాఁ జిత్రితమయి యుండునని వచించినారు శ్రీ వీరేశలింగముగారు.

హిరణ్యాక్షుని గాథ యింతకన్న మఱింత విచిత్రమయినది. ఆతఁడు భూమిని జాపవలెఁజుట్టి చంకయందుంచుకొనియెనట! ఈ కథయే హేతువాదమునే కాని యంగీకరింపని మన విద్యార్థులకడఁ జెప్పెడు పక్షమున విద్యార్థులా చెప్పెడువారి నపహాస్యము చేయక మానరనియు వారి ప్రశ్నలకా యుపాధ్యాయుఁడు నిరుత్తరుఁడు కాక తప్పదనియు శ్రీ వీరేశలింగముగారు వచించినారు.

"ఇంత విశాలమయిన భూమిని జాపగాఁ జుట్టుట కేవలము కల్పనము. ఒక వేళఁ జుట్టినాఁడనియే భావింతము! ఆ చుట్టిన హిరణ్యాక్షుని యాకార మెంత పెద్దిగా నుండవలెను? భూమికన్నను పెద్దదిగా నుండవలయును గదా! ఉన్నదనియే యనుకొందము. అట్టివాఁడెక్కడ నిలిచి భూమిని జాపవలెఁ జుట్టెను? అంతకు ముందాతఁడు భూమిపై నెట్లు నివసింపఁగలిగెను?" ఇవి యన్నియు సమాధానము లేని ప్రశ్నలే.

ఇట్టిదే బైబిలునందున్న తిమింగిలము కథ. శాస్త్రపరిజ్ఞానము తక్కువగా నుండి యేది చెప్పినను నమ్ము స్వభావముగల ప్రాచీనజనులు దీనిని నమ్మి యుందురు. కాని నేటి విద్యార్థులు మాత్రము దీనిని నమ్మరు. ఈ కథ విన్న వెంటనే వారనేక ప్రశ్నముల నడిగి యా కథయొక్క నిరాధారతను నిరూపింతురు.

భౌగోళిక పరిజ్ఞానము బాగుగా సంపాదించిన నేటి విద్యార్థులకు భూమధ్య సముద్రమున నక్కడి యుష్ణ స్వభావమునుబట్టి తిమింగిలములు బ్రదుకఁ జాలవ

చక్కగాఁ దెలియును. అంతేగాదు, ఒకవేళ సెట్లో తిమింగిల మున్నదనుకొన్నను తిమింగిలము గొంతు చాల చిన్నదనియు నందులోనికి చిన్నచిన్న చేపలు మాత్రమే పోఁగలవనియు, నెట్టి పరిస్థితులలోను నంత సన్ననిగొంతు రంధ్రముగల తిమింగిల మొక మనుష్యుని మ్రింగుట యసంభవమనియు నొకవేళ మ్రింగినను నాతఁడు బ్రదికి మూఁడు దినముల తరువాత వెలుపలికి వచ్చుట నమ్మరాదనియు - నేటి విద్యార్థులు హేతుబద్ధముగా నూహింపఁగలరు కనుక వారా కథలను నమ్మరు. నమ్మక, చెప్పినవారిని పరిహాసించి నోరు మూయింతురు.

దీనికిఁ గారణము నేటి విద్యార్థులకు సరియయిన శాస్త్రీయ విజ్ఞానము కలుగుటయే. అట్టి శాస్త్రీయ విజ్ఞానము వృద్ధికి వచ్చిన కొలఁదియు జనులకు మూఢవిశ్వాసములు నశించి యభివృద్ధికి మార్గమేర్పడును. వీరేశలింగముగారికీ విధానము మిక్కిలి యిష్టమయినది.

ప్ర. 6 :- పుస్తకముల కెట్టి స్థాన మీయవలయునని శ్రీ వీరేశలింగము గారి యభిప్రాయమో మీ పాఠ్యభాగ మాధారముగా వివరింపుఁడు.

స :- రావు బహదూరు శ్రీ వీరేశలింగము పంతులుగారు వేదాది గ్రంథములు ఈశ్వరదత్తము లనుటను దీవ్రముగా విమర్శించి యట్లనుటచేత నెవ్వరయినను వేదములు చదువ నగత్యము లేదను దురభిప్రాయమునకు లోను కారాదని హెచ్చరించినారు.

వేదములు భగవద్దత్తములు కాకపోయినను వాని మహత్త్వమునకు క్షతి లేదు. మంచి యెందున్నను గ్రహింప వలసినదే. వేదము నందున్నను వేమన శతకము నందున్నను మంచి పరిగ్రాహ్యమే. అట్లే చెడ్డ యెందున్నను బరిత్యాజ్యమే. వేదములు పరమ ప్రమాణములను మూఢ విశ్వాసము మాత్రము పనికిరాదు. అట్టి విశ్వాసము వలన యుక్తాయుక్త విచక్షణ కవకాశము లేకపోవును. బుద్ధియే సర్వమునకును బరమ ప్రమాణమని యంగీకరించి పుస్తకముల సాహాయ్యమున నా బుద్ధిని నిశిత మొనర్చుకొని విచక్షణ జ్ఞానమును బెంపొందించు కొనవలెను.

జ్ఞానోపార్జనమునకు పుస్తకములు ముఖ్య సాధనము లనుటలో నెవ్వరికి నభిప్రాయభేద ముండరాదు. పూర్వులు తాము సంపాదించిన జ్ఞాన ధనమును బుస్తకములలో భద్రపఱచి మనకిచ్చి పోయినారు. పుస్తకము లక్కఱ లేదనుట వారి జ్ఞాన భాండారము మన కక్కఱ లేదనుటయే. దాని నెవ్వరు నంగీకరింపరు. జ్ఞానము సర్వ ధనము లందును శ్రేష్ఠమయినది. పూర్వు లొసంగిన ధనము వలదను వారుండనట్లే పూర్వుల విజ్ఞానము మన కవసరము లేదనువారు నుండరు. అట్టి పూర్వుల విజ్ఞాన ధనమును జూఱఁగొనుటకు సాయపడునవి యొక్క పుస్తకములు మాత్రమే. కావున మనము మన విజ్ఞానమును బెంపొందించుకొనుట కయి నిరంతరము పుస్తకములను జదువుచునే యుండవలయును. అందున్న మంచి

చెడ్డలను మనకు భగవంతుఁ డనుగ్రహించిన బుద్ధి చేత వివేచించి మంచిని గ్రహించి చెడును బరిత్యజించు చుండవలెను. అట్లయిన మనము క్రమక్రమముగా నుత్తమ స్థితి నందఁగలము.

ఇది శ్రీ వీరేశలింగముగారు గ్రంథముల యావశ్యకతను గుఱించి వచించినదాని సారాంశము.

ప్ర. 6 :- "ఈశ్వరుఁడు మనకుఁ బ్రసాదించినవి రెండు వేదములు" అన్న శ్రీ వీరేశలింగము గారి వాక్యమును వివరింపుఁడు.

స :- శ్రీ వీరేశలింగముగారు తమ యీశ్వర దత్త పుస్తకములను నుపన్యాసమున బైబిలు, ఖురాను, వేదములు మొదలగునవి భగవద్దత్తములు కావని నిరూపించి, యట్లయిన మనము మన ప్రవర్తనమును సరిదిద్దుకొనుటకు భగవంతుఁ డేమియు దారిఁ జూపలేదా ? యను వారి ప్రశ్నమునకు సమాధానముగా భగవంతుఁడు మన కొసంగిన దొక్క వేదము కాదనియు నాతఁ డందఱకు నన్ని కాలముల యందు నుపయోగపడునట్లుగా నొసంగిన వేదములు రెండు గలవనియు వచించినారు.

అందొక్కటి సృష్టి వేదము. రెండవది యాత్మ వేదము. ఇవి రెండును పై మత గ్రంథములవలె నే యొక్క భాషలోనో యున్నవి కావు. ఏ యొక్కరికో యీయఁబడినవియును గావు. ఏ యొక్క కాలమునందో యిచ్చి యూఱకున్నవియునుగావు. ఇవి యందఱకు నాది కాలమునుండి నేటిదనుక నీయఁబడుచునే యున్నవి. ముందుఁ గూడా నీయఁబడఁగలవు. వీని మూలమున మంచిని గ్రహించి మానవులు సత్ప్రవర్తనము నలవఱచుకొని బాగుపడవలయునని భగవదాదేశమయినట్లు పరిశీలించినచో గ్రహింప వచ్చును.

భగవంతుఁ డిచ్చిన వేదములలో మొదటిది సృష్టివేద మంటిమి గదా! సృష్టిలోని ప్రతి వస్తువును భగవంతుని లీలలను, అనంత శక్తిని, యపార కరుణాళుత్వమును వివరించుచుండును. ఎన్ని వేదములయినను నీ సృష్టి వేదముతో సమానమయినవి కావు. ఇందిమిడియున్న జ్ఞాన మపారము. దీనిని గ్రహించినవారు భగవంతుని తత్త్వమును సమగ్రముగా నెఱుఁగఁ గల్గుదురు. సమస్త సత్యములును, సమస్త మతముల సారమును నీ సృష్టి వేదమునందే యిమిడి యున్నది. ఈ సృష్టి జ్ఞానమువలన మానవులు సద్గతి నందుదురనుటకు సందేహములేదు.

ఇఁక భగవంతుఁ డిచ్చిన రెండవ వేదము ఆత్మ వేదము. ఇది మన హృదయ ఫలకమునందు దివ్యాక్షరములతో నెన్నటికిని జెరిగిపోని విధముగా నందఱకు నర్థమగునట్లు లిఖింపఁబడియున్నది. మఱియొక విశేషమేమనఁగా నీ యాత్మ వేదము లిఖిత వేదమువలె నెక్కడనో నణఁగి మణఁగి నిరుపయోగముగా నుండక నిరంత

రమును మనకు జ్ఞానోపదేశము గావించుచు మనను సంస్కరించు చున్నది. దీని యుపదేశముల ననుసరించి మనము ప్రవర్తించు చున్నచో మనకు సద్గతి కలుగు ననుటకు సందేహము లేదు.

ఈ మనో వేదము వలన ననైక్యత కలుగునని కొందఱనవచ్చును. కాని యది సత్యము కాదు. ఈ యాత్మవేద మందఱకు నన్ని వేళలను నొకే విధమయిన యుపదేశముల నొసంగు చుండును. కాని వేఱు విధమునఁ గాదు. అట్లగుట చేతనే ప్రపంచము నందంత టన్నిమతము లందును గొన్ని నిత్యములయిన సత్య వచనము లుండుట తటస్థించినది. ఉదాహరణమునకు "సత్యమును పలుకవలెను" అన్న సూక్తిని గ్రహింతము. దీని నందఱు నన్నిమతములవారు నంగీకరింతురు. దీనికిఁ గారణ మాత్మవేదమే గాని యన్యము కాదు.

ఇట్లే మన మేపని గావింపఁ బూనినను మనలోని యంతరాత్మ వెంటనే దానిలోని మంచి చెడ్డలను నొక్కి వక్కాణించి మనకు మంచిని జేయుమని ప్రబోధించు చుండును. ఈ యాత్మ వేదము ఎల్లప్పుడు సిద్ధముగా నుండు పరామర్శ గ్రంథము (**Reference Book**) వంటిది. పరామర్శ గ్రంథమున నొకప్పుడు కొన్ని యంశములు లభింపక పోవచ్చును. అంతేగాక మనమయి చూచినఁగాని యది మనకుఁ గావలసిన యంశమును జూపలేక పోవచ్చును. ఈ యాత్మవేద మట్లుగాక తనకుఁ దానుగానే మనము విన్నను వినక పోయినను సర్వము నరఁటి పండు నొలిచి చేతనిడినట్లు వివరించి చూపుచుండును.

ఇట్లు భగవంతుఁడు మనకు ప్రసాదించిన సృష్టి వేదము నాత్మ వేదమును నమ్ముటయే యుత్తమ మనియుఁ గడమ వానిని జ్ఞానోపార్జనమునకు సాధనము లయిన గ్రంథ సామాన్యములని భావించుటయే హేతుబద్ధమును యుక్తియుక్తము నగుననియు శ్రీ వీరేశలింగముగారు భావించిరి.

---

# 3. గురూపదేశము
## (శివాజీ చరిత్రము – ఐదవ ప్రకరణము)

*(కీ॥ శే॥ శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు, M.A.)*

[జననము : 1877; కృష్ణా జి॥ నందిగామ తా॥ పెనుగంచి ప్రోలులో; నిర్యాణము: 12-7-1923 నాడు]

"గురూపదేశము" అను నీ పాఠ్య భాగము కీ॥ శే॥ శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు రచించిన "శివాజీ చరిత్రము" అను గ్రంథము నుండి గైకొనఁబడినది.

ఈ శతాబ్ది మొదటి పాదమున నుండిన శ్రీ లక్ష్మణరావుగారు ఆధునికాంధ్రయుగ నిర్మాతలలో నొక్కరు. సంస్కృతాంధ్ర మహారాష్ట్రాంగ్ల భాషలందు వారు గొప్ప విద్వాంసులు. ఆంధ్ర భాషను సర్వసంపన్న మయిన యాధునిక భాషగా దిద్దవలయు ననుట శ్రీ లక్ష్మణరావుగారి జీవితాశయము. అందుకయి వారు ఆంధ్రమున విజ్ఞానసర్వస్వము నారంభించి రెండు సంపుటములు ప్రకటించిరి. చరిత్ర గ్రంథముల రచించిరి. శాస్త్ర గ్రంథములఁ దాము వ్రాయుటయే గాక సమర్థులగు మఱికొంతమందిని గూడ అందుకు ప్రోత్సహించి వారిచే గ్రంథములు వ్రాయించి విజ్ఞానచంద్రికా గ్రంథమండలి ద్వారా ప్రకటించిరి. దేశీయులలో దేశభాష యెడ నాదరమును బెంపొందింపఁ జేయించిరి.

ఏది వ్రాసినను శ్రీ లక్ష్మణరావుగారు సమగ్రముగాను, సరళముగాను వ్రాయు నలవాటు కలవారు. ఎంతటి కఠిన విషయమునైనను దానికి సంబంధించిన గ్రంథములను క్షుణ్ణముగాఁ జదివి యర్థము చేసికొని పిమ్మట తమ మాటలతో దానిని అరటి పండొలిచి చేతనిడినట్లు ముక్కుకు సూటిగా మనసున కెక్కునట్లు రచించుట వారి విధానము.

ప్రస్తుత పాఠ్యము వారి శివాజీ చరిత్రములోనిది. ఇదియే గాక వారు హిందూ మహమ్మదీయ యుగము, మహారాష్ట్ర విజృంభణము, లక్ష్మణరాయ వ్యాసావళి, హిందూదేశ కథా సంగ్రహము అను గ్రంథములఁ గూడ రచించిరి.

మహమ్మదీయ పరిపాలకుల బాధలనుండి దక్షిణాపథమును గాపాడుటకు విజయనగర రాజులు ప్రయత్నించినట్లు, 17వ శతాబ్దమున మహారాష్ట్రమున హిందూ రాజ్యమును స్థాపించుటకు శివాజీ యత్నించెను. హరిహర బుక్కరాయలకు విద్యారణ్యస్వామి వలె శివాజీకి సమర్థ రామదాసస్వామి గురువయి యాతని చేత నా మహాకార్యమును నిర్వహింపఁ జేయించెను.

ప్రపంచ చరిత్రమునఁ దమ పేరుల చిరస్థాయి గావించుకొన్న యే గొప్ప రాజులయొక్క గాని, పరిపాలకుల యొక్కగాని చరిత్రలను జూచిన, వారిని వెనుకనుండి నడిపించిన మహాశక్తి గల యొక మహనీయుఁడు కనుపించుచుండును. ఆ మొదటి మహనీయుఁడు తన శాస్త్ర జ్ఞానము చేతను స్వశక్తి చేతను నొక మహా సిద్ధాన్తమును లోకమునకును, ప్రధానముగాఁ దన శిష్యునకు నుపదేశింపఁగా నా శిష్యప్రాయుఁడో లేక శిష్యుఁడో యయిన యా రెండవ వ్యక్తి యా సిద్ధాన్తమును కార్యరూపము నొందించును.

శ్రీ కృష్ణుఁడు భగవద్గీత యందు ప్రతిపాదించిన సిద్ధాన్తము నర్జునుఁడు అమలులో నుంచి చూపెను. ఈ కృష్ణార్జునుల వంటి సంబంధమే మనకు విద్యారణ్య హరిహరబుక్కరాయలకును, రామదాస శివాజీలకును, చాణక్య చంద్రగుప్తులకును, మార్క్సు లెనినులకును, గాంధీ నెహ్రూలకును నున్నట్లు కనుపట్టును.

ప్రస్తుత పాఠ్య భాగమున శివాజీకి సమర్థరామదాసస్వామి గురువయిన విధము వివరింపఁ బడినది.

## పాఠ్య సారాంశము

శివాజీ చరిత్రము వీరరస ప్రధానము. రామదాసస్వామి జీవితము, శాంత రస ప్రధానము. అయినను శివాజీకి స్వమత దేశరక్షణోత్సాహమును గలిగించిన వారిలో ముఖ్యుఁడయినందున రామదాసస్వామి చరిత్రము అవసరమయినంత వరకయినఁ జూపవలసియున్నది. లేకున్నచో శివాజీ చరిత్రము సమగ్రముకాదు.

మతోపదేశము సామాన్యముగా సంసార విరక్తికి కారణమగుచుండునని తలంచువారికి రామదాసస్వామి యుపదేశమే శివాజీని శూరునిగా దిద్ది తీర్చెననుట కొంత వింతను గలిగించును. కాని మతాభిమానము పూర్వకాలమున దేశాభిమానమునకు మిగుల పోషకముగా నుండెననుట చరిత్రముఁ జదివినవారికిఁ దెలియును. దీనికాంగ్లేయ చరిత్ర యందలి క్రాంవెల్ వృత్తాంతమును, హాలెండు దేశమునందలి ప్రజాసత్తాత్మక రాజ్యస్థాపనమును నుదాహరణములు. ఇంతేగాదు– ఉత్తమ వేదాంత గ్రంథమని భావింపఁబడు భగవద్గీతయే గదా! యర్జునుని రణ శూరునిగా నొనర్చినది! కనుక నిజమయిన మతము మనుజుని కర్తవ్యపరాఙ్ముఖునిఁ జేయదు; సరిగదా కార్యశూరు నొనర్చును.

మహారాష్ట్రమున ఏకనాథుఁడు ముక్తీశ్వరుఁడు మున్నగు సాధుపుంగవు లెందఱో శివాజీకి పూర్వమును తరువాతను జన్మించిరి. వీరిలో సమర్థ రామదాస స్వామి ముఖ్యుఁడు. ఈ సాధుపురుషులలో నన్ని కులములవారును గలరు. వీరు మహారాష్ట్రమునఁ జేసిన మహాకార్యములు మూఁడు :

**1.** సంఘ సంస్కరణము :— ఈ సాధువులలో తుకారాము వైశ్యుఁడు, నామదేవు శూద్రుఁడు, చోఖామేళా హరిజనుఁడు. అయినను వీరికి బ్రాహ్మణ భక్తులయిన యేకనాథ రామదాసులకుఁ గల గౌరవము మహారాష్ట్రమునఁగలదు. ఈ సాధువు లన్నికులములవారికిని సమానముగా భక్తి జ్ఞాన వైరాగ్యముల నుపదేశించిరి. తుకారాము అభంగములను గీతములు రచించి రాతివిగ్రహముల పూజను జాతి భేదమును నిందించెను. రామదాసస్వామి మూఢ విశ్వాసములను దొలఁగించెను.

**2.** భాషాభివృద్ధి:— మహారాష్ట్ర భాష నభివృద్ధిచేసిన కవులు సాధువులు. కనుకనే యాభాషయందు తెలుఁగునవలె శృంగార ప్రబంధములుకాక భక్తిరస కావ్యములే బయలుదేరినవి. జనులకయి యుద్దేశింపఁబడిన సాధుజనుల మహారాష్ట్ర కావ్యములు సంస్కృత పండితుల పరిహాసమునకు పాత్రములయ్యెను. తురక ప్రభువులకు కోపకారణము లయ్యెను. అయినను మహారాష్ట్ర సాధువులు— మహాదేవ గోవిందరానడేగారు వచించినట్లు "విద్యాప్రీతిచేతను, నజ్ఞానులకు ఈశ్వర జ్ఞానము సులభముగా లభింపఁ జేయవలయునను నిరపేక్ష పరోపకార బుద్ధిచేతను దేశభాషా వాఙ్మయము నభివృద్ధి చేసిరి. ఇట్టి వాఙ్మయము ఏ దేశమున కయినను భూషణాస్పదమే."

**3.** రాజకీయ సంస్కరణము :— హిందువుల నందఱను నొక్కచోఁ జేర్చి మహారాష్ట్రసాధువులు వారి కైకమత్యమును బోధించిరి. ఇట్టైకమత్యము నందిన హిందువులు మహమ్మదీయ రాజుల నెదుర్కొని పోరాడుటకుఁ గారణమయ్యెను.

## రామదాసస్వామి

ఇట్టి సాధువులలో రామదాసస్వామి ముఖ్యుఁడు. ఈతఁడు 1608 వ సంవత్సరమున గోదావరీ తీరమునందలి "జాంబ్" అను గ్రామమున జన్మించెను. స్వామి మొదటిపేరు నారాయణుఁడు. రామభక్తిచే రామదాసయి సమర్థుఁడగుటచే "సమర్థ రామదాసస్వామి" యయ్యెను.

## రామదాసస్వామి శివాజీకి గురువగుట

శివాజీకి చిన్ననాఁటి నుండియును పురాణమును వినుటయందు గొప్ప యాసక్తి యుండెను. ఆతఁడొకసారి తుకారామను సాధుపుంగవుని హరికీర్తనములను విని, దాని యందాదరము గలవాఁడయి నిరంతర మాకీర్తనలనే వినుచు లౌకిక కార్యములందు విముఖుఁడయి తుకారాము వలన జ్ఞానోపదేశమును గాంచవలెనని భావించెను. శివాజీ తన యుద్యోగులను తుకారాము నొద్దకు కానుకలతోఁ బంపి యా సాధుపుంగవునిఁ దనయొద్దకుఁ గొనిరా నియమించెను.

తుకారాము శివాజీ కోరికను నిరాకరించి తనకన్న రామదాసస్వామి నాశ్రయించుట శివాజీకి యుక్తమనియు లోకమునకు క్షేమకరమనియు సహూభాసమును వ్రాసిపంపెను. నాటినుండి శివాజీ సమర్థ రామదాసస్వామి నాశ్రయించి యుపదేశముఁ గాంచవలెనని యువ్విళ్లూరుచు నా స్వామి దర్శనమునకయి నిరీక్షించుచుండెను.

సమర్థ రామదాసస్వామియు నంతకుముందే శివాజీ కార్యదీక్షను, దేశాభిమానమును, మతనిరతిని వినినవాఁడగుటచేతఁ దానాతని బ్రోత్సహించి స్వమత స్థాపనకార్యమును సాధించవలయునని భావించుచుండెను. అట్టి సమయ మెప్పుడు వచ్చునాయని స్వామి నిరీక్షించుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁడు శివాజీ వేఁటకయి యరణ్యమున కరిగెను. అక్కడ నొక చెట్టు నందాకులపై వ్రాయఁబడిన కొన్ని పద్యములు శివాజీకిఁ గనిపించెను. అవి చదువఁగా శివాజీకి దేశాభిమానముచే మేనుప్పొంగెను. శివాజీ యా పద్యములు వ్రాసిన మహాకవికయి యా యరణ్యము నందెంతయో వెదకించెను. కాని యా మహానుభావుఁడు కనిపింపలేదు.

ఆ పద్యములను రచించిన దెవ్వరో కాదు; సమర్థ రామదాసస్వామియే. తన పద్యములు చదివి శివాజీ యెట్లు ప్రవర్తించునో కనుగొందమని సమర్థులు రహస్యముగా దాగియుండిరి. కనుకనే వారు శివాజీకి కనుపింపరయిరి.

శివాజీ వేఁటనుండి మఱలి వచ్చెను. కాని యాతని హృదయము మాత్రము రామదాసస్వామి దర్శనమునే కోరుచుండెను. ఆ సందర్భమునచే శివాజీకి రామదాసు కడనుండి పద్యమయ మయిన యొక జాబు వచ్చెను.

## రామదాసస్వామి జాబు సారాంశము

"ఓ మహారాజ! నీవు ధైర్యవంతుఁడవు. ధర్మ రక్షకుఁడవు. నీ వలన నశేష ప్రజానీకము సుఖము లందుచున్నది. నీవు రాజయోగివి. నీతిమంతుఁడవు; కీర్తిమంతుఁడవు. చారుల ద్వారా సమాచారములు తెలిసికొనుటలో సమర్థుఁడవు.

మా మతమునకు క్షతి కలిగి ధర్మము లోపించి తీర్థ క్షేత్రములు ధ్వంసము చేయఁ బడియెను. గో బ్రాహ్మణ రక్షణమునకు నీవు పూనుకొన వలెను. నీ వలననే హిందూ మతము కొంచెమయినను నిలిచియున్నది. ధర్మ రక్షణమునకు నీవు కంకణము కట్టుకొన వలెను.

నీ రాజ్యమునందే యున్నను మేము మీ దృష్టికి వచ్చినారము కాము. సరే! ఈ మతమును రక్షించిన కీర్తి నీవే సంపాదింప వలయును." ఇది జాబు సారాంశము.

ఈ జాబు వలన శివాజీ మిక్కిలి యుత్సాహము నందెను. తా నరణ్యమునఁ జూచిన పద్యములకును వీనికిని బోలిక యున్నందున నాపని గావించిన వాఁడు రామదాసస్వామియే యని గుర్తించెను. స్వామిని గొనివచ్చుట కుద్యోగస్థులను బంపెను.

రామదాసస్వామి 1649లో శివాజీకి జ్ఞానోపదేశము గావించెను. గురు దక్షిణగా స్వామికి శివాజీ తన రాజ్య సర్వస్వమును ధారవోసెను. స్వామి శిష్యుని దన రాజ్యమునకు ధర్మకర్తగా నియమించెను. నాటి మొదలు శివాజీ కాషాయాంబరపు ఝుండాను ఏర్పాటు చేసెను. అది రాజ్యము సన్యాసి దనుటకు గుర్తు.

స్వామి సతారా సమీపమున పరళీ పర్వతముపై నివాస మేర్పఱచు కొనెను. అది సత్పురుషులకు నిలయమయి "సజ్జన గఢ" మయ్యెను.

ఉపదేశమయిన దగ్గఱి నుండి శివాజీ స్వామి శుశ్రూషయందే కాలము గడపుచు రాజకీయ కార్య విముఖుఁడుగా నుండుటను గమనించి గురువాతనికి కృష్ణ పరమాత్మ చెప్పిన కర్మయోగము నుపదేశించి కర్తవ్య నిష్ఠు నొనర్చెను. సందేహములు కలిగినప్పుడు తీర్చుటకు "దాస బోధ" యను గ్రంథమును రచియించి యొసంగెను.

## రామదాసస్వామి బోధ

"యవనుల స్వేచ్ఛా విహారము వలన హిందువుల మతము, ధర్మము, పుణ్యతీర్థములు ధ్వంసము గావింపఁ బడెను. వాటి నుద్ధరించుటకు నీవంటి వాఁడే కావలయును. ఇప్పుడును తురుష్కుల యత్యాచారము లల్లేయున్నవి. వీరి నుండి హిందూ మతమును రక్షించుటకే రాముఁడు నిన్ను బంపినాఁడు. హిందూమత రక్షణమే నీ కర్తవ్యము. నీకు దీనియందు సహాయ పడువారి నైక్యపరపుము. శత్రువులను సంహరించి, మతము, నీతి యను పునాదులపై సుస్థిరముగా నుండు రాజ్యమును స్థాపింపుము." ఇది స్వామి బోధయని "శివ దిగ్విజయ" మను గ్రంథము వచించు చున్నది.

"క్షత్రియుఁడ వయిన నీవు క్షాత్ర ధర్మము ననుసరించి శత్రువు లయిన యవనుల హతమార్చి ధర్మ రక్షణకుగా హిందూ రాజ్య స్థాపనము గావించుట రాముని కోరిక" యని స్వామి బోధించినట్లు "రామదాసస్వామి బఖురు" వచించుచున్నది.

శివాజీ కార్యోన్ముఖుఁ డయ్యెను.

## దా స బో ధ

రామదాసస్వామి "దాస బోధ" రాజ్య ప్రకరణము నందు రాజులు ప్రజారంజకముగా రాజ్యము పాలించుటకుఁ గావలసిన విధములు వర్ణింపఁ బడినవి. గ్రంథ మంతయు మిక్కిలి మనోహరముగా నుండి యనుభవముల వివరించు చుండును.

రామదాసస్వామి బోధచే శివాజీ యుత్తమ గుణోపేతుఁడైన మహా పురుషుఁ డయ్యెను. ధర్మము, దేశాభిమానమును కారణముగా నాతఁడు రుద్రమూర్తి యయి యుద్ధములు చేసినను శాంతమును వీడలేదు. కొందఱు వ్రాసినట్లు శివాజీవి బందిపోటులు కావు. "సిడ్నే ఓవెన్" (Sidney Oven) పొగడినట్లవి దేశాభిమానముతోఁ గూడిన ధర్మ యుద్ధములు. కావుననే మహారాష్ట్ర ప్రజలు శివాజీ నీశ్వరాంశ భవుఁడని భావించిరి.

రామదాసస్వామితో సంబంధము కలిగిన తరువాత శివాజీ జీవిత ముత్తేజితమయ్యెను. ఆతని యనంతర జీవితము నందంతటను స్వామి ముద్రలు స్పష్టముగాఁ గానవచ్చును.

"మృత్యువునకు భయపడు వాఁడు రాజ ధర్మమునకుఁ బనికిరాఁడు. శత్రువులఁ జూచి పరుగెత్తిపోవు వాఁడు దుష్కీర్తిని నరకమును బొందును. యుద్ధమృతులు సద్గతి నందుదురు. యుద్ధ విజేతలు సకల సంపదల నందుదురు. వీరుఁడు నిర్భయముగా శత్రువులఁ జెండాడ వలయును. దేశ కాల పాత్రలఁ జూచి వీరుఁడు సాహసమును బ్రదర్శింప వలయును.

జనుల నైక్య పఱచి యుత్సాహము కలిగించి దండు వెడల వలయును. ఉన్న రాజ్యమును గాపాడు కొనుచుఁ గ్రొత్త రాజ్యమును జేర్చుకొనుచుఁ గ్రమముగా జగత్తంతయు మహారాష్ట్ర రాజ్యముఁ జేయవలయును." ఇది రామదాసస్వామి యభిప్రాయము.

## అ ర్థా దు లు

పుట 102

గురు + ఉపదేశము (స॥ దీ॥ సంధి), శివాజీ గురువు సమర్థ రామదాసస్వామి; చదువు + అరి = చదువుగలవాఁడు (సూ॥ అరి వర్ణకంబు మతుబర్థంబు నందు జాలాదులకగు). వీరరసము: దీనికి స్థాయి భావము ఉత్సాహము; ప్రేరకుఁడు = ప్రోత్సాహ మొసంగినవాఁడు;

మత జిజ్ఞాస = మతమును గుఱించి తెలిసికొనవలయునను కోరిక; సర్వసంగ పరిత్యాగము = సమస్త లౌకిక సంబంధములను విడనాడుట; ఉత్సాహి = ఉత్సాహము గలవాఁడు;

పుట 103

లోహకాయులు = ఇనుమువలె బలమయిన శరీరము గలవారు; పరాభూతులు = అవమానింపఁబడినవారు; ప్రజాసత్తా + ఆత్మక రాజ్యము = ప్రజలకే యధికారము గల రాజ్యము (Republic); ప్రాటెస్టంటులు : క్రైస్తవమతము నందొక తెగవారు;

కర్మమీమాంస : యజ్ఞాదికర్మలే జగత్తు చక్కఁగా నడుచుటకుఁ గారణము లని వాదించు శాస్త్రము; బ్రహ్మమీమాంస : ప్రపంచము స్థితిగతులకు హేతువు బ్రహ్మమని వచించు శాస్త్రము; కర్తవ్య + ఆచరణము = చేయవలసియున్న పనిని చేయుట; అర్జునునిఁ గర్తవ్యాచరణమునకుఁ బ్రేరేపించుట : భగవద్గీత మతగ్రంథమనియు నది చదివినవారు సంసారమును విడిచి భగవంతుని నాశ్రయించి మోక్షము నందుదురనియు జనసామాన్యములో నొక యభిప్రాయమున్నది. కాని శ్రీకృష్ణుఁడు అర్జునునకు గీత నేల యుపదేశించినాఁడని విచారించినచో నర్జునుఁడు ప్రపంచమునుండి దూరముగాఁబోయి తపస్సు చేసికొనుటకయి శ్రీకృష్ణుఁడు భగవద్గీత నుపదేశింపలేదనియు, యుద్ధము చేయుటకయి యాతఁడు విముఖతను జూపఁగా శ్రీకృష్ణుఁడు భగవద్గీత నుపదేశించి యాతనిచేత యుద్ధమును జేయించె ననియుఁ దెలియఁగలదు. అనఁగా నర్జునుఁడు తన కర్తవ్యమును మఱచి యున్నప్పుడు గీతోపదేశముచేత నాతనిని శ్రీకృష్ణుఁడు కర్తవ్య నిర్వహణమునకుఁ బురికొల్పెననుట; అనుకరణీయము = అనుకరింపఁదగినది;

సమకాలికులు = సమకాలమున జీవించినవారు;

పుట 104

వైరాగ్యము = ప్రపంచమునెడ విరక్తి కలిగియుండుట; అంత్యజుఁడు = మాలవాఁడు (చోఖామేళా లో ఖాకాని ఖాకాదు); అభంగము : ఒక మహారాష్ట్ర గీతము; పాషాణ పూజానిషేధము = ఱాతి విగ్రహములకుఁ బూజ పనికిరాదనుట; ప్రేతము = చనిపోయినవారి రూపము;

ఆదిరసము = శృంగారరసము : రసములలో శృంగారము మొదటిది; అన్యప్రేరణము = ఇతర విధమయిన ప్రోత్సాహము;

పుట 105

ప్రతిబంధక పెట్టు = నిర్బంధములు గలిగించు : జనసామాన్యమునకు జ్ఞానము కలిగినచో వారు పరాయి ప్రభుత్వముపైఁ దిరుగఁబడుదురు. ఇది గుర్తించినందు

ననే తురుష్క రాజులు మహారాష్ట్ర సాధువులను నిర్బంధించిరి. మహాదేవ గోవింద రానడే : గొప్పపండితుఁడు. బొంబాయి హైకోర్టులో న్యాయమూర్తులుగా వ్యవహరించినవారు. నిరపేక్ష పరోపకారబుద్ధి = తమకేమియుఁ గోరికలేక కేవలము ఇతరుల కుపకారము చేయవలయునను నిస్స్వార్థబుద్ధి; నీతి + ఉపదేశము = నీత్యుపదేశము (యణాదేశసంధి).

సాధుపుంగవులు = సాధుశ్రేష్ఠులు; పుంగవము = ఎద్దు: ఇది శార్దూలాది పదములవలె నుత్తరపదముగా నున్నపుడు శ్రేష్ఠుఁడను నర్థము నిచ్చును;

పుట 106

శ్రవణము = వినుట; అమిత + ఆసక్తి = ఎక్కువయాసక్తి; హరికీర్తనము: ఇది హరిభవంటిది; సహజ కవిత్వధోరణి = తనంతట తాను లభించిన కవితఁ జెప్ప సలవాటు; శ్రావ్యము = వినఁదగినది; విరాగులు = విరక్తి నందినవారు; ఐహికము = ఈ లోకమునకు సంబంధించినది; భాగవత + ఉత్తముఁడు = భగవద్భక్తులలో శ్రేష్ఠుఁడు (గుణసంధి); చామరము = చమరీమృగపుతోకతోఁ జేయఁబడిన కుంచె; పాండురంగఁడు : పండరీపుర నివాసియయిన విష్ణువునకు "పాండురంగ విఠలస్వామి" యని పేరు.

పుట 107

దేశాభిమానమను నగ్ని (రూపక సమాసము); ప్రాసాదిక శ్లోకములు = ప్రసాదప్రాయముగా నొసంగఁబడిన శ్లోకములు; పరిణామము = మార్పు; రాజయోగి = రాజుగానుండియు యోగివలె వ్యవహరించువాఁడు; నరపతి = రాజు; హయపతి = గుఱ్ఱములు విశేషముగాఁగల రాజు; దుర్గాధిపతి = చాల దుర్గములు గల రాజు; యశస్సు = కీర్తి; సుశీలత = మంచినడవడి;

తీర్థక్షేత్రములు = పుణ్యభూములు; విధ్వస్తములు = ధ్వంసము గావింపఁబడినవి; ఆవాసము = నివాసము; అపవిత్రీకృతంబులు = అపవిత్రములుగాఁ జేయఁబడినవి; విలుప్తము = నశించినది; పృథ్వి = భూమి: విప్లవపూర్ణము = అల్లకల్లోలముతో నిండినది.

పుట 108

సజీవము = ప్రాణముతో నున్నది; అనుష్ఠింపఁబడు = చేయఁబడు; జ్ఞాపకము = స్మృతి (దీని సరియయిన రూపము "జ్ఞప్తి". జ్ఞాపకము = జ్ఞప్తి కలిగించునది-Reminder అని యర్థము); ధార్మికుఁడు = ధర్మబద్ధముగా జీవించువాఁడు;

పులక + అంకితము = గగుర్పాటుచే చిహ్నితము; ధోరణి = విధానము; పతాకము = జండా; కాషాయ + అంబరము = కాషాయ వర్ణముగల బట్ట; సుశోభితము = అలంకృతము;

పుట 109

నిర్లోభి = లోభము లేనివాఁడు; స్తవనీయులు = పొగడఁ దగినవారు;

పర్వత దుర్గము = కొండ మీఁదఁ గట్టఁబడిన ఖిల్లా; సజ్జన గఢము = సత్పురుషులు నివసించు దుర్గము, గఢ్ = దుర్గము;

రాజకార్య కుశలుఁడు = రాజ్య కార్యములందు నేర్పరి; కృష్ణ బోధితము = శ్రీకృష్ణునిచేత (అర్జునునకు) ఉపదేశింపఁ బడినది; కర్మయోగము: ప్రతివాఁడును దన కర్తవ్యమును నిర్వహింప వలయు ననియు నట్లు చేయక పోవుట తగదనియు శ్రీకృష్ణుఁ డర్జునునకు భగవద్గీత ద్వారా బోధించిన సిద్ధాంతము; దుష్ట నిగ్రహము = దుర్మార్గులగు జనులను నిర్బంధించుట; యవనులు = తురుష్కులు; యథా + ఇచ్ఛ = ఇష్టము వచ్చినట్లు; (అవ్యయీ భావ సమాసము): అతి + ఆచారము = దుర్మార్గ వ్యాపారము; ఉచ్ఛేదము = నాశనము; సంకట కాలము = ఆపత్కాలము; దుర్భాషలు = తిట్లు; రఘుపతి = శ్రీరామచంద్రుఁడు: భగవంతుఁడనుట; అనురూపము = తగినది; విసర్జించుట = విడచు;

పుట 110

ప్రహారము = దెబ్బ; జర్జరీ భూతులు = లుకలుకలై చెడినవారు; మతనీతులు (ద్వంద్వసమా.); వైరికులము = శత్రు సమూహము;

అరి = శత్రువు; శక కర్తలు = తమ చర్యల చేత క్రొత్త శకమును ప్రారంభించు వారు; భాషాంతరము = అనువాదము;

పుట 111

ఉచ్ఛృంఖలత్వము = విచ్చల విడిగా సంచరించుట; మద + ఉన్మాదము = మదించి వెఱ్ఱి మొఱ్ఱిగా వ్యవహరించుట; రక్తపాతము చేయుట = శత్రువులను సంహరించి రక్తము ప్రవహించునట్లు చేయుట;

ఈశ్వర సంకేతము = ఈశ్వరుని యొక్క రహస్యపు ఏర్పాటు; పరబాధ = శత్రు బాధ; విముక్తులు = విడివడినవారు; సయుక్తికము = యుక్తితోఁ గూడినది;

ప్ర: చిహ్నము- వి: చిన్నె; రమ్యము = మనోహరము;

పుట 112

దుర్లభము = తేలికగా లభింపనిది; ప్ర: మృత్యువు-వి: మిత్తి; అన్యమార్గముల వలనఁ బొట్టనింపుకొనుట: ఇతరములయిన నిరపాయకరములగు వృత్తులవలనఁ గడుపునింపుకొనుట; పగర = శత్రువు; సద్గతి = ఉత్తమగతి: యుద్ధములో శత్రువులఁ జంపుచు మృతుఁడయిన వానికి సద్గతిగలదు: యుద్ధభూమియందుఁ జనిపోయిన వారు

స్వర్గలోకమునందు- వారి కీర్తి యీలోకము నందెంతకాలము నిలిచియుండునో యంతకాలము- సుఖముగా నుందురని ధర్మశాస్త్రములు పురాణములు వచించు చున్నవి; శత్రుహననము = శత్రువులను జంపుట; పరిత్యజించు = విడుచు; సువి చారము = చక్కగా నాలోచించు విధము; మూలచరిత్రమునకుఁ బోయెదను: ఈ భాగము శివాజీ చరిత్రలోనిది. రామదాసుచరిత్ర మందానుషంగికముగా వచింపఁ బడినది. కనుక శివాజీ గురువయిన రామదాసు చరిత్రము నింతతో విడిచి తరువాతి ప్రకరణమునందు కథా నాయకుఁడయిన శివాజీ చరిత్రమును వర్ణింతుననుట.

## సందర్భ వాక్యములు

1. "నిజమయిన మతము మనుజుని సంసార పరాఙ్ముఖునిఁ జేయుట లేదు, కర్తవ్యనిష్ఠునే చేయును." (పు. 103)

సమా:- ఈ వాక్యము సుప్రసిద్ధ చారిత్రకులు, పండితులు నయిన కీ॥ శే॥ శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి శివాజీ చరిత్రమునందలి గురూపదేశమునందలిది.

శివాజీకి గురువు సమర్థ రామదాసస్వామి. రామదాసస్వామి శివాజీ మహా రాజునకు దేశాభిమానమును స్వమతాభిమానమును కలిగించి యాతనిచే మహా సామ్రాజ్యమును నిర్మింపఁ జేసెను. రామదాసస్వామి సర్వసంగ పరిత్యాగియయిన సన్యాసి. ఆయన బోధనలవలన శివాజీకూడా సన్యాసి కావలసియుండఁగా గొప్ప శూరుఁడగుట కొంత వింతగాఁ గొందఱకుఁ గనుపట్టవచ్చునని భావించి శ్రీ లక్ష్మణ రావుగారు "మతము మనుష్యునికి మెట్టవేదాంతమును బోధింపదనియు, నాతనిని గార్యశూరునిగా దిద్ది కర్మయోగి నొనర్చు"ననియు వచించి యందుకుఁ గావలసిన యుదాహరణముల నొసంగినారు.

అందులో మొదటిది- క్రాంవెల్ మతదీక్షగలవారినే సైనికులుగా నియమిం చుట. రెండవది- ప్రాటెస్టంటు మతాభిమానమే హాలెండున ప్రజాసత్తాత్మక రాజ్య స్థాపనమునకుఁ గారణమగుట. మూఁడవది- వేదాంత గ్రంథమని మనము భావించు భగవద్గీతయే యర్జునుని రణశూరునిగా దిద్దుట. పై యుదాహరణములను బట్టి మతము మానవునిఁ గర్తవ్యనిష్ఠునే చేయును గాని సంసార పరాఙ్ముఖుని జేయద నుట సారాంశము. కాని యామతము నిజమయినది కావలయును. అనఁగాఁ దెలి సియుఁ దెలియని గంజాయి సన్యాసులు బోధించు మెట్టవేదాంతమే మతమను కొన్నచో నిది సాధ్యము కాదన్నమాట.

2. "మావంటి యరణ్యవాసులవలన నీకు నేమియు లాభము కలుగనేరదు. నీవలనఁ బెందవలసిన లాభము మాకు నేమియును లేదు." (పుట 106)

సమా:- ఈవాక్యము కీ॥ శే॥ శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు, M.A. గారు రచించిన "గురూపదేశము" అను పాఠమునందలిది.

"తుకారాము" అను భక్తకవి శివాజీ కాలమునందు మహారాష్ట్రదేశమున తన హరికీర్తనలచేత జనులను భక్తుల నొనర్చుచు మిగుల ప్రఖ్యాతుఁడయి యుండెను. తుకారాము కీర్తనలను శివాజీకూడ వినెను. అందలి భక్తిమాధుర్య మా మహారాజు నాకర్షించెను. అతఁడు నిరంతర మా కీర్తనలను వినుచు ప్రాపంచిక విషయముల విస్మరించి తుకారాము నొద్ద నుపదేశముగాంచి భక్తుఁడు గాఁగోరెను. తుకారామ స్వామిని రాజమందిరమునకుఁ గొనితెచ్చుట కుద్యోగులు కానుకలతో నాతని కడకు వెడలిరి.

తుకారాము కేవలభక్తుఁడు; ప్రాపంచిక సంబంధమును బూర్తిగా విడిచి యీజగత్తునకు సాధ్యమయినంత దూరముగా నుండ నెంచినవాఁడు. తనకు శివాజీ శిష్యుఁడయినచోఁ దాను రాజ గురువు కావలసివచ్చును. అట్టి మర్యాద తన భక్తికి భంగకరమని తుకారాము భావించెను. అంతేగాదు; రాజశేఖరుఁడయిన శివాజీ సామాన్య భక్తులవలె భజనలను కీర్తనలను వినుచు ప్రపంచమునకు దూరస్థుఁడగుటయుఁ దుకారామున కిష్టముకాదు. శివాజీ శూరాగ్రేసరుఁడయి మత రక్షణమునకుఁ గంకణము కట్టుకొని దేశము నుద్ధరింపవలయునని యా మహనీయుని యాశయము. అట్టి యభిప్రాయమును శివాజీకిఁ గలిగించి యాతనిచేత నీ మహోద్యమమును నడిపింపఁజేయఁగల గురువుకూడ నా మహారాజున కవసరమే. కాని తానా పనిచేయలేఁడు. తన ప్రవృత్తి దానికి అనుకూలమయినదికాదు. రాజకీయ వ్యవహారములందుఁ బ్రవేశించుటకుఁ దన కిష్టముగాని ప్రవృత్తిగానిలేదు. శివాజీకి గురువుగా నుండఁదగినవాఁడు సమర్థ రామదాసస్వామి. భక్తి భావములతో పాటుగా రాజకీయ వ్యవహారములు నా మహనీయునకుఁ గొట్టిన పిండి. కావుననే తుకారాము శివాజీకిఁ బంపిన సమాధానమునం దాతనికిఁ దనవలనఁగాని, తన కాతని వలనఁ గాని కలుగఁబోవు ప్రయోజన మేమియు లేదనియు, రామదాసస్వామి నాశ్రయించినచో శివాజీకిని స్వామికిని వారి వారి ప్రయోజనములు నెఱవేరి లోకమునకు మంగళము కలుగుననియు స్పష్టముగాఁ దెలిపెను.

తుకారాముని యీ సమాధానమే శివాజీని సమర్థుని శిష్యునిగా నొనరించి యాతనిచేత మత రక్షణమను మహాకార్యము నిర్వర్తింపఁ జేయించెను.

3. "మత సుస్థాపనము చేసినవాఁడను కీర్తి నీవే సంపాదింప వలయును సుమా!" (పుట 108)

సమా:- ఈ వాక్యము కీ॥ శే॥ శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు, ఎం. ఏ. గారు రచించిన శివాజీ చరిత్రము నందు గురూపదేశమను ప్రకరణము లోనిది.

తన కుపదేశము గావింపు మని కోరిన శివాజీకి సమర్థ రామదాసస్వామి నాశ్రయింపు మని తుకారాము సమాధానముఁ బంపినాఁడు. ఆ సమాధానము చూచిన వెంటనే శివాజీ రామదాసస్వామి నాశ్రయింపఁ దలఁచినాఁడు. కాని యా మహానుభావుఁ డాతనికిఁ గనుపింప లేదు.

సమర్థ రామదాసస్వామి శివాజీ శక్తి సామర్థ్యములను, మత నిరతిని, ధర్మ జిజ్ఞాసను బాగుగా నెఱింగిన వాఁడు కనుక నాతనిని శిష్యునిగా స్వీకరించి, యాతనిచే హిందూ ధర్మ రక్షణకై మహారాష్ట్ర సామ్రాజ్య స్థాపనము చేయింప వలయునని భావించెను. అందుకుఁ దగినసమయమునకయి నిరీక్షించు చుండెను. తానై రాజును దర్శించుట వలనఁ గార్యము సఫలము కాకపోవచ్చును గదా! అంతే గాక యాతనికిఁ దనపై గౌరవము జనింపవలయును. అప్పుడు కాని తన కార్యము నెఱవేరదు. అందుకని శివాజీకిఁ గొంతకాలము దర్శన మీయక ఆతనిఁ బరీక్షింప నెంచినాఁడు.

ఇట్లుండఁగా శివాజీ స్వామి యున్న యరణ్యమునకు వేఁటకయి రాఁగా నాతని మార్గమునఁ గల యొక చెట్టుపై నాకుల యందు దేశభక్తిని కలిగించు శ్లోకములను వ్రాసియుంచి నాఁడు. శివాజీ దేశభక్తిని తాను రహస్యముగా దాగియుండి పరీక్షించినాడు. శివాజీ యింటికి మఱలిపోయిన పిదప నాతని పేర నొక జాబు వ్రాసినాఁడు. అందలిదే ఈ వాక్యము.

ఈ వాక్యము శివాజీ హృదయమున సమర్థుని ముద్ర వేసినది. మహారాజు చేయవలసిన పనిని నిర్దేశించి చూపినది. కనుకనే శివాజీ సమర్థుని బిలిపించి యాతనికి శిష్యుఁడయి స్వామి యానతి ప్రకారము హిందూ ధర్మ రక్షణకుఁ గంకణము ధరించి కృతకృత్యుఁడయినాఁడు.

4. "అమిత గురు భక్తిగల రాజును, రాజ్యమును వదలివేసిన నిర్లోభి యైన గురువును ఒకరికంటె నొక రధిక స్తవనీయులు గదా!" (పుట 109)

సమా:- ఈ వాక్యము కీ॥ శే॥ శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు రచించిన శివాజీ చరిత్రములోని గురూపదేశము అను ప్రకరణము లోనిది. శ్రీ లక్ష్మణరావు గారీ శతాబ్ది ప్రారంభమున వఱలిన వారు; ఆధునికాంధ్రయుగ నిర్మాతలని చెప్పఁ దగిన కొద్దిమందిలో నొక్కరు.

తుకారాము నొద్ద నుపదేశము బొందఁగోరిన శివాజీ యా స్వామి యాజ్ఞ చేత సమర్థ రామదాసస్వామిని గురువుగా స్వీకరించినాఁడు. సమర్థులును శివాజీ దేశభక్తిని, ధర్మపరాయణతను, కార్య శూరతను, మిక్కిలిగాఁ బరీక్షించి యాతని కుపదేశము గావించి తమ శిష్యు నొనరించుకొనినారు. శివ మహారాజు సమర్థుని ధర్మోపదేశమునకు గురుదక్షిణగాఁ దన రాజ్య సర్వస్వము నా మహనీయుని చరణ

కమలములకు ధారవోసినాఁడు. నిజముగా శివాజీ గురుభక్తి యిచట నిరుపమాన మయినది. లేకున్నచోఁ దన రాజ్యము నాతఁడు గురువునకు దానము చేయునా?

స్వామి గురుదక్షిణగా రాజ్యమును దీసికొన్నాఁడు. ఆ స్వామియుఁ గోరిన దదియే. కాని స్వామి రాజ్యము నపేక్షించినది తన కొఱకుఁ గాదు; శివాజీని రాజయోగి నొనర్చుట కొఱకు; ఆతనికి రాజ్య భోగములందుఁ గాక ధర్మరక్షణము నందు మనస్సు లగింపఁ జేయుటకు. కావుననే తాను స్వీకరించిన రాజ్యమును శివాజీకే మఱల నిచ్చి తన ప్రతినిధిగా రాజ్య పరిపాలనము గావింపు మని శాసించి నాఁడు. శివాజీ గుర్వాజ్ఞను దలఁ దాల్చినాఁడు. ఈ రాజ్యము సన్యాసి యయిన రామదాసస్వామిదని చాటుటకు కాషాయాంబర శోభితమయిన "భగవాన్ ఝుండా" ను స్థాపించినాఁడు. నాఁటినుండి రాజ్య వ్యవహారములకు దూరమున నుండు స్వామి రాజ్యాధికారి. నిరంతర రాజకార్య నిమగ్నుఁడయిన శివాజీ దానికి ధర్మకర్త.

ఎంత యుదార భావమిది! ఇద్దఱును స్వార్థము లేనివారే. రాజ్య లోభము గాదు వారి కున్నది; ధర్మరక్షణ దీక్ష. కనుకనే శ్రీ లక్ష్మణరావుగారు వారిద్దఱలో నొకరికన్న నింకొకరు ఎక్కువ సంస్తవనీయులని పై వాక్యమున వచించినారు.

5. "పిరంగిలోని యినుపగుండు నిర్భయముగా శత్రుసైన్య మధ్యము లోనికిఁ బోయినట్లు శత్రువుల లోనికి భయము విడిచి పోవలయును." (పుట 112)

సమా:- ఈ వాక్యము సమర్థ రామదాసస్వామి తన శిష్యుఁడైన శివాజీకిఁ గావించిన యుపదేశము లోనిదని కీ॥ శే॥ శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావు, యం. ఏ. గారు తమ శివాజీ చరిత్ర గ్రంథమున గురూపదేశమను ప్రకరణమున నుదాహ రించినది.

సమర్థులు గొప్ప రాజకీయవేత్తలు, కర్మయోగులు. కనుకనే వారు కేవల భక్తి నపేక్షించిన శివాజీకిఁ దన యుపదేశము చేత దేశాభిమానమును, మత నిర తిని, ధర్మరక్షణము నందాసక్తిని, శత్రు నిర్మూలన కార్యము నందుత్సాహమును కలిగించి యా మహారాజు చేత మహారాష్ట్ర సామ్రాజ్యమును నిర్మింపఁ జేయించి నారు.

రామదాసస్వామి, భక్తి యెంత గొప్పదో క్షాత్ర ధర్మము నంతకన్న గొప్ప దని శివాజీ కుపదేశించినారు. క్షాత్ర ధర్మము నవలంబించినవాఁడు శూరుఁడు కావలయును. భీరువయినవాఁడు క్షాత్ర ధర్మమునకుఁ బనికిరాఁడు. శూరునకు మృత్యు భయముండరాదు. ఆతఁడు శత్రువులకు వెన్నీయ రాదు. శత్రువులకు వెన్నుఁ జూపినవాఁడు ఇహలోకమునం దపకీర్తిని పరమున నరకమును బొంది యుభయమల పాలగును. శత్రువులను ధైర్యముగా నెదుర్కొన్నవాఁడు చచ్చినచో

వీరస్వర్గమున కేగి సుఖముల ననుభవించును. బ్రతికినచో సర్వసంపదల నంది సుఖపడును.

కావున వీరుఁడు నిర్భయముగా శత్రు మధ్యము లోనికిఁ జొరఁబడి వీర విహార మొనరింప వలయును. ఇది స్వామి శివాజీ కొనరించిన యుపదేశము.

ఫిరంగిలో నుండి వెడలిన యినుప గుండు శత్రు నాశనము గావించకుండ నుండదు. అట్లే వీరుఁడు నుండవలె ననుట.

దీనిని బట్టి సమర్థ రామదాసస్వామి శివాజీకి రణోత్సాహము నెట్లు పెంపొందించినది తెలియనగును. ఈ గురు శిష్యుల చరిత్రను జదివినపుడును, వారి సంభాషణమును వినినప్పుడును భారతము నందలి కృష్ణార్జునులు తలంపునకు వత్తురు. భారతమున శ్రీకృష్ణుఁడు భగవద్గీత ద్వారా అర్జునునకు బోధించిన కర్మయోగ మునే సమర్థ రామదాసస్వామి శివాజీకి "దాస బోధ" ద్వారా బోధించినారు.

## ప్రశ్నలు - సమాధానములు

ప్ర. 1 :- నిజమయిన మతము మానవునిఁ గర్తవ్యనిష్ఠునే చేయుననుట యెట్లు మీ పాఠ్యమునందు నిరూపింపఁబడినదో తెలుపుఁడు.

స :- సర్వ సామాన్యముగా మతము దైవము నాధారముగాఁ జేసికొని ప్రవర్తిల్లును గనుక దానికి లోక వ్యవహారములతో సంబంధము లేదనియు, నది కేవలము పరలోక సుఖములకు సంబంధించినదనియుఁ దలంపఁబడు చున్నది. మతగురువులయినవారి బోధనలును చర్యలునుగూడ సామాన్యముగా నీభావమునే బలపఱచుచుండును. అందుకనియే మతనిరతి గలవారు లౌకిక కార్యశూరులు కాక ప్రపంచ విముఖులై యుందురను భావమొకటి ప్రబలముగా వ్యాపించుట కవకాశము కలిగినది.

పరలోక సుఖములకయి యీ లోక సుఖములఁ ద్యజించుట కేవలము పనికిరాదనుట భావ్యము కాకపోవచ్చును కాని వాని కొఱకై పూర్తిగా జనులు నిర్వ్యాపారులై సోమరులైనచోఁ బ్రపంచవ్యవహారములే కుంటువడును గనుక అదిమాత్ర ముత్తమమయినది కాదనియే చెప్పవలయును. అయినను గొంత కాలము జనులెల్లరును మతము మానవునిఁ గర్తవ్యనిష్ఠనుండి దూరముఁజేయు ననియే భావించుచుండిరి. ఇప్పటికి నట్లు తలంచువారు లేకపోలేదు. శ్రీ లక్ష్మణ రావుగారు తమ శివాజీ చరిత్రమున నిది సత్యముకాదని వచించి దానికిఁ బ్రపంచ చరిత్రనుండి ప్రబలమయిన యుదాహరణములఁ జూపిరి.

వారు చూపిన యుదాహరణములో మొదటిది క్రాంవెల్ అను నాంగ్లేయ రాజనీతిజ్ఞుని మతనిరతి. ఈతఁడు పదునేడవ శతాబ్దియందు ఆంగ్లదేశమునకు

సంరక్షకుఁడుగా నుండినవాఁడు. ఈతని సైనికులు లోహకాయులని పేరు వడసినవారు; పరాజయమన్నది కననివారు. దీనికిఁ గారణము వారి మత నిరతియే యని శ్రీ లక్ష్మణరావుగారు వచించుచున్నారు. క్రాంవెల్, అమిత మతాభిమానముకల యువకులనుమాత్రమే సైనికులుగాఁ జేర్చుకొనుచుండెడి వాఁడట. క్రాంవెల్ విజయములకుఁ గారణమయిన యతని మతాభిమానము నాతని సైనికుల మతాభిమానము ప్రపంచ విముఖతకు మతము కారణమను భావమునకుఁ జక్కని సమాధానము.

వారు చూపిన రెండవ యుదాహరణము హోలెండు దేశమునకు సంబంధించినది. అక్కడి జనులలో బాగుగా వ్యాపించిన ప్రాటెస్టంటు మతాభిమానమే యా దేశము ప్రజాసత్తాత్మక రాజ్యముగా నవతరించుటకుఁ గారణమయినది.

వారు చూపిన యింకొక యుదాహరణము "భగవద్గీత". భగవద్గీత గొప్ప మతగ్రంథమనియు వేదాంతగ్రంథమనియు నందఱెఱింగినదే. ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతాచార్యులు మువ్వురును నీ గ్రంథమునకు వ్యాఖ్యలు రచించి తమ సిద్ధాన్తముల నిరూపింప యత్నించుటయే యిందుకుఁ బ్రబల నిదర్శనము. కాని సత్యము నాలోచించినచో భగవద్గీత మానవునిఁ గర్తవ్యమునుండి దూరముచేసి మోక్షార్థి నొనర్పదను విషయము స్పష్టమగును. గ్రంథముఁ జదివి మాత్రమేకాక యది యెట్టి సందర్భములో నావిర్భవించినది కనుఁగొనినచో దాని యుద్దేశము స్పష్టము కాఁగలదు.

యుద్ధరంగమున మోహబుద్ధికలవాఁడయి యర్జునుఁడు బంధుహననము చేయలేనని వచించి క్షత్రియధర్మమయిన యుద్ధమునకు విముఖుఁడయినప్పుడు శ్రీకృష్ణుఁడు భగవద్గీత నుపదేశించినాఁడు. శ్రీకృష్ణుని యుపదేశముపలన నర్జునుఁడు తన భావములను వదలి మఱలఁ గర్తవ్యనిష్ఠుఁడయి యుద్ధము గావించి విజయము గాంచినాఁడు. తత్ఫలితముగా ధర్మరాజు రాజయి ధర్మసంస్థాపనము గావింపఁబడినది. దీనినిబట్టి భగవద్గీత కూడ మానవునిఁ గర్తవ్యాచరణమునకే ప్రోత్సహించుననుట స్పష్టమగుచున్నది.

భగవద్గీత కీ విధమయిన సమన్వయము కలిగించినవాఁడు తిలకు మహనీయుఁడు. లక్ష్మణరావుగారు బాలగంగాధర తిలకు మహాశయుని యడుగుజాడలలో నడచినవారు. కనుకనే వారు దీనినిట్లు సమన్వయముచేసి చూపినారు.

మతము మానవునిఁ గర్తవ్యనిష్ఠునిఁ జేయుననుటకు మఱియొక ప్రబల నిదర్శనము శివాజీ చరిత్ర. మతగురువైన రామదాసస్వామి బోధయేగదా శివాజీని రణశూరుఁగాఁ దీర్చి దిద్దినది!

మనచరిత్రమునం దిట్టి యుదాహరణము లింకెన్నియయినను లభింపఁగలవు. కాని యా మతము నిజమయిన మతము కావలయును.

అనఁగా సత్యము నెఱింగిన మహనీయుల బోధనల ననుసరించినది కావల యును గాని మెట్టవేదాంతము బోధించు గంజాయి సన్యాసుల బోధ కారాదు.

ప్ర. 2 :— భగవద్భక్తు లయిన సాధు కవులవలన మహారాష్ట్ర భాషకు, మహారాష్ట్ర దేశమునకుఁ గలిగిన మేలేమి ?

స :- శ్రీ లక్ష్మణరావుగారు చిన్ననాఁడు నాగపురమునందు విద్యాభ్యాసము గావించిరి. వారు మహారాష్ట్ర భాషలో గొప్ప పండితులు ; రచయితలు. మహారాష్ట్రులయిన కొందఱు గొప్ప రచయితలు తను మహారాష్ట్రి రచనలను లక్ష్మణరావుగారికిఁజూపి వారిచేతఁ దప్పులు దిద్దించుకొనిరన్నచో వారికా భాష యందుఁగల పాండిత్యమెట్టిదో మనకు సులభముగాఁ దెలియును. వా రాభాషా సాహిత్యములను బుక్కిటఁబట్టిన మహనీయులు.

శ్రీ లక్ష్మణరావుగారి యీ మహారాష్ట్రి భాషాసాహిత్యముల పరిచయము వారి శివాజీ చరిత్రయందు మనకుఁ గన్నులకుఁ గట్టినట్లు కనుపట్టుచుండును.

శ్రీ లక్ష్మణరావుగారు రామదాసస్వామిని గుఱించి వచించుచుఁ బ్రసంగ వశమున భక్తకవుల వలన మహారాష్ట్రి దేశభాషలకుఁ గలిగిన యుపకారములు మూఁడని వచించి, వారు సంఘ సంస్కరణమును, భాషాభివృద్ధిని, రాజకీయ సంస్కరణమును తమ గీతములద్వారా ప్రచార మొనరించి సాధించిరని వచించినారు.

భక్తకవులగు జ్ఞానోబా తుకారాము రామదాసు చోఖామేళాలు భిన్న జాతులకుఁ జెందినవారు. వీరిలో బ్రాహ్మణులు మొదలుకొని హరిజనుల వఱకు నున్నారు. వీరందఱు నన్నిజాతులవారి యాదరము నందినారు. తమ రచనల ద్వారా అందఱకును భక్తి జ్ఞాన వైరాగ్యముల నుపదేశించినారు. జాతిభేదముల నందఱును తమ రచనలందు ప్రత్యేకముగా ఖండించి యైకమత్యమును బోధించినారు.

భక్తకవులు తమ రచనలను సామాన్య జనుల కుపయోగింపవలయునని తలంచినవారు కనుక వారు సులభమయిన మహారాష్ట్రిభాషయందు తమ గీత ముల రచించిరి. ఇది పండితులకును మహమ్మదీయ ప్రభువులకును గోపకారణ మయ్యెను. కాని దానివలన మహారాష్ట్రిభాష చక్కగా వృద్ధియయ్యెను. కవులందఱును భక్తులే యగుటవలన వారి రచనలును భక్తిజ్ఞానముల బోధించు కావ్యములుగానే యవతరించినవి. ఆంధ్రభాష యందువలె మహారాష్ట్రిభాష యందు శృంగార ప్రబంధములు లేకపోవుటకు నిదియే హేతువు.

భక్తకవులు తమ గీతములద్వారా భక్తి జ్ఞాన వైరాగ్యములనేగాక యైక మత్యమును గూడ బోధించిరి. వారి బోధనలు విన్న హిందువులు తమలోని

యంతర్భేదములను మఱచి సంఘటితులైరి. వారంతకు ముందువలె మహమ్మదీయ ప్రభువులకు లొంగియుండక తమ మత రక్షణమునకును, ధర్మ రక్షణకొఱకును నైకమత్యముతో నిలచి పోరాడిరి. హిందువుల మత నిరతియే శివాజీ హైందవ ధర్మసామ్రాజ్యమును స్థాపించుటకు ముఖ్యకారణమయ్యెను

కావున మహారాష్ట్ర భక్తకవులవలన నా దేశ భాషకును సంఘమునకును మేలు కలిగెననియు హిందూధర్మము నిలఁబడెననియు వచింపవచ్చును.

ప్ర. 3 :- రామదాసస్వామి శివాజీకి గురువైన విధము వివరింపుఁడు.

ఉ :- శివాజీకి సమకాలీనుఁడయిన తుకారాము అను సాధుపుంగవుఁడు "హరికీర్తనము" అనునొక క్రొత్త విధానముద్వారా భగవద్భక్తిని వ్యాపింపఁజేయుచుండెను. హరికీర్తనము మన దేశమునందలి హరికథవంటిది. తుకారామస్వామి కీర్తనల కానాఁడు జనులలో విశేషాదరము లభించెను. ఎక్కడఁ జూచినను తుకారాము కీర్తనలే పాడఁబడుచుండెను.

ఒకసారి శివాజీకూడ తుకారాము కీర్తనలను వినెను. ఆ కీర్తనలు శివాజీని మిక్కిలిగా నాకర్షించెను. అప్పటినుండి శివాజీ నిరంతరము తుకారాము కీర్తనలనే వినుచు భగవద్భక్తుఁ డయ్యెను. అంతేగాదు - ఆతఁడు తుకారామస్వామిని రాచనగరుకు రప్పించి తా నాస్వామికి శిష్యుఁడు గాఁగోరెను. ఉపదేశమొసంగుటకయి రాజగృహమునకు రావలసినదిగాఁ గోరుచుఁ దన యుద్యోగులను స్వామికడకుఁ గానుకలతోఁగూడఁ బంపెను.

కాని తుకారామస్వామి శివాజీ కోరికను మన్నింపక యాతని కానుకలను దిరిగి పంపివేసి శివాజీని సమర్థ రామదాసస్వామి నాశ్రయింపుమని యాదేశించెను. కేవలభక్తితో నరణ్యవాసమున నుండు తనవలన శివాజీకిఁ గావలసిన కార్యమేమియు లేదనియు నాతనివలనఁ దనకు నేమియు లాభము లేదనియుఁ దుకారాము శివాజీకి జవాబు పంపెను. నాఁటినుండి శివాజీ రామదాసస్వామి దర్శనమునకయి నిరీక్షించుచుండెను. రామదాసస్వామియు శివాజీకి జ్ఞానోపదేశము గావింపవలయునని యదివఱకు ముందే నిశ్చయించుకొన్నను శివాజీలోని యా కోరిక ప్రబలమయినదని పరీక్షించి చూచికాని యాతని కుపదేశమొసంగరాదని యనుకొని తగిన సమయమునకయి నిరీక్షించుచుండెను.

ఒకనాఁడు శివాజీ వేఁటకు వెడలెను. స్వామి యా మహారాజు మార్గమున నొక చెట్టు నందాకులపై దేశభక్తి ప్రబోధకములగు కొన్ని శ్లోకములను వ్రాసియుంచెను. శివాజీ యా శ్లోకములను జదివి యుత్తేజితుఁడయి తత్కర్తకయి యరణ్యమునంతయు వెదకించెను. రామదాసస్వామి దాగుకొని వారికిఁ గనుపింపక శివాజీ చర్యలను గమనించుచుండెను.

శివాజీ వేఁటనుండి మఱలి యింటికి చేరిన పిమ్మట కొంతకాలమునకు రామదాసస్వామి యొకజాబును శివాజీపేరఁ బంపెను. ఆ జాబులోని పద్యములును, తా నరణ్యమునఁ జూచిన పద్యములు నొకే విధముగా నుండుటవలన వా రెంటి కర్తయు రామదాసస్వామియే యని గ్రహించి శివాజీ రామదాసస్వామిని దన కుపదేశమొసంగ వేడుచు నుద్యోగులను బంపెను. రామదాసస్వామి యది యుపదేశమున కనుకూలమయిన సమయమని గుర్తించి శివాజీ మందిరమునకు వచ్చి యాతని కోరిక నెఱవేర్చెను.

అమిత గురుభక్తికల శివాజీ గురుదక్షిణగాఁ దన రాజ్య సర్వస్వమును సమర్థ రామదాసస్వామికి ధారవోసెను. స్వామి యా రాజ్యమును మఱల శివాజీ హస్తములందే యుంచి తన ప్రతినిధిగా నాతనినే రాజ్యపాలనము గావింపు మనెను. దీనివలనఁగూడ శివాజీకే లాభము కలిగెను. ఆతఁడు రాజ్యమునకు ధర్మకర్తమాత్రమే. కావున శివాజీకి రాజ్యమువలన నహంకారాదులు కలుగక యాతఁడు రాజయోగివలె మెలఁగుట కవకాశము కలిగెను.

ఇదియే రామదాసస్వామి శివాజీకి గురువయిన విధము.

ప్ర. 4 :- "మహారాష్ట్రభాష యందాదిరసకావ్య మొక్కటియును లేదు". ఏల ?

స :- ఆది రసమనఁగా శృంగార రసము. రసములను జెప్పునప్పుడు మొట్ట మొదట శృంగారరసమును గుఱించి చెప్పుట సంప్రదాయము. కావున దాని కాదిరసము అను నామ మేర్పడెను.

మహారాష్ట్రభాషయందుఁ గావ్యములు రచింపఁబడిన తీరే యీ యాదిరస కావ్యము లా భాషయందు లేకపోవుటకుఁ గారణమయినది. ఆ విధమును బరి శీలించుటకు ముందు తెలుఁగు భాషలోని విధముఁ జూతము.

ఆంధ్రభాషయం దెక్కువగానున్నవి శృంగారకావ్యములే. దీనికిఁ గారణ మాంధ్రభాషను, నాంధ్రకవులను బోషించినవారు రాజులగుటయే యని శ్రీ లక్ష్మణరావుగారు తమ శివాజీ చరిత్రయందు వచించుచున్నారు. ఆంధ్రకవులు తమ కావ్యములను రాజుల మెప్పును బొందుటకయి రచించిరి. రాజులు సర్వ సంపదలతోను దులఁదూగుచుఁ గేవలము భోగప్రియులయి యున్నవారు. కావున భోగప్రియులయిన యా రాజులను మెప్పించుటకయి శృంగార రస ప్రధానము లయిన కావ్యములనే యాంధ్రకవులు వ్రాయవలసి వచ్చినది. ఆ కావ్యము లందలి భాషయును సామాన్యజనమున కర్థమగునట్లుకాక మిక్కిలి ప్రౌఢముగా నుండుట సంభవించినది.

మహారాష్ట్ర దేశమునందలి కవులవిధము దీనికిఁ బూర్తిగా భిన్నమయినది. ఆ భాషయందుఁ బ్రథమకాలమునుండియుఁ గవులందఱును భక్తులయిన సాధు పుంగవులు. రాజాశ్రయము నపేక్షించుటకాని, రాజుల మెప్పించుటకాని వారి కవసరము లేదు. కేవలము ప్రజలకు భక్తి జ్ఞాన వైరాగ్యముల బోధించుట కయియే వారు తమ రచనలను సాగించిరి. కావుననే వారి రచనల యందంతటను భక్తిభావములును, నీతివిషయములును దప్ప శృంగారవిషయములు కానరావు. భాషయును బ్రజలకు సులభముగా నర్థమగునట్లు సులభ మహారాష్ట్ర పదములతో నొప్పారుచుండును.

ఆంధ్రభాషలోని కావ్యములు రాజులకొఱకయి బయలుదేరినవి. కాఁబట్టి ప్రౌఢములయి శృంగారమయములుగా నవతరించినవనియు, మహారాష్ట్ర రచనలు ప్రజలకొఱకయి యుద్దిష్టము లయినవి కనుక భక్తి జ్ఞాన వైరాగ్యములు బోధించుచు సులభగ్రాహ్యములుగా నున్నవనియు శ్రీ లక్ష్మణరావుగారి భావము.

---

# 4. హృదయశల్యము

*(శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు)*

[ జననము : 1885; నివాసము : హైదరాబాదు ]

శ్రీ హనుమంతరావు పంతులుగారు రాజకీయములందును రచనలందును సమానమగు స్థాయిలో నిలిచిన మహనీయులు. వారు నేడాంధ్రప్రదేశ శాసన పరిషత్తునకు అధ్యక్షులుగా నున్నారు. (**The Chairman, Andhra Pradesh Legislative Council.**) ఇది వారి రాజకీయ పరిచయము. పంతులు గారు తెలంగాణపు రాజకీయవేత్తలలో నగ్రశ్రేణికిఁ జెందినవారి యందు గొందఱికి రాజకీయ గురువులు, మఱి కొందఱికిఁ బూజ్యమిత్రులు. వారి దేశసేవను గుర్తించి తెలుఁగువారు వారి "నాంధ్ర పితామహు" లని గౌరవించుకొన్నారు; భారత ప్రభుత్వము "పద్మభూషణ" బిరుద మిచ్చి సత్కరించినది; ఉస్మానియా విశ్వవిద్యాలయము గౌరవ "డాక్టరేటు" పట్టము నొసంగినది.

పంతులుగారు రచనయందే గాదు ఉపన్యాసము నందును గ్రాంధిక భాషనే వాడుదురు. వారిది గ్రాంధిక మయ్యును సరళమయిన భాష. వీరి దీ విషయమున వీరేశలింగముగారి మార్గమని చెప్పవచ్చును. ప్రస్తుత పాఠ్యము దానికిఁ జక్కని యుదాహరణము.

శ్రీ హనుమంతరావుగారు మల్లికా గుచ్ఛము, మాలతీ గుచ్ఛము నను రెండు కథల సంపుటములను; జాత్రకాలపు హిందూార్యులు, తెలంగాణా ఆంధ్రోద్యమము మున్నగు చారిత్రక గ్రంథములను; మహాభారత సమీక్షణాది విమర్శ గ్రంథములను వ్రాసి యాంధ్రభాష నలంకరించిరి. ప్రస్తుత పాఠ్యము కాకతీయ చక్రవర్తిని రుద్రాంబనాడు జరిగినట్లు కల్పించిన యొక కథ.

దీనిని "చారిత్రక కథానిక" యని యనవచ్చును. ఇందలి వస్తువు (**Plot**) కల్పితమే కాని చారిత్రకము కాదు. దీనిలో వచ్చు రుద్రాంబ చారిత్రక వ్యక్తి. కడమవారు కల్పిత వ్యక్తులు.

రుద్రమాంబ తండ్రి గణపతిదేవ చక్రవర్తి. ఆ మహారాజునకు పురుష సంతానము లేవందునఁ దన పెద్ద కూఁతురు రుద్రాంబను రుద్రదేవుఁడను పురుష నామముతో వ్యవహరించి యామెకు రాజోచిత విద్య లన్నియు నేర్పించెను. తా నామెకు రాజకీయ వ్యవహారములందుఁ బ్రవేశము కలిగించి తన యనంతర మామెయే చక్రవర్తిని పదము నలంకరించు నట్లేర్పాటు కావించెను. ఆ

యేర్పాటు ననుసరించియే తండ్రి యనంతరము కాకతీయ సామ్రాజ్యమునకుఁ జక్రవర్తి (ని) యయ్యెను. ఆమె పురుష వేషమున రుద్రదేవుఁడను వ్యవహార నామముతో రాజకీయ వ్యవహారములను నడుపుచుండెను. రుద్రమాంబ పురుష వేషమున నున్నప్పుడు నిజముగానే పురుషునట్లు మారిపోవుట వలనఁ గొత్తవారి కామెను స్త్రీగా గుర్తించుట సాధ్యమయ్యెడిది కాదు. అప్పుడు యామె వ్యవహారము నందేమాత్రమును స్త్రీత్వము కనుపడకుండ నామె, నటకుఁడు తన పాత్రమును చక్కగాఁ దన వ్యక్తిత్వ మేమాత్రమును కనుపట్టనీయక నిర్వహించునట్లు ప్రవర్తించుచుండెను.

నటకుఁ డెంత మెలఁకువగాఁ బ్రవర్తించినను వాఁడు నొక్క మానవ మాత్రుఁడే కదా! ఎప్పుడో యొకప్పు డాతఁడు హృదయము ద్రవించి చలించి తన వ్యక్తిత్వమును బ్రదర్శించు సంఘటనలును జరుగుననుట యసంభావ్యము గాదు. రుద్రమాంబ విషయమునను నట్లొకమాఱు జరిగినదని శ్రీ పంతులు గారిందు చిత్రించినారు. ఆమె పురుష వేషమున నున్నప్పుడు స్త్రీత్వమామె నావేశించినది. ఇది యామెకు వెంటనే గుర్తునకు వచ్చినను జరిగిన దానిని సరిదిద్దు కొనుటకుఁ గొంత కాలము పట్టినది. అదియే యీ కథానికకు వస్తువు.

# పాత్ర్య సారము

## 1

ఓరుగల్లు కాకతీయుల రాజధాని. అంబాల దానికిఁ గొద్ది దూరమున నున్న గ్రామము. ఒకనాఁటి సాయంకాల మొక పల్లకి యంబాల నుండి యోరుగల్లు ముఖముగాఁ బోవుచుండెను. అందొక యందాలరాశి యైన యువతి ప్రయాణము చేయుచుండెను. ఆ యువతి భర్త యామె పల్లకి ప్రక్కనే గుఱ్ఱముపై స్వారి చేయుచు వచ్చుచుండెను.

సాయంకాల మగుటచేత బోయలు కల్లు త్రాగి మైమరచి పరుగెత్తుచుండిరి. అలసిపోయి నందున గుఱ్ఱము మెల్లగా నడచుచుండెను. ఇంతలో సాయంకాల మయ్యెను. గ్రుడ్డి వెన్నెల కాచుచున్నను జీఁకటి వ్యాపించుచుండెను. అది భయంకరారణ్య మగుటచేతఁ ద్వరత్వరగా నడిచి యడవి దాటవలయునని భావించి బోయీలు పరుగిడ సాగిరి. గుఱ్ఱపు స్వారీకి వారికిని జాల దూర మెడమయ్యెను.

ఇంతలో నొక దొంగల గుంపు వారిపైఁ బడెను. దొంగలకు భయపడి బోయీలు పల్లకిదించి పలాయన మంత్రమును జిత్తగించిరి. దొంగల నాయకుఁడు పల్లకిలో నున్న యువతిని సమీపించి, యామె నీవలకు లాగ యత్నించుచుండెను. ఇది యంతయు నడివలకే గమనించిన యా యువతి ధైర్యము తెచ్చుకొని తన

కడ నున్న కటారితో నా దొంగల నాయకునిఁ బొడువ నుంకించెను. ఆ నాయకుఁడు తటస్థమయిన యాపదను గుర్తించి తన ప్రాణములు కాపాడు కొనుటకయి యామె కంఠమునకు గుఱిపెట్టి యామెను హతమార్చుటకయి కత్తి నెత్తెను.

## 2

ఆ కాలమున నోరుగల్లును బరిపాలించు చున్నది రుద్రమాంబ. ఆమె కంబాల గ్రామము ప్రియతమ మయినది. అంబాలకును ఓరుగల్లునకును మధ్యనున్న సాంద్రారణ్యము దారిదోపిడిగాండ్రకు నిలయము.

సరిగాఁ బై ప్రకరణమునందు దొంగల గుంపు ఆ పల్లకిని ముట్టడించి నపుడే యిద్దఱాశ్వికులు అంబాల దిక్కుగా వచ్చుచు నక్కడఁ జేరిరి. కాని వారిద్దఱే యగుట చేత దొంగలు భయపడలేదు. ఆ వచ్చిన వారిలో నొక్కఁడప్పుడు దొంగల నాయకుఁ డెత్తిన చేయి నెత్తినట్లే నరకివేసి యా యువతి ప్రాణముల రక్షించెను. దొంగలు పరుగెత్తి పోయిరి.

బ్రదికి బయటఁ బడిన యా యువతి తన ప్రాణములు కాపాడిన యాశ్వికుని కృతజ్ఞతా సూచకముగఁ జూచి కంట తడిపెట్టుకొనెను. ఆ యాశ్వికుఁ డామె యప్పటి స్థితికి జాలివడి యామెను దగ్గఱకుఁ దీసి కౌఁగలించి కొనెను. సరిగా నా సమయముననే యా యువతి భర్తయు నక్కడికివచ్చి జరిగిన సంగతులను జూచి మిక్కిలి వగచి తన భార్య ప్రాణములఁ గాపాడిన యా యువకునకుఁ గృతజ్ఞతఁ దెలిపి యాతని నొక్కసారి తమ గృహమునకు రమ్మని వేడికొనెను. ఆ యువకుఁడు నందు కంగీకరించి తనతోఁడి యాశ్వికుని నరణ్యము దాటుదనుక వారి వెంటనుండ నియమించి తాను తన పనిపై వెడలిపోయెను. ఆ యువకుఁడు తన పేరును జెప్పెను గాని యది సరిగా వారికి వినపడ లేదు.

ఆ యువతి పేరు యమున. ఆమె భర్త ప్రతాపుఁడు. వారి నివాస మా సమీపముననే యున్న రుద్రవరమను గ్రామము.

## 3

రుద్రవరము చిన్నదే యయినను నందమయిన గ్రామము. ఆ యూరిలో నందమయిన గృహము ప్రతాపునిది. వారు సంపన్న గృహస్థులు. పితృ విహీనుఁ డగుట చేత ప్రతాపుఁడే తన యాస్తిపాస్తులను జూచుకొను చుండెను. యమున కాపరమునకు వచ్చిననాఁటినుండి యాతఁడు స్వర్గ సుఖముల ననుభవించెను. వారిద్ద ఱన్యోన్యానురాగముతో సుఖముగాఁ గాలక్షేపము చేయుచుండిరి.

కాని వారు పై సంఘటనము జరిగి రుద్రవరము చేరుకొనిన తరువాత నీ స్థితి చాల కాలమ్ము నిలువ లేదు. క్రమ క్రమముగా నా యింట సుఖశాంతు లంతరించెను. ప్రతాపుఁడు ముందు కొంచెము ముభావముగా నుండి క్రమక్రమ

ముగా యమునపై చీదరించు కొనుటయు, కోపగించు కొనుటయు, నారంభించెను. యమునకుఁ దన భర్త యిట్లుగా మారిపోవుటకు మొదటఁ గారణమర్థము కాకపోయినను, రాను రాను, ఆనాఁడు యువకుఁడు తన్ను కౌఁగలించుకొని తనయెడ ననురాగముఁ జూపుటయే భర్త కిట్టి యనుమానము కలుగుటకు హేతువయ్యెనని గమనించెను.

నిజముగాఁ దా నేపాపమును నెఱుంగదు! తన భర్తకుఁ గలిగిన యీ యనుమానము నిరాధార మయినది. దాని నెట్లేని తొలగించినచో నాతఁడు సుఖపడఁ గలఁడు. అందుకుఁ దన ప్రాణములు పోయినను నామెకుఁ జింతలేదు. ఎట్లయినను తన భర్త యీ "హృదయ శల్యము" తొలఁగి పోవలయును. కాని యెట్లది సాధ్య మగును?

## 4

ఇట్లు మూఁడు నెలలు గడచెను. యమున దుఃఖము దిన దినము వృద్ధియగుచుండెను. ఇట్లుండగా నొక్కనాఁడు వెనుక యమున ప్రాణములను గాపాడిన రుద్రదేవుఁడను నాయువకుఁడు ప్రతాపుని యింటికి వచ్చెను. ప్రతాపుఁడు తన విచారము నెట్లో కప్పిపుచ్చికొని యతిథికిఁ జూపవలసిన మర్యాదల నొనరించెను.

రుద్రదేవుఁడు యమునను గూడఁ బల్కరించెను. కాని యామెలో సంతోషమేమియు లేదు. పైపెచ్చామె కా యాగంతుకునిపై క్రోధము కలిగెను. ఆనాఁడు తన భర్త కట్లనుమానమును గలిగించుటయే కాక మఱల నీనాఁ డిట్లిక్కడి కరుగుదెంచుట చేత నామెకు రుద్రదేవునిపై క్రోధము, ద్వేషము, కలిగినవి. కాని యెట్లో అతనికిఁ బరిచర్యలను జేసినది.

వచ్చిన రుద్రదేవుఁడు వెంటనే వెడలి పోలేదు. రెండు దినములు వారింటనే నిలిచినాఁడు. ఆ రెండు దినములలో నాతనికి భార్యా భర్తల వ్యవహారములు కొంతగా నాకళింపునకు వచ్చినవి.

మూఁడవ నాఁడు యమున యింక నోర్పు వహింప లేకపోయినది. తన భర్త ముందఱనే రుద్రదేవుని నవమానించునట్లు చీవాట్లుపెట్టి యాతఁడు తన పండువంటి కాపురమును నాశనము చేసినాఁడని నిందించినది. రుద్రదేవుఁడు లోలోపల నవ్వుకొని పైకి మాత్రము కోపము నటించుచుఁ దాను ప్రాణములు కాపాడుటయే తన యపరాధ మనియు నిట్టి యతిథి మర్యాద తెలియని వారని తెలిసి యుండినచోఁ దానక్కడ నొక క్షణము కూడ నిలిచి యుండనని కఠినముగా సమాధానము చెప్పినాఁడు. తన భార్య ప్రవర్తనకుఁ బ్రతాపునకు సిగ్గు కలిగినది. అతఁ డెట్లో యీ యువకునకు సమాధానము కుదుర్చ వలయునని తన భార్యను చీవాట్లు పెట్టినాఁడు. అయినను నా రుద్రదేవుఁడు కోపమును మానలేదు.

అక్కడి నుండి వెడలిపోయి చావడిలోఁ గూర్చున్నాఁడు. ప్రతాపున కేమిచేయను దోఁచక వాకిటిలోనికి వెళ్లి నిలుచుండినాఁడు.

ఇంతలోనే యొక రాజ పురుషుఁడు వచ్చి ప్రతాపుని ముందు నిలిచి వారి యేలిక రుద్రమాంబగారు మూఁడు దినముల ముందు వారింటికి వచ్చినారనియు, డానా మహారాజ్ఞిని వెంటనే దర్శింప వలసియున్నదనియు వచించెను. ప్రతాపునకు వాని మాట లర్థము కాలేదు. అంతలోనే లోపలనుండి రుద్రదేవుఁ డక్కడకు వచ్చి చేరెను. అప్పుడా రాజపురుషుఁ డా యువకునికి నమస్కారము చేసి తానామె యాజ్ఞ చొప్పునఁ బ్రయాణమునకు సన్నాహ మొనర్చినట్లు విన్నవించెను.

ప్రతాపునకు రుద్రదేవుఁ డెవ్వరయినది యర్థమయ్యెను. వెంటనే లోనికిఁ బరుగెత్తి భార్యను గొనివచ్చి తా మిరువురును మహారాజ్ఞి పాదములకు నమస్కరించి చేసిన తప్పును మన్నింప వేడికొనిరి. ఆమెయు వారి మాటలకుఁ దాను కోపపడలేదనియు వారి యనుమానమును దీర్చుటకే తాను మఱల వచ్చితి ననియుఁ జెప్పి వారి నాశీర్వదించెను.

ఈ విధముగా యమునా ప్రతాపుల హృదయ శల్యము రుద్రమాంబ దయ వలన వీడిపోయెను. ఆ మహారాజ్ఞి యానాఁడే బయలుదేరి యోరుగల్లు చేరుకొనెను.

## కఠినపదార్థములు: వివరణములు

### 1

["పడఁతి యొక్కదాని విడిచి యించుక యమృ
తంబు లేదు ; భువి విషంబు లేదు"

వివ :- స్త్రీయే విషము. స్త్రీయే యమృతము. ఇవి తప్ప వేరే విషము నమృతము ననునవి లేవు. ఈ పద్యము తరువాతి భాగ మిట్లున్నది.

"అమృతలత లతాంగి యనురాగవతియైనఁ
గాక మెలఁగెనేని గరళవల్లి"

స్త్రీ యనురాగము కలిగి మెలఁగినయెడ నామె తనభర్తకు అమృతలతవలె నానంద మొసంగును. అట్లు కాకపోయినచో విషలతవలెఁ బ్రాణము తీయఁ గలదు. కనుకనే స్త్రీ కన్న వేరుగా నమృతముగాని విషముగాని లేదని భర్తృహరి మహాకవి భావించినాఁడు. పైది భర్తృహరి సంస్కృత మూలమునకు ఏనుఁగు లక్ష్మణకవి యాంధ్రానువాదము.

[ప్రస్తుతకథలోఁ దన భార్య ననుమానించిన ప్రతాపుఁ డామెను విషప్రాయముగా భావించుట యీ పద్యముచేత సూచితమయినది. ఇది మూలమునఁ గలదు. పాఠ్యమున విడువఁ బడినది.]

అంబాల :- రుద్రమాంబను సైనికులు "అంబ" యని పిలుచుచుండిరఁట. అందుకని యామె "యంబ" యను తన పేరితో "నంబాల" యను గ్రామము నొకదానిని నిర్మించెనఁట. ఈ విషయము ప్రతాప చరిత్రయందును, సిద్ధేశ్వర చరిత్రమునందును జెప్పఁబడి యున్నది.

ప్రాయశః = బహుళః, (లేదా వయసునుబట్టి); వసంత + ఋతు (గుణ సంధి); అశ్వ + ఆరూఢుఁడు = గుఱ్ఱము నెక్కినవాఁడు (స॥దీ॥ సం.); వేగన్ + వేగన్ = వేవేగన్ (ఆమ్రేడిత సం.); కుక్షి = కడుపు; మద్యము = కల్లు; ఆశ్వికుఁడు = గుఱ్ఱపుస్వారి చేయువాఁడు; భానుఁడు = సూర్యుఁడు; కరములు = కిరణములు, చేతులు; వృక్ష + అగ్రములు = చెట్ల కొనలు; వలను + ఐనంత = వీలయినంత; మందగమనము = మెల్లని నడక; ఓంకార నినాదము = "ఓం" అనెడి చప్పుడు-బోయవారు పల్లకి మోయుచుఁ బోవునపుడు "ఓం, ఓం" అను చప్పుడును చేయుచుఁ బోవుదురు. దానివలన వారికిఁ గొంత శ్రమ తగ్గినట్లు కనుపించును; డోల + ఆందోళిత మానస = ఊయెలలో నుంచి యూపినట్టు లిటు నటు నూగుచు నాందోళన మందుచున్న మనస్సు కలది; ఏలిక = ప్రభువు; ఎడము = మధ్యదూరము.

చంద్ర + ఉదయము (గుణసంధి); గ్రుడ్డివెన్నెల = చాల తక్కువగానున్న వెన్నెల; తరుణము = సమయము; వీనులు = చెవులు; పరికించు = పరీక్షించు (ప్ర); సందడించు = అలజడి కలిగించు; తదనుగుణము = దానికిఁ దగినది; స + ఆయుధముగ = ఆయుధములతోఁ గూడ; వెలవెలఁ బోవు = భయముచేతఁ దెల్లబడిపోవు; గతి + అంతరము = మఱియొక మార్గము (దిక్కు) యణాదేశ సంధి;

దొరసాని = ప్రభ్వి, యజమానురాలు; సాని "ప్ర"- స్వామిని = యజమానురాలు, "సాని" యను పదమునకు మొదట యజమానురాలనియే యర్థము. తరువాత తరువాత దానికి నేఁడు మనము వ్యవహరించు చున్నట్లు "భోగపు స్త్రీ" యను నర్థము వచ్చినది. కాని యిప్పుడును "దొరసాని", "పఱేలుసాని" మున్నగు పదములందు మొదటి యర్థమే కనిపించును.

విస్మయము = ఆశ్చర్యము; విచారము = దుఃఖము; పఱపు = వ్యాపింపఁ జేయు;

సుందరి = అందకత్తెయగు స్త్రీ; దౌర్బల్యము = దుర్బల స్వభావము; ఎద = హృదయము; లేమ = స్త్రీ; దండప్రహారము = బడితదెబ్బ; జవ్వని =

యువతి ; ఇతికర్తవ్యతామూఢ = ఏమిచేయవలెనో తెలియక నిశ్చేష్టితురాలయి యున్నది ; గుప్తము = దాచి యుంచినది; రొమ్ము: "ప్ర"-ఉరమ్ము = వక్షస్థలము ; విద్యుద్వేగముతో = పిడుగువలెఁ ద్వరగా ; ఉంకించు = పూనుకొను.

## 2

త్రిలింగ రాజ్యము :- తెలుఁగుదేశము. శ్రీశైలము, కాళేశ్వరము, ద్రాక్షారామము నను మూఁడు శివస్థలములందుఁగల లింగముల ననుసరించి తెలుఁగు దేశమునకు "త్రిలింగ"మను పేరు వచ్చినది. శ్రీశైలము రాయలసీమయందు కర్నూలు మండలముననుు, కాళేశ్వరము తెలంగాణమున కరీమునగరము జిల్లాలో మంథెనదగ్గఱను, ద్రాక్షారామము తూర్పుగోదావరి జిల్లాలో రెండు గోదావరి పాయలకు మధ్యగాను నున్నవి. వైభవ + ఉపేతము (గుణసంధి); సాంద్రి + అరణ్యము = దట్టమగు నడవి (స॥ దీ॥ సం. కర్మధారయ సమా.); గ్రామ + ఉన్ముఖులుగ = గ్రామపుదిక్కు వెడలువారుగ (గుణసంధి); యథా + ఇచ్ఛముగ = కోరినట్లు (గుణ సం. అవ్యయీభావ సమా.); పరలోకగామి = పరలోకమునకు వెడలునది ; ఆగంతుకులు = క్రొత్తగ వచ్చినవారు ; కటిబద్ధుఁడు = నడుముకట్టుకొని యున్నవాఁడు ; ప్రేటు = దెబ్బ ; పిక్కబలముచూపు = పరుగెత్తు ; మార్గదర్శి = త్రోవఁజూపినవాఁడు ; సుదతి : 'వ్యు'-మంచి పలువరుసగల స్త్రీ ; కృతజ్ఞతా + అవలోకనములు = కృతజ్ఞతతోడి చూపులు (స॥ దీ॥ సం.) ; స్వీయభావము = తన యభిప్రాయము (కృతజ్ఞత) ; ఆనంద + అతిశయము = పోనున్న ప్రాణము దక్కుటవలనఁ గలిగిన యత్యంతానందము ; బాష్పకణములు = కన్నీటిబొట్టులు ; కనుదమ్ములు = తామరపూలవంటి కన్నులు (ఉపమానోత్తర పద కర్మధారయ సమా.), తమ్మి = తామరపూవు ; నును చెక్కులు = నున్నగానున్న చెక్కులు(విశే. పూర్వపద కర్మధారయము); దేదీప్యమానముగా = చక్కని కాంతితో ; వెల్లి = ప్రవాహము ; వెల్లివిరియు = చాలుకట్టు ; ముద్దియ = ముగ్ధ = అమాయికురాలగు స్త్రీ ; ముద్ద + ఆలు = ముద్దరాలు (రుగాగమసంధి. సూ॥ కర్మధారయంబునం బేదాదుల కాలు శబ్దంబు పరంబగు నపుడు రుగాగమంబగు.), ముద్ద-"ప్ర" ముగ్ధ ; ఒక్కతూరి = ఒక్కమాఱు:- తన భార్యను పరపురుషుఁడు కౌఁగలించుకొనుట నా యువకుఁడు కన్నులారఁ జూచెననుట ; తస్కరుఁడు = దొంగ ; ఆయుధములు పాణులందుఁ గలవారు (బహుప్రీహి) ; తెఱంగు = విధము ; చెప్పకయ చెప్పెను : వానిని జూచి తానే గ్రహించెననుట ; ముప్పిరిగొను = మూఁడు పేటలుగా నొకదానితో నొకటిగా నల్లుకొను - ఆపద వచ్చినందుకు దుఃఖము, బ్రదికినందుకు సంతోషము, కాపాడిన వానియెడఁ గృతజ్ఞత ; ప్రాణ + ఈశుఁడు = ప్రాణములవలెఁ బ్రియుఁడయిన భర్త (గుణ సం॥); బాహులతలు (ఉపమానోత్తరపద కర్మధారయ సమా.).

నెఱ + చెలి = నెచ్చెలి (ప్రాంతాది సంధి. సూ॥ అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొ. చోఁ గానంబడియెడి); తత్ + మూలము (అనునాసిక సంధి); నయము = నీతి ; శ్లాఘించు = పొగడు ; చిరకాలము = చాలా కాలము ; శ్లాఘనీయము = పొగడఁదగినది ; కర్తవ్యము = చేయఁదగినపని-"Duty" ;

పాప మీ సుందరిని వదలిపోవుట నా కిష్టములేదు : ఆగంతకుఁ డీ మాట నా సుందరియెడఁగల సానుభూతితోఁ బల్కియుండవచ్చును. కాని వినువారి కాతఁ డామె యందనురాగము గల్గియుండెననుటను సూచించును.

ఆనందప్రదము = సంతోషము నొసంగునది ; వందనము = నమస్కృతి ; రుద్రదేవుఁడు : ఇది రుద్రమాంబకుఁ బురుషవేషమునందలి పేరు.

## 3

వాసము = నివాసము : పైతృకములు = తండ్రిగారినుండి లభించినవి, కేలఁగొను = చేతికిఁగొను; కమాను = Arch ; దంపతులు-"విగ్ర" జాయయును పతియును (ద్వంద్వము); ముత్తియము: రూపాంతరము ముత్తెము ; తత్ + మూల్యము = దానివెల (అనునాసిక సం.); అనుదినము = ప్రతిదినము; గృహ + ఆరామము = పెరటి తోట (స॥ దీ॥ సం.); అభ్యంతరగృహము = అంతఃపురము; అభ్యంతరము = అడ్డు ; నర్మగర్భ వాక్యములు = అర్థాంతరము వచ్చునట్లు మాట్లాడు వ్యంగ్య వాక్యములు ; ఉసురు = ప్రాణము ; అంతరాళము = నడిమి భాగము, అన్వేషించు = వెదకు ; హృదయ శల్యము = మనసులోఁ గ్రుచ్చుకొనిన యెముక, (నిరంతరము బాధించు చింతయనుట) ; పావిత్ర్యము = పవిత్రత ; మేధస్సు = మెదడు ; కంటక + ఆవృతము = ముండ్లచేఁ జుట్టఁబడినది ; మనోజ్ఞము = అందమయినది ; మనక్షేత్రము = మనస్సనెడి క్షేత్రము (రూపక సమాసము) "మనఃక్షేత్రము" అనునది సాధురూపము ;

## 4

దుర్దినము = చెడు దినము;-చింతకుఁ గారణమయినది కనుక నది దుర్దినము-సూర్యుఁడు కానరాని దినమునకు దుర్దినమనుట ప్రాచీన వ్యవహారము ; లతా వితానము = తీఁగల గుంపు ; సమాగమము = రాక, సమావేశము : సంతానము = సమూహము; సౌరభము = సువాసన ; పల్లవింపఁజేయు = ఉత్సాహపఱచు ; కేళాకూళులు = దిగుడబావులు ; మిథునము = జంట ; అంతరంగము = మనస్సు ; అసువులు = ప్రాణములు ; జీవిత + ఈశ్వరుఁడు = భర్త (గుణ సం.); శంకారాహిత్యము = అనుమానము లేకుండుట ; కన్నీరు మున్నీరుగా = కంటినీరు సముద్రమంతగాగా, మున్నీరు = సముద్రము ; దశ = స్థితి ;

మఱుగుపఱచు = దాచియుంచు ; హృదయ కమలము: "విగ్ర" హృదయ మనెడి కమలము (రూపక సమాసము) ; తర్క వితర్కము = ఇటులగునా ? అటులగునా ? అను నాలోచన ; మానసిక + అస్వస్థత = మనసులోని యనారోగ్యము; దగ్ధము = కాలిపోయినది ; వేధించుట = బాధపెట్టుట ;

సన్న-"ప్ర" సంజ్ఞ ; పర + ఉపకారము (గుణసంధి) ; ముఖము వాయఁ జీవాట్లు పెట్టు = ఎక్కువగా నిందించు ; ఆనతి-"ప్ర" ఆజ్ఞప్తి ; ఆయత్తము = సిద్ధము ; పాదరాజీవములు (ఉపమానోత్తర పద కర్మధారయము): "విగ్ర" రాజీవములవంటి పాదములు ; రాజీవములు = కమలములు ;

అభినయించు = నటించు ; మార్దవము = మెత్తఁదనము (జాలి), నివర్తితము = పోఁగొట్టఁబడినది ; నిష్కాపట్యము = కపటములేనిది ; అవజ్ఞ = అవమానము ; కేలుమోడ్పు = నమస్కరించు ; భయభక్తి + ఆశ్చర్య + ఆవేశములు: (ద్వంద్వసమాసము: 1 యణాదేశసంధి 2 సవర్ణదీర్ఘసంధి); పునఃపునః ప్రణామములు = మఱల మఱలఁ జేయు నమస్కారములు ; అధిష్ఠించిన = కూర్చుండిన ; ఆందోళిక = పల్లకి; అంతర్హితమగు = మాయమగు, దూరముగాఁ బోయి కనుపట్టక పోయెననుట.

## సందర్భ వాక్యములు

1. "పాప మీ సుందరిని వదలిపోవుటకు నాకిష్టముగలేదు. అయినను నట్లు చేయక తప్పదు. మీ గ్రామ మెద్దియో తెలిపిన నొకమా ఱచటికి వచ్చి మిమ్ము దర్శించి ధన్యత నొందెదను." (పుట 117)

పై వాక్యములు పద్మభూషణ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులు గారు వ్రాసిన "హృదయ శల్యము" అను కథానిక యందలివి.

యమునను దొంగల బారినుండి కాపాడిన అందమయిన యాశ్వికుఁడు పిమ్మట నామె స్థితికి జాలిపడి యామెను కౌఁగలించుకొన్నాఁడు. సరిగా ఆ సమయమునకే యమున భర్త అక్కడికి వచ్చినాఁడు. అప్పుడాతని హృదయస్థితి యెట్లుండెనో కాని తరువాత మాత్రము ఆతనికి, తన భార్యపై ననుమానము కలిగినది. పై పలుకులు ఆశ్వికుఁడు సుందరీ ప్రతాపులకడ సెలవు గైకొనుచుఁ బలికినవి.

పాప మా యాశ్వికునకు యమునాసుందరిని వదలిపోవుట కిష్టముగ లేదట. ఏలనో ? అనురాగమో ? లేక జాలియో కారణము కాఁదగును. ఆ యాశ్వికుని యంతస్స్థితి మనకుఁ దెలియదుగాని యమున భర్త కది యనురాగముచేతనే యని తోఁచుట కవకాశమున్నది. ఇష్టము లేకపోయినను విడువక తప్పదట.

ఇదియు నట్టిదే. ఆ యాశ్వికుఁడేదో ఐరూరుపనిపై నేగుచున్నాఁడు కాఁబోలు! ఏదయిన రాచకార్యమయి యుండును! కాని మఱల వారిని దర్శింపవలయును గను గ్రామాదుల వివరము లడిగి తెలిసికొన్నాఁడా యాశ్వికుఁడు.

పై వాక్యములే, పూర్తిగా కాకపోయినను నివి కూడ యమున యెడ నామె భర్తకనుమానము కలుగుటకుఁ దోడ్పడియుండునని యనుమానించుటకు వీలుగా నున్నది.

కాని కథానికను బూర్తిగాఁ జదివినప్పుడు పై భావమునకు భిన్నముగా నా వాక్యములు పలికినది మహారాణి రుద్రమాంబయనియు, నామె కిరుణార్ద్రచిత్తయయి యమునను కౌఁగిలించుకొనెననియు, నా పిదప నామెకుఁ దనవేషము విషయము స్ఫురణమునకు వచ్చి యిట్లా దంపతులను మఱల దర్శించి వారి యనుమానమును బోఁగొట్ట నిశ్చయించెననియు విశదమగును.

శ్రీ పంతులుగారి రచనయందు సున్నితమయిన హాస్యము తొలకాడుచుండు ననుటకు పై వాక్యములు చక్కని తార్కాణము.

2. "అనురాగమున కునికిపట్టులగు స్త్రీలు పురుషుల నెంత గాఢముగఁ బ్రేమింపఁగలరో పురుషులు స్త్రీల నంత గాఢముగఁ బ్రేమింపఁగలుగుట కొన్ని పట్టుల నసంభవముగదా !" (పుట 118)

పై వాక్యములు ఆంధ్రపితామహ శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారి "హృదయ శల్యము" అను కథానికలోనివి.

"స్త్రీలు సహజముగా ప్రేమ కునికిపట్టులు. ప్రేమించుట వారి సహజ గుణము. కావుననే వా రెవరిని ప్రేమించినను నందుఁ దమ భర్తలను గాఢముగాఁ బ్రేమింపఁగలరు. పురుషు లట్టివారు కారు. వారు గాఢముగాఁ బ్రేమించినను స్త్రీలతోఁ బోల్చినప్పుడు వారి ప్రేమ యంత గాఢమయినదిగాఁ గనుపట్టదు. ఇది సర్వత్ర నిలుచు భావము కాకపోవచ్చును గాని కొన్ని యెడల నయినను నట్లగునని యొప్పుకొనక తప్పదు." ఇది పంతులుగారు యమునా ప్రతాపుల యనురాగముల తారతమ్యములఁ జిత్రించి యమున యెడఁ బ్రతాపున కనుమానము కలుగుట కవకాశ మెట్లు కలిగినదియు నిరూపించు నుపోద్ఘాతము.

యమున ప్రతాపుని గాఢముగాఁ బ్రేమించుచుండెను. ప్రతాపుఁడు యమునను గూడఁ బ్రేమించుచుండెను. ఇట్లు వారి సంసారము సుఖముగాఁ గడచి పోవుచుండెను. కాని యానాఁడు ఆశ్వికుఁడు యమునను గౌఁగలించుకొన్నది మొదలు లా యనురాగమున మార్పు కనుపింపఁజొచ్చెను. ప్రతాపునకు మొదట యమున యందున్న యనురాగము క్రమక్రమముగా మాయము కాఁజొచ్చెను.

ఈ భావమునకు వ్యాఖ్యాన రూపమగు నుపోద్ఘాతమే పై వాక్యములు.

3. "వస్త్రముపైఁ బడిన మచ్చను గడిగివేయవచ్చును గాని హృదయమునఁ బడిన మచ్చను నుడిచివేయుట దుస్సాధ్యము." (పుట 118)

ఈ వాక్యము శ్రీ సూరపాటి హనుమంతరావు పంతులుగారు వ్రాసిన "హృదయ శల్యము" అను కథానికలోనిది.

యమున యెడఁ బ్రతాపుని యమితానురాగము. యమునకు భర్త యెడఁ గల ప్రేమ యపారము. అన్యోన్యానురాగము గల యా దంపతుల జీవయాత్ర స్వర్లోక సౌఖ్యములతో సాగిపోవుచుండెను. కాని యీ స్థితి కొంత కాలమునకు మారిపోయెను.

ఒక నాఁడు యమున పల్లకిలో నరణ్య మధ్యమున ప్రయాణము చేయుచుండఁగా దొంగల గుంపొకటి యామె పల్లకిని జుట్టుముట్టెను. అప్పుడు ప్రతాపుఁడు చాల వెనుకగా వచ్చుచుండెను. దొంగల నాయకుఁడు యమునను జంపుటకై కత్తి యెత్తెను. ఇంతలో నెవ్వరో యాశ్వికుఁడు వచ్చి యమునను నాయాపదనుండి కాపాడి యామె స్థితికి జాలినంది యామె నోదార్చుటకయి దగ్గఱకుఁ దీసికొని కౌఁగలించుకొనియెను. సరిగా నా సమయముననే ప్రతాపుఁ డక్కడికి వచ్చి జరిగినదానిని దెలిసికొని చాల విచారించి యాశ్వికునకుఁ గృతజ్ఞతఁ దెలిపి యింటికిఁ జేరెను.

కాని ప్రతాపుఁడు తన భార్య యన్యపురుషుని కౌఁగలింతలో నున్న యా ఘట్టమును మఱచి పోలేక పోయెను. అతని హృదయమున యమునయెడ నిదివఱకున్న యనురాగము పోయి దాని స్థానము ననుమానము మాక్రమించెను. హృదయము తెల్లని బట్టవంటిది. అనుమానము దానిమీఁది మచ్చవంటిది. కాని బట్టమీఁది మచ్చను కడిగివేయవచ్చును. హృదయమున బయలుదేరిన యనుమానము తొలగించుట యంత సుసాధ్యము కాదు. కనుకనే ప్రతాపుని యనుమానము నెట్లు దూరము చేయవలయునో తెలియక యమున మిక్కిలి దుఃఖము ననుభవించినది.

ఈ వాక్యము యమునా ప్రతాపులకు మునుముందు కలుగు పరితాపమున కుపోద్ఘాత ప్రాయమయిన పరిచయము.

4. "నీ వితరుని వెలగల ముత్తియమును పొరపాటునఁ బగులఁ గొట్టితివేని దానికిఁ బ్రతిగఁ దన్మూల్యమగు ధనము నిచ్చిన నీ నేరము తీరిపోవును; కాని నీ వొక్కని మనస్సును జితుకఁ గొట్టితివేని ప్రపంచమునఁ గల యెట్టి యమూల్య వస్తువు నిచ్చినను నా కొఱఁత దీఱఁజాలదు." (పుట 119)

ఇవి శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారి "హృదయ శల్యము" అను కథానికలోని పంక్తులు.

మనసు చాల సుకుమారమయినది. దాని నేమాత్రమును బాధింపరాదు. ఎవరి మనసునేని మనము బాధించినచో నా బాధను బోఁగొట్టుటకు మఱొక యుపాయమే లేదు. మనసు ముత్యముకన్న విలువయినది. ముత్యమును బగులఁగొట్టినచో దాని వెల నిచ్చివేసి మన బాధ్యతఁ దీర్చుకొనవచ్చును. కాని మనసు విషయ మట్టిది కాదు. అది విఱిగినచో దాని నతికించుట కేమిచేసినను నది సాధ్యము కాదు.

ఇది ప్రతాపుని మనస్సును గుఱించిన పరిచయము. యమునపయి ప్రతాపున కనుమానము కలిగినది. ఆ యనుమానము వలన నాతని కామెపై మనసు విఱిగినది. మమకారము నశించినది. ఆ పూర్వానురాగము నాఁడేమిచేసినఁ జూపఁగలఁడు? ఆతని మనస్సు మఱల నతుకుకొనుట యెట్లు? అది చాల కష్టకార్యము. అట్లా దంపతులు దుఃఖ ప్రవాహమున మునుకలు వేయవలసినదే.

దీని కుపోద్ఘాతమే పై వాక్యరచన.

5. "మానవ హృదయ మొక విచిత్ర క్షేత్రము." (పుట 120)

ఈ వాక్యము శ్రీ మాడపాటి హనుమంతరావు పంతులుగారు రచించిన "హృదయ శల్యము" లోనిది.

యమున ప్రతాపునకుఁ దనయెడఁగలిగిన యనుమానమునకుఁ గారణమును గ్రహించినది. అది యాతని వట్టి యనుమానమేయని యామె యెఱుంగును. ఆ యాశ్వికుఁడు తనను గౌఁగలించుకొనుట తప్పే. కాని యాతని యప్పటిభావ మేమో తెలియదు. తానో నిష్కళంక హృదయ. తన హృదయమునఁ బ్రతాపునకుఁదెక్క అన్యులకు స్థానములేదు. ఈ విషయము ప్రతాపున కర్థముచేయించవలయును. అప్పుడాతని యనుమానము దూరము కాఁగలదు. "నిజముగా హృదయము లిచ్చి చెప్పినచోఁ బ్రతాపుని యనుమానము తొలఁగునేమో?" ఇది యమున మొదటి యాలోచన.

కాని యీ యాలోచన యెంతోసేపు నిలువలేదు. "నిజముగా నంత సులభముగా ననుమానము వీడఁగలవాఁడయినచోఁ దన హృదయ మిదివఱకే పూర్తిగా నెఱింగినవాఁ డింతచిన్న విషయమున కేల యనుమానముపాలు గావలెను?" అను నదియే యామె మనస్సుననే బయలుదేరిన సమాధానము. అందుకని యామె ప్రతాపుని యనుమానమును దొలగించు ప్రయత్న మేమియు గావింపలేదు.

దీనికిఁ గారణమేమి? ఆమె మనస్సే. మనస్సున సంకల్ప వికల్పములు కలుగుచుండును. అది యొక విచిత్ర క్షేత్రము. అందు మంచి చెట్లును విషలతలును నొకదాని తరువాత నొకటి బయలుదేరును.

పై వాక్యము మనస్సుయొక్క స్వరూపమును హృదయంగమముగాఁ జిత్రించుచున్నది.

6. "నిన్నుఁ గాపాడుటయే నేఁజేసిన ఘోర పాపమైనచోఁ బరోపకార మాహాత్మ్యమును నాకుఁ గడుఁజక్కఁగ నుపదేశించినదాన వైతివి." (పుట 123)

ఈ వాక్యము శ్రీ మాడపాటి హనుమంతరావుగారు రచించిన "హృదయ శల్యము" అను కథానికయందు రుద్రదేవుఁడు యమునతోఁ బలికినది.

రుద్రదేవుఁడు ఆపత్సమయమునఁ దన్నుఁ గాపాడినను ఆనాఁడు తన్ను కౌఁగలించుకొని తన భర్తకుఁ దనయెడ ననురాగము నశించునట్లు కావించినాఁడు. అట్టివానియెడఁ దనకసలే చాల కోపముగానున్నది. దానికిఁ దోడాతఁ డిప్పుడు తమ యింటి కతిథిగా వచ్చి మూఁడుదినములుగా "తిష్ఠ" వేసికొని కూర్చున్నాఁడు. ఇది యమునకు సహింపరానిదయినది. అందు కామె మూఁడవనాఁడు భర్త యెదురుగనే రుద్రదేవుని ఛడామడా చీవాట్లుపెట్టి యాతఁడొనర్చిన యపకారమును- అస్పష్టముగానే- నిందించినది.

రుద్రదేవుఁ డా మాటలు విని కోపముతోఁ జెప్పిన సమాధానమే పై వాక్యము. నిజమునకు రుద్రదేవుఁడు యమున కొనర్చిన యపకార మేమియులేదు; పైగా నామె ప్రాణములను తాను గాపాడినాఁడు. ఇందు కామె తనయెడఁ గృతజ్ఞతఁ జూపవలసియుండఁగా దానిని విడిచి నిందింప నారంభించినది.

ఈ భావమునే యా రుద్రదేవుఁడు పై వాక్యముతో యమునకుఁ దెలిపినాఁడు.

కాని యా రుద్రదేవునకు యమున యంతస్తాపము తెలియకపోలేదు. కావుననే యాతని యీ మాటలయందు గ్రహించువారికి సున్నితమయిన హాస్యము గోచరించును. ప్రతాపుని యనుమానమును దా నొక్క నిముసములోఁ బోఁగొట్టుదునన్న ధీమాతోనున్నవాఁడు కాఁబోలు నాయాశ్వికుఁడు! కనుకనే యాతఁడు జరిగిన దేమని యడిగి తెలిసికొనక తాను నామెకన్న నెక్కువ కోపముతో సమాధానము చెప్పినాఁడు.

## ప్రశ్నలు - సమాధానములు

ప్ర 1 :- "హృదయ శల్యము" అను పేరాకథకెట్లు తగియున్నదో వివరింపుఁడు.

సమా:- "హృదయ శల్యము" శ్రీ మాడపాటి హనుమంతరావుగారు రచించిన కథానిక. ఇందు రుద్రమాంబ పురుషవేషమునుండి తన వేషపు స్వభావమును మఱచి యొక మగనాలిని కౌఁగలించుకొనఁగా నది యా దంపతులలోఁ గలఁతలకుఁ గారణమయిన విషయము చిత్రింపఁబడినది.

ప్రతాపునకుఁ దన భార్యను "బర పురుషుఁడు" కౌఁగలించుకొనుటవలన నామె యందనుమానము బయలుదేరినది. ఆ యనుమానమువలన నాతఁడంతకు ముందు తన భార్యయెడఁ జూపుచుండిన యనురాగము గోల్పోయినాఁడు. యమున జీవిత మావిధముగా దుఃఖముల పాలయినది.

ప్రతాపుఁడు తన భార్య నట్లని యెదురుగా నిలిచి యేమియు నిందింపఁడు. ఆమె దోష మిదియని తెగవేసి యనలేఁడు. లేదని యామెను ఆదరింపలేఁడు. తనలోఁ దానే యనుమానముతో లోలోన బాధపడుచుండును. అతనికిఁ దన భార్య యెడఁ గలిగిన యనుమానము హృదయమునఁ గ్రుచ్చుకొన్న శల్యమువలె నిరంతరము బాధను గలిగించుచుండును.

ఈ బాధ యితరులకుఁ జెప్పఁదగినదియునుగాదు. చెప్పి ప్రయోజనమును లేదు. కనుకనే యాతఁ డెవ్వరితోడను వెనుకటివలె నుల్లాసముగా మాట్లాడలేక పోయినాఁడు.

ఈ యంతర్గతమయిన హృదయతాప మిందు వర్ణింపఁబడినదని సూచించుటకే యీ కథానికకు "హృదయశల్యము" అని పేరు పెట్టఁబడియుండును.

రుద్రదేవుఁడు కాకతీయ సామ్రాజ్యమునకు మహారాజ్ఞియయిన రుద్రమాంబయే యని కథానికకుఁ జివర స్పష్టమయినది. అప్పుడు ప్రతాపుని హృదయమునందలి యనుమానశల్యము తనంతటఁ దానే నశించినది. యమునా ప్రతాపుల యనురాగ ప్రవాహమును గొంతకాలము సాగకుండ అడ్డుకట్టవలె నయిన దీ యనుమానశల్యము. అడ్డుకట్ట తొలఁగినతరువాతఁ బ్రవాహవేగము హెచ్చినట్లే యమునా ప్రతాపులు హృదయ శల్యము వీడినఁ తనే వెనుకటికన్న హెచ్చుగా ననురాగయుక్తులై యుండి యుందురు.

ఈ కథ యంతయు నొక్క యనుమాన మాధారముగాఁ గూర్చఁబడినది. కనుక "హృదయ శల్యము" అనుపేరు దీనికిఁ దగియేయున్నది.

ప్ర 2:- రుద్రమాంబ ప్రవర్తనమును మీ పాఠ్యభాగము ననుసరించి చర్చింపుఁడు.

యమున ప్రాణాపాయముననున్న సమయమునందుఁ బురుషవేషముననున్న రుద్రమాంబ యామెను గాపాడెను. ఆమె యా సమయము నందేదో రాచకార్యముపై నా మార్గమునఁ బయనించుచుండెను. వెంట నొక యాశ్వికుఁడు నుండెను.

ప్రాణాపాయమునుండి కాపాడిన వ్యక్తియెడఁ గృతజ్ఞతఁ జూపుట యమున విధి. ఆమె యా విధిని జాల సహజముగా నిర్వర్తించెను. ఆమె యప్పటిస్థితి రుద్ర మాంబకుఁ జాల జాలి కలిగించెను. అందుకని యామె యమునను గ్రుచ్చియెత్తి కౌఁగలించుకొని యాశ్వాసించెను. సరిగా ఆ సమయమునకే యమున భర్త యక్కడకు వచ్చిచూచి సిదప గృహమునకుఁ బోయిన కొంతకాలమున కనుమానము పాలయ్యెను. ఈ యనుమానమునకుఁ గారణము రుద్రమాంబ పురుషవేషము నందుంటయే.

ఆమె తన వేషస్వభావమును జ్ఞాపకముంచుకొని యమునను దూరము నుండియే యోదార్చియున్నచో నీ యనుమానమున కవకాశము లేకపోయి యుండును. లేదా యమున భర్తవచ్చినవెంటనే యామె తన సంగతిని వారికి స్పష్టముగాఁ జెప్పియున్నను నీ యనుమానము కలిగియుండునది కాదు.

అందు మొదటిదానిని చేయకుండుటకుఁ గారణమును రుద్రమాంబయే చివరకు వచించినది. చావిచ్చు నంచనేకములగు నొడుదుడుకులను జూచినదగుటచేత స్త్రీ స్వభావమయిన జాలి యామెకుఁ గలిగి తన యప్పటి పురుషవేషమును మఱచి యామె యమునను గౌఁగలించుకొన్నదఁట. ఇది సహజమే. కొన్ని పట్టులలో హృదయగత భావములు తాత్కాలికములయిన బాహ్యావేషములను మఱపింపఁ జేయును. కనుకనే రుద్రమాంబ యీ చర్య సమర్థింపఁదగినదే.

ఇఁక నామె వెంటనే తన స్థితి నెందుకు వారికిఁ దెలుపలేదను ప్రశ్నమున కేదయిన సమాధానము కలదేమో చూతము.

రుద్రమాంబ వెంటనే తాను జేసిన కృత్యమువలనఁ గలుగు పరిణామము నూహించినది. కనుకనే తాను మఱల వారిని జూచుటకు వారి యింటికి వచ్చెదనని చెప్పి యంగీకరింపఁ జేసినది. కాని యప్పుడే తాను "మహారాజ్ఞి"నని చెప్పియుండరాదా? యని యనవచ్చును. కాని యామె యేదో ముఖ్యమయిన రాచకార్యముపై తొందరగా నరుగుచున్నదిగదా! ఆ రాచకార్యము తాను మహారాజ్ఞియని యితరులకుఁ దెలుపరానిదై యుండవచ్చును. అదియునుగాక యామె యస్పష్టముగానైనను దాను "రుద్రదే...." యని సూచించినది. ప్రతాపుఁడు కొంచెము బుద్ధినైశిత్యము కలవాఁడయినచో నామెను "రుద్రమాంబ"యని గుర్తించియే యుండును. ఏలయన నా యాశ్విక యువకునకు పురుషోచితములయిన మీసములు లేవని ముందే చెప్పఁబడినదిగదా! ఇంతకును బ్రతాపుఁడు దేనిని త్వరగా గుర్తించి యొక నిర్ణయమునకుఁ ద్వరగావచ్చువానివలెఁ గనిపింపఁడు. కనుకనే యిది యిట్లు జరిగినది. తన భార్యపై ననుమానము మాత్ర మాతని కెప్పుడు కలిగినది? యింటికి పోయిన పిదపఁగదా! ఆ యనుమానమే యరణ్యము నందాతనికిఁ గలిగి యున్నచో రుద్రమాంబ యాతని కక్కడనే యేదోవిధముగా సమాధానమును గలిగించియుండును.

దీనినిబట్టి రుద్రమాంబ రెండవ ప్రవర్తనము సముంజసమయినదయని తేలుచున్నది ఈ కథానికయందు రుద్రమాంబ ప్రవర్తనము చాలసహజముగాను, ఉచితముగాను జిత్రింపఁబడినదనుట సారాంశము.

ప్ర 3 :- యమునా ప్రతాపుల చరిత్రమును మీ పాఠ్యము ననుసరించి వర్ణింపుఁడు.

సమా:- ప్రతాపుఁడు రుద్రవరనివాసి. సంపన్నమయిన సంసారము గలవాఁడు. కాని తల్లిదండ్రులు లేనివాఁడగుటచేత యమున కాపురమునకు రాక ముందు గొంతకాలము సాంసారిక కష్టముల నెదుర్కొన్నాఁడు. యమున కాపురమునకు వచ్చినప్పటినుండి యాతని యిల్లు స్వర్లోకసౌఖ్యములకు నిలయమయినది వారిద్దఱు పరస్పరానురాగముతో హృదయములు కలిసి మెదులుచుండుటవలన వారికిఁ గాలము క్షణములవలెఁ బరుగెత్తుచుండెను. నవయౌవనము, అన్యోన్యానురాగము, సుఖముల ననుభవించుటకుఁ గావలసిన సంపద, యివి యన్నియు నున్నవారి జీవితమునకుఁ గొదవయేలేదుగదా !

ఒకనాఁడు వారిరువురును నొక యరణ్యమునఁ బ్రయాణము చేయుచుండిరి. యమున పల్లకియందుఁ బయనించుచుండెను. ప్రతాపుఁడు గుఱ్ఱముపై నామెవెంట వచ్చుచుండెను. సాయంకాలము కాఁగా బోయలు కల్లుదాగి మత్తుచేఁ బరుగెత్త సాగిరి. ప్రతాపుని గుఱ్ఱము వెనుకఁబడెను. వారిద్దఱకును నడుమ నెడమేర్పడెను.

సరిగా నా సమయముననే దొంగల గుంపొకటి పల్లకిని ముట్టడించుటయు దొంగలనాయకుఁడు యమునను జంప నుంకించుటయు జరిగెను. క్షణములో యమున చచ్చియుండెడిదే. కాని యా సమయమునకే యక్కడికివచ్చిన రుద్రదేవుఁడను నాశ్వికయువకుఁ డామె ప్రాణములను గాపాడెను. యమున యా యాశ్వికునియెడఁ గృతజ్ఞతను జూపెను. ఆ యాశ్వికుఁడు యమునను జాలివడి కౌఁగలించుకొనెను. ఈ దృశ్యము ప్రతాపుని కంటఁబడెను. జరిగిన సంగతిఁజూచి యాశ్వికున కాతఁడు కృతజ్ఞత తెలిపి భార్యతోఁగూడ స్వగృహమునకుఁ జేరుకొనెను.

ప్రతాపుని హృదయమునందుఁ దన భార్యయెడ ననుమానము బయలు దేరెను. మెల్లమెల్లగా నాతఁడు తన భార్యయెడ ననురాగమును గోల్పోయి యామెకు దూరము కాఁజొచ్చెను. నిరంతర చింతచేత నాతఁడు మిక్కిలి దుఃఖము నొందెను. దీనివలన యమునయు నంతస్తాపమునకు గుఱియయ్యెను. ఆ యింటి నుండి సంతోషము మాయమయ్యెను. ఇట్లా గృహము ఒకప్పుడు స్వర్గమువలె ప్రకాశించి యిప్పుడు నరకప్రాయమయ్యెను. దీని కంతకును బ్రతాపుని యనుమానమే కారణము. ఆ యనుమానమున కానాఁడు యమునను ఆశ్వికయువకుఁడు కౌఁగలించుకొనుట కారణము,

యమున నిరపరాధిని. ఆమె హృదయమునఁ బ్రతాపునకుఁదప్ప నన్యులకు స్థానములేదు. కాని యీ భావము ప్రతాపున కెట్లు తెలియవలయును. అనుమానము కలుగఁగూడదు, కాని కలిగినచో— నిట్టి విషయములందు— అన్నియు దాని కనుగుణముగానే యర్థమగుచుండును. అట్లే దుఃఖభారముతో నా దంపతులు దినముల నీడ్చుచుండిరి.

మూఁడు నెలలు గడచెను. ఒకనాఁడా వెనుకటి రుద్రదేవుఁడు వారి యింటికి వచ్చెను ప్రతాపుఁడు తన హృదయము నెట్లో దాచిపెట్టుకొని రుద్రదేవుని కుచితమయిన విధముగా నాతిథ్య మొసంగెను. యమున పరిస్థితిమాత్ర మట్లులేదు. తన సంసారసౌఖ్యమును గంగలోఁ గలిపిన దీ రుద్రదేవుఁడే కనుక నాతనిపై నామెకు విద్వేషము కలిగెను. రెండుదినము లెట్లో ఓపిపట్టి మూఁడవనాఁడామె తన భర్తయెదుటనే రుద్రదేవుని కసరి మాట్లాడి నిందించెను. భార్య యీ వ్యవహారము రుద్రదేవున కేమాత్రమును నచ్చలేదు! అతఁడు భార్యను దూషించి యతిథికి క్షమార్పణముఁ జెప్పుకొనెను.

కాని రుద్రదేవుఁడు యమునకన్న నెక్కువ కోపమును నటించుచుఁ దన నిర్దోషితను వచించి వారి యాతిథ్య వ్యతిక్రమమును ఎత్తిపొడిచెను. ఈ విధముగా నాయింట నిం కొక విధమయిన విచిత్ర వాతావరణ మేర్పడెను.

కాని యిది యెంతోసేపు నిలువలేదు. ఇంతలోనే యొక రాజపురుషుఁడు వచ్చి వారికి వింత కలుగునట్లు రుద్రదేవుఁడు పురుషుఁడు కాక, కాకతీయ సామ్రాజ్యమున కేలికయగు రుద్రమాంబయని తెలియునట్లు ప్రవర్తించెను.

యమునా ప్రతాపులు జరిగినదానిని గుర్తించి రాణిగారికి క్షమార్పణ చెప్పుకొనిరి. ఆమె వారిని దీవించి యేకశిలా నగరమునకుఁ బయనమయ్యెను.

---

# 5. విజయనగర సామ్రాజ్య స్థాపనము

(శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు)
[జననము : 1891; మినుమించిలిపాడు
అగ్రహారము, ప॥ గో॥ జిల్లా]

శ్రీ సోమశేఖర శర్మగారు జగమెఱిగిన బ్రాహ్మణులు. దేశాభిమానమునకు దేశచరిత్ర పరిశోధనమును మేళవించి విజ్ఞానయాత్ర సాగించుచున్న మనీషి వతంసులు, శ్రీ శర్మగారు. చదివినది మెట్రిక్యులేషను దనుక నే కాని సాధించిన దనంతము. తమ నిర్విరామ పరిశోధనలవలన వారు వెలువరించిన నూతనాంశములు ఆంధ్రచరిత్రలో వారు వేసియుంచిన చెఱుగని ముద్రలు.

చరిత్రలోని సత్యాంశములు ఎముకల గూడువంటివి. వానిని సాహిత్యముతో మేళవించినప్పుడవి సజీవములై చదివినవారి కుత్తేజమును కలిగించి దేశ భవిష్యత్తును తీర్చి దిద్దఁగలవు. లేనినాఁడు చదువుటకు విసుగు కలిగించును. శ్రీ సోమశేఖర శర్మగారి కిటుకును జక్కఁగా నెఱిఁగిన వారనుటకు వారి రచనలే నిదర్శనములు.

శ్రీ సోమశేఖర శర్మగారు- ఆంధ్రవీరులు; అమరావతీ స్తూపము; చారిత్రక వ్యాసములు; ఆంధ్రదేశచరిత్ర సంగ్రహము మున్నగు వానిని తెలుఁగునను; **Forgotten Chapter of Andhra Country; The History of Reddi Kingdoms** అనువాని నాంగ్లమునను రచించినారు. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము మూఁడవ సంపుటము వారి నిరంతరకృషికి ఆంధ్రాభిమానమునకు చక్కని మచ్చు. ఇవిగాక వారు అప్పుడప్పుడు ప్రకటించిన వ్యాసములు మఱికొన్ని. అట్టివానిలోనిదే ప్రస్తుతవ్యాసము.

పన్నెండవ శతాబ్దినాటి కుత్తరహిందూస్థానమున స్థిరముగా బలపడిన మహమ్మదీయ చక్రవర్తులు తరువాత తమ కబంధహస్తములను దక్షిణాపథము పైకి ప్రసరింపఁజేయ నారంభించినారు. పరస్పర కలహములతో దక్షిణాపథ పాలకులు సతమతమగుచుండుట వారి కనుకూలించినది. ముందు యాదవులు నశించినారు. తరువాత కొంతకాలము ఓరుగల్లుకోట మహమ్మదీయులను ముందునకు సాగకుండ నిలిపినది. కాని తరువాత కాకతీయ వంశ మంతరించినది. ఆ తరువాత మఱికొన్ని చిన్న రాజ్యములుకూడ కూలిపోయినవి. అప్పుడు దక్షిణదేశ మంతయు మహమ్మదీయ చక్రవర్తులకు లొంగి పోవలసినదే. కాని హరిహర బుక్కరాయాది సోదరులు విజయనగర సామ్రాజ్యమును స్థాపించి దక్షిణదేశము

సంతటిని క్రమముగాఁ దమ యేలుబడిలోనికిఁ గొనితెచ్చి మహమ్మదీయ ప్రవాహమున కడ్డుకట్టవేసినారు. సుమారు రెండుంబాతిక శతాబ్దులా సామ్రాజ్యము మహావైభవము ననుభవించినది.

విజయనగరమును మునుముందు సంగమ వంశీయులు, పిదప సాళువవారు, నా పిదప తుళువరాజన్యులు, పరిపాలించినారు.

ఆ సామ్రాజ్యము విస్తరిల్లి విఱిగిపోయిన విధములను, వానిలోని విశేషములను శ్రీ శర్మగారీ వ్యాసమున వివరించినారు. ప్రసంగవశమున శర్మగారిందు ప్రాచీన వర్ణవ్యవస్థలోని యాంతర్యమును, మత రాజకీయముల పరస్పర సంబంధమును వివరించి చూపినారు.

## పార్యసారము

(పే. 1) ప్రాచీన హిందూదేశ చరిత్రము మతప్రధానమయినది, సంస్కృతి ప్రధానమయినది. ఇంగ్లీషువారు మనదేశమునకు వచ్చిన తరువాతనే మనచరిత్ర కేవలము రాజకీయములకు సంబంధించినదిగా మారినది.

(పే. 2) వేదకాలమునుండియు హిందువులకు తమ మత సంస్కృతులపై నభిమానము మెండు. హిందువుల సమస్త వ్యవహారములు వేదముపై నాధారపడియున్నవి. విజ్ఞానము, శాస్త్రములు, కర్మలు, పురాణములు అన్నియు వేదము ననుసరించి వృద్ధిపొందినవే.

(పే. 3) ఈ వేదభూమియందు హిందువుల కనాదినుండి మతముతో నవినాభావసంబంధ మేర్పడినది. మతమునకు సంబంధించని దేమియు హిందువునకు లేదు. కష్టములందు, సుఖములందు నాతనికి మతమే శరణ్యము. ఏదయినను మతముతో సమానమయిన దింకొకటి హిందువులకు లేదు.

(పే. 4) ఈ మతమును బెంచినవారు బ్రాహ్మణులు. కత్తిపట్టి కాపాడినవారు రాజులు. కడమ వర్ణముల వారందఱు మతచ్ఛాయలందు వృద్ధిపొందినవారే. వర్ణాశ్రమాచార ధర్మములుగూడ మత సంస్కృతుల రక్షణ కేర్పడినవే. బ్రాహ్మణుని సమస్త కర్మలు మతరక్షణకు, సంఘరక్షణకు నేర్పడినవి. కనుకనే కడమ వారికతఁడు పూజ్యుఁడైనాఁడు. ప్రాచీన భారతదేశమునకు బ్రాహ్మణుఁడు దివ్యచక్షువు.

బ్రాహ్మణుని తరువాతి స్థానము గోవుది. భారతదేశము వ్యవసాయ ప్రధానమయినది. కనుక గోవు భారతీయుల ఆధిభౌతిక సంపదకు ప్రతినిధి. ఈ యిరువురి రక్షణమునకై భారతీయు లెల్లరును దమ యావచ్ఛక్తిని వినియోగించువారు. వారి క్షేమమే తమ క్షేమముగా నెంచువారు.

కావున ప్రాచీన హిందూచరిత్రమనఁగా నది దేశీయ విదేశీయ సంస్కృతుల కును వైదికావైదిక మతములకును జరిగిన సంఘర్షణమే కాని యన్యము కాదు.

(పే. 5) ఈ దేశము నందెందరో రాజులు, ఎన్నియో రాజ్యములు పుట్టి గిట్టుట జరిగినది. కాని మత సంస్కృతులను ప్రవాహములు నిరాటంకముగా సాగిపోవుచునే యున్నవి. మత సంస్కృతుల పరిరక్షణమునకుఁ బూనుకొన్న రాజులే కీర్తిమంతులైనారు. అట్టి మత సంస్కృతుల రక్షించు రాజ్యము, రాజు లేని పరిస్థితియే యేర్పడినచో ప్రజలే తమ సర్వస్వము ధారపోసి తమ మత సంస్కృతులను గాపాడ కొనుటకు ముందు కుఱికెడివారు. వారు చావునకు వెను దీసెడివారు కారు; బ్రదుకును చావును నేర్చిన నేర్పరులు.

(పే. 6) కాని యిట్లు ప్రజలే తమ మత సంస్కృతులఁ గాపాడుకొనుటకై పూనుకొన్న ఘట్టము లెన్నో లేవు. సామాన్యముగా రాజులు రాజ్య సంపాదన మున కయి యుద్ధము చేయుట కలదు. కాని మతధర్మ రక్షణమున కయి ప్రజలు ముందు కుఱికి విజయము సంపాదించిన ఘట్టములు మాత్రము లేవు. అట్టి దొక్క మన యాంధ్రదేశ చరిత్రముననే గలదు 14వ శతాబ్దమున కాకతీయుల పత నానంతరము బయలుదేరిన కొండవీడు విజయనగర ప్రభుత్వము లట్టివి.

(పే. 7) పదుమూఁడవ శతాబ్ది చివరిదశ నుండి దక్షిణ హిందూ దేశము కల్లోలిత మయినది. ఉత్తర హిందూ దేశము నంతను ముందే యాక్రమించి స్థిర పడిన మహమ్మదీయులు దక్షిణదేశముపై దండెత్తినారు. ఆ ధాకకు మొట్ట మొదటి యాహుతి దేవగిరి రాజ్యము. రెండవ దాడి యోరుగంటి పైన.

(పే. 8) కాకతీయ సామ్రాజ్యమున కేలిక యానాఁడు ప్రతాపరుద్రుఁడు. ఆ యుగమున ముఖ్య మతము "వీర శైవము". "వీర భద్రుఁ" డైన ప్రతాప రుద్రుని నాయకత్వమునఁ దెలుఁగువీరులు దక్షిణాపథ మంతటిని కాకతీయుల బావుటా క్రిందికిఁ గొనితెచ్చినారు.

(పే. 9) ఇటు ప్రతాపరుద్రుని యండదండలతో పెంపొందిన వీర శైవము, అటు ఉత్తర భూములఁ దన కాలి క్రిందికిఁ దెచ్చుకొన్న యిస్లాము శక్తి - ఈ రెండు మహాశక్తుల సంఘర్షణము వల్ల మహాప్రళయమే బయలుదేరినది.

(పే. 10) ప్రతాపరుద్రుఁడు తేలికగా లొంగువాఁడు కాఁడు; మహమ్మ దీయులా మఱలిపోవు వారు కారు. కనుకనే యోరుగల్లుకడ నీ మహాసంగ్రా మము కొన్ని సంవత్సరములు సాగినది.

(పే. 11) వేల సంవత్సరముల నుండి అవిచ్ఛిన్నముగా వచ్చిన మత సంస్కృతులకు ఆపద సంభవించినది. దాని నాయాపద నుండి రక్షించ వలసిన బాధ్య తెలుఁగు వీరులపైఁ బడినది. నిజముగా నిది యంత తేలికయిన పనికాదు. అయి

నను యోరుగంటి తెలుఁగు వీరులు తమ సర్వస్వమును దానికయి ధారవోయ సిద్ధపడినారు.

(పే. 12) ఓరుగంటిపై మహమ్మదీయు లొక్కమారు కాదు; పలుమార్లు దాడి జరిపినారు; ఓడిపోయినారు. కాని యేమి లాభము? తుదకు వీరాధి వీరుఁడైన ప్రతాపరుద్రుఁడు మహమ్మదీయుల వశమయినాఁడు. ఓరుగంటిపై మహమ్మదీయుల చంద్ర ధ్వజము నిలచినది. మానధనుఁడైన ప్రతాపరుద్రుఁడు మార్గ మధ్యముననే దివంగతుఁడైనాఁడు.

(పే. 13) ప్రతాపరుద్రుని మరణముతో నాంధ్రదేశము ఆపదలలో మునిగినది. రాజులేఁడు; మతము, సంస్కృతి, స్వాతంత్ర్యము, సర్వము నిరాలంబములయి నశించు పరిస్థితి కలిగినది.

(పే 14) ఈ యాపదను గుర్తించి యాంధ్ర ప్రజలు మేలుకొన్నారు. మునునూరి ప్రోలయ కాపయలు వారికి నాయకులు. ప్రజావాహిని బయలుదేరినది; మఱల నోరుగంటిపై హిందువుల బావుటా మెఱసినది.

(పే. 15) ఈ సంఘటనము కడమవారి కుత్సాహము కలిగించినది. హరిహర బుక్కరాయలు నడుములు బిగించి కాకతీయుల కన్న బలమయిన సామ్రాజ్యమును నిర్మించి హిందూ ధర్మమును రక్షింపఁ బూనుకొన్నారు. సంకల్పము గొప్పదే కాని సాధనసంపద లేదు. అయినను వారు నిరుత్సాహపడలేదు. వజ్ర సంకల్పముండవలెఁ గాని కార్య సాధనమునకుఁ గొదువా?

(పే. 16) వారికి శ్రీవిద్యారణ్యుల దర్శనమయినది. స్వామి రాయ సోదరుల హృదయమును, సామర్థ్యమును, దేశకాల పరిస్థితులను బరికించి హిందూ ధర్మరక్షణమునకై శ్రీవిరూపాక్ష భాండారము నేడు గడియలు రాయ సోదరులకుఁ గొల్లవిడిచి నాఁడు. వారు గురుపాదులకు నమస్కరించి కావలసిన ధనముఁ గైకొన్నారు.

(పే. 17) సర్వము సిద్ధమయినది. సర్వులు మతరక్షణకు దీక్షగైకొన్నారు. అదొక పవిత్రమయిన మహాయజ్ఞము. విద్యారణ్యస్వామి దానికి పురోహితుఁడు. విరూపాక్షుఁడు దైవము. హరిహర బుక్కరాయలు, వీరాధివీరులయిన సైనికులు దానికి నాయకులు. అది యొక మహారంభము.

(పే. 18) వెంటనే రాయ సోదరులు పవిత్ర వ్రతదీక్ష గైకొన్నారు. ఈ వినూత్న సందేశము దక్షిణాపథ రాజు లందఱకు వినిపింపఁ జేసినారు. వారును మత రక్షణమునఁ దమ కర్తవ్యమును నిర్వహించిరా? సరేసరి. లేదా యుద్ధము. కాని యా మహావాహినిని కాదను వారెవరు ?

(పే. 19) దక్షిణాపథ మంతయు నీ నూతన సందేశము నందుకొన్నది. అందఱును హిందూధర్మ సంరక్షణమునకుఁ గంకణము కట్టుకొన్నారు. మనుష్యుఁడు జీవించుట కాహారము వలె జాతి జీవించుట కున్నతాదర్శములు భావములు నుండవలెను. ఇస్లాము శక్తి విజృంభించి హిందూ జాతిని నిర్వీర్య మొనరించినది. ఆ జాతికి మఱల నుత్తేజమును కలిగించి ధర్మోద్ధరణమను సందేశ మొసంగినవాఁడు విద్యారణ్యస్వామి.

(పే. 20) రాజ్యములు, రాజ్యము లేకమయినవి. పాత పగలు మఱచి జనులందఱు నేకమయినారు. దక్షిణాపథ మంతయును హరిహర బుక్కరాయల ఛత్రచ్ఛాయ క్రిందికి వచ్చి నిలచినది.

(పే. 21) ఈ విధముగా లభించిన రాజ్యము నంతటిని హరిహర బుక్కరాయలు విద్యారణ్యస్వామికి ధారవోసి తమ్మును, దమ సర్వస్వమును స్వామి కర్పించినారు. ఆ రాజ్యమును సంపాదించుట కుపయోగించినది విరూపాక్షనిధి గదా! కావున రాజ్య మాదేవునిది. విద్యారణ్యస్వామి విరూపాక్ష దేవుని రాజ్యమునకు హరిహర బుక్కరాయలను ధర్మకర్తలుగా నియమించినాఁడు. ఇది విజయనగర రాజ్య మావిర్భవించిన విధము. హిందూ ధర్మమున కే విపత్తును గలుగకుండఁ గాపాడుట విజయనగర ప్రభువుల విధియైనది.

(పే. 22) ఆనాఁడు విజయనగర సామ్రాజ్యమే తలయెత్తకుండినచో దక్షిణ హిందూదేశమున మత సంస్కృతుల చరిత్రము వేఱు విధముగా నుండియుండెడిది. విజయనగర సామ్రాజ్యము హిందూధర్మమును రక్షించుటయే కాక దానికొక క్రొత్తబలమును గూర్చినది. ఇది యపూర్వసంఘటనము.

(పే. 23) దక్షిణమునకు వచ్చుచున్న యిస్లాము శక్తిని కొంత కాలము మఱల నోరుగంటినుండి కాపయనాయకుఁడు నిలువరించినాఁడు. కాని తరువాత నోరుగల్లు పతనమయినది. నాఁటినుండి కృష్ణను దాటి రాకుండ నిస్లాము విజృంభణము నాపినది విజయనగరాంధ్రులే.

(పే. 24) హరిహరరాయలు విజయనగరపు మొదటిరాజు. తరువాతి వాఁడాతని సోదరుఁడు బుక్కరాయలు. బుక్కరాయల సంతతివారు విజయనగరమును రెండు వందల యేండ్లు పాలించిరి. వీరి మూలపురుషుఁడు సంగమరాయలు. కనుక వీరు సంగమ వంశీయులైరి. ఎవరు ప్రభువులైనను వారు ధర్మకర్తలు మాత్రమే; రాజ్యము విరూపాక్ష స్వామిది. కావుననే వారు దానశాసనము లన్నింటను "శ్రీ విరూపాక్ష" యని మాత్రమే వ్రాలు చెక్కించువారు. ఈ నియమమును భంగమొనర్చినవాఁడు విరూపాక్షరాయలు. అతఁడు వైష్ణవుఁడై "శ్రీరామ" యని వ్రాలు చేయుటచేతనే యాతని వంశమువారికి రాజ్యము పోయెనని యందురు. తరువాత వచ్చిన తుళువ వంశీయులగు వీర నరసింహరాయ కృష్ణ

రాయాదులు మాత్రము తాము వైష్ణవులయినను "శ్రీ విరూపాక్ష" యనియే చెక్కించిరి.

(పే. 25) 1565 లో రక్షసతగడి యుద్ధమున ఆరవీటి రామరాయలు మరణించినాఁడు. విజయనగర దశ మాఱినది. రామరాయల సోదరులు తిరుమల రాయ, రంగరాయ, వేంకటపతి రాయాదులు వైష్ణవులై "శ్రీ వేంకటేశ"యని వ్రాలు చెక్కించిరి. కృష్ణరాయలనాఁటి ప్రాభవ మంతరించి పోయినది.

(పే. 26) విజయనగరరాజ్యము హిందూధర్మ రక్షణమునకు వెలసినది. శైవ వైష్ణవ స్మార్తులయినను జైన బౌద్ధులయినను నందఱు హిందువులే. అన్ని మతములును సమానములే— ఈ సిద్ధాంతమే విజయనగర రాజుల యాదర్శము. ఇట్లనుటచేత నానాఁడు మతకలహములు లేవనికాదు. బుక్కరాయలకాలమున జైన వైష్ణవులకుఁ దగాదాలు కలుగఁగా నా యిరుమతస్థులను సమావేశపఱచి రాయలు వారికి మైత్రిని జేకూర్చెనఁట! ఎంతటి మత సామరస్యాకాంక్ష యిది! అశోకవర్ధనుని యనంతర మిట్టివాఁడొక బుక్కరాయలే. బేరాసను విదేశీయుని వ్రాఁతయు దీనినే బలపఱచుచున్నది.

(పే. 27) సరిగా నీకాలముననే యూరపు ఖండమున మతము పేరితో మారణహోమములు జరుగుచుండినవనఁగా నదేకాలమున దక్షిణ హిందూదేశ మున మతసామరస్యమునకై రాజులు పాటుపడినారనుట శ్లాఘ్యమయిన విషయము.

(పే. 28) మధ్యయుగము నందింతటి యుదారాశయములతో నుండిన రాజ్యమింకొకటిలేదు. విజయనగరరాజుల ఛత్రచ్ఛాయలక్రింద తమిళాంధ్ర కర్ణాటులందఱు నైకమత్యముతోఁ దామందఱమును హిందువులమను నేకైక పవిత్రాశయముతో సుఖముగా బ్రదికినారు. వీరందఱు నేకమయి మతమను పేరుతో మహమ్మదీయులు తమ మతమును సంస్కృతిని స్వేచ్ఛను నశింపఁజేయ నెత్తిరాఁగా నదేపేరుతో వారి నెదిరించి తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యములను గాపాడి కొనినారు.

(పే. 28) విజయనగర ప్రభువుల కాలమున కళలు, శాస్త్రములు, వేద ధర్మములు, వర్తక వ్యాపారములు ఒకటేమిటి– సర్వము నభివృద్ధిగాంచినది.

(పే. 29) విదేశీయులయిన బేరాసు, అబ్దుర్ రజాకులను వారు విజయ నగరాభివృద్ధిని గుఱించియు నక్కడి న్యాయపాలనమును గుఱించియు వ్రాసి నారు. ఇది నిజముగాఁ బొగడ్తకదా!

(పే. 30) విజయనగర సామ్రాజ్యమునకు విద్యారణ్యస్వామి పునాది ఱాయి వేసిన ముహూర్తమువలన దక్షిణదేశమున హిందూత్వము నిలిచి నిలువ

గ్రొక్కుకొని పెంపొంది పెద్దపెరిగినది. ఆ రాజ్య నామ సంస్మరణము స్వేచ్ఛ, ధర్మదీక్ష, కార్యదక్షత, త్యాగము, ఐకమత్యము అను భావములకు ప్రతీకము.

## కఠిన పదార్థాదులు

### పుట 126

తద్ + అన్యములు = వానికన్న వేఱయినవి (పంచమీ తత్పు.); కుంఫిణీ పరిపాలనము = ఈస్టిండియా కంపెనీవారి పరిపాలనము; పరమ + అర్థము = తత్త్వము.

### పుట 127

సభ్యతాసౌధము = సభ్యతయను సౌధము (రూపక సమాసము); సౌధము = బంగళా-"వ్యు" :- సుధచేత కట్టఁబడినది; సుధ = సున్నము; విజ్ఞానము-"వి" విజ్ఞానము; జన్యము = జనించినది; విజ్ఞాన + అనుబంధము = కూడఁగట్టఁబడినది.

అవినాభావసంబంధము = ఒకదానిని విడిచి మఱియొకటిలేని యట్టి గాఢ సంబంధము; కఱదలు గఱపి = మంచి యాలోచనములు సూచించి; అనిర్వాచ్యము = ఇది యిట్టిదని చెప్ప వీలుకానట్టిది; అపూర్వము = ఇదివఱకెప్పుడు లేనిది; దాది- "ప్ర" ధాత్రి; జీవిత + అధినేత = జీవితమును నడిపించువాఁడు (స॥ దీ॥ సంధి); ఉపాస్య దైవము = నిరంతరము మనన ధ్యానాదులచేత నారాధింపఁదగిన దైవము; వినశ్వరములు = నశించు స్వభావము కలవి; వర్షము- "నానా": వాన, సంవత్సరము,- 1. భారతము, 2. రమ్యకము, 3. కింపురుషము, 4. హరి, 5. భద్రాశ్వము, 6. కురువు, 7. హిరణ్మయము, 8. ఇలావృతము, 9. కేతుమాలము అను తొమ్మిదింటిలో నొకటి;

వర్ణములు : బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులు; ఆశ్రమములు : బ్రహ్మచర్యము; గృహస్థాశ్రమము; వానప్రస్థము; సన్న్యాసాశ్రమము అను నాలుగు; ఆయువుపట్టు = ప్రాణముల కాధారముగానున్న స్థానము; సాంఘికులు = సంఘములవారు; వేద + అధ్యయన + ఆదులు = వేదమును చదువుట మొదలగునవి; దివ్య చక్షువు = చర్మచక్షువులకు కానరాని విషయములను సైతము కనుఁగొని కాపాడువాఁడు;-"విగ్ర" దివ్యమయిన చక్షువు (కన్ను) "ఉపమాన పూర్వపద కర్మధారయ సమా.";

### పుట 128

ఆదర్శము = తమ నడవడిని దిద్దుకొనుట కనువుగా ననుకరింపఁదగినవాఁడు; ప్రతిమూర్తి = ప్రతినిధి **(Representative)**; ఆరాధ్యము = పూజనీయము మహా + ఉన్నతము (గుణ సంధి); "గోబ్రాహ్మణులకు శుభము కలుగవలెను"

సమస్త వైదిక కర్మలకు చివర ప్రజలకు క్షేమము కలుగుగాక! రాజులు న్యాయ్యముగా పరిపాలింతురు గాక! గోబ్రాహ్మణులకు శుభము కలుగుగాక, సమస్త ప్రపంచములును సౌఖ్యమందుగాక! అను నర్థము నిచ్చు ఫలశ్రుతి వచనమును చెప్పుట యాచారము. అది యిది:

"స్వస్తి ప్రజాభ్యః, పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః,

గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు, నిత్యం లోకా స్సమస్తా స్సుఖినో భవంతు".

మంత్రపూతము = మంత్రోచ్చారణముచేత పవిత్రమయినది; అవలగ్నము = భావమున పొడకట్టినది, దృష్టిలోనున్నది; హిరణ్యాదానము = బంగారు నొసఁగుట; భోగ్యము = ధనధాన్యాదికము; మహీపతి = రాజు (షష్ఠీ తత్పు.); గురుదేవుఁడు- "విగ" దేవునివంటి గురువు (ఉపమానోత్తరపద కర్మధార.); పురోధసుఁడు = పురోహితుఁడు; మంత్రము = ఆలోచనము, వేదమంత్రము; సమర కౌశలము = యుద్ధమునందలి నేర్పు; అప్రతిమానము = సాటిలేనిది; సేవా + అనురక్తి = సేవయందలి ప్రీతి; చేయిచేయి కలిపి = ఒకదానితో నొకటి సహకరించి; పరిరక్షణము = పరిరక్షణము (ఉపసర్గాచ్చునకు దీర్ఘము); విమోచన + అర్థము = విడిపించుట కొఱకు;

పుట 129

పుడమిపడుచు = భూమియను యువతి (రూపక సమా.); బాసికము: వివాహసమయమున వధూవరుల ముఖములకు కట్టు నొక వస్తువు; కర్మక్షేత్రము: హిందూదేశీయుల జీవనమున నడుగడుగునకు కర్మ ముఖ్యమయినదిగాఁ జెప్పఁబడినది. కనుక భారతదేశము కర్మక్షేత్రమని ప్రసిద్ధమయినది; అవినశ్వరము = శాశ్వతమయినది; ఆబ్రహ్మకల్ప + అంతస్థాయి = బ్రహ్మకల్పము చివరిదనుక నుండునది; కైదువు = ఆయుధము; విష్ణు + అంశ సంభూతులు (యణాదేశ సంధి) = విష్ణువు నంశమున జన్మించినవారు: విష్ణువే రాజుగా జన్మించి ప్రజలను గాపాడు ననుట హైందవ సంప్రదాయము-"నాఽవిష్ణుః పృథివీ పతిః" అని నానుడి. సంఘట్టనము = ఒకదానినొకటి బాధించుట; పోటుపాటులు (ద్వంద్వ సమా.)

సంక్షోభములు = అలజడులు, ఝంఝా మారుతము = గాలివాన; సంస్కృతి స్రవంతి = సంస్కృతియను ప్రవాహము (రూపక సమా.): లేఁత + తీవ = లేఁదీగ (ప్రాఁతాది సంధి); మహా పథికమూర్తివలె = ఒకగొప్ప బాటసారివలె; అనంత కాలపథము = అంతములేని కాలమనెడి మార్గము (రూపక సమా.): అంగరక్ష = **Body Guard:** అవాంతరములు = అటంకములు; అవని + ఈశుఁడు (స॥ దీ॥ సంధి):

పుట 130

వీరచందన మలందుట, విడియములు తీసికొనుట : రణోత్సాహమునంది యా కార్యమును నిర్వహింతుమని నిశ్చయించుకొనుట; నిశితము = తీక్ష్ణము, అధికము; లాలసత = అనురాగము; జీపించి యుండుమా............చూఁడఁగొనవలె: యుద్ధమునందు జయించినను జచ్చినను మంచిదే యనుట. భగవద్గీతయందు శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునకు "చచ్చితివా స్వర్గమునకుఁ బోదువు. జయించితివా రాజ్యలాభము కలుగును." (హత్వా వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం) అని చెప్పెను. దాని సారమే యిందున్నది.

అర్థప్రాణములు (ద్వంద్వము); పెద్ద + ఆస = పేరాస (పాఁతాది సంధి); మన్నీలు = వీరులు, ప్రభువులు; రౌతు = అశ్వికుఁడు; రాణువ = సేన; అతిలోకము = లోకాతీతము;

పుట 131

కొండవీడు రాజ్యము: కొండవీడు రెడ్డి రాజుల రాజధాని. ప్రతాపరుద్రుని జయించి మహమ్మదీయులు కాకతీయ రాజ్యము నాక్రమించినంతనే వారి యాక్రమణకు లొంగని భాగములను కాకతీయరాజుల సామంతులు సేనానాయకులు నాక్రమించి రాజులై రాజ్యముల స్థాపించిరి. అట్లేర్పడినదే రెడ్డిరాజ్యము. వీరి మొదటి రాజధాని అద్దంకి. వీరు తాము పండితులై పండిత పోషకులై హిందూ సంస్కృతిని కాపాడిరి. తుదకీ రాజ్యము విజయనగర రాజుల పాలనము క్రిందికి వచ్చెను.

బలిష్ఠము, పటిష్ఠము : (ఇష్ఠన్ ప్రత్యయాంతములు) = మిక్కిలి బలమయినది; తొలిచూపు వేడికోపు = మొదటి కోపపు చూపు, నాట్యము; చంద్రధ్వజము = మహమ్మదీయుల జండా: మహమ్మదీయ రాజుల పతాక చిహ్నము చంద్రుఁడు, దాని మధ్యనొక చుక్క. ఇక్కడ లక్షణార్థమున నిది వాడఁబడినది. యాదవరాజ్యము మహమ్మదీయుల బలమునకు లొంగి లోఁబడెననుట. దేవగిరి యాదవ రాజ్యము : దేవగిరి దౌలతాబాదనుపేర నేటి బొంబాయి రాష్ట్రమున ఔరంగాబాదు జిల్లాలోనున్నది. ఇది కాకతీయుల కుత్తరముననున్న రాజ్యము. పశ్చిమ చాళుక్యులకు ఎదురు తిరిగి స్వాతంత్ర్యమును ప్రకటించుకొన్న మొదటి యాదవరాజు "మల్లుగి". ఈ వంశమువారు కాకతీయులకు ప్రబల శత్రువులు. 1270 - 1309 సం॥రముల నడుమ రామచంద్రుఁడు దేవగిరి నేలెను. ఈ కాలముననే మహమ్మదీయుల దండయాత్ర లారంభమయ్యెను. రామచంద్రుఁడు ఢిల్లీ రాజులకు సామంతుఁడుగా నుండుట కంగీకరించి సంధి చేసికొనెను. అయినను నడుమ నడుమ మహమ్మదీయుల దండయాత్రలు సాగుచునే యుండెను. చివరకు ముబారక్ ఖిల్జీ యాదవరాజు హరపాలుని నిర్మూలించి దేవగిరి రాజ్యమును ఢిల్లీ రాజ్యమున నంతర్భాగముగాఁ జేసెను.

దుర్నిరీక్ష్యము = తేటిచూడరానిది; ధరా + అధినేత = భూపతి; జోదులు-"ప్ర" యోధులు; జంబుకేశ్వర తీర్థము : ఇది మదరాసు రాష్ట్రమున తిరుచినాపల్లి దగ్గఱనున్నది. ఇక్కడి దేవాలయమున ప్రతాపరుద్రుని శాసనము లభించినది. తిరువానైక్కావుడయారు : ఇది జంబుకేశ్వర తీర్థమునకు సమీపముననున్న ఈశ్వరుని పేరు;

తెలుఁగు తేజి చౌకళింపు = తెలుఁగుజోదుల గుఱ్ఱపు పరుగు; చౌకళింపు = నాలుగు కాళ్లు వేసి పరుగెత్తు గుఱ్ఱపు పరుగు ("పల్లాలేపుట"యని వ్యవహారము); నవలక్ష ధనుర్ధరులు : కాకతి రాజుల సేన తొమ్మిది లక్షలని వారి "నవలక్ష ధనుర్ధరాధినాథు" లను బిరుదమువలనఁ దెలియ వచ్చుచున్నది; సింగాణులు = బాణములు; క్షోణీ + ఈశ్వరుఁడు = భూనాథుఁడు (స॥ దీ॥ సంధి); పాండ్య బలము : కాకతీయులనాఁడు దక్షిణమున బలిష్ఠములుగా నున్న రాజ్యములలో పాండ్యరాజ్య మొకటి. వీరి రాజధాని మధురానగరము. కాకతీయుల పతనానంతరము దీనిని ఢిల్లీసుల్తానులు జయించిరి. తరువాత నిది విజయనగర రాజ్యమున నంతర్భాగమయ్యెను; చోళులు : వీరు కాంచీ నగరము రాజధానిగా పాండ్య రాజ్యమునకు ప్రక్కగా నుండిన ప్రబల రాజ వంశీయులు. వీరిలో గంగైకొండ రాజేంద్రచోళుఁడు గంగానది దనుక విజయయాత్రలు చేసినవాఁడఁట. ఈ రాజ్యమును తూర్పు చాళుక్యరాజు రాజరాజ నరేంద్రుని కుమారుఁడు రాజేంద్ర దేవుఁడు వారసత్వమునుబట్టి సంపాదించి కులోత్తుంగ చోళుఁడను పేర పాలించెను. గణపతిదేవ చక్రవర్తి కాంచీనగరమును పట్టుకొనెను. కొంతకాల మిట్లది కాకతీయులకు లొంగియుండెను. తరువాత విజయనగర రాజ్యమునఁ జేరెను; అవతంసము = సిగబంతి; చైతన్యవీర పరిప్లుతి = ఉత్సాహవంతులయిన వీరుల సర్వతః ప్రసరమయిన కదలిక, ఆవేశము;

పు. 132

వీరశైవము : దీనిని బసవేశ్వరుఁడు వ్యాపింపఁజేసెను. వీరశైవము భక్తితో పాటుగా శివుని ప్రీతికయి ప్రాణములనైనను లక్ష్యము చేయరాదను నుత్సాహమును దేశీయజనులలో వ్యాపింపఁజేసెను. ఈ మతముచే నుత్సాహితులయిన జనులు కాకతీయులనాఁడు దేశరక్షణమున ముఖ్యపాత్ర వహించిరి; శివపాద శేఖరుఁడు = శివ పాదములను శిరసాధరించిన వాఁడు; మన్నుఱేఁడు = భూనాథుఁడు; వీరభద్రుఁడు = వీరులగు భద్రభటులుగల ప్రతాపరుద్రుఁడు;- వీరభద్రుఁడు దక్షాధ్వర ధ్వంసమున వీరవిహార మొనర్చినట్లు ప్రతాపరుద్రుఁడు సమరరంగమున వీరవిహార మొనరించి మించెననుట;

జ్వాజ్వలించినవి = మంటలు క్రక్కుచు విజృంభించినవి; ఉల్లోల కల్లోల వారాసులు రెండు: మహమ్మదీయ మతము, వీరశైవ మతము- ఇవి రెండు విజృంభించిన సముద్రములని చెప్పఁబడినది. వార్ + రాశి = వారాశి (రేఫలోప సంధి)

సూ॥ రేఫకు రేఫ పరమైనచో మొదటిరేఫ లోపించి దాని పూర్వస్వరమునకు దీర్ఘము వచ్చును. వారాశి- (బ. వ.) వారాసులు. ("శ" వర్ణము "స" వర్ణముగా మారినది.); ఘూర్ణిల్లు = ధ్వనిచేయు;

చేవ = బలము; కొత్తళము = బురుజు; పందు పూండ్లు = అనేక సంవత్సరములు.

తెగి తునకలు వోకుండ = నిరంతరముగా;

పుట 133

వీనులు = చెవులు; సముత్కరము = సమూహము; ఉమటమటులు = ఉద్ధతి ప్రోద్ధతులు: ఆంధ్రులు విమతవాహిని నోడించిన టొక్క పర్యాయమునుగాదు: 1303 సం॥రమున ఢిల్లీ సుల్తాను అల్లావుద్దీను ఖిల్జీ సేనానాయకులు మాలిక్ ఛజ్జూ, ఫక్రుద్దీనుజూనాలును, 1308 లో మాలిక్ కాఫరునూ, 1318 లో సుల్తాన్ ముబారక్ సైన్యమునూ, 1320 లో గయాజుద్దీను తుగ్లకు సైన్యము ఉలుఘ్ ఖాన్ నాయకత్వముననూ, కాకతీయుల రాజధానిపై దండయాత్రలు కావించిరి. అవి యన్నియు కాకతీయులకే విజయము నొసంగెను. 1322 లో మఱల నింకొకమాఱు తురుష్క సైన్యము ఏకశిలానగరముపై దండెత్తెను. ఐదుమాసముల తరువాత ప్రతాపరుద్రుని వారు చెరఁబట్టిరి. అవిమృశ్యకారిత్వము = దూరదృష్టితో విమర్శింపక కావించు పని: కాకతీయ సేనానాయకులలోఁగల యంతఃకలహములే మహమ్మదీయుల విజయమునకు హేతువులయ్యెనని చారిత్రకులు భావించుచున్నారు; భీతు = భయము- "ప్ర" భీతి; బందె = బంధితుఁడు: దేవ + ఆయతనము = దేవాలయము; వరాహలాంఛిత హేమపట్టములు = వరాహ చిహ్నములుగల పట్టు జండాలు: తూర్పు చాళుక్యులవలెనే కాకతీయరాజుల జండాగుర్తు "ఆదివరాహమూర్తి"- ఈ గుర్తుతో వేయఁబడిన నాణెములకే "వరాహ" అనిపేరు; మారుత + ఆహతి = గాలి తాకిడి; సుల్తాన్ పురము: వరంగల్లునకు మహమ్మదీయు లిడిన నామము; పంచమహాశబ్దములు: కాకతీయరాజులకు "సమధిగత పంచమహాశబ్ద" యని బిరుదు: అయిదు వాద్యముల ధ్వని. మొరసిన = ధ్వనించిన; ఢంకా నౌబత్తులు = ఒకవిధమగు వాద్యములు; ఏకవీర, కాకతమ్మలు: కాకతీయుల కాలమున మిక్కిలి ప్రచారమునందుండి పూజింపఁబడిన స్త్రీ దేవతలు. కాకతీశక్తినిబట్టియే యారాజులు కాకతీయులయిరని చారిత్రకులు తలంచుచున్నారు; ఆత్మీయ .... కాంతులతో; ఆత్మీయ = తనయొక్క, మౌళి = శిరస్సునందలి. మకుట = కిరీటమునందు, స్థగిత = తాపఁబడిన, మణి = మణులయు, ప్రవాళ = పగడములయొక్కయు, లేదా చిగుళ్లవంటి, కాంతులతో; నివ్వాళి = హారతి; మధ్యేమార్గము = మార్గమధ్యము; దివంగతుఁడు = చనిపోయి స్వర్గమును జేరినవాఁడు;

పుట 134

పొనుఁగువడు = తేజోహీనమగు, నిరాలంబ = ఆదుకొనువారు లేనిది, పట్టు వీడినది; (శ్రీ) ముసునూరి ప్రోలయ నాయకుఁడు: ఏకశిలానగరము మహమ్మదీయుల వశమయినపిదప ప్రతాపరుద్రుని సేనానాయకులను సామంతులను సైన్యపఱచి నేటి భద్రాచలము తాలూకాయందలి రేకపల్లె యందీతఁడు స్వతంత్రరాజ్యము స్థాపించి హిందూ ధర్మమును కాపాడెను. కాని యనతికాలముననే యీతఁడు మృత్యు వాతఁబడెను. ప్రోలయ మార్గముననే పయనించి విజయము గాంచినవాఁడు కాపయనాయకుఁడు; మామిడాకు తోరణముఁగట్టు = శుభారంభముకావించు, విఘ్నేశ్వరపూజకావించు = ముందుకుసాగి కార్యము నిర్విఘ్నముగా కొనసాగించుట;- ప్రతి మత కార్యమునను ముందుగ గణపతిని పూజించుట హైందవాచారము; రాచలోఁగిళ్లు = రాజగృహములు; కృపాణపాణులు = కత్తులు చేత ధరించిన వారు;

హరిహర బుక్కరాయలు: వీరు ప్రతాపరుద్రుని ఖజానామంత్రులుగా నుండి యాతని పతనానంతరము ఆనెగొందెరాజు నాశ్రయించి యచిరకాలముననే ముఖ్యోద్యోగులయిరి. తరువాత నానెగొందెపై ఢిల్లీ చక్రవర్తి దండెత్తి యా రాజును చంపి వీరిని ఢిల్లీకిఁ గొనిపోయెను. కొంతకాలము తరువాత నాంధ్ర దేశమునందలి తిరుగుబాటుల నణచివేయ రాయసోదరులను ఢిల్లీ చక్రవర్తి యాంధ్రదేశమునకు పాలకులుగాఁ బంపెను. వారు విజయనగరము స్థాపించి స్వాతంత్ర్యము ప్రకటించి హిందూధర్మరక్షణమునకు బద్ధకంకణులయిరి; ఉన్నతాశయములుండి ప్రయోజనమేమి ధనహీనునికి?: సమస్త కార్యములకు ధనమే మూలము, ధనములేనిచో నేకార్యములును నెఱవేరవు. కనుక దరిద్రుఁ డెంతమంచి యాశయములతో నున్నను ధనాభావమువలన నాతని యాశయములు కార్యరూపమును బొందలేక నిరర్థకములగు ననుట.

పుట 135

వజ్రసంకల్పముండవలెనుగాని కార్యసాధనకు కొదువా?: సంకల్పము బలముగా నున్నచో దాని నెట్లయినను సాధింపక విడువఁడనుట. "Where there is the will there is a way" అను నాంగ్లలోకోక్తికూడ దీనినే సూచించుచున్నది. దీనికి రాయసోదరుల కార్యసాధనమే యుదాహరణము. మొదటిది లోక సామాన్యముగాగా యసాధారణ సంకల్పముగల లోకాతీతవ్యక్తులను గుఱించినదీ రెండవ వాక్యము;

కరతల + ఆమలకము = చేతియందలి యుసిరికాయ: స్వాధీనముననున్న విషయమనుట; దోహదము = ప్రోత్సాహము;

ఉత్క్షిప్తములు = పైకి వెల్లుబికినవి; ఆముష్మికసుఖ + అవాప్తి = పరలోక సుఖమును పొందుట; సోపానము = మెట్టు:

పుట 136

పురోగాములు = ముందునకు నడచువారు; హరిహరరాయని సోదరులు: 1. బుక్కరాయలు 2. కంపరాయలు 3. మారప్ప 4. ముద్దప్ప అను నలుగురు; మంత్రపూతములు = మంత్రపఠనముచేత పవిత్రమైనవి: అధ్వరము = యజ్ఞము; ధాటి-"విక్ర" దాడి; అడ్డపాకలు = ఆటంకములు; ఇరుగుపొరుగులు = రెండు పార్శ్వములు; రాజన్యులు = పట్టాభిషిక్తులగు రాజులు; మాండలికులు = చిన్న చిన్న రాజులు;

మంత్రద్రష్ట = ఋషి: నూతనములగు వేదమంత్రములను దర్శించినవారు: నిర్వీర్యత = బలహీనత;

పుట 137

వల్లిక = తీఁగ; సంతరించుట = కూర్చుట; ప్రణమిల్లు = నమస్కరించు;
ఆశీఃప్రభావము = దీవనలోని ప్రభావము, దాస + అనుదాసులు = దాసుల ననుసరించు దాసులు; తనువు = శరీరము; సంయమి = ముని; మేఖల = మొల నూలు: సముద్రమే మొలనూలుగాఁగలది (బహువ్రీహి)

పుట 138

మాధ్యాహ్నిక = మధ్యాహ్నకాలమునందలి, మహానైవేద్య = షడ్రసము లతోఁ గూర్చిన శాకపాకాద్యాహారము నివేదించు, అవసరమున = సమయమున; నినాదము = ధ్వని;-ఏదేనినొక కార్యమును గుఱించి యాలోచించునప్పుడు ఘంటా నినాదము వినవచ్చుట యా కార్యము నిర్విఘ్నముగా జరిగిపోఁగలదనుటకు సూచనమని శకునశాస్త్రజ్ఞులు వచింతురు.

చెలియలికట్ట: మహానది సముద్రమునఁ గలియుచోటు. సముద్ర తరంగములు దీనిని దాటి ముందునకు రావందురు; చరిత్రను వేరొకరీతిని చదువుచుండెడి వారము: దక్షిణదేశమున విజయనగరరాజుల పరిపాలనమువలన హిందూ సంస్కృతి, సాహిత్యము, కళలు చక్కగా పెంపొందినవి. ఆ రాజులే లేనిచో నివి సాధ్యము కాకుండెడిది. అనగా ఈ చరిత్రాధ్యాయము దుఃఖభూయిష్ఠమయి యుండెడిదనుట;

పుట 139

సాకుట = కాపాడుట; కాపయరాజ్యనాశము; కాపయరాజ్యమును గోల కొండ నవాబులు కొంత కబళించిరి. ఆతని యహంకారమున కసూయపడిన తోటి తెల్గుఁగువీరులు దాడి సలిపి యాతనిని తుదముట్టించి మిగిలిన రాజ్యమును కైవసము చేసికొనిరి.

వేదాంగములు: శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అను నాఱు; తనుపు = సంతోషపెట్టు;

పుట 140

విరూపాక్షరాయలు 1465-1478 ల నడుమ రాజ్యము నేలెను. క్రూరుఁడు, దూరదృష్టి లేనివాఁడు. సామంతులు లేకమై సాళువ నరసరాయలచేత నీతని నున్మూలింపఁజేయించి యాతనినే రాజుగా నెన్నుకొనిరి.

అరవీటి రామరాయలు: కృష్ణదేవరాయల యల్లుఁడు. సదాశివరాయలను నామమాత్రముగానుంచి తాను రాజ్యము నేలెను. 1565 లో జరిగిన తాళికోట యుద్ధమున నీతఁడు మరణించెను.

అరవీటి తిరుమలరాయలు: ఈతఁడు రామరాయల తమ్ముఁడు. రామరాయల మరణానంతరము "పెనుగొండ"లో విజయనగరమునఁ బోగా మిగిలిన రాజ్యము స్థాపించెను. తరువాతఁ దానే సింహాసనము నెక్కెను. రంగరాయ వేంకటపతి రాయలు ఈతని కుమారులు.

పుట 141

ప్రాభవము = ప్రభుత్వము, ప్రతాప మనెడి భానుఁడు (రూపక సమా); ప్రాయము = వయస్సు; చరమదిశ = అంత్యదిశ;

సమాదరణీయుము = గౌరవింపఁ దగినది; స్నిగ్ధము = స్నేహము కలది;

పుట 142

సఖ్యము = స్నేహము; అపూర్వము = అదివఱకెన్నఁడును లేనిది; సామరస్య + ఆకాంక్ష = సమరస భావము కూర్చవలెనను బలమయిన కోరిక;

మత + ఆచార్యులు = మత గురువులు; తత్ + అన్యములు = ఆ గురువులు చెప్పిన వానికి భిన్నములు; వంద్యులు = నమస్కరింపఁ దగినవారు;

ఆశయము = అభిప్రాయము, వాహిని = సేన, ప్రవాహము;

పుట 143

విధ్వస్తము = నాశముచేయఁ బడినది; నామ మాత్ర + అవశిష్టము = పేరు మాత్రమే మిగిలినది (నశించినది); వెల్ల = తెల్లని; ధ్వానము = ధ్వని; నిధానము = స్థానము; పొనుగు వడు = నశించు; దీప్తి = కాంతి;

పుట 144

అత్యంత + ఔన్నత్యము (వృద్ధి సంధి). ఉప్పుపత్రి పుట్టు = గౌరవము లభించు; అకుంఠితము = మొక్కవోనిది; అతుల = సాటిలేని; శుభ + ఉదర్కము

(గుణ సంధి), ఉదర్కము=భవిష్యత్తు: శుభోదర్కము = మంగళకరమయిన భవిష్యత్తు కలది.

## సందర్భ వాక్యములు

1. "హిందూ జీవితమున వేదసంస్కృతి జన్యముకాని దొక్కటి కూడ లేదు". (పుట 126)

సమా :- ఈ వాక్యము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రచించిన "విజయనగర సామ్రాజ్య స్థాపనము" అను వ్యాసమునుండి గైకొనఁ బడినది. శ్రీ శర్మ గారాధునికాంధ్ర చారిత్రకులలోఁ బరమ ప్రామాణికు లయినవారు.

"హిందూ మతమునకు మూలము వేదము. హిందువుల సమస్త కార్యములు వేదముపై నాధారపడి యున్నవి. తెల్లవారి లేచినది మొదలుకొని మఱల నిద్రించువఱకును హిందువులను సమస్త కార్యములందును వేదము శాసించుచున్నది. హిందువులకు జననమాది మరణ పర్యంతము ఇహమును బరమును బ్రసాదించునది వేదము, వేదోదితమయిన మతము. కావున హిందూ మతమన్నను, హిందూ సంస్కృతి యన్నను, హిందూత్వమన్నను వేదములకు భిన్నమయిన దేమియు లేదు." ఇవి శ్రీ శర్మగారు విజయనగర చరిత్రమును సమీక్షించుటకు ముందు ప్రసక్తమయిన హిందూ ధర్మమును నిర్వచించుచు వచించిన పలుకులు.

దీనిని సంప్రదాయవేత్త లందఱు నంగీకరింతురు. పురాణములు, ధర్మశాస్త్రములు, ఇతిహాసములు, కావ్యములు వేదోక్తములయిన ధర్మములనే భిన్న భిన్న రీతులుగా వివరించునవి యని పండితుల యభిప్రాయము.

2. "వారికి భోగపరత యెంత నిశితమో? త్యాగ లాలసతయు నంత యధికము"

లేదా

"జీవించి యుందుమా? దేవేంద్రభోగము లనుభవింపవలె; లేదా గౌరవాహవముగఁ జచ్చి వీరస్వర్గము చూఱఁగొనవలె".

సమా :- ఈ వాక్యములు ఆధునికాంధ్ర చారిత్రకులలో ప్రముఖులయిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రచియించిన "విజయనగర సామ్రాజ్య స్థాపనము" అను వ్యాసము నందలివి.

ప్రాచీన భారతీయులకుఁ దమ మతము నెడను, తమ సంస్కృతి యెడను నాదరాభిమానములు మెండు. భారతీయులకు సుఖ దుఃఖ సమయములు రెంటను

మతము తోడు నీడయయి నిలిచినది. కనుక తమ మత సంస్కృతులను రక్షించుకొనుటకు ప్రాచీన భారతీయు లెంతటి త్యాగమునైనఁ జేయుటకు వెను దీయువారు కారు. వారు సుఖముగా జీవించు స్వభావము కలవారని మాత్రము మన మిదివఱకు చరిత్రయందు చదివియున్నాము. కాని యంతేకాదు- వారికి భోగపరత యెంత యెక్కువగా నుండెడిదో త్యాగమన్నను నంత యనురక్తి యుండెడిది. సమయము వచ్చినచో చావునకయినను వారు భయపడువారు కారు.

చచ్చినను బ్రదికినను వారు తాము గౌరవార్హముగ బ్రదుకవలయు నను టయే వారి యాశయము. యుద్ధరంగమునఁ జనిపోయినవారు వీర స్వర్గముఁ జూఱగొందురని దృఢముగా నమ్మినవారు ప్రాచీన భారతీయులు.

"హత్వా వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీం"

అని శ్రీకృష్ణుఁడు అర్జునునకు రణమున జయించినను చచ్చినను స్వర్గసౌఖ్యములు లభించునని భగవద్గీతయందు వచియించి యుద్ధోత్సాహమును గలిగించెను.

దీనిని బట్టి భారతీయుల త్యాగనిరతి యెట్టిదియో గమనింపవచ్చును.

3. "ఉల్లోల కల్లోల వారాసులు రెండు కలసి కలగుండువడి ఘూర్ణిల్లినవి. ఇఁక ప్రళయమును విలయమును గాక మఱేమి ?" (పుట 132)

ఈ వాక్యములు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "విజయనగర సామ్రాజ్య స్థాపనము" అను వ్యాసములోనివి.

ప్రాచీన భారత చరిత్రము నందెక్కడఁ జూచినను, వైదికావైదిక మతములకును వైదికావైదిక సంస్కృతులకును జరిగిన సంఘర్షణములే కను పట్టునను నుపోద్ఘాతముతో ప్రారంభించి శ్రీ శర్మగారు పదునాలుగవ శతాబ్దము నందు ప్రతాపరుద్ర ధరణీవిభునకు మహమ్మదీయులతో జరిగిన యుద్ధమును మతముల సంఘర్షణమే యని సహేతుకముగా వచించినారు.

మతావిష్టులైన మహమ్మదీయ రాజులు ఆ యావేశముచేతనే తమ సేనలఁ బ్రోత్సహించి యుత్సాహపఱచి తేలికగా శత్రువులను జయించువారు. అది వఱకు ముందు మహమ్మదీయుల విజయము లన్నియు నిట్టివే. కాకతీయులతోడి యుద్ధమున నిది విచిత్రముగా మాఱినది.

కాకతీయ యుగమునం దాంధ్రదేశమున వీరశైవము బాగుగా వ్యాపించి యుండెను. జనులలో నా మతము నెడ గొప్ప యాదరాభిమానము లుండెను. వా రా మతము పేర నెట్టి త్యాగములు చేయుట కయినను సిద్ధముగా నుండు నట్లంతకు ముందునుండే ప్రయత్నములు కావింపఁ బడెను. తత్ఫలితముగనే కాకతీయులు దక్షిణాపథమునందుఁ జాల భాగమునుఁ దమ యేలుబడిలోనికి

దెచ్చుకొనిరి. అట్టి ప్రమథులవంటి సైన్యము కలవాఁడు ప్రతాపరుద్రుఁడు. మహమ్మదీయ సేనలఁ బ్రోత్సహించుచుండిన మతావేశమువంటిదే ప్రతాపరుద్రుని సేనలఁ గూడ బ్రోత్సహించు చుండుటచేత వారి యిద్దఱిమధ్య జరిగిన యుద్ధము ప్రళయముగాఁ బరిణమించిన దని శ్రీ శర్మగారు పై వాక్యములచేత వ్యాఖ్యానించుచున్నారు.

ఆ సైన్యముల సంఘర్షణము రెండు మహాసముద్రములు ఢీకొన్నట్లున్న ధ్వనియు నట్లు ఢీకొన్నచోఁ బ్రళయమేకాని మఱేమియు మిగలదనియు వచించి శ్రీ శర్మగారా యుద్ధ స్థితిని కన్నులకుఁ గట్టినట్లు వర్ణించి చూపినారు.

4. "వజ్ర సంకల్ప ముండవలెను గాని కార్యసాధనమునకుఁ గొదువా?"
(పుట 135)

ఈ వాక్యము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "విజయనగర సామ్రాజ్య స్థాపనము" అను వ్యాసములోనిది.

"దృఢ సంకల్పము కావలయును. అట్టి సంకల్పమే యున్నచో సాధన సంపత్తి యేదో విధముగా సమకూడి కార్యము సాధింపఁ బడును" అని పై వాక్యము నభిప్రాయము.

ఆంగ్ల భాషయందుఁ గల "Where there is the will there is a way" అను సామెతయు, సంస్కృతభాష యందుఁ గల "క్రియా సిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే" యన్న నానుడియు, "తెగఁబడి నరకెడు వానికి ఖగమేల తురంగమేల ఖడ్గము లేలన్" అన్న పలుకులును పై భావమునే బలపఱచుచున్నవి.

ప్రతాపరుద్రుని మరణానంతరము ఆంధ్ర దేశమునందు ప్రజలలో నొక నూతన చైతన్యము బయలుదేరినది. ప్రజలే ముందునకు వచ్చి తమ మత ధర్మములను గాపాడుకొనుటకుఁ గృతనిశ్చయులైనారు. తెలంగాణము నందు ముసునూరి నాయకులు, పశ్చిమాంధ్రమున హరిహర బుక్కరాయలు మఱల హిందూ సామ్రాజ్యముల స్థాపించి మత ధర్మములఁ గాపాడుటకుఁ బ్రయత్నించిరి.

"హరిహర బుక్కరాయల సంకల్పము చాల మంచిదే. కాని సాధన సంపద లేదు. సాధన సంపద లేనిదే కార్యమును సాధింపఁ బూనుకొనక పోవుట సామాన్యుల విషయము. హరిహర బుక్కరాయ లట్టివారు కారు. తమ సంకల్పము నెఱవేర్చుకొనుటకు వారి కేదయిన నుపాయము దొరకకపోదు" అని శ్రీ శర్మగారు రుపోద్ఘాతముగా వచించియున్నారు. కనుకనే వారికి విద్యారణ్యుల సాహాయ్యము లభించినది. వారు తమ సంకల్పానుసారముగా హిందూ ధర్మ రక్షణమునకు విజయనగర సామ్రాజ్యమును స్థాపించినారు.

5. "మానవుఁడు జీవించుట కాహార మెట్లో జాతి జీవించుటకున్నత భావము లట్లు". (పుట 186)

ఈ వాక్యము శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాసిన "విజయనగర సామ్రాజ్య స్థాపనము" అను వ్యాసములోనిది.

మానవుఁడు జీవించుట కాహార మత్యంతావశ్యకము. ఆహారము లేనిదే యే వ్యక్తియును జీవించలేఁడు. అనేక వ్యక్తుల సంఘమే జాతి. ఈ జాతికిని జీవముండును. జాతి వ్యక్తుల సమూహమయ్యును జాతి జీవనమున కాహారము భిన్నము. జాతి జీవించుట కున్నతములయిన భావములు కావలయును. ఆ భావములే జాతిని సజీవముగాఁ గాపాడును. ఆ యున్నతములైన భావములు జనులలో నున్నప్పుడే వారిలో సాముదాయిక జీవము నుండును. అట్టియెడనే వారేదయిన మహత్తరమయిన కార్యమును సులభముగా సాధింపఁగలరు. సజీవమయిన జాతి నెవ్వరు నేమియుఁ జేయలేరు. ఏనాఁడు సంఘమునం దిట్టి యున్నతాదర్శములు నశించునో ఆనాఁడా జాతి నిర్జీవమగును. అందలి జను లందఱు నాహారము గ్రహించుచు సజీవులుగా నున్నను నా జాతి నిర్వీర్యమయి యితరులకుఁ దేలికగా లొంగిపోవును.

మహమ్మదీయులం దట్టి మతావేశమును గుఱించి యున్నత భావము లున్నవి. హిందువు లందానాఁడట్టి యుదాత్తాశయములు కొంచెము కొఱవడినవి. అట్టి యుదాత్తాశయములు కలిగించుటకుఁ దపస్సంపన్నుఁడయిన మతద్రష్ట కావలయును. అప్పుడా జాతి పునరుజ్జీవితయగును.

విజయనగర సామ్రాజ్య స్థాపనావసరమున విద్యారణ్య శ్రీపాదులు ప్రజలకు ధర్మోద్ధరణమను నూతన సందేశము నొసంగినారు. ఆ సందేశము నందుకొన్న హిందూజాతి యుత్తేజితమయి ధర్మ నిర్వహణము గావించినది.

6. "ఉత్తమ ప్రయోజనార్థము తనువు ధారవోయుటకంటె ప్రమోదకరమయిన కార్యము వేఱొండు లేదు." (పుట 187)

ఈ వాక్యము "విజయనగర సామ్రాజ్య స్థాపనము" అను వ్యాసములోనిది. ఆ వ్యాసము రచించినవారు సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

సంగమ వంశీయుఁడయిన హరిహరరాయలు తన సోదరులు బుక్కరాయాదుల సాయముతోను, విద్యారణ్య శ్రీపాదులు విరూపాక్ష భాండారమును డి యొసఁగిన ధనముతోఁ గూర్చుకొన్న సైన్యముతోను బయలుదేరి దక్షిణా పథమంతయు జయించినాఁడు. మహమ్మదీయులను కృష్ణకుత్తరముగాఁ దోలి

ద్రోలినాఁడు. విజయలక్ష్మితో విద్యారణ్యస్వామి కడకు మఱలివచ్చినాఁడు. దక్షిణాపథమంతయు హరిహరరాయల హస్తగతమయినది.

మఱియొక రయినచో నీ రాజ్యమును సుఖముగా ననుభవించి యుందురు. కాని హరిహరరాయ లట్టివాఁడు కాఁడు. ఆతఁడు తన కా రాజ్యమును సంపాదించుటకుఁ గావలసిన ధనము నిచ్చినది విద్యారణ్యస్వామి కనుక ఈ రాజ్యమంతయు నా స్వామిదేయని భావించినాఁడు. రాజ్య సర్వస్వమును స్వామికి ధారవోసినాఁడు.

ఇట్లు ధారవోయుటకయి యాతఁ డా రాజ్యము నేల సంపాదించెనని యడుగవచ్చును. కేవల ధర్మోద్ధరణమే యా రాయల యుద్దేశము. ఆనాఁడు కలిగిన క్షతినుండి హిందూ ధర్మమును కాపాడుటయే రాయ సోదరుల జీవిత లక్ష్యము. తల్లక్ష్యసాధనకయి జీవితమును ధారవోయుటయే యత్యుత్తమ మయిన పవిత్ర కార్యమని వారి తలంపు.

పై వాక్యము హరిహరరాయలు విద్యారణ్యస్వామితో వచించినది. దీని వలన హరిహరరాయల నిస్స్వార్థ స్వభావమును, ధర్మ నిరతియును స్పష్టము లగును.

## ప్రశ్నలు - సమాధానములు

ప్ర. 1:- ప్రాచీన హిందూదేశ చరిత్రమున మతమునకున్న స్థానమెట్టిదో మీ పాఠ్యము ననుసరించి వివరింపుఁడు.

సమా :- శ్రీమల్లంపల్లి సోమశేఖర శర్మగారు తమ "విజయనగర సామ్రాజ్య స్థాపనము" అను వ్యాసమునందు ప్రాచీన భారతదేశ చరిత్ర ప్రధానముగా మత సంస్కృతుల చరిత్రమే యనియు, మతముతో సంబంధములేని కేవల రాజకీయ చరిత్ర మ్మనునది మనదేశమున ఆంగ్లేయులు వచ్చిన తరువాతనే యారంభమయిన దనియు వచించిరి.

అతి ప్రాచీన కాలమునుండియు హిందువులకు మతముతో నవినాభావ సంబంధమేర్పడినది. సామాన్యజనులనుండి మహారాజులవఱకు అందఱకును మతమునకు సంబంధించని కార్యమేలేదు. జననమాది మరణపర్యంతము అన్ని కార్యములును మతముతోఁ గూడినవే. ఈ మతమునకు వేదము లాధారములు. శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు, స్మృతులు, కావ్యములు, నాటకములు సర్వమును వేదములందుఁ జెప్పఁబడిన ధర్మములనే భంగ్యంతరముగాఁ జిత్రించి చూపినవి. కావున హిందువుల జీవిత సర్వస్వము హిందూమతముగా రూపొందినది.

హిందూమతమునకు మూలము వేదము, వేదధర్మములు. వీనిని రక్షించుచు సంఘమునకు శ్రేయస్సును సాధించువాఁడు బ్రాహ్మణుఁడు. కావున బ్రాహ్మణుని గడను జాతులవారు పూజించిరి. హిందూజాతికిఁ దరువాత నారాధనీయమైనది గోవు. అది వారి యాధిభౌతిక జీవనాధారము. కనుక గోబ్రాహ్మణులు హిందూసంఘమున ముఖ్యస్థానము నాక్రమించిరి. తద్రక్షణమునకయి హిందూ సంఘము యావత్తునెట్టి త్యాగమయినను జేయుటకు సిద్ధముగా నుండెడిది.

హిందూ ధర్మరక్షణము, హిందూ సంస్కృతిని గాపాడుట యివి రాజధర్మములు. రాజులు దేశముల కొఱకయి తమలోఁదాము పోట్లాడుకొనవచ్చును. కాని ధర్మక్షతి మాత్రము కలుగరాదు. అట్లు మతధర్మములకు నాశములేనంత వఱకన్ని వ్యవహారములును సాఫీగానే సాగిపోవుచుండెడివి. ఒకవేళ మత ధర్మములకే యాపద సంభవించినచో నింక ప్రజలే వీరు వారను భేదభావములేక సర్వులు నేకమయి రాజు మొదలుకొని సామాన్యులవఱకును దద్రక్షణమునకయి సర్వస్వమును ధారవోయువారు.

సామాన్యముగా విదేశీయుల దండయాత్రలు జరిగినప్పుడెల్ల నిట్టి సంక్షోభములు కలుగుటయు దానికి హిందువులు తగిన రీతిని సమాధానము చెప్పుటయు మనకుఁ గనుపించుచునే యుండును. కనుకనే శ్రీ సోమశేఖర శర్మగారు ప్రాచీన హిందూదేశచరిత్ర మత సంస్కృతుల చరిత్రమేయని వచించినారు.

ప్ర. 2 :- ప్రతాపరుద్రునినాఁటి కాకతీయుల వైభవమును వర్ణించి యోరుగల్లు పతనమయిన విధము వివరించునది.

సమా :- కాకతీయ రాజులలోఁ గడపటివాఁడు ప్రతాపరుద్ర చక్రవర్తి. ఆతఁడు నిజముగా ప్రతాపమున రుద్రుఁడే. నవలక్ష ధనుర్ధరులాతని సైనికులు. ఆ మహారాజు నాయకత్వమున విజృంభించిన తెలుఁగు జోదులకుఁ దిరుగుబాటును విరుగుబాటును లేకపోయినది. గోదావరి కడనుండి బయలుదేరిన తెనుఁగు వాహినులు కావేరిని దాటి కాంచీనగరము దాఁక వీరవిహార మొనరించినవి. చోళులు పాండ్యులు ప్రతాపరుద్ర చక్రవర్తి ప్రతాపము ముందు తలలువంచి మోకరిల్లినారు. తిరుగుబాటుచేసిన సామాన్య మాండలికుల సంగతి వేరుగాఁ జెప్పవలయునా? వారు ప్రతాపరుద్ర మహీపతి మొదటి కోపపుఁ జూపునకే హతమయినారు.

దక్షిణాపథమంతయుఁ బ్రతాపరుద్ర మహీపాలుని ఛత్రచ్ఛాయ క్రిందికి వచ్చినది. ఇంతటి యుత్సాహమునకు తేజస్సునకుఁ గారణ మేమందురేమో? అది యా యుగశక్తి. ఆ యుగమున కధిదేవత రుద్రుఁడు. ఆ యుగమునఁ బ్రవర్తిల్లిన మతము వీరశైవము. ఆ మత ప్రభావమువలన నాంధ్రవీరులు కాకలుతీరిన బంటులయినారు. భయమన్నదే భయపడి వారిని సమీపింప లేకపోఁగా ప్రతాపరుద్రుని వీరభటుల వీరవిహారమునకు ఎదురులేక పోయినది. వారి నాయకుఁడు ప్రతాపరుద్రుఁడు వీరభద్రుఁడయి నిలిచినాఁడు.

ఆంధ్రదేశమునందిట్టి స్థితియుండఁగా నప్పటికే యుత్తర హిందూస్థానము నంతటిని తన పాదములక్రిందికిఁ గొనితెచ్చుకొన్న యిస్లాము మతశక్తి తన నాలుకలను దక్షిణాపథము మీఁదికిఁ జాప దొడఁగొన్నది. దానికి మొదటి కబళముగా నాహుతి యయినది దేవగిరి రాజ్యము. దాని రెండవ దండయాత్ర యోరుగల్లు మీఁదికి.

కాని దేవగిరివలె నోరుగల్లు తేలికగా స్వాధీన మగునది కాదు. అంగబలము నర్థబలము బుద్ధిబలముగల ప్రతాపరుద్రుఁడు దాని కేలిక. వీర శైవ మతావేశము గల వీరభటులాతని సేవకులు. కాని మహమ్మదీయులు నంతతో మఱలి పరుగెత్తు వారు కారు. కావుననే నాయిరువాహినులు రెండు మహాసముద్రములు గలియఁబడి ఘూర్ణిల్లినట్లు కలియఁబడి పోట్లాడినవి. అదొక మహా ప్రళయమే.

వీరరుద్రుని ధాకకాగలేక యిస్లాముశక్తి వెక్కు బలముఁ జూపవలసివచ్చినది. కాని యిది స్థిరముగా నిలువలేదు. ఎన్నిసారు లోడిననేమి? కడపటఁ బ్రతాపరుద్రుఁడు చెఱఁబడినాఁడు; ఓరుగంటిపై చంద్రధ్వజము లేచినది.

ప్ర. 3 :- విజయనగర సామ్రాజ్యము స్థాపింపఁబడిన విధము వివరింపుఁడు.

సమా :- పదుమూఁడు పదునాలుగు శతాబ్దములలో దక్షిణాపథమంతయు నట్టుడికినట్టుడికి పోయినది. అంతకుఁ బూర్వమే యుత్తర హిందూస్థానము నంతనుఁ దమ పాదాక్రాంతమొనర్చుకొనిన మహమ్మదీయులు తమ కబంధ హస్తములను దక్షిణ హిందూస్థానముపైకిఁ జాప నారంభించినారు. వారి రాజ్యదాహమునకు మొదటి కబళమయినది దేవగిరి యాదవరాజ్యము. రెండవ దండయాత్రలో నోరుగల్లు వారి వశము కావలసియుండెను.

కాని ప్రతాపరుద్ర చక్రవర్తి యసమాన పరాక్రమశాలి యగుటచేతను, నాతని సైనికులు కాకలుతీరిన యోధపుంగవు లగుటచేతను వీరరుద్రుని జయించుట మహమ్మదీయుల కంత సుకరము కాలేదు. ఎన్నియో మారు లోడిపోయి వారు కాలికి బుద్ధిచెప్పవలసి వచ్చినది. అయినను వారు తమ పట్టుదలను వీడలేదు. దాడిమీఁద దాడి కావించి చివఱకు కాకతీయ సామ్రాజ్యమును మహమ్మదీయులు మట్టుపెట్టినారు. చెఱ పట్టఁబడిన ప్రతాపరుద్రుఁడు మార్గ మధ్యముననే మరణము పాలయినాఁడు.

ప్రతాపరుద్ర చక్రవర్తి మరణముతో దక్షిణాపథమంతయు నిస్లాముశక్తికి పాదాక్రాంతము కావలసినదే. కాని యాంధ్ర ప్రజావాహిని తమ మత సంస్కృతులకు కలుగనున్న యీ యాపదను గమనించి లేచి నిలిచినది. వారి యుద్ధోత్సాహమున నొకవైపు ముసునూరి నాయకులు నాయకత్వము వహించి విజృంభింపఁగా నింకొక వైపు రెడ్డిరాజులు నాయకులైనారు. దానితో మఱల కొంత దేశమున హిందువులకు ప్రతిష్ఠ లభించినది.

ఇది యిట్లుండఁగాఁ బశ్చిమాంధ్ర దేశమున హరిహర బుక్కరాయలు హిందూ ధర్మ సంరక్షణము కావింపవలయునని కంకణము కట్టుకొన్నారు. వారు చిన్న మాండలికులు. వారి కీ మహాకార్యమునకుఁ గావలసిన సాధన సంపదగాని ధనముగాని లేవు. అయినను నా సోదరులు నిరుత్సాహపడ లేదు. తమ సర్వస్వములైనను ధారవోసి యీ పవిత్ర కార్యమును నిర్వహింపవలె ననియే వారు నిశ్చయించుకొనినారు. ఇంతలో దైవికముగా వారికి విద్యారణ్య శ్రీపాదుల దర్శనము లభించినది.

విద్యారణ్యులు విరూపాక్షస్వామి భాండారమును హరిహర బుక్కరాయలకు కొల్లవిడిపినారు. ఆ ధనమును స్వీకరించి రాయసోదరులు తమకుఁ గావలసిన సైనికులను, యుద్ధ పరికరములను గూర్చుకొన్నారు. రాయసోదరుల భుజబలమునకు విద్యారణ్యుల బుద్ధిబలమును, ప్రజల నైతికబలమును లభించినవి. ఇఁక దక్షిణాపథమున వారినే బలమడ్డుకొనఁ గలదు ? అనతికాలముననే దక్షిణాపథమంతయు వారి వశమయినది.

కాని ధర్మైకమతులును నిస్స్వార్థులును నైన రాయసోదరులా రాజ్యమునంతటిని విద్యారణ్యులకు ధారవోసినారు. ఆ స్వామి రాజ్యము విరూపాక్షునిదనియు దానికి ధర్మకర్తలు రాజులనియు నియమించి శుభ ముహూర్తమున హరిహరరాయలచేత విజయనగర నిర్మాణముఁ జేయించినాఁడు.

ఈ విధముగా దక్షిణాపథమున విజయనగర సామ్రాజ్యము కేవలము హిందూ ధర్మరక్షణ కొఱకును, హిందూ సంస్కృతి పరిరక్షణకును స్థాపింపఁబడినది. నాఁడు మొదలు విజయనగరాధీశ్వరులు మహమ్మదీయులను కృష్ణ దాటి రాకుండఁ జూచుచుఁ దమ రాజ్యమున సర్వమత సహనమును, వేద ధర్మ పోషణమును, కళా పోషణమును గావించి వాసికెక్కిరి. ఆనాఁడు విజయనగర రాజులే పూనుకొననిచో దక్షిణాపథ చరిత్రగమనమే యింకొకరీతిగా నుండెడి దని శ్రీ సోమశేఖరశర్మగారు వచించినదెంతయు సమంజసమయిన పలుకు.

ప్ర. 4 :- "విజయనగర రాజ్యము విరూపాక్షస్వామిది. విజయనగర మహీధవులా స్వామి ధర్మకర్తలు" అన్న యీ పలుకును శ్రీ సోమశేఖరశర్మగారు సమర్థించిన విధము తెల్పుఁడు.

సమా :- హరిహర బుక్కరాయలు విజయనగర సామ్రాజ్యమును స్థాపించిన మూలపురుషులు. వారా సామ్రాజ్యమును సంపాదించుట కుపయోగించిన ధనము శ్రీ విరూపాక్ష స్వామివారిది. కనుకనే హరిహరరాయలు దిగ్విజయానంతరము తన రాజ్య సర్వస్వమును విరూపాక్ష దేవాలయమునకు ధర్మకర్త లయిన విద్యారణ్యస్వామివారి కర్పించెను.

విద్యారణ్యస్వామి వైదిక లౌకికములు చక్కఁగా నెఱింగిన మహనీయుఁడు. ఆ స్వామి రాజ్యమును విరూపాక్షస్వామి పక్షమునఁ దాను పరిగ్రహించి ఆ దేవుని ధర్మకర్తగా విజయనగర రాజ్యమును బాలింపుచుండుమని హరిహరరాయల నాదేశించినాఁడు. నాఁడు మొదలుకొని విజయనగర సామ్రాజ్యమునకుఁ బ్రభువు విరూపాక్షస్వామియే. విజయనగర ప్రభువులు విరూపాక్షస్వామి రాజ్యమునకు ధర్మకర్తలు మాత్రమే.

కనుకనే హరిహరరాయలును నాతని తరువాత విజయనగర పరిపాలకు లయిన బుక్కరాయాదులును రాజకీయ కార్యముల నన్నింటిని శ్రీ విరూపాక్ష స్వామి పేరనే నిర్వర్తించిరి. ఏ దానశాసనమునందును విజయనగర ప్రభువుల స్వీయ నామాంకితము లయిన సంతకములు కనుపింపవు. వాని స్థానమున "శ్రీ విరూపాక్ష" ముద్రయే కనుపించును.

రాజ్యపాలకులు శైవులయినను వైష్ణవులయినను రాజ్యము మాత్రము విరూపాక్షునిదే కనుక నీ సంప్రదాయ మిట్లుగా సాగిపోవలసినదే. దానికి భంగము కలిగించినచో నా పరిపాలకులు పదచ్యుతులు కాక తప్పదు. సంగమ వంశీయులలోఁ గడపటి విజయనగరాధీశుఁడు విరూపాక్షరాయలు.

విరూపాక్షరాయలు ఆనువంశికమయిన శైవమును వదలి వైష్ణవమతమును స్వీకరించినాఁడు. ఆ వైష్ణవము నందలి యభిమానముచేత దానశాసనము లందలి "వి రూ పా క్ష" ముద్రను "శ్రీ రా మ" గా మార్చినాఁడఁట. ఇది స్వామి ద్రోహము. కనుకనే యాతని తరువాత విజయనగర సామ్రాజ్యము సంగమ వంశీయులకు దక్కకుండఁ బోయినది.

దీనిని గ్రహించిన తుళువ వంశీయులు కృష్ణరాయాదులు తాము వైష్ణవులే యయినను మఱల వెనుకటివలెనే "శ్రీ విరూపాక్ష" ముద్రతో దానశాసనములఁ బ్రకటించినారు.

ఆరవీటి రామరాయలు తాళికోట యుద్ధమున మరణించిన తరువాత నాతని తమ్ములు తిరుమల రాయాదులును తరువాత రాజ్యమునకు వచ్చిన రంగ రాయాదులును మఱల నీ సంప్రదాయమునకు విచ్ఛిత్తి కలిగించినారు. వారి శాసనములందు "శ్రీ వేంకటేశ", "శ్రీరామ" యను ముద్రలు కానవచ్చుచున్నవి.

ఈ కాలమునాటికి విజయనగర సామ్రాజ్య ప్రాభవము పూర్తిగా క్షీణించి పోయినది. వారు విజయనగరమునుండి వెడలిపోయి పెనుగొండయందు నివాస మేర్పఱచుకొనినారు.

కనుకనే శ్రీ సోమశేఖరశర్మగారు విజయనగర సామ్రాజ్యము విరూపాక్ష స్వామిదే యనియు తత్పాలకులు కేవలము ఆ స్వామికి ధర్మకర్తలే యనియుఁ దమ వ్యాసమున వచించినారు.